మూగబోయిన చలసాని ప్రసాద్ గళం

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

VEEKSHANAM, TELUGU MONTHLY

సంపుటి : 13 సంచిక : 8 హైదరాబాద్ 169 ఆగస్టు 2015 పేజీలు : 68 రు. 20

* జనాన్ని పుష్కరాల్లో ముంచిన పాలకులు
* గిరిజనుల గుండెలపై థర్మల్ కుంపటి
* అంబేద్కర్ పేరుతో ఆర్ఎస్ఎస్ వంచన
* విచారణల్లో, తీర్పుల్లో ముస్లింలపై ద్వేషం
* బిజెపి పాలన కుంభకోణాల మయం
* సోషలిజం ఆవశ్యకత చాటుతున్న గ్రీస్
* మయన్మార్‌పై దుందుడుకు చర్య

## ఆంధ్రప్రదేశ్ వీక్షణం రచయితల సమావేశం వాయిదా

**గత సంచికలో ప్రకటించినట్టుగా ఆగస్టు 9న గుంటూరులో జరగవలసిన ఆంధ్రప్రదేశ్ వీక్షణం రచయితల సమావేశం అనివార్య కారణాల వల్ల వాయిదా పడింది. ఈ సమావేశం సెప్టెంబర్ 6, ఆదివారం జరుగుతుంది.**

ప్రాంతీయ, దేశీయ, అంతర్దేశీయ పరిణామాలపై అవగాహనలను, తెలుగు సమాజం తనతో తాను జరుపుతున్న సంభాషణను అక్షరబద్ధం చేస్తున్న రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక వీక్షణం ప్రతి సంవత్సరం తన రచయితలతో, అభిమానులతో సంభాషణకు కూడ వేదిక కల్పిస్తున్నది. వీక్షణం ఎనిమిది సంవత్సరాల కింద ఈ వార్షిక రచయితల సమావేశం ప్రారంభించింది. వీక్షణం రచయితలు, పాఠకులు, అభిమానులు, సిబ్బంది కలిసి కూచుని వీక్షణంలో అచ్చవుతున్న రచనల గురించీ, అచ్చు కావలసిన అంశాల గురించీ చర్చించుకోవడానికి, పత్రిక వెలువడుతున్న తీరు గురించి అభిప్రాయాలు, సలహాలు, సూచనలు పంచుకోవడానికి, గతాన్ని సమీక్షించుకుని భవిష్యత్తుకు మార్గాలు వేసుకోవడానికి ఈ సమావేశాలు జరుగుతున్నాయి. రాష్ట్ర విభజన తరువాత తెలంగాణ సమావేశం మార్చ్ 8న జరిగింది. అదే వరుసలో ఆంధ్రప్రదేశ్ సమావేశం సెప్టెంబర్ 6, ఆదివారం గుంటూరులో జరుగుతుంది.

ఇప్పటికే వీక్షణంలో రచనలు చేసినవారు, రచనలు చేయదలచుకున్నవారు, పాఠకులు, అభిమానులు, శ్రేయోభిలాషులు – మొత్తంగా తెలుగు సమాజ జీవితం గురించి, ప్రజల గురించి ఆలోచించే ప్రతి ఒక్కరూ ఈ సమావేశానికి ఆహ్వానితులే.

పాల్గొనదలచినవారు అదనపు సమాచారం కోసం వీక్షణం కార్యాలయానికి ఫోన్ చేయగలరు.
ఫోన్ నం. 040-66843495, 9949391028

## వీక్షణం దగ్గర అమ్మకానికి ఉన్న పుస్తకాలు

**ఆర్థిక వ్యవస్థ – సామ్రాజ్యవాదం**

| | | |
|---|---|---|
| ఒక దళారీ పశ్చాత్తాపం | జాన్ పెర్కిన్స్ | రు. 75 |
| కుట్రాజకీయం | స్టీఫెన్ కింజర్ | 40 |
| అభివృద్ధిని ఇలా చూద్దాం | ముదునూరి భారతి | 80 |
| కొత్తచూపు | ఆర్.ఎస్. రావు | 120 |
| ఊరి దారి | ఎన్. వేణుగోపాల్ | 60 |
| రాబందు వాలిన నేల | ఎన్. వేణుగోపాల్ | 180 |
| వ్యవసాయం – ప్రపంచీకరణ | కె.ఆర్. చౌదరి | 100 |

**తెలంగాణ**

| | | |
|---|---|---|
| లేచినిలిచిన తెలంగాణ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| తిరగబడ్డ తెలంగాణ | ఇనుకొండ తిరుమలి | 100 |
| తెలంగాణ రాజకీయాలు | దాగ్మార్ బెర్న్‌స్టార్ఫ్, హ్యూగ్ గ్రే | 80 |
| కొత్త వంతెన | కె. శ్రీనివాస్ | 120 |
| తెలంగాణ జైత్రయాత్ర | ఘంటా చక్రపాణి | 200 |
| తెలంగాణ కాలజ్ఞాని ప్రొ. జయశంకర్ | ఘంటా చక్రపాణి | 20 |

**శాస్త్రవిజ్ఞానం**

| | | |
|---|---|---|
| విశ్వాంతరాళం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మానవ పరిణామం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవకణాలూ నాడీకణాలూ | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 80 |
| ప్రకృతీ – పర్యావరణం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవశాస్త్ర విజ్ఞానం – సమాజం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| విజ్ఞాన శాస్త్రం మనిషి విస్తరణ | జెడి బెర్నాల్ | 80 |

**కులం–మతం**

| | | |
|---|---|---|
| భారతదేశంలో కుల సమస్య | అనురాధ గాంధీ | 120 |
| శూద్రవర్ణం ఎలా పుట్టింది | ఆర్.ఎస్. శర్మ | 80 |

**చరిత్ర–జీవిత చరిత్ర**

| | | |
|---|---|---|
| భారత చరిత్ర అధ్యయానికి ఒక పరిచయం | డి.డి. కోసంబి | 250 |
| భారత చరిత్ర పరిచయ వ్యాసాలు | డి.డి. కొశాంబి | 40 |
| ప్రాచీన భారత దేశ చరిత్ర | కె. బాలగోపాల్ | 50 |
| చరిత్రలో ఏం జరిగింది? | గార్డన్ చైల్డ్ | 80 |
| తరతరాల భారతదేశ చరిత్ర | రొమిల్లా థాపర్ | 80 |
| ఆధునిక భారతదేశ చరిత్ర | బిపిన్ చంద్ర | 100 |
| ఇండియాలో దాగిన హిందుస్థాన్ | పెరి ఆండర్‌సన్ | 150 |
| 24 గంటలు | కె.జి. కన్నబిరాన్ | 200 |
| బాబాసాహెబ్ అంబేద్కర్ | బి. విజయభారతి | 70 |
| చేగువేరా | కాత్యాయని | 80 |
| ఒక సెక్స్ వర్కర్ ఆత్మ కథ | నళినీ జమీలా | 50 |
| నూరేళ్ల కాళోజీ | వరవరరావు | 60 |
| ఇండియాలో దాగిన హిందుస్థాన్ | పెరి ఆండర్సన్ | 150 |

**సాహిత్య విమర్శ – వ్యాసాలు**

| | | |
|---|---|---|
| గురజాడ దేశభక్తి | ఎన్. వేణుగోపాల్ | రు. 20 |
| విరసం సాహిత్య విమర్శ | విరసం ప్రచురణ | 150 |
| మహోదయం | కె.వి.ఆర్. | 200 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు-2 | కె.వి.ఆర్. | 250 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు-3 | కె.వి.ఆర్. | 250 |
| కెవిఆర్ సామాజిక వ్యాసాలు | కె.వి.ఆర్. | 300 |
| సాహిత్య సమాలోచన | కృష్ణాబాయి | 300 |
| సామాజికం | వి. చెంచయ్య | 30 |

**కథ – నవల**

| | | |
|---|---|---|
| దండకారణ్య కథలు(2005-2012) | విరసం ప్రచురణ | 100 |
| వసంతగీతం | అల్లం రాజయ్య | 250 |
| ఏడుతరాలు | అలెక్స్ హేలీ | 80 |
| స్పార్టకస్ | హోవార్డ్ ఫాస్ట్ | 80 |
| బీజభూమి | వరవరరావు | 100 |
| హింసపాదు | బమ్మిడి జగదీశ్వరరావు | 180 |

**విప్లవోద్యమం**

| | | |
|---|---|---|
| పోలీసులు అరెస్ట్ చేస్తే | బొజ్జా తారకం | 30 |
| భారత్‌పై అరుణతార | యాన్ మిర్డాల్ | 100 |
| జంగల్‌నామా | సత్నామ్ | 100 |
| మంద్రస్థాయి యుద్ధం | విరసం ప్రచురణ | 100 |
| జగిత్యాల జంగల్‌మహల్-1 | విరసం ప్రచురణ | 75 |
| జగిత్యాల జంగల్‌మహల్-2 | విరసం ప్రచురణ | 100 |
| నేటి రాయలసీమ | విరసం ప్రచురణ | 100 |
| దండకారణ్యంలో గ్రీన్‌హంట్ | విరసం ప్రచురణ | 60 |
| రివిజనిజం | లెనిన్ | 75 |
| జనతన జైత్రయాత్ర | విరసం ప్రచురణ | 20 |
| అంతర్యుద్ధంలో ఆదివాసులు | విరసం ప్రచురణ | 20 |
| ఆదర్శ జీవులు అమరులు | విరసం ప్రచురణ | 30 |
| మావో రచనలు – 1 | మావో | 170 |
| మావో రచనలు – 2 | మావో | 220 |
| విధ్వంసకర అభివృద్ధి | మలుపు ప్రచురణ | 150 |
| సంకెళ్ల సవ్వడి | అరుణ్ ఫరేరా | 150 |
| కశ్మీర్‌లో నిషిద్ధ రాత్రి | బషారత్ పీర్ | 150 |

**డివిడి**

| | |
|---|---|
| వీక్షణం (2003 – 2012) | 200 |
| సృజన (1966–1992) | 240 |
| అరుణతార (1970–2013) | 125 |
| 'ఓయు'ద్ధకాండ | 100 |

169 ISSN 2231-6892

# వీక్షణం
రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

ఆగస్టు 2015
సంపుటి : 13
సంచిక : 8





**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

**తెలంగాణ :** ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; కరీంనగర్ – ఎస్.తిరుపతి; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ఎం. రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఇక్బాల్; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; రంగారెడ్డి – వి. శంకరయ్య

**ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – కొండ్రాయుడు; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – కె.ఎస్. ప్రకాష్‌రావు; శ్రీకాకుళం – ఆర్. శ్రీలత; విశాఖపట్నం – పి.వి. రమణ

(ఈ సంచికలోని వరంగల్, నల్గొండ, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, విజయనగరం, ప. గోదావరి జిల్లాల అసహజ మరణాల వివరాలు అందిస్తున్న వారు ఎస్. వెంకటేశ్)



**'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, చెక్కులు,డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం**

మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495

Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

ప్రింటర్స్ : **డక్కన్ ప్రెస్ / చరితా ఇంప్రెషన్స్**
ఆజామాబాద్, హైదరాబాద్. ఫోన్ : 040 - 27678411

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 20 | రు. 20 |
| సంవత్సరం | రు. 240 | రు. 200 |
| మూడు సంవత్సరాలు | రు. 600 | రు. 540 |
| ఐదు సంవత్సరాలు | రు. 1000 | రు. 900 |
| పది సంవత్సరాలు | రు. 2000 | రు. 1700 |

ఆన్‌లైన్ ద్వారా డబ్బులు పంపేవారు మాత్రమే బ్యాంక్ స్లిప్‌పై 'veekshanam' అని రాసి వీక్షణం అకౌంట్ నెంబర్ – **013911011002175** ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి. ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 000/0139** నెంబర్ రాసి వేయవచ్చు.

## పాఠకుల వీక్షణం

**వీక్షణం చేస్తున్న కృషి పదికాలాల పాటు కొనసాగాలనే ఆకాంక్షతో మూలనిధికి 2015 జూలై నెలలో వచ్చిన విరాళాలు - ఎన్. భగవాన్ రెడ్డి, సిద్దిపేట - రు. 1000, డా. ఎం.ఎఫ్. గోపీనాథ్, ఖమ్మం - రు. 1000, కాకి భాస్కర్, ఖమ్మం - రు. 2400 మిత్రులందరికీ కృతజ్ఞతలు. - సం.**

వీక్షణం జూలై సంచికలో 'మలద్వారంతో తిని చూపిస్తారా అనీ, హోమో పశుతుల్యులు అనీ హోమోలని ఉద్దేశించి రంగనాయకమ్మ అనడం అమానుషం' – అని సంపత్ రాజారామ్ చేసిన వాఖ్య సందర్భశుద్ధిలేని వ్యాఖ్య ! 'ప్రకృతి సహజత్వమా? ఎవరు నిర్ణయిస్తారు దాన్ని?' అనే హోమోల వాదనను ప్రస్తావించి, రంగనాయకమ్మ ఆ మాటలు వాడినట్టు ఆమె వ్యాసంలో స్పష్టంగా ఉంది. వ్యాసం మూడో భాగంలో (ఏప్రిల్ వీక్షణంలో) చివరన, ఆ మాటలు ఇలా ఉన్నాయి. 'ప్రకృతి సహజత్వమా? ఎవరు నిర్ణయిస్తారు దాన్ని? అని వాదిస్తారా మనుషులు?' 'ప్రకృతి సహజత్వాన్ని ప్రకృతే నిర్ణయిస్తుంది' అనేటంత చిన్న విషయం కూడా తెలియదా ఆ ఆలోచనాపరులకి? అన్నం తినాలంటే, నోటితో తింటారా, మలద్వారంతో తింటారా? – నోటితోనే తింటాం. శరీరంలో మలద్వారం ఉన్నది అన్నం తినడానికి కాదు అని జవాబు చెప్పుకోవలసి వస్తే, అదే మరి ప్రకృతి సహజత్వం!' ఇదే సందర్భంలో నాలుగో భాగం ప్రారంభంలో (మే వీక్షణంలో) 'హోమో పశుతుల్యులు' అనే మాట ఉన్నచోట వాక్యాలు చూడండి. 'మన హోమోల భాషలో, ముఖరతి, అంగచూషణం, మలద్వార శృంగారం వంటి రోత వికృత, కుళ్లు వాగుళ్లెన్నో ఉన్నట్టు చదివాను. స్త్రీలను హింసపెట్టే మన పశుతుల్యులు కూడా అవే కుళ్లు ప్రవర్తనలతో ఉంటారని స్త్రీల ద్వారా విన్నాను. మన హోమో పశుతుల్యుల శృంగారం అంతా ఆ వికృతత్వంతో నిండినదే.' – ఈ మాటల్లో మగ హోమో పశుతుల్యుల శృంగారాన్నే గాక, స్త్రీలను హింసపెట్టే మగ పశుతుల్యుల్ని కూడా (హోమోలు కాని హెటిరోలను) విమర్శించారు గదా? మరి, సందర్భం నించీ మాటల్ని విడగొట్టి, రంగనాయకమ్మ వైఖరి 'అమానుషం' అనడం వక్రీకరణే అవుతుంది.

**– యు.ఎచ్. ప్రీతమ్**
ఖమ్మం

వీక్షణంలో వస్తున్న అనేక వ్యాసాల్లో చాలా విస్తారమైన వివరణ ఉంటోంది. కాని గ్రాఫ్‌లు, ఛాయాచిత్రాలు ఉండడంలేదు. అవి ఉంటే విషయానికి బలాన్ని చేకూర్చేవిగా ఉంటాయని నా అభిప్రాయం. అవకాశం ఉంటే ఆలోచించగలరని మనవి.

**– ముత్తన్నగారి రాజేందర్ రెడ్డి,**
భూంపల్లి, మెదక్

రంగనాయకమ్మకు హిజ్రాలపై ద్వేషం ఎందుకుంటుంది? ఆఖరి భాగంలో చేసిన ఎన్నో మంచి సలహాలు, సూచనలు చదవకుండానే తప్పు నిర్ణయానికి వచ్చారు కొందరు. తన రచనని వీక్షణం ప్రచురించి తప్పు చేసింది అంటున్నారు. భూమి గుండ్రంగా ఉందని, భూమే సూర్యుని చుట్టూ తిరుగుతుందని మొదట ఒక్కరు చెప్పడంతోటే చర్చ మొదలయి, ఆ తరువాతే ఒప్పుకున్నారు. వాస్తవాన్ని కొందరు ఇప్పటికీ ఒప్పుకోనివారు కూడా ఉన్నారు. దూషణలు మాని, తప్పుని మాత్రమే విమర్శిస్తే బాగుంటుంది. చర్చకు దారితీస్తున్న రచనలు ప్రచురిస్తున్న వీక్షణంకు అభినందనలు.

**– జి. హరిప్రసాద్,**
బళ్లారి

జూలై వీక్షణం సంచికలో 'నాగభూషణం అన్నట్టు ట్రాట్స్కీని లెనిన్ ద్రోహి అన్నదానికి ఆధారాలు ఎక్కడాలేవ'ని స్పందించారు నరేంద్రమోహన్. లెనిన్ ఆరు లేఖలు (చెల్లెలు మారియా ఉల్యానోవాకి లెనిన్ రాసినవి, అర్ధరాత్రి మారియా ఇంటి సోదాలో లభించినవి అయివుండాలి) లో కూడా అలా ఏమీ రాయలేదనీ లెనిన్ ఒకే ఒకసారి నిరంతర విప్లవ ప్రస్తావనని వ్యతిరేకించాడనీ అంటారు నరేంద్రమోహన్. ట్రాట్స్కీపై లెనిన్ వ్యాఖ్యలకి లెనిన్ నోట్–ఫిబ్రవరి 1917 ఇన్నెసా ఆర్మండ్–లేబర్ వీక్లీ–సెప్టెంబర్ –1949; అలెగ్జాండ్రా కొల్లంతాయ్‌కి లెనిన్ రాసిన లేఖ – 23 – కలెక్టెడ్ వర్క్స్ – 1976 – వాల్యూం 35, పేజీ నెం 285–287; కలెక్టెడ్ వర్క్స రిట్రీవ్ 3వ ఎడిషన్. వాల్యూం XV, పేజీ నెం 17, కలెక్టెడ్ వర్క్స్ వాల్యూం VII – పేజీ నెం 194 లను చూపుతారు. ఆయాచోట్ల స్కౌండ్రల్, పంది, మెన్షివిక్కుల్లో లిక్విడేటర్, పనికిమాలినవాడు, మందబుద్ధి మొదలయిన కొన్ని పరుషమైన పదాలు దొర్లి ఉండొచ్చు. అయితే ఆ వ్యాఖ్యలు చరిత్ర పొరల్లో మసకబారి నేటికి నిష్ప్రయోజ నాలు అనిపించొచ్చు. అంతేకాక ట్రాట్స్కీ అసాధారణ ప్రజ్ఞావంతుడు, కేంద్ర కమిటీలో ప్రతిభా సంపన్నుడు, స్టాలిన్ సరిజోడు అంటూ కూడాడు ట్రాట్స్కీ తన అతి వాక్చాతుర్యంతో ఎదుటి వాళ్లని తనవైపు తిప్పుకోగల సమర్థుడని, మహిత్వాకాంక్షకలవాడు, స్థిరత్వం లేనివాడు, విచలిత మనస్కుడు, తన పట్టే తనదైనవాడు, తనకి తానే సాటైనవాడు అంటాడు లెనిన్. మెలికలూ, మోసాల్తో వామపక్షీయుడనని నటిస్తూ రైటిస్టులకి శాయశక్తులా సహాయపడ్డాడని అభిప్రాయం వ్యక్తపరుస్తాడు. ట్రాట్స్కీ ప్రతి విప్లవం బ్రిటిష్ కన్జర్వేటిజంకి కూటస్తమే అంటాడు. ట్రాట్స్కీ మనలో ఒకడుకాని మనలోనివాడని, ట్రాట్స్కీలోని ఒక రకమైన ఆభిజాత్య అహంకారం మంచి లక్షణం కాదంటాడు (లెనిన్ లాస్ట్‌విల్, కొల్లంతాయికి లేఖ, ఇతరత్రా).

ట్రాట్స్కీని బేరీజు వేస్తూ – మార్క్సిస్టు విశ్లేషణకి కావాల్సిన లోతు, సూక్ష్మ పరిశీలనా సామర్థ్యం ట్రాట్స్కీలో ఏనాడూ ఒక బలమైన అంశం కాలేకపోయిందని లెనిన్ సతీమణి క్రుపస్కయా అన్నట్టు గోర్కీ రచనల్లో లభిస్తుందని మోంటీ జాన్‌స్టన్ అంటాడు (లెనిన్ కలెక్టెడ్ వర్క్స వాల్యూం 7, పేజీ నెం 113).

కేంద్ర కమిటీ/లెనిన్‌ల నిర్ణయాన్ని పాటించక యుద్ధమూ వద్దు–శాంతీ వద్దంటూ బ్రెస్టు–లిటోవిస్క్ శాంతి సంధిని భగ్నం చేశాడంటూ ట్రాట్స్కీ దగా చేశాడని బోల్షివిక్కులు నిందించారు. ఒకానొక ప్రచార చిత్రంలో మార్క్సిజంలో ఆధునిక సెయింట్ జార్జిగా చిత్రించారు. ఒకవేళ నాగభూషణం స్టాలినిస్టు రచనల ఆధారంగా ఆ ఆరోపణ చేస్తే స్టాలిన్ ఆధీనంలో జరిగిన చరిత్ర వక్రీకరణ, బోల్షివిక్ నాయకులపై సాగించిన షో ట్రయల్స్ గురించి ఐసాక్ డ్యుశ్చేర్ సుదీర్ఘ రచనలు చేయడాన్ని గుర్తుచేస్తారు నరేంద్రమోహన్. అలా నరేంద్రమోహన్ డ్యుశ్చేర్ రాసిన బయోగ్రఫీ ఆఫ్ ట్రాట్స్కీ (ప్రోఫెట్ ఆర్మ్‌డ్, ప్రోఫెట్ అనార్మ్‌డ్, ప్రోఫెట్ ఔట్‌కాస్ట్ – భాగాలు) లోని వాస్తవాల్ని పూర్తిగా నమ్మి వాటిపై ఆధారపడ్డారు.

డ్యుశ్చేర్ విశ్లేషణ ఎలా తప్పో, ఆ ప్రాథమిక ఆధారాల్తో డ్యుశ్చేర్ వాదనలు తప్పు అని నిరూపించవచ్చో చూపాలి. ఏ రచన ఆధారంతో ఈ ఆరోపణలు చేస్తున్నారో వివరిస్తే విప్లవానికి ఎంతో అవసరమైన పోలిమిక్‌కి అవకాశం ఉంటుంది – అంటారు నరేంద్రమోహన్. బయోగ్రఫీ ఆఫ్ ట్రాట్స్కీతో పాటు 'స్టాలిన్ : ఎ పొలిటికల్ బయోగ్రఫీ' అనే 600 పేజీల విమర్శ గ్రంథం రాశాడు డ్యుశ్చేర్. అది ప్రచ్ఛన్న యుద్ధంలో ఓ గొప్ప ప్రచార ఆయుధంగా వాడబడింది. ఆ గ్రంథాన్ని సమీక్షిస్తూ 'స్టాలిన్ : స్లాండర్స్ అండ్ ట్రూత్' అంటూ సి ఆలెన్ రాశాడు (ద కమ్యూనిస్టు రివ్యూ – జనవరి 1950 – కమ్యూనిస్టు పార్టీ – గ్రేట్ బ్రిటన్). డ్యుశ్చేర్ లక్ష్యమల్లా సోవియట్ యూనియన్, కమ్యూనిస్టు పార్టీ, దాని నాయకుడైన స్టాలిన్ పై బురద చల్లడం, మసిపూయడం. విపరీతమైన వక్రీకరణలు, బాతాఖానీలు, పరమ అశిష్ట అబద్ధాల మీద డ్యుశ్చేర్ ఆ దుర్భాషలు ఆధారితాలంటూ అవి అడుగడుగునా ఆ గ్రంథంలో ఎలా చోటు చేసుకున్నాయో సవిస్తరంగా ఎత్తి చూపుతాడు ఆలెన్. ఆ రివ్యూ డ్యుశ్చేర్ 'బయోగ్రఫీ ఆఫ్ ట్రాట్స్కీ' లోని సత్య వివరణలు తెలుసుకోడానికి ఉపయోగపడేది కావొచ్చు.

డ్యుశ్చేర్ పోలెండ్ దేశీయుడు, అక్కడి కమ్యూనిస్టు పార్టీలో ఆదిలో సభ్యుడు. కొన్ని కవితలు రాశాడు. రాజకీయ యాక్టివిస్టు. తర్వాత లండన్‌చేరి అక్కడి ఎకానమిస్టు పత్రికలో పాత్రికేయుడిగా చేరాడు. సోవియట్, స్టాలిన్‌లపై బద్ధవ్యతిరేక రచనలకి పూనుకున్నాడు. స్టాలిన్–ట్రాట్స్కీ వివాదానికి పశ్చిమ దేశాల విప్లవ ఉద్యమాలు (?) అంతం పలికాయంటారు నరేంద్రమోహన్. ఇది ఆహ్వానించదగ్గ అత్యవసర పరిణామం. కాని వరల్డ్ సోషలిస్టు వెబ్‌సైట్, సోషలిస్టు రివ్యూ, మార్క్సిస్టు ఇంటర్నేషనల్ ఆర్కైవ్స్ మొదలయిన వాటిని నరేంద్రమోహన్ చదువుతూ ఉంటారు.

(మిగతా 62వ పేజీలో...)

# అవినీతికి కొత్త ప్రమాణాలు సృష్టిస్తున్న భాజపా



కాంగ్రెస్ నాయకత్వంలోని యునైటెడ్ ప్రోగ్రెసివ్ అలయన్స్ (యుపిఎ) ప్రభుత్వం పది సంవత్సరాలలో కుంభకోణాల కుప్పగా మారిందని, రోజుకో అవినీతి, లక్షల కోట్ల రూపాయల కైంకర్యం బైట పడుతున్నాయని భారత సమాజంలో అసంతృప్తి, వ్యతిరేకత చెలరేగాయి. వాటిని ఆధారం చేసుకుని భారతీయ జనతా పార్టీ నాయకత్వంలోని నేషనల్ డెమొక్రటిక్ అలయన్స్ (ఎన్‌డిఎ) 2014 ఎన్నికల పోరాటాన్ని ప్రారంభించింది. అదే ప్రధాన సమస్యగా, తాను అధికారంలోకి వస్తే అవినీతి అనేదే లేని పారదర్శక పాలన అందిస్తానని భారీ వాగ్దానాలు చేసింది. యుపిఎ అవినీతితో విసిగిపోయిన ప్రజలు ఎన్‌డిఎను నమ్మలేకపోయినా నమ్మారు. ఇతరేతర కారణాలెన్నో కూడ కలిసి ఎన్‌డిఎకు అధికారం చేజిక్కింది. నరేంద్ర మోడీ ప్రధానమంత్రిగా రూపొందిన భాజపా–ఎన్‌డిఎ ప్రభుత్వం తన ఎన్నికలకు ముందరి వాగ్దానాలన్నిటినీ తుంగలో తొక్కి అంతకు ముందరి యుపిఎ ప్రభుత్వంతో అవినీతిలో పోటీ పడదలచుకున్నట్టు కనబడుతున్నది.

ఒక వ్యక్తి స్వయంగా అవినీతికి పాల్పడలేదు గనుక నీతిమంతుడని, కుటుంబం, స్వార్థప్రయోజనాలు, విలాసవంతమైన జీవనశైలి లేకపోతే, నిరాడంబరంగా ఉంటే అవినీతిపరుడు కాదని కొన్ని భ్రమలు ఈ సమాజంలో రాజ్యం చేస్తున్నాయి. కాని తన అనుచరుల అవినీతి గురించి స్పష్టమైన సాక్ష్యాధారాలు బైటపడిన తర్వాత కూడ మౌనం వహించడం, ఖండించకపోవడం, అవినీతిని అరికట్టడానికి తనకున్న అధికారాన్ని వినియోగించకపోవడం, చేసిన వాగ్దానం తప్పడం కూడ అవినీతికి భిన్న రూపాలే. నరేంద్ర మోడీకి కుటుంబం లేకపోవచ్చు, సొంతంగా డబ్బు పోగు చేసుకున్న దాఖలాలు లేకపోవచ్చు. అవి కూడ ఎప్పుడో బైటపడడానికి అవకాశం కూడ ఉండవచ్చు. కాని తన పార్టీ నాయకులు, అనుచరులు, కేంద్ర మంత్రులు, ముఖ్యమంత్రులు, భాజపా రాష్ట్ర ప్రభుత్వాలు ఇవాళ దారుణమైన అవినీతి ఆరోపణలు ఎదుర్కోవడం మాత్రమే కాదు, స్పష్టమైన సాక్ష్యాధారాలతో బైటపడుతున్నారు. అయినా బాధ్యత వహించవలసిన అగ్రనాయకుడు అసాధారణమైన మౌనం వహిస్తున్నాడు.

ఇవాళ్టి దారుణమైన అవినీతి ఉదంతాలన్నిటిలోకీ ప్రధానమైనదీ, భయానకమైనదీ మధ్యప్రదేశ్ లో వ్యాపం కుంభకోణం. స్వయంగా ముఖ్యమంత్రితో సహా వందల మంది భాజపా నాయకులు, అధికారులు, ప్రభుత్వోద్యోగులు పాలుపంచుకున్న ఆ కుంభకోణం ఎన్నో సంవత్సరాలుగా సాగుతూ పదివేల కోట్ల రూపాయలలో, ఇరవైవేల కోట్ల రూపాయలలో, ఇంకా ఎక్కువో కైంకర్యం చేసిందని వార్తలు వస్తున్నాయి. సిబిఐ విచారణ జరపాలా లేదా అని వివాదం జరిగి, చివరికి సుప్రీం కోర్టు ఆదేశాలతో సిబిఐ విచారణ ప్రారంభమైంది గాని, రేపు సిబిఐ కూడ అసలు అవినీతే జరగలేదని చెల్లుచీటీ ఇవ్వవచ్చు. అది ఎంత దుర్మార్గమైన కుంభకోణమో అర్థం చేసుకోవడానికి వరుసగా నలభై మంది సాక్షులను హత్య చేయడమే నిదర్శనం. గత ఆరుదశాబ్దాల పాలకుల అవినీతి వ్యవహారాలలో కోట్ల రూపాయల కైంకర్యం ఉంది, విచారణలను తప్పుదోవ పట్టించడం ఉంది. సాక్ష్యాధారాలను మాయం చేయడం ఉంది, చివరికి అవినీతి జరగలేదని చెల్లుచీటీ ఇవ్వడం ఉంది. కాని, ఇంత పెద్ద ఎత్తున సాక్షులను చంపిపారేసిన చరిత్ర సృష్టించినది సంఘపరివారమే. తమకు వ్యతిరేకంగా మాట్లాడినవారిని చంపడం సంఘ పరివారానికి వెన్నతో పెట్టిన విద్య అనేది మరొకసారి రుజువవుతున్నది.

అలాగే నేరస్తులకు కొమ్ముకాయడంలో కూడ భాజపా కొత్త ప్రమాణాలు సృష్టిస్తున్నది. నేరస్తులు తమకు కావలసిన వారైనా తూతూ మంత్రంగానైనా విచారణ జరిపి, వారిని నిర్దోషులుగా ప్రకటింపజేసి విడుదల చేయడం, అధికార పీఠాలమీద కూచోబెట్టడం ఆరు దశాబ్దాలుగా పాలకులకు అలవాటైన విద్య. ఇప్పుడు భాజపా కనీసం ఆ నామ మాత్రపు విచారణ ప్రక్రియను కూడ పక్కనపెట్టడం మాత్రమే కాదు, నేరస్తులు విదేశాలకు పారిపోయి, బోనెక్కకుండా అక్కడే తలదాచుకునేందుకు సహాయపడుతున్నది. వందల కోట్ల రూపాయల అవినీతి కుంభకోణానికి బాధ్యుడైన వ్యక్తి విదేశాల్లో ఆశ్రయం పొందడానికి భాజపాకు చెందిన కేంద్ర మంత్రి, రాష్ట్ర ముఖ్యమంత్రి సహకరించారు. సంఘ పరివారానికి చెందిన ఒక సీనియర్ పాత్రికేయుడు లండన్ వెళ్లి మరీ ఆ నేరస్తుడి గుణగణాలను వర్ణించి, ఆశ్రయానికి సిఫారసు చేసివచ్చాడు.

ప్రజా సంక్షేమ కార్యక్రమాలకు కేటాయించే ప్రజాధనాన్ని దుర్వినియోగం చేయడం, సొంత బొక్కసాలు నింపుకోవడం గతకాలపు పాలకులందరూ చేసిన అవినీతి కార్యక్రమాలలో భాగమే. అందులో కొత్త ఏమీ లేదు. కాని అక్కడ కూడ అత్యంత అసహ్యకరమైన పద్ధతిలో అవినీతికి పాల్పడే కొత్త ఒరవడిని భాజపా నాయకులు సృష్టిస్తున్నారు. తండ్రి మరణంతో, సానుభూతి పవనాలతో మంత్రి అయిన వ్యక్తి ప్రభుత్వ హాస్టళ్లలో ఉండే చిన్నపిల్లల ఆహార, వసతి సౌకర్యాల నిధుల్లో, చిట్టచివరికి ఆ పిల్లలకు ఇచ్చే వేరుశనగ ఉండల కొనుగోళ్లలో, అక్రమాలకు పాల్పడ్డారంటే భాజపా నాయకులు ఎంత నిస్సిగ్గుగా 'మంచి తరుణం మించిన దొరకదు, ఆలసించిన ఆశాభంగం' అన్నట్టుగా పెద్దా చిన్నా కుంభకోణాల్లో కూరుకుపోతున్నారో అర్థమవుతుంది.

అయితే భాజపా అవినీతి గురించి మాట్లడుతున్నామంటే, మిగిలిన పార్టీలు నీతిమంతులని ఎంతమాత్రం కాదు. ఈ దేశంలో పార్లమెంటరీ రాజకీయ పక్షాలన్నీ రాష్ట్రాలలోనో, కేంద్రంలోనూ ప్రభుత్వాధికారం చేపట్టినవే. ఏ ఒక్క ప్రభుత్వమూ అవినీతికి మినహాయింపు కాదు. అసలు ఇవాళ కొనసాగుతున్న వ్యవస్థే అవినీతికి ఆస్కారం ఇచ్చే వ్యవస్థ. అతి కొద్దిమందికి సకల అవకాశాలు ఇచ్చి, అశేష ప్రజానీకాన్ని పేదరికంలో ముంచే అసమానతలు నిండిన వ్యవస్థే అవినీతి. అన్ని ప్రభుత్వాల, అన్ని పాలకవర్గ ముఠాల బాధ్యత ఆ అవినీతికర వ్యవస్థను పరిరక్షించడమే. కనుక డబ్బులు తిన్నారా తినలేదా, అక్రమాలకు పాల్పడ్డారా లేదా అనే ప్రశ్నల కన్న వ్యవస్థను కాపాడడం అనే అవినీతికి పాల్పడుతున్నారా లేదా అనేదే అసలు ప్రశ్న. అవినీతి రద్దయిపోవాలని నిజమైన ఆకాంక్ష ఉన్నవారు వ్యవస్థ రద్దయి పోవాలని కోరుకోవలసిందే తప్ప, ఈ వ్యవస్థలో అవినీతి రహిత పాలన అసాధ్యమని గుర్తించాలి. వీ

# నీట ముంచి, కళ్లు కప్పి, అసలు విషయాలు తప్పించి...

ఈ నెల కూడ రెండు తెలుగు రాష్ట్రాలకూ కలిపి ఒకే సంపాదకీయవ్యాఖ్య రాయక తప్పడం లేదు. ఈ నెలలో రెండు రాష్ట్రాలలో విడివిడిగా జరిగినప్పటికీ, గోదావరి పుష్కరాలు అనే ఒకే పరిణామం జరిగింది. ఆ పరిణామంలో రాజ్యాంగ ఉల్లంఘన దగ్గరినుంచి ప్రజల దృష్టిని అసలు విషయాల నుంచి మళ్లించే పాలకవర్గాల వంచనాశిల్పం దాకా అనేక చర్చనీయమైన కోణాలున్నాయి.

అసలు పుష్కరాలనేవే ఒక మూఢనమ్మకం మీద, అబద్ధం మీద, మధ్యయుగాల అజ్ఞాన విశ్వాసం మీద, జ్యోతిష్యం మీద ఆధారపడినవి. భూమి బల్లపరుపుగా ఉన్నదనే, నవగ్రహాలూ భూమి చుట్టూ తిరుగుతున్నాయనే ఒక తప్పుడు ప్రాతిపదిక మీద, స్థిరంగా కనబడిన నక్షత్ర మండలం ఒక్కొక్కదాన్నీ ఒక రాశిగా గుర్తించింది జ్యోతిష్యం. ఒకవైపు తప్పుడు ప్రాతిపదికలు, మరొకవైపు దృగ్గోచరాంశాల పట్ల, ముఖ్యంగా నక్షత్ర మండలాల పట్ల కచ్చితమైన గణితశాస్త్ర అంచనాలు కలగలిసిన విచిత్ర సమ్మేళనం అది. గ్రహచలనంలో ఆయా రాశులలోకి ఆయా గ్రహాలు రావడాన్ని బట్టి కోట్ల మైళ్ల దూరంలో ఉన్న మనుషుల మీద ఏవో ప్రభావాలు ఉంటాయనే తప్పుడు నిర్ధారణలు తీసింది జ్యోతిష్యం. ఈ నిగూఢ, మూఢవిశ్వాసాలను ప్రజలలో పెంపొందించడమే తమ దోపిడీ పీడనలను ప్రశ్నించకుండా ఉండడానికి మార్గం అనుకున్న పాలకవర్గాలు వేల సంవత్సరాలుగా ఈ తప్పుడు భావాలను ప్రోత్సహిస్తూ వస్తున్నాయి. జ్యోతిష్యం ప్రకారం ఒక్కోనదికి ఒక రాశిని కేటాయించి, బృహస్పతి గ్రహం ఆ రాశిలో ప్రవేశించినప్పుడు ఆ నదికి పుష్కరం జరుగుతుందని, అప్పుడు ముక్కోటి దేవతలు ఆ నదిలో స్నానం చేస్తారని, అప్పుడు స్నానం చేసిన మనుషుల పాపాలన్నీ అంతరిస్తాయని, ఒక కట్టుకథ ప్రచారంలో పెట్టారు. హేతువాదాన్నీ, తర్కాన్నీ, శాస్త్రీయ జ్ఞానాన్నీ పరిగణనలోకి తీసుకుంటే ఈ కట్టుకథను తుత్తునియలు చేయవచ్చు.

నిజానికి స్వామి వివేకానందతో సహా భారతీయ ఆలోచనాధారలో జ్యోతిష్యాన్ని మూఢనమ్మకంగా భావించి ఖండించిన వారెందరో ఉన్నారు. భారత సమాజం ఇటువంటి హేతురహిత, మూఢనమ్మకాల వల్లనే పురోగమించ లేకపోయిందనే ఆలోచనలతోనే భారత రాజ్యాంగంలో 'శాస్త్రీయ స్పృహతో, అన్వేషణా దృష్టితో ప్రవర్తించడం పౌరులలో ప్రతి ఒక్కరి ప్రాథమిక బాధ్యత' అని రాసుకున్నాం. అది పౌరుల బాధ్యత అంటే, దానికి అవకాశం కలిగించడం ప్రభుత్వ బాధ్యత అని అర్థం. కాని ప్రభుత్వాలే అశాస్త్రీయ భావాలను, మూఢనమ్మకాలను ప్రచారం చేయడం, అన్వేషణా దృష్టిని మొద్దుబార్చే చర్యలు చేపట్టడం, అందుకొరకు వందల కోట్ల రూపాయల ప్రజాధనాన్ని దుర్వినియోగం చేయడం కచ్చితంగా రాజ్యాంగ ఆదర్శాల ఉల్లంఘనే. రాజ్యాంగం మీద ప్రమాణం చేసి అధికారానికి వచ్చిన, రాజ్యాంగబద్ధంగా మాత్రమే పాలన నిర్వహించవలసిన ప్రభుత్వాలు, భిన్నమైన ఆదర్శాలను ప్రకటించే ప్రభుత్వాలు కూడ ఇంత పెద్ద ఎత్తున రాజ్యాంగ ఉల్లంఘనకు ఎందుకు పాల్పడుతున్నట్టు?

ప్రభుత్వమనేది పాలకవర్గ ప్రయోజనాలను నెరవేర్చే బాధ్యత తీసుకున్న అధికార యంత్రాంగం గనుక, ప్రభుత్వాలు మారినట్టు కనిపించినప్పటికీ ఒక పాలకవర్గ ముఠా స్థానంలో మరొక పాలకవర్గ ముఠా చేతికి అధికారమార్పిడి జరగడం తప్ప మరేమీ జరగదు గనుక, రాజ్యాంగ ఉల్లంఘనలకు అసలు కారణాన్ని పాలకవర్గ ప్రయోజనాలేమిటనే చర్చలోనే వెతకవలసి ఉంటుంది. మన సమాజం లోని సమాజ సంపదను పిడికెడు మంది సంపన్నులకు పంచడం, దోపిడీ పీడనలను యథాతథంగా కొనసాగించడం, ఆ దోపిడీ పీడనలు ప్రజల దృష్టికి రాకుండా మేలిముసుగు కప్పి అబద్ధాలు ప్రచారం చేయడం, వాస్తవాల్ని బైట పెట్టేవారి గొంతు నొక్కడానికి, వారిని అణచివేయడానికి ప్రయత్నించడం పాలకవర్గాల బాధ్యత. ఈ పనులన్నీ చేయడానికి, ప్రజలను మత్తులో ముంచడానికి ఉపయోగపడేవి మతం, మతాచారాలు, మూఢనమ్మకాలు. అందువల్లనే రాజ్యాంగంలో లౌకిక వాదం, శాస్త్రీయ దృక్పథం అనే గంభీరమైన మాటలు రాసుకున్నప్పటికీ పాలకులు మూకుమ్మడిగా, పెద్ద ఎత్తున మూఢనమ్మకాలను, మతాచారాలను ప్రచారం చేస్తారు.

తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాలు రెండిటికీ కూడ ఇవాళ ఏడాది గడిచిన తర్వాత కూడ అమలు చేయలేకపోయిన వాగ్దానాల గురించి చర్చ జరగగూడదు. పేదరికం, అవిద్య, అనారోగ్యం, నిరుద్యోగం, ఆత్మగౌరవం, రైతాంగం ఆత్మహత్యలు, పాలకుల వాగ్దానభంగాలు వంటి నిజమైన నిత్యజీవిత ప్రజాసమస్యల మీద చర్చ జరగగూడదు. పాలకుల నిర్వాకం మీద చర్చ జరగగూడదు. అంటే, రొట్టె ఇవ్వలేనప్పుడు సర్కస్ ఇవ్వాలి అని సామెత చెప్పినట్టు, ఈ అసలు సమస్యలు చర్చించడానికి అవకాశం లేని, తీరిక లేని ఒక ఉద్వేగ, ఉన్మాద వాతావరణం కావాలి. ఆ సంరంభంలో మౌలిక విషయాలమీద మౌనం నెలకొనడమే పాలకవర్గాల ప్రయోజనం. ఆ ఉన్మాదస్థితిని రెచ్చగొట్టడానికి వందల కోట్ల రూపాయలు కేటాయిస్తే, లెక్కాపత్రం లేని ఆ నిధుల ఖర్చులో ఆశ్రిత కాంట్రాక్టర్ల ప్రయోజనాలూ నెరవేరుతాయి. ఆ ఉన్మాదంలో అభాగ్యుల ప్రాణాలు పిట్టల్లా రాలిపోయినా, అనారోగ్యం ప్రబలినా, మూఢనమ్మకాలు బలపడినా పాలకవర్గాల మోసాన్ని కనబడకుండా చేయడంలో వీటిని పట్టించుకోనక్కరలేదు.

ప్రజల నిత్యజీవితావసరాలు తీర్చడానికి అడ్డువస్తున్న నిధుల కొరత, మూఢనమ్మకాల ప్రచారానికీ, అంధవిశ్వాసాల ప్రోత్సాహానికీ ఎందుకు అడ్డం రావడం లేదో, అన్యాయానికీ, వివక్షకూ గురైన వర్గాలు నోరుతెరిచి అడిగినా పది కోట్ల లోపు నిధులు ఇవ్వడానికి కూడ సిద్ధపడని పాలకులు, ఎవరూ అడగకుండానే ఈ వేలం వెర్రికి వందల, వేల కోట్ల రూపాయలు ఎందుకు ఖర్చు పెడుతున్నారో ఆలోచనాపరులైనా గుర్తించాలి, ప్రశ్నించాలి. ఏదైనా ఒక పని వేలం వెర్రిగా జరిగినంతమాత్రాన, లక్షల మందో, కోట్ల మందో పాల్గొన్నంత మాత్రాన సరి అయినదైపోదు. న్యాయాన్యాయ, నిజానిజ, ఉచితానుచిత విచక్షణ కావాలి. వీ

# మరొకసారి గ్రీస్ ప్రజలకు పాలకుల ద్రోహం

పెనం నుంచి పొయ్యిలో పడ్డట్లయింది గ్రీస్ ప్రజల పరిస్థితి. స్వేచ్ఛా మార్కెట్ విధానాలకు వ్యతిరేకంగా తిరుగుబాటు తీర్పునిచ్చి సిరిజా వామపక్ష ప్రభుత్వాన్ని ఎన్నుకున్నందుకు ప్రతీకారం అన్నట్లు యూరోపియన్ కమిషన్, యూరోపియన్ సెంట్రల్ బ్యాంక్, ఐఎంఎఫ్ దుష్ట త్రయం యూరప్ పెద్దన్న జర్మనీ కనుసన్నల్లో ప్రజలను మరింత అప్పుల ఊబిలోకి తోసేసే 'బెయిల్‌ఔట్' ప్యాకేజీ గుదిబండను బిగించింది. బెయిల్ ఔట్‌గా ముద్దుగా పిలవబడే అప్పుల ప్యాకేజీని ప్రకటించి 'షరతులు వర్తించును' అనే ట్యాగ్ తగిలించింది. చితికిన బతుకుల్ని మరింత ఛిద్రం చేసే అమానవీయ షరతుల చిట్టాలను చిద్విలాసంగా ఆవిష్కరించింది. 2010, 2012 లలో ఇచ్చిన 'బెయిల్ ఔట్స్' ప్రజలను ఆదుకోలేదు సరికదా, గ్రీస్ బ్యాంకులకు రుణాలు చెల్లించడానికి మాత్రమే ఉపయోగపడ్డాయి. ఉద్యోగాల, వేతనాల కోత, పెన్షన్ల తగ్గింపు, విద్య, ఆరోగ్య సేవల కుదింపు, పన్నుల పెంపు, ప్రైవేటీకరణ రూపంలో ప్రజలు నానా ఇక్కట్లు ఎదుర్కొన్నారు. ఇయు వల్ల లాభపడింది జర్మనీ మాత్రమే.

జూలై 5 నాటి ప్రజాతీర్పును సిరిజా ప్రభుత్వ కూటమి గౌరవించ లేకపోయింది. 19 దేశాలు, 17 గంటలు చర్చలు సాగించి పాత షరతులతో కొత్త కాఠిన్యంతో ముచ్చటగా మూడోసారి 87 బిలియన్ యూరోల ప్యాకేజీని ప్రకటించాయి. ఈ షరతులన్నీ అమల్లోకి వస్తే గ్రీస్ మరింత అతలా కుతలం కావడం ఖాయం. గ్రీస్ రు(ణా)జాగ్రస్త ఆర్థిక వ్యవస్థకు మళ్లీ పనిచేయని మందునే అందించింది యూరప్ సమాఖ్య. కనీసం 350 యూరోల పింఛన్ పొందుతున్న వృద్ధులు 120 యూరోల చొప్పున కోతను భరించాల్సి వస్తుంది. కనీస వేతనాలు తగ్గించడంతో పాటు ప్రభుత్వ రంగ సంస్థలైన విమానాశ్రయాలు, ఓడరేవులు, విద్యుత్ కేంద్రాలను కారుచౌకగా దేశీయ ప్రైవేట్ సంస్థలకో, విదేశీ కార్పొరేట్లకో విక్రయించాలి. సరిగ్గా ఇటువంటి స్థితినే గ్రీస్‌లోని ఉన్నత వర్గాల చేతుల్లో ఉన్న మీడియా కోరుకున్నది. మొన్నటి రెఫరెండంలో కూడా విచ్చలవిడిగా ప్రచారం చేసింది. పన్నుల భారం పెరిగి కనీస అవసరాలు ప్రత్యేకించి మందుల ధరలు పెరిగి ప్రజలకు అందుబాటులో ఉండకపోవచ్చు. పన్నులు చెల్లించలేని స్థితిలో ప్రజలుంటే ప్రభుత్వం పన్ను ఆదాయం లేక మరింత దివాళా తీసి రుణాలను తిరిగి చెల్లించలేని దుస్థితికి నెట్టబడుతుంది. భవిష్యత్‌లో ఏ పని చేసినా రుణదాతల కనుసన్నల్లోనే, ఏ నిర్ణయం అయినా వారి దయాదాక్షిణ్యాల మీద ఆధారపడే, ఒక రకంగా సార్వభౌమత్వాన్ని రుణదాత చేతుల్లో పెట్టినట్లే. ఇంత కఠినమైన షరతులతో కూడిన ప్యాకేజీ ప్రకటనకు ప్రధాన శక్తి ఇయు సమాఖ్యలో పెత్తనం చేస్తున్న జర్మనీ.

గ్రీస్ పునర్వైభవం పొందాలంటే దేశీయ వనరుల ఆలంబనగా తన ఆర్థిక వ్యవస్థను తిరిగి నిర్మించుకోవాల్సి ఉంది. సమాఖ్య పేరుతో స్వంత ఉనికిని కోల్పోకుండా, పరాధీనం కాకుండా తన కాళ్లపై తాను నిలబడాలి. యూరోపియన్ యూనియన్ నుండి తక్షణమే కాకపోయినా నిష్క్రమణకు మార్గం సిద్ధం చేసుకోవాలి. యూరో కరెన్సీని వదిలి దేశీయ కరెన్సీని ఎంచుకోవాలి. దేశీయ ఉత్పత్తులకు మార్కెట్‌ను వెతుక్కునే ప్రయత్నాలు మొదలు పెట్టాలి. ప్రస్తుత రుణాల సుడిగుండంలోంచి గ్రీస్‌ను బయట పడేసే బాధ్యత అంతర్జాతీయ సమాజంపై కూడా ఉన్నది. యూరోపియన్ సమాఖ్య అప్పులను తక్షణమే రద్దుపరిచేలా, గ్రీస్ ఒక స్వయం సమృద్ధ ఆర్థికవ్యవస్థగా ఎదిగేలా తోడ్పాటును అందించాలి.

వీ






❖ **కాసుల కబంధ హస్తాలలో – కళలు, సాహిత్యం** – 'సోషలిస్టు సంస్కృతికి పాఠ్యగ్రంథం' – అప్టన్ సింక్లేర్ 'మమనార్ట్' పరిచయం – ముక్తవరం పార్థసారథి – జనసాహితి ప్రచురణ–197 పేజీలు, 1/8 డెమీ, రు. 75




❖ **ప్రజాసాహితిలో సమరశీల కలం యోధుడు – సి.వి.** – జనసాహితి ప్రచురణ – 240 పేజీలు, 1/8 డెమీ, రు. 120

పై రెండు పుస్తకాల ప్రతులకు : మైత్రీ బుక్‌హౌస్, జలీల్ వీధి, కార్ల్‌మార్క్స్ రోడ్డు, విజయవాడ – 520 002; సెల్: 9848631604; ఈమెయిల్:ravibabujs@yahoo.co.in




❖ **మనాది** – యాది పాటలు – మాసాయిపేట యాదగిరి మాదిగ – దండోరా ప్రచురణ – 112 పేజీలు, 1/8 డెమీ, రు. 50 – ప్రతులకు : యాది, మాసాయిపేట యాదగిరి మాదిగ, మాసాయిపేట గ్రామం, వెల్దుర్తి మండలం, మెదక్ – 502 335; సెల్: 9849247751; విశాలాంధ్ర బుక్‌హౌస్; మైత్రీ బుక్‌హౌస్; అన్ని బుక్‌స్టాల్లలోనూ




❖ 'లెనిన్ అంతిమ పోరాటం' పుస్తకంలో చేసిన ఆరోపణలకు **– మా సమాధానం** – తోలేటి జగన్మోహనరావు – స్టాలిన్ సొసైటి, ఇండియా – 106 పేజీలు, 1/8 డెమీ, రు. 60 – ప్రతులకు : తోలేటి జగన్మోహనరావు, బి–1005, ఫార్చ్యూన్ హైట్స్, మదీనాగూడ, హైదరాబాద్ – 500 049; విశాలాంధ్ర; ప్రజాశక్తి; మైత్రీ; అన్ని బుక్‌స్టాల్లలోనూ




❖ **నూరు ప్రశ్నల హోరు – ద్వానా జవాబుల జోరు** – నియోగి – కిన్నెర పబ్లికేషన్స్ – 93 పేజీలు, 1/8 డెమీ, రు. 100




❖ **అలనాటి విశేష కవితలు** – డా. ద్వా.నా. శాస్త్రి – ప్రగతి పబ్లిషర్స్ – 78 పేజీలు, 1/8 డెమీ




❖ **తెలంగాణ సాహితీ సంపద** – డా. ద్వా.నా. శాస్త్రి – ప్రగతి పబ్లిషర్స్ – 176 పేజీలు, 1/8 డెమీ, రు. 150

పై మూడు పుస్తకాల ప్రతులకు : డా. ద్వా.నా. శాస్త్రి, 1–1–428, గాంధీనగర్, హైదరాబాద్ – 500080; సెల్: 9849293376; ఈమెయిల్:sastri48@gmail.com; విశాలాంధ్ర; ప్రజాశక్తి; మైత్రీ; అన్ని బుక్‌స్టాల్లలోనూ




❖ **తెలంగాణ సాహిత్య రత్నాల వీణ** – డా. ద్వా.నా. శాస్త్రి – నీల్‌కమల్ పబ్లికేషన్స్ – 287 పేజీలు, 1/8 డెమీ, రు. 250 ప్రతులకు : నీల్‌కమల్ పబ్లికేషన్స్ ప్రై.లి., సుల్తాన్ బజార్, హైదరాబాద్ – 500 095; ఫోన్: 24757140, 24757197, 24757944




❖ **పి. రామకృష్ణ రచనలు** – నవలలు, కథలు, వ్యాసాలు, కవితలు – మానవి పబ్లికేషన్స్ – 816 పేజీలు, 1/8 డెమీ, రు. 500, ప్రతులకు : మానవి పబ్లికేషన్స్, 404, జెబిఎస్ రెసిడెన్సీ, సాలిపేట రోడ్డు, పోరంకి – 521 137, విజయవాడ; సెల్ : 9490942587



❖ **కమ్యూనిస్టు మానిఫెస్టో** – కార్ల్ మార్క్స్, ఫ్రెడరిక్ ఎంగెల్స్ – కామ్రేడ్ కొల్లా వెంకయ్య మెమోరియల్ లైబ్రరి ప్రచురణ – 80 పేజీలు, 1/8 డెమీ, రు. 10, ప్రతులకు : కామ్రేడ్ కొల్లా వెంకయ్య మెమోరియల్ లైబ్రరి, పెదనందిపాడు – 522 235, గుంటూరు జిల్లా; అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాల్లో




❖ **చైనా కమ్యూనిస్టు పార్టీ – మౌలిక అవగాహన** – షాంఘై టెక్స్ట్‌బుక్ 1974 – విప్లవ రచయితల సంఘం – 198 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు : పి. వరలక్ష్మి, 5–1820, గీతాశ్రమం వీధి, ప్రొద్దుటూరు, కడప జిల్లా – 516 360; అన్ని ప్రముఖ పుస్తక షాపులు




❖ **ఏది నేరం?!** – హజారీబాగ్ జైలు గాథలు – బి. అనురాధ – విప్లవ రచయితల సంఘం – 141 పేజీలు, 1/8 డెమీ, రు. 75, ప్రతులకు : డి.వి. రామక్రిష్ణారావు, ఎంఐజి – 14, ఎపిఐఐసి కాలనీ, కార్బైడ్ కంపెనీ ఎదురుగా, మౌలాలీ, హైదరాబాద్ – 500040; అన్ని ప్రముఖ పుస్తక షాపులు




❖ **వాట్సప్ తరంలో యుద్ధగీతం**– విప్లవ రచయితల సంఘం – 56 పేజీలు, 1/8 డెమీ, రు. 30, ప్రతులకు : వలేటి అరవింద్ కుమార్, 1–9–52/ఎఫ్/2, ఈసేవ, మదర్స్ హైస్కూల్, రామ్‌నగర్, హైదరాబాద్ – 500 020; సెల్: 814220011; అన్ని ప్రముఖ పుస్తక షాపులు




❖ **ఐక్య సంఘటన** – సిద్ధాంత వ్యాసాలు – విప్లవ రచయితల సంఘం – 104 పేజీలు, 1/8 డెమీ, రు. 35, ప్రతులకు : సి.ఎస్.ఆర్. ప్రసాద్, సి–132, ఎస్‌విఎన్ కాలనీ, గుంటూరు – 522 011; అన్ని ప్రముఖ పుస్తక షాపులు




❖ **విద్యార్థి ఉద్యమాల్లో విప్లవ దిద్దుబాటు** – దిక్సూచి ప్రచురణ – 88 పేజీలు, 1/8 డెమీ, రు. 30, ప్రతులకు : దిక్సూచి ప్రచురణలు, జింకిభద్ర గ్రామం, శ్రీకాకుళం జిల్లా; అన్ని ప్రముఖ పుస్తక షాపులు




❖ **చైనా తాత్విక రంగాన మూడు ప్రధాన పోరాటాలు 1949–64** – విప్లవ రచయితల సంఘం – 48 పేజీలు, 1/8 డెమీ, రు. 20, ప్రతులకు : సి.ఎస్.ఆర్. ప్రసాద్, సి–132, ఎస్‌విఎన్ కాలనీ, గుంటూరు – 522 001; అన్ని ప్రముఖ పుస్తక షాపులు

# అప్పుడు చలసాని ప్రసాద్‌కు వీక్షణం కన్నీటి జోహార్లు

'వారం పది రోజుల్లో హైదరాబాద్ వస్తున్నా. వారం రోజులుంటా. చాలా పనులున్నాయి. వీక్షణంకు విరాళాలు సేకరించడం మొదటి పని. అరుణతారకు విరాళాలు సేకరించడం నా మొదటి బాధ్యత కదా, ఇన్నాళ్లూ ఆ పనిలో వీక్షణంను పక్కన పెట్టాను. ఏమీ అనుకోకు. ఈసారి పూర్తిగా నీ పనే. నా అప్పులు కూడ పెరిగి పోతున్నాయి. తీర్చే మార్గం చూడాలి. అప్పు ఎగ్గొట్టి చనిపోయాడు అని ఎవరూ అనుకోగూడదు...' అంటూ ఆయన చెప్పిన మాటే చెపుతూ పోతుంటే అవసరం లేని ఒత్తిడి అనుభవిస్తున్నందుకు, చావు మాట ఎత్తినందుకు 'ఎందుకలా మాట్లాడుతారు' అని కోప్పడ్డాను. 'నా ఆరోగ్యానికేమైంది, బాగున్నా, ఊరికే చెప్తున్నా' అన్నారు. అది జూలై 14 సాయం కాలం నాలుగున్నరకు.

శ్రీకాకుళం జిల్లా సోంపేట పోలీసు కాల్పులు జరిగి జూలై 14కు ఐదు సంవత్సరాలు అయిన సందర్భంగా అక్కడ జరిగిన సభలో మాట్లాడ డానికి వెళ్లి, తిరిగి వస్తూ, విశాఖపట్నంలో గోదావరి ఎక్స్‌ప్రెస్ అందుకోవడానికి ముప్పావు గంట వ్యవధి ఉండడంతో పది నిమిషాల కోసమైనా చలసాని ప్రసాద్‌ను చూసి వద్దామని ఇంటికి వెళ్లాను. అదే చివరి చూపు అవుతుందనుకోలేదు. జూలై 25 ఉదయం పది గంటలకు ఆయన తుదిశ్వాస విడిచారు. ఏడాది కింద స్కూటర్ మీది నుంచి పడిపోయినప్పుడు ఆందోళన కలిగింది గాని ఆ తర్వాత అన్ని రిపోర్టులూ నార్మల్‌గా ఉండడంతో, మరే అనారోగ్యమూ లేకపోవడంతో, కొద్దిపాటి మతిమరుపు, చెప్పిన మాటే చెప్పడం వచ్చినా మేధ ఇంకా సునిశితంగానే ఉండడంతో ఇంకా ఐదు, పది సంవత్సరాలు ఉంటారని భరోసా ఉండింది.



8 డిసెంబర్ 1932 - 25 జూలై 2015

అనేక రంగాలలో విస్తృత కృషి సాగించిన చలసాని ప్రసాద్ వంటి బహుముఖ ప్రతిభాశాలి గురించి, హృదయానికి అత్యంత సన్నిహితుడైన వ్యక్తి గురించి క్లుప్తంగా రాయడం కష్టం. ఆయన ఒక అసాధారణమైన మనిషి. ఏడు దశాబ్దాలుగా కమ్యూనిస్టు ఆదర్శాలతో జీవిస్తున్నవాడిగా అరుదైన వ్యక్తి ఆయన. ప్రజా ఉద్యమాలతో, విప్లవ సాహిత్యోద్యమంతో మమేకమై, వేలాది మంది స్నేహితులకు ప్రేమను పంచిన వ్యక్తి. అసాధారణమైన చదువరి. పుస్తక ప్రేమికుడు. సైద్ధాంతిక, రాజకీయ అంశాలలో చాల కచ్చితంగా, సునిశితంగా, విమర్శనాత్మకంగా ఉంటూనే మానవ సంబంధాలలో ఉదారంగా, ప్రేమపూర్వకంగా, విశాల హృదయంతో ఉండాలనే విలువను జీవితాంతం ఆచరించిన వ్యక్తి.

కృష్ణా జిల్లా భట్ల పెనుమర్రులో చలసాని బసవయ్య, వెంకటనరసమ్మల కొడుకుగా చలసాని ప్రసాద్ 1932 డిసెంబర్ 8న పుట్టారు. తండ్రి చల్లపల్లి జమీందార్ దగ్గర సమద్దార్ (గుమస్తా) గా పనిచేస్తుండడంతో కుటుంబం చల్లపల్లి సమీపంలోని కృష్ణాతీర గ్రామం నాదెళ్లవారిపాలెం చేరింది. ప్రగతిశీల భావాలతో, నిజాయితీకి మారుపేరుగా ఉండే బసవయ్యను జమీందారు ఏరికోరి తన ఆర్థిక వ్యవహారాల, కప్పం వసూళ్ల గుమస్తాగా నియమించుకున్నాడు. తండ్రి నిజాయితీయే మారుతున్న సామాజిక రాజకీయార్థిక పరిస్థితులలో ఇంట్లోకి సహజంగా కమ్యూనిస్టు రాజకీయాలను తీసుకువచ్చింది. ఆ రాజకీయ వాతావరణం ప్రభావం వల్లనే ప్రసాద్ తన ఐదో ఏట మొదటిసారి కమ్యూనిస్టు జెండా పట్టుకుని ఊరేగింపులో పాల్గొన్నారు. పాఠశాల విద్యార్థిగానే స్టూడెంట్స్ ఫెడరేషన్ కార్యకర్త అయ్యాడు. తెలంగాణ రైతాంగ సాయుధ పోరాట నాయకులు రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి, రాజబహదూర్ గౌర్ అజ్ఞాతవాసంలో తన ఇంట్లో ఉండడం ప్రసాద్ తొలి యవ్వనపు గుర్తు. తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటానికి అండగా ఉన్నందుకూ, జమీందారీ వ్యతిరేక పోరాటాలలో అగ్రభాగాన ఉన్నందుకూ కృష్ణా జిల్లా కమ్యూనిస్టుల మీద 1948-50లలో అమలయిన దారుణ దమనకాండలో ప్రసాద్ పినతండ్రి జగన్నాథరావును, అన్న శ్రీనివాసరావు ను, పెద్దక్క భర్త పాపారావును పోలీసులు కాల్చి చంపారు. కుటుంబం అష్టకష్టాల పాలై, కృష్ణా- ఖమ్మం సరిహద్దు గ్రామమైన చీమలపాడుకు తరలి పోయింది. ప్రసాద్ చదువు ఆగిపోయింది. అలా ప్రసాద్ బాల్యమూ యవ్వనమూ కష్టాలతో, కమ్యూనిస్టు ఆదర్శాలతో, ఆచరణతో, త్యాగ సంప్రదాయాలతో కలగలిసి సాగాయి. ఆ తర్వాత గడిచిన ఆరున్నర దశాబ్దాల ప్రసాద్ జీవితమంతా ఆ ఆదర్శాలతో, ఆచరణతో, త్యాగనిరతితోనే కొనసాగింది.

హైదరాబాదు, ఖాజీపేట, మద్రాసు వంటి అనేకచోట్ల మత్స్యశాఖలో, రైల్వేలో, సినిమాల్లో చిరుద్యోగాలు చేసి చివరికి 1968లో విశాఖపట్నం మిసెస్ ఎవిఎన్ కాలేజిలో రాజనీతి శాస్త్ర అధ్యాపకుడిగా చేరి అక్కడే 1992లో పదవీ విరమణ చేశారు. ఏ ఊళ్లో ఉన్నా, ఏ ఉద్యోగం చేసినా ఆయన ఆలోచించినదీ, శ్వాసించినదీ, ఆచరించినదీ మార్క్సిజమే. ఇరవై నిండకముందే కుటుంబ సభ్యులనూ, సన్నిహిత మిత్రులనూ రాజ్యం పొట్టన పెట్టుకున్నప్పుడు కలిగిన రాజ్యవ్యతిరేకత ఆయనలో చివరిక్షణం వరకూ కొనసాగింది. చిన్ననాటనే రూపొందిన సమసమాజ భావన, త్రిపురనేని రామస్వామి చౌదరి, చలం వంటి ప్రగతిశీల ఆలోచనాధార, నిరంతర విస్తృత అధ్యయనం ఆయన ఆదర్శాలను బలపరిచాయి. తాళాలు లేని ఇళ్లు, పరీక్షలు లేని పాఠశాలలు, పోలీసులు లేని సమాజం ఏర్పడాలనే ఆదర్శాన్ని ఆయన తన సొంత ఆదర్శంగా మార్చుకున్నారు. తన ఇంటిని తాళం లేని ఇల్లుగా సమాజపు ఆస్తిగా మార్చారు. పాఠశాలలోనూ, సమాజం లోనూ తక్షణమే తన విలువలను అమలు చేసే అవకాశం లేకపోయినా ఆ దిశగా సాగుతున్న పోరాటాలకు తన అనుక్షణ ఆలోచనలో కార్యాచరణలో మనసా వాచా కర్మణా సహకరించారు.

తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటం కన్న ముందే మార్క్సిస్టు భావజాలంతో ప్రభావితులై, ఆ పోరాట విరమణ తర్వాత ఆ పోరాట స్ఫూర్తి కొడిగట్టి పోకుండా కాపాడుకుని, మళ్లీ నక్సల్బరీ, శ్రీకాకుళ విప్లవోద్యమాల ప్రజ్వలనంతో ఆ సంప్రదాయాన్ని కొనసాగించి మూడు తరాల విప్లవధారగా, వారధిగా నిలిచిన అరుదైన వ్యక్తులలో చలసాని ప్రసాద్ ఒకరు. అంతకు ముందు నుంచే ఉన్న సాహిత్యాభిమానం తెలంగాణ

సాయుధ పోరాట విరమణ తర్వాత పూర్తిస్థాయి సాహిత్యాభినివేశంగా మారింది. మొదటినుంచీ శ్రీశ్రీ మీద ఉండిన అభిమానం 1955 ఎన్నికల ప్రచారంలో శ్రీశ్రీకి సహాయకుడిగా వెంట తిరగడంతో మరింత బలపడి, అవినాభావ సంబంధంగా మారింది. అప్పటినుంచి నక్సల్బరీ, శ్రీకాకుళ విప్లవోద్యమ ప్రజ్వలనం దాకా కమ్యూనిస్టు పార్టీ, అభ్యుదయ రచయితల సంఘమూ బలహీనంగా, ప్రజలకు దూరంగా ఉండగా, చలసాని ప్రసాద్ నిరుద్యోగంలో, చిరుద్యోగాలలో హైదరాబాదు, ఖాజీపేట, మద్రాసు తిరుగుతున్నారు. ఖాజీపేట రోజుల్లోనే ఆయనకు అంతకుముందే పరిచితులైన కొండపల్లి సీతారామయ్య, కెజి సత్యమూర్తిల ప్రభావం, సాన్నిహిత్యం పెరిగాయి. తర్వాత కొన్ని సంవత్సరాలకు తాను విశాఖపట్నం మారి శ్రీకాకుళ విప్లవోద్యమంతో సంబంధం ఏర్పడినాక ఆ బంధం మరింత బలపడింది.

ఆ సమయంలోనే 1970 ఫిబ్రవరి 1న విశాఖపట్నంలో శ్రీశ్రీ షష్టిపూర్తి కార్యక్రమం ఏర్పాటు చేయడంలో ప్రసాద్ కీలకపాత్ర వహించారు. ఆ షష్టిపూర్తి సభలకు సరిగ్గా ఐదు వారాల ముందు శ్రీకాకుళం జిల్లా రంగమెటియా కొండల్లో సుబ్బారావు పాణిగ్రాహిని పోలీసులు కాల్చి చంపారు. అప్పటికే శ్రీకాకుళ విప్లవోద్యమంతో సంబంధంలో ఉన్న ప్రసాద్‌తో పాటు విశాఖ విద్యార్థులు శ్రీశ్రీ షష్టిపూర్తి సభలను రచయితలకు సవాల్ విసరడానికి వేదికగా వాడుకోదలచారు. 'రచయితలారా మీరెటు వైపు' అని ప్రశ్నించిన ఆ కరపత్రం 'స్పానిష్ విప్లవంలో ప్రాణాలు పోగొట్టుకున్న సాహిత్యకారుడు క్రిస్టఫర్ కాడ్వెల్ లాగా, తను రాసిన ప్రతి పద్య గిరిజనుల నోట ఊతపదంగా చేసి శ్రీకాకుళ విప్లవ పోరాటంలో వీరమరణం చెందిన సుబ్బారావు పాణిగ్రాహిలా, సాహిత్యాన్ని జీవితాన్ని మార్చే శక్తిగా మీరెందుకు చెయ్యలేరు?' అని నిలదీసింది.

దానికి జవాబుగా శ్రీశ్రీ శ్రీకాకుళంవైపు, ప్రజలవైపు నిలబడతానని స్పష్టంగా ప్రకటించాడు. శ్రీశ్రీని ఆ దిశగా ప్రసాద్ నడిపాడని అన్నా అతిశయోక్తి కాదు. శ్రీశ్రీని కొనివెయ్యడానికి, శ్రీకాకుళం నుంచీ ప్రజా పోరాటాల నుంచీ దూరం చెయ్యడానికి ఇంకా ఏమన్నా అవకాశం ఉందేమోనని పాలకవర్గాలు 1970 జూలై 4న మరొక ప్రయత్నం చేశాయి. ఆ ప్రయత్నాన్ని విఫలం చేసి, జూలై 4 తెల్లవారు జామున విప్లవ రచయితల సంఘం స్థాపించడంలోనూ, 'విప్లవకెరటం నన్ను తోసుకుపోయింది' అని శ్రీశ్రీ చెప్పినట్టు, ఆ తోసుకుపోయిన విప్లవకెరటం వెనుకా ఉన్నది ప్రసాదే.

అప్పటి నుంచి చివరి శ్వాస విడిచిన 2015 జూలై 25 దాకా, నలబై ఐదు సంవత్సరాల పాటు ప్రసాద్ విరసంతో, విప్లవ సాహిత్యోద్యమంతో, విప్లవోద్యమంతో అనితరసాధ్యమైన మమేకతను సాధించారు. ఆయన విరసం సంస్థాపక సభ్యుడు. నాలుగున్నర దశాబ్దాలుగా కార్యవర్గ సభ్యుడు. కొద్దికాలం కార్యదర్శి, అధ్యక్షుడు. అధికారపత్రిక అరుణతార సంపాదకుడు. రాష్ట్ర వ్యాప్తంగా అనేకచోట్ల ఉపన్యసించిన వక్త. తత్వశాస్త్రం, నూతన ప్రజాస్వామిక విప్లవం, సాహిత్య చరిత్ర అలవోకగా సరళంగా బోధించిన ఉపాధ్యాయుడు. వేలాది మందికి ప్రేరణ. శ్రీశ్రీ సాహిత్య సర్వస్వం 21 సంపుటాలు, కొడవటిగంటి కుటుంబరావు రచనా ప్రపంచం పద్దెనిమిది సంపుటాలు, రావిశాస్త్రి సర్వస్వం ఒక్కచేతి మీద వెలువరించినవాడు. గోపీచంద్ సంపుటాలు, చివరికి నార్ల వెంకటేశ్వరరావు, విశ్వనాథ సత్యనారాయణ రచనల సేకరణలోనూ తన స్నేహహస్తం అందించినవాడు.

వీక్షణం వ్యవస్థాపక సంపాదకులు వి. హనుమంతరావు విశాఖపట్నంలో విలేఖరిగా ఉన్న రోజుల నుంచీ ఆయనతో స్నేహం వల్ల, నా మీద నాలుగున్నర దశాబ్దాలుగా ఉన్న వాత్సల్యం వల్ల వీక్షణంను చలసాని ప్రసాద్ చాల అభిమానించారు. వీక్షణంలో వెలువడే రచనల మీద తన అభిప్రాయాలు పంచుకున్నారు. వీక్షణంను తన మిత్రులకు పరిచయం చేశారు. వీక్షణం ఆర్థికస్థితి ఇబ్బందుల్లో ఉందని తెలిసి తనకు తెలిసిన దాతల చేత విరాళం ఇప్పిస్తాననీ, కాకపోతే కాస్త సమయం కావాలనీ అనేవారు. వీక్షణం ఆర్థికస్థితి గురించి విని, కొందరు గౌరవనీయ మిత్రులు, తెలుగు సమాజ ప్రముఖులు వీక్షణంను ఆదుకొమ్మని ప్రకటన చేయడానికి ప్రయత్నాలు చేస్తున్నప్పుడు, ఆ ప్రకటన మీద చలసాని ప్రసాద్ సంతకం కూడ ఉంటే బాగుంటుందనుకొన్నాను. ఫోన్ చేసి, విషయం చెప్పి, 'ప్రకటన పంపుతాను, చూసి సంతకం పెట్టి వెనక్కి పంపుతారా' అని అడిగాను. 'వీక్షణం కోసం సంతకం పెట్టమని నన్నడగాలా? నా సంతకం నువ్వు నీ ఇష్టం వచ్చినట్టు ఎలాగైనా వాడుకోవచ్చు' అన్నారు. వీక్షణం నిర్వాహక బృందంలో ఇద్దరు ముగ్గురితో కలిసినప్పుడల్లా 'వీక్షణంకు చాల చెయ్యాలని నాకుంది, కాని అరుణతార ఇంకా గడ్డు పరిస్థితిలో ఉంది, అది నా మొదటి ప్రాధాన్యత. కాస్త వెసులుబాటు రాగానే వీక్షణంకు విరాళాలు సేకరిస్తాను' అనేవారు. దానికి కొనసాగింపుగానే, నేను చివరిసారి కలిసినప్పుడు తాను ఈసారి హైదరాబాద్ వచ్చినప్పుడు వీక్షణం విరాళాల సేకరణకు సమయం పెట్టుకుంటానన్నారు.

చలసాని ప్రసాద్ ఎనబై మూడు సంవత్సరాల నిండైన, విస్తృతమైన జీవితం గడిపారు. వేలాది మంది ప్రేమను చూరగొన్నారు. వేలాది మందికి స్నేహం పంచి ఇచ్చారు. ప్రాచీన, ఆధునిక సాహిత్యాన్నీ, సకల రంగాల సాహిత్యాన్నీ మథించారు. తెలుగుసీమలో అతి పెద్ద వ్యక్తిగత గ్రంథాలయాన్ని నిర్మించారు. ఎవరైనా సరే కష్టాల్లో ఉన్నారని తెలిస్తే, తనకు వీలయినంత వరకు మాత్రమే కాదు, తన పరిమితికి మించి కూడ, అపాత్రదానమైనా సరే ఆదుకున్నారు. విప్లవోద్యమ, విప్లవ సాహిత్యోద్యమ అవసరం ఎంతటిదైనా పెద్దదిక్కుగా నిలిచారు. తెలంగాణ, ఉత్తరాంధ్ర ప్రజా ఆకాంక్షలను అర్థంచేసుకుని, సహానుభూతిని ప్రకటించారు. ఆ ఆకాంక్షలను నిర్ద్వంద్వంగా బలపరిచారు. ఉమ్మడి కమ్యూనిస్టు పార్టీకీ, నక్సల్బరీ విప్లవోద్యమానికీ, మావోయిస్టు పార్టీకీ మూడు తరాల మార్క్సిస్టు ఆచరణకు వారధిగా, సమన్వయంగా నిలిచారు. ప్రాచీన సాహిత్యానికీ, అభ్యుదయ సాహిత్యానికీ, విప్లవ సాహిత్యానికీ వారధిగా నిలిచారు. కృష్ణా జిల్లాలో, అగ్రవర్ణంలో పుట్టి ఆ ప్రాంతీయ, కుల ఆభిజాత్యం ఏ ఒక్క సందర్భంలోనూ కనిపించనివ్వని ప్రజాస్వామికత పాటించారు. ప్రాంత, కుల అంతరాలను అధిగమించారు. విప్లవ సాహిత్యోద్యమం ప్రారంభమయ్యే నాటికే తాను నలబయ్యో పడిలో ఉన్నా తనకన్న ఇరవై ఏళ్లు చిన్నవాళ్లతో సమానంగా కార్యకర్తగా ప్రవర్తించారు. కాలం గడిచిన కొద్దీ తనకన్న అరవై ఏళ్లు చిన్నవాళ్లతో కూడ అంతే స్నేహంగా, సమ వయస్కుడిగా మెలిగి వయసు అంతరాన్ని కూడ అధిగమించారు. జీవితమంతా హైందవ, బ్రాహ్మణ్య, సంఘపరివార్ భావజాలాన్ని, అన్నిరకాల మతాచారాల తంతులను తీవ్రంగా అసహ్యించుకుంటూ ఈ దేశానికి అవసరమైన ప్రజాస్వామిక వ్యక్తిత్వం ఎలా ఉండాలో చూపారు. పెట్టుబడిదారీ, సామ్రాజ్యవాద సంస్కృతీ చిహ్నాలను చాదస్తమనిపించే స్థాయిలో ద్వేషించి, దూరం పెట్టారు.

చలసాని ప్రసాద్ మృతి విప్లవోద్యమానికీ, విప్లవ సాహిత్యోద్యమానికీ, విప్లవ రచయితల సంఘానికీ, తెలుగు సమాజానికీ, సాహిత్యానికీ అత్యంత విషాదకరమైన సందర్భం. ఆయన మృతి వీక్షణం కుటుంబానికి కూడ అంతే విషాదకరం. వ్యక్తిగతంగా నాకు నాలుగు దశాబ్దాలుగా నా హృదయంలో అవిభాజ్యంగా కలిసిపోయిన ఒక అపురూప సన్నిహిత వ్యక్తిత్వం కోల్పోయిన తీరని దుఃఖం ఇది. అయితే చలసాని ప్రసాద్ లాంటి వ్యక్తుల స్ఫూర్తి అజరామరమైనది. ఆయన ప్రభావాన్ని భౌతిక మరణం తొలగించజాలదు, తగ్గించజాలదు. చలసాని ప్రసాద్ స్ఫూర్తి, స్మృతి చిరకాలం సజీవంగా వర్ధిల్లుతాయి.

**- ఎన్ వేణుగోపాల్** వీ

# జనాన్ని పుష్కరాల్లో ముంచిన పాలకులు

*ప్రజలు అనేక సమస్యలు ఎదుర్కొంటుంటే వారిని తప్పుదోవ పట్టించి హిందూ మత మూఢత్వంలో ఉంచడానికి పాలకులు తెచ్చినవే పుష్కరాలని అంటున్నారు* **అరణ్య**

ప్రభుత్వాలు ప్రజలను అజ్ఞానంలో, మూఢత్వంలో ఉంచడానికి దేవుడు, భక్తి అనే అంశాలను విరివిగా ప్రచారం చేస్తున్నాయి. ప్రజలను ఆ మత్తులో ఉంచే ఒక దళారి పూజారి, పురోహిత వర్గాన్ని పెంచి పోషిస్తున్నాయి. నిరంతరం నిర్వహిస్తున్న ఆధ్యాత్మిక కార్యక్రమాల పరంపరలో భాగంగా ముందుకు తెచ్చినవే గోదావరి పుష్కరాలు. ప్రతి పన్నెండేళ్లకొకసారి గోదావరి నదికి పుష్కరాలు వస్తాయని, ఆ సమయంలో నదిలో స్నానం చేసిన ప్రతి ఒక్కరికీ పుణ్యం వస్తుందని, సకల పాపాలు హరించి పోతాయని కోట్లాది మంది ప్రజలను ప్రభుత్వాలు నమ్మింపజేస్తున్నాయి. ప్రభుత్వాల విధానాల గురించి ఆలోచించకుండా వారి మెదళ్లను పక్కదారి పట్టించే ప్రయత్నంలో ప్రభుత్వాలు ఇప్పుడు చాలా బిజీగా ఉన్నాయి. ఈ ప్రయత్నంలో పైచేయి కోసం తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వాలు పోటాపోటీగా పుష్కర మూఢత్వాన్ని ప్రజలపై రుద్దే పనిలో ఉన్నాయి.

పుష్కరాలకు సంబంధించిన మూడు ప్రధానమైన అంశాలను పరిశీలిద్దాం. మొదటిది – ఇందులో ఉన్న ఆధ్యాత్మిక అంశం. గోదావరి నది పుట్టుక గురించిన కథ ఒక పుక్కిటిపురాణంగా ప్రజలలో ప్రచారంలో ఉంది. గౌతముడనే ముని కరువు విపరీతంగా ఉన్న సమయంలో తన తపోశక్తితో పంటలను సృష్టిస్తాడు. అది చూసి అసూయ చెందిన ఇతర మునులు మాయగోవును పంపి వాటిని నాశనం చేయించే సమయంలో గౌతముడు ఒక దర్భ అనే గడ్డిపోచతో గోవును అదిలిస్తే అది చనిపోయి అతనికి గోహత్య పాపం చుట్టుకుంటుంది. ఆ పాప విముక్తి కోసం శివుని కొరకై తపస్సు చేయగా శివుడు గంగ (గోదావరి)ని గోవు కళేబరం నుంచి పారించి గోవును బతికిస్తాడు. గోవు పేరుమీద గోదావరి అని, గౌతముని పేరుమీద గౌతమి అని ఆ నదిని పిలుస్తున్నారు. ఈ కథలో ఎన్ని అసంబద్ధమైన అంశాలున్నాయంటే అసలు కరువు ఉన్న సమయంలో పంటలు పండించడం విపరీతమైన శ్రమచేస్తే గాని సాధ్యం కాదు. అలాంటప్పుడు తపోశక్తితో పంటలు సృష్టించడమేమిటి? బావి తవ్వుకుని పండించాడని కొందరు చెప్తారు గానీ విపరీత కరువు సమయంలో బావులు మాత్రం ఎండిపోవా? ఇక మునులు చాలా గొప్పవారు, మంచి వారని పురాణాలు చెప్తాయి కదా, మరి మునుల్లో ఈ అసూయ ఏమిటి? మాయగోవును సృష్టించడం సాధ్యమేనా? గడ్డి పరకతో అదిలిస్తేనే అది చనిపోతుందా? అసలు మాయగోవు చావడం ఏమిటి? అసలైతే గోవును చంపడం పాపం అనేదే అబద్ధం. అయినా కాసేపు అది నిజమే అనుకుందాం. కానీ మాయగోవును చంపితే కూడా పాపమేనా? గోహత్య పాపం చుట్టుకుంటుందా? ఆ పాపం కోసం శివుని తపస్సు చేయడం ఏమిటి? శివుడు తన జటాజూటిల్లో జేమేడ్‌గా తయారై ఉన్న గంగను పంపకుండా కొత్తనది గోదావరిని సృష్టించడం ఎందుకు? ఒకవేళ కళేబరం మీద పారడానికే అయితే ఓ బిందెడు నీళ్లు నేరుగా కళేబరంపై పారిస్తే చాలు కదా, ఇంతపెద్ద నది కొండలు, గుట్టల్లోంచి పారేలా సృష్టించడం ఎందుకు? ఎంత అశాస్త్రీయమైన కట్టుకథ ఇది? ఈ కథతో ప్రారంభించే పుష్కరాల గొప్పతనాన్ని మందిరాలలో, టివి ఛానళ్లలో మన దళారి పురోహిత వర్గం, బ్రాహ్మణ వర్గం ప్రజలకు చెపుతుంటే గోదావరి పుట్టుక గురించి, ప్రజలు పారవశ్యంలో ఊగిపోతూ ఎలాంటి తర్కం వైపుకు తమ మెదళ్లను పోనీయకుండా జడంగా వింటూ పోతున్నారు.

బృహస్పతి కర్కాటక రాశి నుంచి సింహరాశిలోకి ప్రవేశించే సమయంలో గోదావరి పుష్కరాలు వస్తాయని చెపుతున్నారు. ఈ పుష్కర సమయంలో నదులలో త్రిమూర్తులు, ఇంద్రాది దేవతలు, పితృదేవతలు, రుషులు నివసిస్తారని, అందుకే ఈ సమయంలో పుష్కర స్నానం చేయాలని అంటున్నారు. ఈ రాశులు, నక్షత్రాల విభజన పూర్తిగా హేతు విరుద్ధం. ఒకప్పుడు సైంటిఫిక్ గణాంకాల జ్ఞానంలేని సమయంలో ఈ రాశులు, నక్షత్రాల కొలతలు అప్పటికిగాను తాత్కాలికంగా పనిచేశాయి గానీ ఈరోజు సెకన్లో వెయ్యోవంతును కూడా గ్రహించి గణించే సైన్స్ పరిజ్ఞానం వచ్చాక రాశులు, నక్షత్రాలు, గ్రహాల కొలతలు పూర్తిగా తప్పుడు లెక్కలు. అయినా సరే, ఒకసారి ఆ రాశుల వివరాల్లోకే వెళ్లి చూద్దాం. బృహస్పతి కర్కాటకరాశి నుండి సింహరాశికి ఎందుకు పోతాడు? కర్కాటకరాశిలో లేని గొప్పతనం సింహరాశిలో ఏముంది? ఈ బృహస్పతికి, కర్కాటక సింహరాశులకు, గోదావరి నదికి ఏమిటి సంబంధం? సింహరాశిలోకి వస్తే మాత్రం ఆ సమయంలోనే దేవతలు ఎందుకు కిందకు వస్తారు? చనిపోయిన పితృవంశజులు మళ్లీ పుట్టడమేమిటి? ఏడాదికోసారి నదులు తిరగడమేమిటి? – ఇలా ప్రశ్నించుకుంటూ పోతే వందల కొద్దీ సమాధానం ఇవ్వలేని ప్రశ్నలు ఒకదాని తర్వాత ఒకటి వేయవచ్చు. అయితే ఇప్పుడు చర్చ ఆధ్యాత్మిక వాదంతో కాదు కనుక వదిలేద్దాం. నదీనీటి విషయానికే చర్చను పరిమితం చేద్దాం.

అసలు ఒక నదికి, నది నీటికి పవిత్రత ఎలా వస్తుంది? సాధారణంగా నీటికి శక్తి ఉంటుంది. నిలకడ నీటికైనా, ప్రవాహ నీటికైనా దాని స్థితినిబట్టి దానికాశక్తి వస్తుంది. అది స్థితి ద్వారా వచ్చిన శక్తే గానీ నీటికి స్వభావ రీత్యా ఏ శక్తీ ఉండదు. నీటి శక్తి స్థిర జలం కంటే ప్రవాహ జల స్థితిలో కొంత ఎక్కువగా ఉంటుంది. డ్యాంల దగ్గర స్థిరంగా ఉన్నప్పటి కంటే గేట్లు విడిచినప్పుడు (ప్రవాహంగా మారేటప్పుడు) శక్తి ఎక్కువగా ఉండడం సాధారణంగా మనం చూస్తుంటాం. అందుకే స్థిర జలంలో కంటే ప్రవాహ జలంలో చేతులు కడుక్కున్నా, స్నానం చేసినా శరీర మలినాలు పోయే అవకాశం ఎక్కువ. అలాగే ఒక నది అడవులలో నుండి, కొండల్లో నుండి వస్తుంది కనుక, ఇదివరకు అడవులలో అనేక ఔషధాల మొక్కలుండడం వల్ల ఆ మొక్కల ఔషధ

గుణాలు కలుపుకుని నది నీళ్లు ఒక మెడిసిన్‌గా పనిచేస్తాయి. అది ఆరోగ్యకరమైన నీరుగా తయారవుతుంది కనుక నదీ స్నానం ఆరోగ్యానికి మంచిదనేది ఒక మోస్తరు వాదనగా అంగీకరించాల్సిన విషయమే. తద్వారా మలినాలు పోయి, రక్తశుద్ధి జరుగుతుందనేది కూడా పాక్షికంగానైనా నిజమే. అయితే ఈ సైన్స్ దృగ్విషయం వేల ఏళ్లుగా ఉన్నదే. నిజానికి ఇది నీటికున్న ఏదో మహత్తర 'శక్తి' కాదు. నీరు తనలో కొన్ని పదార్థాలను కలుపుకోవడం వల్ల నీటికి ఆ మంచి లక్షణం వస్తుంది. అది కేవలం తాత్కాలిక లక్షణమే. శాశ్వతంగా నీటిని అంటిపెట్టుకుని ఉండని లక్షణం అది. కానీ పురాణాలు, శాస్త్రాలు నీటికి మహత్తర శక్తి ఉందని, నీరు అన్ని మంచి పనులూ చేసే గొప్పనైన పదార్థమని చెపుతూ నీటికి అనవసరమైన భక్తి నియమాలను జోడించాయి. మూఢత్వాన్ని నది నీటికి కూడా ఆపాదించాయి. పైగా ఏ నీటికైనా ఒకే గుణం ఉంటుందనే ప్రాథమిక విషయాన్ని మరచిపోయి ఒక్కో నది నీటికి ఒక్కో గుణం ఉంటుందని రాశారు. కృష్ణానది నీటిని తాగితే క్షాత్రం, కావేరి నీటిని తాగితే గాత్రం, గోదావరి నీరు తాగితే మంచిబుద్ధి, నదీ స్నానం వల్ల నాదశక్తి, చైతన్య శక్తి పెరుగుతాయని, ప్రాణ చైతన్యం పెరుగుతాయని చెపుతూ వచ్చారు. సంతాన హీనులు సంతానవంతులవుతారని, సర్వ రోగాలు మాయమవుతాయని, దేహ మాలిన్యమే కాదు, మానసిక మాలిన్యమూ పోతుందని తలా తోకలేని విషయాలు చెపుతూ వచ్చారు. ఎన్నో అశాస్త్రీయ కథలు, కథనాలు నదీస్నానం చుట్టూ అల్లుకుపోతూ వచ్చాయి.

చిలువలు పలువలుగా వందల వేల అంశాలు అతుక్కుపోతూ నదీ స్నానం పవిత్రతకు ఆధ్యాత్మిక మద్దతు పెరుతుగూ వచ్చింది. నిజానికి నదీ స్నానానికి ఉన్న సైంటిఫిక్ కోణాన్ని కూడా యథాతథంగా ఆమోదించడం సందిగ్ధంగా ఉంటున్నది. ఒకప్పుడు అడవుల శాతం ఎక్కువగా ఉండేది. ఒక నది ప్రవహిస్తున్నదంటే దాని చుట్టూరా కొన్ని కిలోమీటర్ల వరకూ అరణ్యాలుండేవి. జంతు జాలాలు, మృగాలు, సరీసృపాలు అక్కడ నివసించేవి. ఆహారాన్నిచ్చే చెట్లు, ఔషధ మొక్కలుండేవి. నదీస్నానానికి వెళ్లడమంటేనే అడవుల్లో కొండల్లో కాలినడకన పోయి రావడం ఒక పెద్ద పనిగా ఉండేది. కానీ ఇప్పుడు అడవులు తగ్గిపోయాయి. ఔషధాల మొక్కలూ లేవు, మందు చెట్లూ లేవు, పసర్ల మొక్కలూ లేవు. కొండలు గుట్టలు పెట్టుబడి పుణ్యమా అని తరిగి పోయాయి. నది నిలవడానికి అవసరమైన ఇసుకా తగ్గిపోయింది. ఇసుక ఉంటే నీళ్లు బురదను పట్టుకోవు. ఇసుకలేక ఇప్పటి నది నీళ్లన్నీ బురదతో కూడి ఉండడం మనం చూస్తూ ఉన్నాం. ఇప్పుడు ఇలాంటి బురద నీళ్లలో ప్రజలను మునకలు వేయించి పుష్కర స్నానం అతి పవిత్రమైందని బుకాయిస్తూ వస్తున్నారు. బురద బాహ్య విషయమేనని, అంతర్గతంగా నీటికున్న శక్తిని చూడాలని మోస పూరితంగా మాట్లాడుతున్నారు. నీటికి ఉండే లక్షణమంతా బాహ్యమే. మనిషికి ఆపాదించిన ఆత్మలలాగా నీటికి అంతర్గత ముఖం ఏమీ ఉండదు. నీటికి గనుక అలాంటి అంతర్గత ముఖంగా మహత్తర శక్తులు ఏమైనా ఉంటే గత పుష్కరాలలో స్నానాలు చేసిన వారందరికీ రోగాలు పోయి, బాధలు పోయి సుఖంగా ఉండాలి కదా! అలా జరగలేదే?

చెప్పేవాళ్లెవరికీ ఒక విషయం మీద పొంతన ఉండదు. ఒకడు ఆది పుష్కరాలు (పుష్కర సంవత్సరపు మొదటి పన్నెండు రోజులు), అంత్య పుష్కరాలు (చివరి పన్నెండు రోజులు మాత్రమే గొప్పవి, మిగతావి గొప్పవి కావంటాడు. ఇంకొకడు సంవత్సరం పొడుగూతా అన్నీ మంచి రోజులే అంటాడు. సంవత్సరమంతా దేవతలు నదిలోనే ఉంటారని ఒకడంటే, లేదు, ఇంద్రుడు, బృహస్పతే ఉంటారు, మిగతా వాళ్లు పన్నెండు రోజులు కాగానే వెళ్లిపోతారని అంటాడు. ఈ ఒక్క నదికి (గోదావరి) తప్ప మరేనది పుష్కరాలకు ఆది, అంత్య పుష్కరాలు ఎందుకుండవంటే ఎవరూ చెప్పరు. ఏదో ఒకటి నోటికి తోచింది అని పారేస్తారు. ఎక్కడా తర్కం ప్రశ్నే ఉండదు. అన్నీ ప్రజలను భ్రమింపచేసే పనులే. ఉదాహరణకు కాళేశ్వరంలో నిజానికి సరస్వతి నది అనేది లేదు. అంతర్వాహిని నది అంటారు గానీ గోదావరి లోపలే పుట్టి లోపలే కలిసిపోతున్నట్లు ఎలాంటి ఆధారాలు లేవు. కొందరు కాళేశ్వరం గుడిలో శివుని ముక్కులో పోసిన నీరు అంతర్భూభాగమై సరస్వతి నదిగా ప్రవహిస్తుందంటారు, కానీ దానికి కూడా ఆధారమేదీ లేదు. అది నిజమే అనుకున్నా కూడా సహజ సిద్ధంగా పుట్టి ప్రవహించేది నది అవుతుంది కానీ, మనిషి నీళ్లు పోసినప్పుడు ధారగా ప్రవహించి పోయేది నది ఎలా అవుతుంది? కనుక ఏ విధంగా చూసినా అసలు సరస్వతి అనే నది అక్కడ లేదు. ఎప్పుడూ దాని ఆనవాళ్ల జాడ లేదు. అయినా సరే గోదావరి, ప్రాణహిత, సరస్వతి నదుల సంగమంగా కాళేశ్వరం దేశ వ్యాప్తంగా త్రివేణి సంగమంగా ప్రసిద్ధి చెందింది. కానీ కళ్లకు కనపడేలా నిజామాబాద్ జిల్లా కందకుర్తిలో మంజీర, హరిద్ర, గోదావరిలు కలుస్తున్నా ఆ ప్రాంతం పెద్దగా ప్రాచుర్యం పొందలేదు. అంటే లేని నదిని ఉన్నట్లు చూపి కాళేశ్వరాన్ని త్రివేణి సంగమంగా ఏళ్లకేళ్లుగా ప్రజలను నమ్మిస్తున్నారు. ఇంకా విచిత్రమేమంటే ఆ లేని సరస్వతి నదికి ఈ మధ్యన పుష్కరాలు జరిపి గోదావరి, ప్రాణహిత నదుల్లో జనాలను మునకలు వేయించి సరస్వతిలో మునిగినట్లుగా చెప్పి పురోహితులు మోసం చేశారు. ప్రభుత్వం ఆ పురోహితులకే వత్తాసు పలికింది. ఇదంతా ఏమిటని ప్రశ్నిస్తే జవాబు లేదు. ఇలా ఎన్నో విషయాలలో ఎవ్వరికీ ఒక స్పష్టత లేదు. ఏకీభావం అంతకన్నా లేదు. కానీ ప్రజలను మోసం చేసే పనిలో అందరూ ఒక్కటై మంత్రాలు మాత్రం చదువుతుంటారు.

నిజానికి ఈ పుష్కరాల గురించిన ప్రస్తావన వేదాలలో గానీ, ఇతిహాసిక గ్రంథాలలో గానీ ఎక్కడా లేదు. ఈ పుష్కర ప్రస్తావన ప్రక్షిప్తంగా మధ్యలో చొప్పించారు. పుష్కరుడనే బ్రాహ్మణుడు తపస్సు చేసి నీటిలో జీవిస్తూ నదులను పవిత్రం చేసే శక్తిని పొందగా, బృహస్పతి తను వివిధ రాశులలో ప్రవేశించినపుడు వివిధ నదులను పునీతం చేయమనే అతని అభ్యర్థన మేరకు పుష్కరుడు ఇలా నదులలో ప్రవేశిస్తూ పోతాడనే కథను 1426 సంవత్సరంలో 'జాతక పారిజాతం' అనే జోతిష్య శాస్త్ర గ్రంథంలో వైద్యనాథ దీక్షితులు మొదటిసారి రాశాడు. అంతకు ముందు ఈ పుష్కర కథ లేదు. ఇదంతా తప్పుడు కథ అని సులభంగా నిరూపించవచ్చు.

పుష్కర స్నాన సమయంలో జపం, దానం, అర్చన, ధ్యానం, తిలోదకాలు వంటి ప్రక్రియలన్నీ బ్రాహ్మణులు చేసేవే. తాము సంభావనలు పొంది డబ్బు సంపాదించుకునేందుకు బ్రాహ్మణ పురోహిత దళారి వర్గం సృష్టించిందే ఈ పుష్కర స్నానం. ఈ దోపిడిని మరింత పెంచుకునేందుకు గోదావరి తీర బ్రాహ్మణ వర్గం అంత్య పుష్కరాలు, ఆది పుష్కరాలు అని సృష్టించి రెండేసి సార్లు దోపిడికి తెగబడుతున్నాయి. ఇక్కడ చాలా మందికి తెలియని ఇంకో విషయం ఏమిటంటే పుష్కరాలు 12 నదులలో కాదు, 14 నదులకు జరుగుతాయి. బృహస్పతి 12 రాశులలోకి ప్రవేశించినపుడు 12 నదులకే జరగాల్సిన పుష్కరాలు బృహస్పతి వృశ్చిక, ధనుస్సు రాశుల్లోకి ప్రవేశించినప్పుడు రెండేసి నదులకు పుష్కరాలు జరుగుతాయి. వృశ్చిక రాశి సమయంలో భీమ నదితో పాటు తమిళనాడులోని తామరపాణి నదికి, ధనురాశి

సమయంలో బ్రహ్మపుత్ర, తపతి నదులకు ఒకేసారి పుష్కరాలు జరుగుతాయి. ఒకే సమయంలో పుష్కరుడు రెండేసి నదుల్లోకి ఎట్లా వెళ్తాడనే ప్రశ్నకు జవాబుండదు, ఈ బ్రాహ్మణ వర్గం దగ్గర.

ఇక రెండో అంశాన్ని చూద్దాం. ఈ పుష్కరాలకు తెలంగాణ ప్రభుత్వం అధికారికంగా 600 కోట్ల రూపాయలు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1900 కోట్లు ఖర్చు చేస్తున్నది. కేంద్ర ప్రభుత్వం తెలంగాణకు 50 కోట్లు, ఆంధ్రప్రదేశ్‌కు 100 కోట్లు మద్దతుగా ఇస్తున్నది. ఈ కోట్లాది రూపాయలను కేవలం పన్నెండు రోజులలో ఖర్చు పెట్టడం జరిగాక వెనక్కి తిరిగి చూస్తే దానితో ప్రజలకు శాశ్వత ప్రాతిపదికన ఒనగూరేదేమీ ఉండదు. గోదావరి ఒడ్డున ఉండే గ్రామాలలో ప్రధానంగా తాగడానికి నీరులేక ప్రజలు అల్లాడుతున్నారు. ఏడాది కిందట దాకా తెలంగాణ పార్టీలు, ప్రజలు ఈ సమస్యకు ఆంధ్ర వలస పాలనను కారణంగా చెప్పుకున్నారు. తెలంగాణ పాలకులు వచ్చి ఏడాది అయింది. పరిస్థితి అట్లాగే ఉంది. తాగునీటి కొరత తీవ్రంగా ఉంది. గోదావరి, దాని ఉప నదులైన ఇంద్రావతి, ప్రాణహిత, శబరి, మానేరు, కిన్నెరసాని నదులు పారుతున్న నేలల్లో కూడా తాగునీటి సమస్య తీవ్రంగా ఉంది. దీనికితోడు సాగునీటి సమస్య కూడా తీవ్రంగా ఉంది. పక్క నుండి నది పోతున్నా పొలానికి బొట్టు నీరు కూడా రాని పరిస్థితిలో లక్షల రూపాయలతో బోర్లు వేయించుకునే స్థోమతలేని ఇక్కడి రైతులు ఆత్మహత్యల బాట పడుతున్న దీనస్థితి తెలంగాణ రాష్ట్రం ఏర్పడ్డాక కూడా కొనసాగుతున్నది. గోదావరి ఒడ్డు పొడుగునా అనేక వృత్తులు వికసించినవి. ప్రపంచంలో నదీలోయ నాగరికతలు వికసించిన అనేక ప్రదేశాల్లో లాగానే గోదావరి ఒడ్డు గ్రామాలు, పట్టణాలు ఒకప్పుడు సకల వృత్తులతో విరాజిల్లినవి. కానీ వలసల వల్ల, ప్రపంచీకరణ ప్రభావం వల్ల వృత్తులు కునారిల్లినవి. వృత్తిని చేపట్టేవాళ్లే లేకుండా పోయారు. అట్లాగే అనేక జానపద ప్రాచీన కళారూపాలు ఈ ప్రదేశాలలో ఉండేవి. ఒకప్పుడు కళాకారులు తెప్పల మీద, చిన్న పడవల మీద నీళ్లలోంచి ఒక గ్రామం నుంచి మరో గ్రామానికి పోయి తమ కళా ప్రదర్శనలతో కడుపునింపుకునేవాళ్లు. ఇవ్వాళ ఆ కళారూపాలే కనుమరుగైపోయాయి. ఆ కళాకారుల్లో చాలా మంది భిక్షాటనను వృత్తిగా చేసుకుంటున్నారు. తెలంగాణలో పుష్కరాలు జరిగే ఐదు జిల్లాల్లోని 106 ప్రదేశాలలో సామాజికంగా, ఆర్థికంగా వెనకబడిన ప్రజలున్న ప్రాంతాలు, వ్యవసాయ ఆధారిత ప్రాంతాలు, దళితులు, గిరిజనులు ఎక్కువగా ఉన్న ప్రాంతాలు. ఈ ప్రాంతాల అభివృద్ధి కోసం తెలంగాణ రాష్ట్రం ఏర్పడ్డాక జరిగిందేమీ లేదు. కానీ దళితులకు, ఆదివాసులకు బ్రాహ్మణీయ సంస్కృతిని బదలాయించే రీతిలో పుష్కరాలను నిర్వహించడానికి ప్రభుత్వం పూనుకున్నది. ఏ సంస్కృతి చరిత్ర పొడుగునా వాళ్లను వెలివేసిందో ఆ సంస్కృతిని వాళ్ల ముంగిట్లోకి తెచ్చి, వాళ్లను అందులోకి లాగివేసే కుట్ర పుష్కరాల పేరిట జరుగుతున్నది. అంటే ఇదంతా ఒక సామాజిక సాంస్కృతిక దోపిడీ కార్యక్రమం.

నిజానికి ఈరోజు గోదావరి పారుతున్న ప్రాంతాల ప్రజలకు తాగునీరు కావాలి, సాగునీరు కావాలి. చితికిపోతున్న వృత్తులకు ఒక మద్దతు కావాలి. పని కావాలి. భూమి కావాలి. పోడు కావాలి. పోలీసుల చేతుల్లో ఎన్‌కౌంటర్లు కాబడని హక్కు కావాలి. ఏ పగలో ఏ రాత్రో ఊర్లమీద పడి దాడులు చేసే తోడేళ్లు (గ్రేహౌండ్స్), తాచుపాముల (కోబ్రా) నుంచి విముక్తి కావాలి. అన్నల జాడ చెప్పమంటూ తమ్ముళ్లను స్టేషన్‌లకు పిలిపించి బెదిరించే పరిస్థితి లేని స్వేచ్ఛ కావాలి. పౌర స్వేచ్ఛ కావాలి. పౌర హక్కులు కావాలి. ముఖ్యంగా జీవించే హక్కు కావాలి. వీటిని సాధించుకునేందుకు తగిన పరిస్థితులు కావాలి. ప్రభుత్వ మద్దతు కావాలి. సహకారం కావాలి. నిధులు కావాలి. తెలంగాణ ఉద్యమ సమయంలో అతి ప్రాథమికమైన, అందరూ ఆమోదించిన డిమాండ్లే గానీ, ఇవేమీ ఆకాశంలోంచి ఊడిపడ్డ డిమాండ్లో, గొంతెమ్మ కోరికలో కాదు. మా ఉద్యోగాలు – మా వనరులు అనే కదా ఆంధ్ర పాలకులను నిలదీసింది. మరి ఈ ప్రభుత్వం ప్రజల కోర్కెలను తీర్చే ఆ దారిలో పోతున్నదా? ఎవరి కోసం ఈ 600 కోట్లు? పాత పాలకులు డబ్బులివ్వలేదు కనుక మేము ఇస్తున్నామని గొప్పలు చెప్పుకుంటున్నారే తప్ప అసలు ఇలాంటి ఆధ్యాత్మిక విషయాలకు అన్ని వందల కోట్లు అవసరమా? అనే ప్రశ్న వేసుకోవడం లేదు. నీళ్లకో, ఉద్యోగాలకో ఈ డబ్బులను వాడితే ఎన్ని జీవితాలు నిలబడేవి! కనీసం పుష్కరాల సమయంలోనైనా నీళ్లు లేని పరిస్థితి గోదావరికి ఎందుకు దాపురించిందనేది ఆలోచించకుండా అక్కర కోసం మహారాష్ట్రను అడిగితే సరిపోతుందని సర్ది చెప్పుకుంటూ పోతున్నారు. ఈ నిర్లిప్త ధోరణి వల్ల ప్రజల సమస్యలు శాశ్వత ప్రాతిపదికన పరిష్కారమయ్యే వీలు ఉండదు. నరేంద్రమోడీ దృష్టిలో పడాలనే తాపత్రయంతో కుంభమేళాను తలపించే విధంగా పుష్కరాలను నిర్వహించేందుకు ఉబలాట పడడం వల్ల మోడీ లక్ష్యమైన హైందవీకరణ వైపు అడుగులు వేసినట్లవుతుంది గానీ ప్రజల సమస్యలు తీర్చేవైపు మాత్రం కాదు. ఇక ఆంధ్రప్రదేశ్‌లో కూడా ప్రజల సమస్యలు అనేకం ఉన్నా 1600 కోట్లను బూడిద చేసే ప్రయత్నంలో ఉన్నారు. పుష్కర మూఢత్వాన్ని నింపే ప్రయత్నం చేసి అందులో విజయవంతమై పుష్కరాల మొదటి రోజే 27 మంది ప్రజల ప్రాణాలను బలిగొన్నాడు చంద్రబాబు.

ఇక మూడవ అంశం – ఈ పుష్కరాలను ఘనంగా నిర్వహింపచేయడం అనేది ప్రపంచ బ్యాంకు నిర్దేశిత అజెండాలో భాగం. పుష్కరాల 'రేట్'ను ఒకేసారి 600 కోట్లుగా, 1600 కోట్లుగా నిర్ణయింపచేసి రానురాను ప్రభుత్వాల పోటీలలో భాగంగా పెరుగుతూ పోయే పుష్కర బడ్జెట్ ఏదో ఒక రోజున సంతృప్తి స్థాయిని దాటాక ప్రభుత్వాలు బడ్జెట్ కేటాయించలేని పరిస్థితిలో ఆ ప్రభుత్వాల వ్యవహారాలలోకి, ప్రజల అభివృద్ధిలోకి తాను ప్రవేశించి, వాటిని నిర్దేశించి ప్రతిఫలంగా పూర్తి మొత్తపు పుష్కర బడ్జెట్‌ను అప్పుగా అడిగేందుకు తనపై ఆధారపడే పరిస్థితిని ఆ ప్రభుత్వాలకు కల్పించే కుట్రలో భాగంగా, భవిష్యత్ వ్యూహంలో భాగంగా ఈసారి తెలంగాణ ప్రభుత్వం ఖర్చు చేస్తున్న 600 కోట్లు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఖర్చు చేస్తున్న 1600 కోట్లకు తోడు 'ముఫ్త్'గా వరల్డ్ బ్యాంక్ కొంత మొత్తాన్ని పుష్కర ఖర్చు నిమిత్తం ఆ రాష్ట్రాలకు అందించిందనేది రహస్య వాస్తవం. ఇదంతా తెలియని ప్రజలు ముక్కులు మూసుకుని, భక్తి పారవశ్యంలో తేలుతూ ఉండడం కూడా ఆ వరల్డ్ బ్యాంక్‌కు, ప్రభుత్వాలకు అవసరమే కదా!

ఈ మూడు అంశాలను పరిశీలించిన తర్వాత ఈ ప్రభుత్వాలు ఎందుకు పుష్కరాలను ఇంత సీరియస్‌గా, ఇంత పెద్ద ఎత్తున ప్రమోట్ చేస్తున్నాయో అర్థం చేసుకోవాలి. తెలంగాణ రాష్ట్రంలో గోదావరి ప్రవహించే 61,780 చదరపు కిలోమీటర్లలో కేవలం 18 వేల చదరపు కిలోమీటర్లు మాత్రమే సాగులో ఉన్న పరిస్థితి ఎంత దుర్భరమో ఇక్కడి ప్రభుత్వం ఆలోచించడం లేదు. ఓపెన్ కాస్ట్‌తో గోదావరి తీరమంతా బొందల గడ్డలుగా మారిన పరిస్థితిని ప్రశ్నించడం లేదు. రెండు రాష్ట్రాలలోనూ గోదావరి ఒడ్డున అక్రమ మైనింగ్, అక్రమ ఇసుక దందాలు, అక్రమ కలప స్మగ్లింగ్‌లను అడ్డుకోవడానికి ప్రభుత్వాలు ప్రయత్నించడం లేదు. అడవులు లేక, వానలు లేక, సహజ వృక్ష సంపద, జంతు సంపద కనుమరుగైపోయి అత్యధిక ఉష్ణోగ్రతలకు గోదావరి తీరాలు కేంద్రమవడానికి కారణాలు అన్వేషించడం లేదు.

*(రచయిత సామాజిక కార్యకర్త, కాలమిస్టు)* వీ

# గిరిజన గుండెలపై థర్మల్ కుంపటి

*అభివృద్ధి పేరుతో తెస్తున్న థర్మల్ పవర్ ప్లాంట్ స్థానిక ప్రజలను నిర్వాసితులను చేస్తోందనీ, దీనివల్ల వెలువడే విషవాయువులతో చుట్టుపక్కల భూమి, నీరు, గాలి కలుషితమై జీవావరణానికి ప్రమాదం ఉందనీ అంటున్నారు* **అన్నెబోయిన మట్టయ్య**

గిరిజన గుండెలపై థర్మల్ కుంపటి పేలడానికి సర్వం సిద్ధమైంది. తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం ఎంతో ప్రతిష్ఠాత్మకంగా చేపట్టిన బొగ్గు ఆధారిత విద్యుత్ ప్రాజెక్ట్‌ను నల్లగొండ జిల్లా దామరచర్ల మండలం వీర్లపాలెం గ్రామ పంచాయితీ పరిధిలో ఏర్పాటు చేయనున్నారు. దీనికి 'యాదాద్రి థర్మల్ విద్యుత్ ప్రాజెక్ట్' అని నామకరణం చేశారు. 2015 జూన్ 8న తెలంగాణ రాష్ట్ర ముఖ్యమంత్రి కె. చంద్రశేఖర్‌రావు అధికారిక లాంఛనాలతో థర్మల్ విద్యుత్ ప్రాజెక్ట్‌కు సంబంధించి పైలాన్‌ను ఆవిష్కరించారు. ఇక్కడ నిర్మింప తలపెట్టిన థర్మల్ విద్యుత్ ప్రాజెక్ట్ భారతదేశంలోనే అతిపెద్దది.

ఆంధ్రప్రదేశ్ పునర్విభజన చట్టం 6 ఆఫ్ 2014, షెడ్యూల్ 13, సెక్షన్ 93లోని 7వ అంశంలో పేర్కొనబడిన విధంగా తెలంగాణ రాష్ట్రానికి 4000 మెగావాట్ల బొగ్గు ఆధారిత విద్యుత్ ఉత్పత్తికి కేంద్ర ప్రభుత్వం సహకారాన్ని అందిస్తుంది. దీంతో తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం థర్మల్ పవర్ ప్రాజెక్ట్ ఏర్పాటుకు చకచకా పావులు కదిపింది. నల్లగొండ జిల్లా కలెక్టర్ నేతృత్వంలో రెవెన్యూ, అటవీ, భూమి కొలతల శాఖల అధికారులు, సిబ్బందితో ప్రాథమికంగా సర్వే పనులు చేపట్టారు. తొలుత పది వేల ఎకరాల భూమిని సేకరించి, నివేదికలు రూపొందించి రాష్ట్ర ప్రభుత్వానికి అందించగా, కేంద్ర ప్రభుత్వానికి పంపింది. ఇందులో ఎనిమిది వేల ఎకరాలు అటవీ భూమి కాగా, మరో రెండు వేల ఎకరాల భూమి దళిత, గిరిజన, వెనకబడిన తరగతులకు చెందినవారి స్వానుభవంలో ఉండబడిన పట్టా భూములతో పాటు అటవీ భూములు కూడా ఉన్నాయి. నివేదికలు పరిశీలించిన అనంతరం కేంద్ర ప్రభుత్వం కేవలం 4400 ఎకరాల అటవీ భూమిని మాత్రమే పరిగణనలోకి తీసుకుంది.

యాదాద్రి థర్మల్ విద్యుత్ ప్రాజెక్ట్ ఏర్పాటుకు కేంద్ర ప్రభుత్వం చొరవ తీసుకుని అనతి కాలంలోనే అటవీ, పర్యావరణ శాఖల అనుమతులు మంజూరు చేసిందని రాష్ట్ర ప్రథమ వార్షికోత్సవ తెలంగాణ సంబరాలకు హాజరైన సందర్భంగా కేంద్ర మంత్రి ప్రకాశ్ జవదేకర్ వెల్లడించారు. ఏదేని పరిశ్రమ ఏర్పాటుకు ముందు నిర్దేశిత ప్రాంతాల్లో ప్రాంతీయ కాలుష్య నియంత్రణ మండలి ఆధ్వర్యంలో ప్రజాభిప్రాయ సేకరణ చేపట్టాల్సి ఉంటుంది. ప్రజాభిప్రాయ సేకరణ నిర్వహించనున్న తేదీకి 30 రోజులు ముందుగా ప్రముఖ దినపత్రికలలో అధికారిక ప్రకటనలు ఇస్తారు. ప్రభావిత ప్రాంతాలైన గ్రామ పంచాయితీ కార్యాలయాల్లో నోటీసులు అతికిస్తారు. ఆయా గ్రామాల్లో టాంటాంలు వేయిస్తారు. ఆ తరువాతనే నిర్దేశిత ప్రాంతాల్లో జిల్లా కలెక్టర్ అధ్యక్షతన ప్రజాభిప్రాయ సేకరణ జరుపుతారు. ప్రజల అభిప్రాయాలన్నింటిని క్రోడీకరించి కేంద్ర పర్యావరణ మంత్రిత్వ శాఖకు నివేదికలు పంపాలి. తదుపరి ప్రభుత్వ నియమ నిబంధనలకు అనుగుణంగా నివేదికలను సమీక్షించి ప్రాజెక్టుకు అనుమతులు మంజూరు చేస్తారు. ఇవన్నీ ఏమీ జరగకుండానే ఏకపక్షంగా థర్మల్ విద్యుత్ ప్రాజెక్టుకు అనుమతులు మంజూరయ్యాయని చెప్పడంపై ప్రభుత్వ అధికారుల నుంచి స్పష్టత రావాల్సి ఉంది.

ఈ ప్రాంతంలో ఒక్కో ప్లాంటు ద్వారా 800 మెగావాట్లు, మొత్తంగా 5 ప్లాంట్ల ద్వారా 4000 మెగావాట్ల థర్మల్ విద్యుత్ ఉత్పత్తి సాధించాలని ప్రభుత్వం సంకల్పించింది. వీటి నిర్మాణాల కోసం సుమారు 19 వేల కోట్ల రూపాయల అంచనా వ్యయంతో ప్రతిపాదనలు రూపొందించారు. ప్లాంట్ల నిర్మాణాల మొత్తం బిఎచ్ఇఎల్ సంస్థకు అప్పగించేందుకు టిఎస్ జెన్‌కో సన్నాహాలు చేస్తుంది. మొత్తం ప్లాంట్ల నిర్మాణాలు పూర్తి కావడానికి సుమారు 4 సంవత్సరాల కాల వ్యవధి పడుతుందని నిర్మాణ రంగ నిపుణులు అభిప్రాయపడుతున్నారు.

సాధారణంగా థర్మల్ విద్యుత్ ప్లాంట్లకు కావాల్సింది బొగ్గు. నిజానికి ఈ ప్రాంతంలో బొగ్గు నిల్వలు లేవు. బొగ్గును ఇతర ప్రాంతాల నుండి తీసుకుని రావాలి. వీటి రవాణా ఖర్చులు అధికంగా ఉంటాయి. అయినా బొగ్గు రవాణాకు కలిసి వచ్చే విధంగా రైలు మార్గం సమీపంలో ఉంది. దీంతో పాటు నీరు అత్యధికంగా అవసరం ఏర్పడుతుంది. ఇదే మండల పరిధిలో ప్రవహిస్తున్న కృష్ణా నదిపై నిర్మించిన టెయిల్ పాండ్ ప్రాజెక్ట్ నుంచి నీటి నిల్వలు వాడుకోవడానికి తగు ప్రయత్నాలు చేస్తున్నారు. ఇప్పటి వరకు కృష్ణా నీటి నిల్వల వాడకానికి సంబంధించి తగిన అనుమతులు తీసుకోలేదు.

### పర్యావరణంపై దుష్ప్రభావాలు

థర్మల్ పవర్ ప్లాంట్లు పర్యావరణాన్ని చాలా తీవ్రంగా దుష్ప్రభావం చేస్తాయి. పవర్ ప్లాంట్ల వలన ఉద్గారించబడే సల్ఫర్ ఆక్సైడ్, నైట్రోజన్, ఆక్సైడ్, ఎస్‌పిఎం, ఆర్ఎస్ పిఎంలు 25 కిలోమీటర్ల పరిధి వరకు విస్తరిస్తాయి. ఈ కాలుష్యం వలన మానవాళికి, జంతు ప్రపంచానికి ఊపిరితిత్తులు, గుండె సంబంధిత వ్యాధులు, క్యాన్సర్, అంగవైకల్యం, చర్మ వ్యాధులు తదితర వ్యాధులు వచ్చే ప్రమాదం ఉంది. చెట్ల ఆకులపై ఎస్‌పిఎం పడడం వలన కిరణజన్య సంయోగ క్రియపై ప్రభావం చూపుతుంది. ఈ విషధూళి రేణువులు చెట్ల లోనికి ప్రవేశించి ఖనిజాలు, సూక్ష్మ ప్రధాన పోషకాలను హరింపజేస్తాయి. తద్వారా మొక్కలలో ఎదుగుదల లోపిస్తుంది. చెట్లు ఎండిపోవడానికి కారణమవుతుంది. ఎస్‌పిఎం వ్యాప్తి వలన కృతిక క్షమ క్షయం ఏర్పడుతుంది. దీర్ఘకాలం ఈ ప్లాంట్లు నడవడం వలన సారవంతమైన భూములు నాశనమవుతాయి. అటవీ సంపద నాశనమవడమే కాక మళ్లీ పుట్టుకొచ్చే అవకాశం లేదు. పర్యావరణం ధ్వంసమై పరిసర ప్రాంతాలలో వ్యవసాయం కనుమరుగయ్యే ప్రమాదం పొంచి ఉంది.

బొగ్గు ఆధారిత విద్యుత్ ప్లాంట్ల నుంచి నిరంతరం విడుదలయ్యే కాలుష్యంలో ప్రధానమైన సల్ఫర్ ఆక్సైడ్, నైట్రోజన్ ఆక్సైడ్, ఇంకా అనేక రేడియో ఆక్టివ్ పదార్థాల వలన చుట్ట పక్కల ఉండే నిర్మాణాలు,

భవనాలు నాశనమవుతాయి. అతి తీవ్ర స్థాయిలో కార్బన్ డయాక్సైడ్ విడుదలవుతుంది. ఇది పీల్చితే మనుషులు మరణిస్తారు. భూమి వేడి పెరిగి వాతావరణ మార్పులు జరిగి సమయానికి వర్షాలు పడవు. చలి కాలంలో కూడా చలి ఉండదు. ఉష్ణ మండలంగా మారి అప్పుడప్పుడు ఒకటి రెండు వర్షాలు పడితే, అవి కూడా ఆమ్ల వర్షాలు కురుస్తాయని శాస్త్ర పరిశోధనల్లో రుజువైంది.

బొగ్గు ఆధారిత విద్యుత్ ప్లాంట్లకు ప్రధానంగా నీరు కావాలి. ఫ్లైయాష్ కొరకు కొలను నిర్మించడం ద్వారా నీటి అవసరాలు తగ్గించబడ్డాయి. ఈ రకంగానైనా ఒక యూనిట్ విద్యుత్ ఉత్పత్తికి 150 లీటర్ల నీరు కావాలి. ఇది భవిష్యత్‌లో నీటి లభ్యతపై తీవ్ర ప్రభావం చూపుతుంది. బొగ్గు, ఆయిల్, గ్యాస్ ద్వారా నీటిని మరిగించి తద్వారా వచ్చిన ఆవిరితో టర్బయిన్స్ ద్వారా విద్యుత్ ఉత్పత్తి చేస్తారు. ఇలా చేయడం ద్వారా వచ్చిన వేడి నీటిని సమీపంలోని చెరువులు, వాగులు, కాల్వల ద్వారా కృష్ణా నదిలోకి వదిలే అవకాశం లేకపోలేదు. దీని వలన జలచరాలు మరణిస్తాయి. వాటిపై ఆధారపడిన మత్స్యకారుల కుటుంబాలు వీధినపడే ప్రమాదం ఉంది.

యాష్‌పాండ్ అతి ప్రమాదకరమైన ఆర్సినిక్, బోరాన్, పాదరసంలు భూగర్భ జలాల్లోకి ఇంకి గృహ అవసరాలకు సైతం నీరు పనికి రాకుండా పోతుంది. ఫ్లైయాష్‌లోని క్షారాల కారణంగా భూమి క్షారంగా మారి, సహజంగా ఉండే సారం కోల్పోతుంది.

గణనీయమైన బొగ్గు రవాణా చేయడం ద్వారా పరిసర ప్రాంతాలు దుమ్ము, ధూళి, వాయు, శబ్ద కాలుష్యాన్ని ఏర్పరుస్తాయి. థర్మల్ పవర్ ప్రాథమిక కాలుష్యం ద్వారానే ఉష్ణ పీడనలు ఏర్పడి, గాలిలోని ఆక్సిజన్ తరిగిపోయి జీవ మనుగడకు ఆటంకం ఏర్పడుతుంది. వాతావరణంలో జరిగే ఆకస్మిక మార్పుల వలన పక్షి జాతులు అంతరించి పోతాయి. వాటి జీవ క్రియ వ్యవస్థలు ఈ మార్పులను తట్టుకునేలా ఉండవు.

సాంఘీక, ఆర్థిక వ్యవస్థలపై థర్మల్ పవర్ ప్రభావం పడనుంది. పునర్ వ్యవస్థీకరణ, పునరావాసం, స్థానికంగా ఉంటున్న ప్రజలపై, పవర్ ప్లాంట్ ఉద్యోగులపై ప్రభావం పడనుంది. ప్రమాదకరమైన పరిస్థితుల్లో పనులు చేయడం వలన ఎక్కువగా ప్రమాదాలు నమోదవుతున్న సంఘటనలు ఉన్నాయి. థర్మల్ పవర్ ప్లాంట్ ఏర్పాటు వలన ఒక లక్ష ఉద్యోగాలు వచ్చే మాటేమోగాని... ఈ ప్రాంత ప్రజలకు వచ్చే ఉద్యోగాలు బూడిద మోయడం తప్ప... ఇంతకన్నా పెద్ద ఉద్యోగాలు రావనే విషయం నిష్ఠుర సత్యం.

### మృత్యు ఒడిలో కృష్ణ పట్టి ప్రాంతం

ఇప్పటికే జిల్లాలోని కృష్ణా నది తీర ప్రాంతంలో ఉష్ణోగ్రత అధికంగా ఉంటుంది. దామరచర్ల మండల పరిధిలో ఇండియా సిమెంట్స్, పెన్నా సిమెంట్స్, దక్కన్ క్రోమైట్స్, హరిత ఫర్టిలైజర్ మూడు ప్రైవేట్ యాజమాన్యంలో నిర్వహిస్తున్న పవర్ ప్లాంట్లు, 150కి పైగా నాపరాయి పరిశ్రమలు, ముగ్గు మిల్లులు ఉన్నాయి. అంతేగాక సిమెంట్, నాపరాయి పరిశ్రమలకు కావాల్సిన ముడిసరుకైన లైమ్‌స్టోన్ కోసం క్వారీలు తవ్వారు. ఇవన్నీ పర్యావరణాన్ని ధ్వంసం చేశాయి. వీటి ఫలితంగా ఎంతో మంది ప్రజలు మరణించారు. వేలాది మంది అనారోగ్యంతో కొట్టుమిట్టాడుతూ ఆసుపత్రుల చుట్టూ తిరుగుతూ ఆర్థికంగా చితికిపోతున్నారు. ఇదిలా ఉండగా థర్మల్ పవర్ ప్లాంట్ ఏర్పాటు వలన ఉష్ణోగ్రత మరీ ఎక్కువయ్యే ప్రమాదం ఉంది. కృష్ణ పట్టె ప్రాంతం మృత్యు ఒడిలోకి చేరువవుతూ, శాశ్వతంగా నష్టపోయే అవకాశం ఉంది. ప్రకృతిపై, పర్యావరణంపై తీవ్ర ఒత్తిడి ఏర్పడి, పర్యావరణ క్షీణతను అదుపులో ఉంచడానికి లేదా తగ్గించడానికి ఏర్పాటు చేసిన కఠినమైన ప్రభుత్వ నియమాలకు విరుద్ధం.

థర్మల్ విద్యుత్ ప్రాజెక్ట్ ఏర్పాటు వలన పర్యావరణంపై తీవ్ర ప్రభావం చూపనున్న ఈ నేపథ్యంలో భూ నిర్వాసితులకు, గృహ నిర్వాసితులకు ఇప్పటి వరకు అధికారికంగా స్పష్టమైన హామీలు లభించలేదు. దీంతో బాధిత ప్రజలు ఆందోళన చెందుతున్నారు.

### ప్రాథమికంగా సర్వే నిర్వహించిన సందర్భంలో...

1) 'ఆర్ అండ్ ఆర్ యాక్ట్ ప్రకారం నిర్వాసితులకు ఏక మొత్తంగా మార్కెట్ రేటు కంటే మూడు రెట్లు వెంటనే చెల్లింపులు జరుగుతాయి. 2) డబుల్ బెడ్‌రూమ్ పథకం వర్తింపజేస్తాం. 3) ఉద్యోగ అవకాశాలు కల్పిస్తాం. 4) భూమి కోల్పోయిన దళిత, గిరిజనులకు ఇతర ప్రాంతంలో భూమి కొనుగోలు చేసి పట్టాదారు పాసు పుస్తకాలు అందజేస్తాం. 5) ఈ ప్రాంతానికి ప్రత్యక్షంగా, పరోక్షంగా 1,30,000 ఉద్యోగాలు వస్తాయి. 6) ఉపాధి అవకాశాలు మెరుగు పడతాయి'. అని సర్వే అధికారులు నమ్మబలికారు. దీంతో మా బతుకులు బాగుపడతాయని ఒకింత ఆనందం వ్యక్తం చేయడంతో పాటు సర్వే అధికారుల బృందానికి స్థానికులు పూర్తి స్థాయిలో సహకరించారు.

కానీ, రాష్ట్ర ముఖ్యమంత్రి కెసిఆర్ యాదాద్రి థర్మల్ విద్యుత్ ప్రాజెక్ట్ పైలాన్‌ను అట్టహాసంగా ఆవిష్కరించిన సందర్భంగా ఎంతో ఆశగా ఎదురు చూస్తున్న స్థానికులకు నిరాశే మిగిల్చారు. ఎలాంటి హామీలు ఇవ్వకపోవడం, అరగంట వ్యవధిలో భూమి పూజ కార్యక్రమం హడావుడిగా చేసి కెసిఆర్ పయనమవుతుండగానే... భూ నిర్వాసితుల ఆవేదన, ఆగ్రహాలు కట్టలు తెంచుకుని కన్నీళ్ల పర్యంతమై నిరసన వ్యక్తం చేశారు. అనంతరం నిరసనకారులను పోలీసులు అదుపు చేశారు.

### నిర్వాసితులు కానున్న గిరిజనులు

ఏది ఏమైనా థర్మల్ పవర్ ప్లాంట్లు నిర్మించనున్న ప్రాంతంలో 25కి పైగా గిరిజన లంబాడ తండాలతో పాటు 12 గ్రామ పంచాయితీల ప్రజలపై అతి తీవ్ర ప్రభావం పడనుండడం చేత నిర్వాసితులు కానున్నారు. వీరిలో 90 శాతం గిరిజన లంబాడ ప్రజలున్నారు. మిర్యాలగూడ శాసనసభ నియోజకవర్గ పరిధిలోగల దామరచర్ల మండలం వీర్లపాలెం గ్రామ పంచాయితీ పరిధిలోని మోదుగులకుంట తండ, కపురతండ, సాత్తండ, దుబ్బతండ, తిమ్మాపురం గ్రామ పంచాయితీ పరిధిలోని పుట్టగడ్డతండ, తూర్పుతండ, పడమటితండ, ఎస్‌సి కాలని, కల్లేపల్లి గ్రామ పంచాయితీ పరిధిలోని శాంతినగర్, గడ్డమీదితండ, కిందితండ, నర్సాపురం గ్రామ పంచాయతీ, బాలాజీనగర్ గ్రామ పంచాయతీ పరిధిలోని గాంధీనగర్, తూర్పు తండ, ఏడుగుట్టల తండ, కెజెఆర్ కాలని గ్రామ పంచాయితీ పరిధిలోని కేతావత్ తండ, దూద్యాతండ, కొత్తపేటతండ, గోన్యాతండ, కొండ్రపోలు గ్రామ పంచాయితీ పరిధిలోని రాళ్లవాగుతండ, బండావత్ తండ, గేర్ తండ, చర్లతండ, పర్సునాయక్ తండ, వాచ్యతండ గ్రామ పంచాయితీ పరిధిలోని బొల్లిగుట్టతండ, లావూరితండాలతో పాటు ముదిమాణిక్యం, తాళ్లవీరప్ప గూడెం, గ్రామ పంచాయితీలు, మిర్యాలగూడ మండలం పరిధిలోని అన్నారం గ్రామ పంచాయితీ, నాగార్జున సాగర్ శాసనసభ నియోజకవర్గ త్రిపురారం మండల పరిధిలోని డొంక తండ గ్రామ పంచాయితీ పరిధి లోని బడాయిగడ్డ తండ, మాలబోడు తండ, కాన్యా తండ, హర్జ్యా తండాల ప్రజలపై అతి తీవ్రంగా ప్రభావం పడనుంది. ఈ రకంగా 50 వేల జనాభాపై అతి తీవ్రంగానూ, మరో 50 వేల జనాభాపై తీవ్రంగానూ, మొత్తంగా ఒక లక్ష జనాభాపై కాలుష్య ప్రభావం పడనుంది. పరిస్థితులను పరిశీలిస్తే ఒక లక్ష ఉద్యోగాల మాట అటుంచితే ఒక లక్ష జనాభా కచ్చితంగా ఖాళీ చేయాల్సిన స్థితిలోకి నెట్టివేయబడుతుంది. ముఖ్యంగా

# విచారణల్లో, తీర్పుల్లో ముస్లింలపై ద్వేషం

*దేశంలో అణగారిన వర్గాలపై అన్ని రంగాల్లోనూ వివక్ష కొనసాగుతోందనీ, న్యాయవ్యవస్థ కూడ పక్షపాత వైఖరి చూపుతూ ఆధిపత్య ధోరణిని అవలంబిస్తోందనీ అంటున్నారు* **ఉషా ఎస్ డానీ**

పాలకవర్గాలు సాగించే కార్యకలాపాలన్నీ దాదాపు సామాన్య ప్రజలు, బాధితులు ఊహించినట్టే జరుగుతుంటాయి. అయితే అధికార వర్గంలోని అసమ్మతివర్గం ఒకటి స్వచ్ఛందంగా ముందుకువచ్చి బయటపెట్టే వరకు అలాంటి ఊహాగానాలు, అనుమానాలకు సాధికారత సమకూరదు. మాలెగావ్ పేలుళ్ల కేసుల మీద న్యాయస్థానాల్లో విచారణ ప్రక్రియ నత్తనడక నడవడం మీద భారత ముస్లిం సమాజానికేకాక, పౌర సమాజానికి కూడ అనేక అనుమానాలున్నాయి. సోనియా – మన్మోహన్ సింగ్ నాయకత్వంలోని యుపిఏ ప్రభుత్వం తనదైన నిర్లిప్త పద్ధతుల్లో సాచివేత ధోరణిని కొనసాగిస్తే, నరేంద్రమోడీ నాయకత్వంలోని ఎన్‌డిఏ ప్రభుత్వం తనదైన చురుకైన పద్ధతుల్లో కేసును నీరుగారుస్తోంది.

2008 నాటి మాలెగావ్ పేలుళ్ల కేసులో మెత్తగా వ్యవహరించాలని పైనుండి తనకు ఆదేశాలు వచ్చినట్టు స్పెషల్ పబ్లిక్ ప్రాసిక్యూటర్ రోహిణి సాలియన్ ఇటీవల ఒక సంచలనాత్మక ప్రకటన చేశారు. అభినవ్ భారత్ అనే హిందూత్వ ఉగ్రవాద సంస్థను నడుపుతున్నారనే ఆరోపణ ఉన్న సాధ్వీ ప్రజ్ఞాసింగ్ ఠాకూర్ ఈ కేసులో ప్రధాన నిందితురాలిగా ఉండడంతో పబ్లిక్ ప్రాసిక్యూటర్ ప్రకటన రాజకీయ, సామాజిక ప్రాముఖ్యాన్ని సంతరించుకుంది.

వర్గసమాజ స్వభావమే నేరాలకు పుట్టినిల్లు. సహజ సంపదల్ని, సాంఘీక వ్యవస్థల్ని, శరీర ధర్మాల్ని సమాజంలోని ఒక వర్గం స్వాధీనం చేసుకున్నప్పుడు రెండోవర్గం నేరం చేయాల్సిన దుస్థితికి నెట్టివేయబడుతుంది. నేరాలు రెండు రకాలు. జీవికను నిలబెట్టుకోవడానికి చేసేవి. మరింత విలాసాల కోసం చేసేవి, సాధారణంగా అణగారిన వర్గాలు జీవికను నిలబెట్టుకోవడానికి కొన్ని సందర్భాల్లో నేరానికి పాల్పడితే, ఆధిపత్య వర్గాలు మరింత విలాసాల కోసం కొన్ని సందర్భాల్లో నేరానికి పాల్పడు తుంటాయి. ఉగ్రవాదుల్లో ఇస్లామిక్ ఉగ్రవాదాన్ని అణగారిన వర్గాలు చేసే నేరంగానూ, హిందూత్వ ఉగ్రవాదాన్ని ఆధిపత్యవర్గాలు చేసే నేరం గానూ వర్గీకరించవచ్చు. ఉగ్రవాదాన్ని రంగుల్లో చిత్రించాలని సరదాపడే వాళ్లు హరిత ఉగ్రవాదం, కాషాయ ఉగ్రవాదం అని పిలుచుకోవచ్చు.

హైదరాబాద్‌లో ఏ భూవివాదాన్ని తవ్వి చూసినా ఒక ముస్లిం సమాధి బయటపడుతుంది. ఆ సమాధుల్లో నుండే హరిత ఉగ్రవాదం పుడుతుంది. ముస్లింల జీవిక పరాధీనతను వదిలిపెట్టి హరిత ఉగ్రవాదాన్ని మాత్రమే నిందిస్తున్నంత కాలం సమస్య పెరుగుతుందే తప్ప పరిష్కారం కాదు. ఉగ్రవాద చర్య జరిగినప్పుడు పరిశోధనా సంస్థలు, మీడియా కూడ సహజంగానే ముస్లిం సమాజాన్ని అనుమానిస్తాయి. 'ముస్లింలందరూ టెర్రరిస్టులు కారు. కానీ టెర్రరిస్టు లందరూ ముస్లింలే' అనే ప్రచారం ఒకటి ఎలానూ ఉంది. దీనికి అలవాటు పడిన పోలీసులు హిందూత్వ ఉగ్రవాదం చర్యలకు పాల్పడినప్పుడు కూడా ముస్లింలనే నిందితులుగా పేర్కొని కేసులు పెడుతుంటారు. ఇలాంటి సందర్భాల్లో దోషుల్ని శిక్షించడం అటుంచి బాధితుల్ని కేసుల నుండి తప్పించడమే ప్రధాన

---

దామరచర్ల మండల ప్రజలంతా తమతమ గ్రామాలు, వ్యవసాయ భూములు వదిలివెళ్లే దుస్థితి అతి సమీపకాలంలోనే ఉందనే విషయం వాస్తవం.

**బాధితుల గోడు పట్టని నేతలు**

ఇంత జరుగుతున్నా బాధితుల గోడు పట్టించుకునే నాథుడే కరువయ్యాడు. మునుముందు జరగబోయే నష్టాలపై స్థానిక ప్రజా ప్రతినిధులు, వామపక్ష పార్టీలు, ఇతర రాజకీయ పార్టీలు, జెఏసిలు, పర్యావరణ వేత్తలు, ఉద్యమ కార్యకర్తలు, ప్రజా సంఘాలు, ప్రజాస్వామిక వాదులు ఎవరూ కూడా నోరు మెదపకపోవడం పట్ల బాధిత ప్రజలు తీవ్ర అసహనంతో ఉన్నారు.

ప్రధాన ప్రతిపక్ష పార్టీకి చెందిన నియోజకవర్గ ప్రజాప్రతినిధి జరుగనున్న నష్టాలపై స్పందించకుండా నిర్లక్ష్యానికి నిలువుటద్దంగా నిలవడం దారుణం. తన గెలుపుకు ఈ ప్రాంత ప్రజలు పూర్తిగా సహకరించారని, ఈ ప్రాంతాన్ని తన గుండెకాయగా అభివర్ణించిన మూడు దశాబ్దాల రాజకీయ అనుభవం గడించిన ప్రజా ప్రతినిధి తీరు ప్రస్తుత పరిస్థితులను పరిశీలిస్తే 'తల్లిపాలు తాగి తల్లి రొమ్మునే గుద్దిన' చందంగా ఉందని బాధితులు వాపోతున్నారు. ఈ నేత సాధారణ ఎన్నికలకు ముందు తన మేనిఫెస్టోలో పొందుపరిచిన అంశాల్లో ఏ ఒక్క హామీని కూడా నెరవేర్చలేదు. పైగా థర్మల్ విద్యుత్ ప్రాజెక్ట్ తానే తీసుకొచ్చానని జబ్బలు చరుసుకోవడం ఆయనకే చెల్లింది. అభివృద్ధి అనేది ప్రజా జీవనం మెరుగుపడే విధంగా ఉంటే బాగుంటుంది. కానీ, సరిగ్గా ఇందుకు భిన్నంగా ప్రజా జీవనం ఛిద్రమవుతుంటే చోద్యం చూడడం బాధాకరం. గతంలో ఒకసారి పునరావాస గ్రామాలుగా ఏర్పాటైన ఈ ప్రాంతం మరోసారి పునరావాసం వెతుక్కోవాల్సి రావడం దురదృష్టకరం. పారిశ్రామికాభివృద్ధి ఇక్కడి ప్రజల పాలిట మృత్యువుగా మారింది. 'తమ గుండెలపై పెనుమంటలు చెలరేగే విధంగా థర్మల్ కుంపటి పెట్టారు' అని బాధిత ప్రజలు చర్చించుకుంటున్నారు.

**సామాజిక బాధ్యత**

కటిక చీకట్లు అలుముకున్న ఈ నేపథ్యంలో బాధిత ప్రజలందరూ ఐక్యంగా ఉండి, స్తబ్దత, భయం, నిర్లిప్తతలను బద్దలు కొట్టి, రేపటి సూర్యోదయం వెలుగులు విస్తరించడం కోసం, మంచి ఆరోగ్యంతో జీవించే విధంగా ఈ ప్రాంత పర్యావరణాన్ని పరిరక్షించుకోవాల్సిన సామాజిక బాధ్యత మనందరిపై ఉంది.

*(రచయిత ప్రజాఫ్రంట్ నల్గొండ జిల్లా కార్యదర్శి)* వీ

సమస్యగా మారుతుంది. 'దైవికంగానో' యాధృచ్ఛికంగానో బయటపడితే తప్ప కాషాయ ఉగ్రవాద దోషుల్ని పట్టుకోవడం కాదు కదా వాళ్లను అనుమానించడం కూడా నేర పరిశోధనా సంస్థలకు సాధ్యం కాదు.

లుంబినీ పార్కు, గోకుల్ చాట్ పేలుళ్ల దోషుల్ని శిక్షించేదెప్పుడూ? బాధితులకు న్యాయం జరిగేదెప్పుడూ? అంటూ ప్రతి సంవత్సరం ఆగస్టు నెలలో తెలుగు మీడియా సంస్థలన్నీ ప్రత్యేక కార్యక్రమాలు నడుపుతుంటాయి. ఒక్కటంటే ఒక్క మీడియా సంస్థ కూడా మక్కా మసీదు పేలుళ్ల దోషుల్ని శిక్షించేదెప్పుడూ? బాధితులకు న్యాయం జరిగేదెప్పుడూ? అన్న కథనాన్ని ప్రచురించిన సందర్భం ఒక్కటీ లేదు. ఈ విషయంలో ఆంగ్ల మీడియా కొంచెం మెరుగు. మక్కా మసీదు పేలుళ్ల నిందితుల పేర్లను అయినా అవి ప్రచురించాయి. తెలుగు మీడియాకు ఆపాటి సాహసం కూడ లేదు. ప్రాంతీయ మీడియాలది భాష, ప్రాంత విభజన మాత్రమే కాదు, అది తరచుగా మత విభజన కూడ.

మహారాష్ట్ర నాసిక్ జిల్లాలోని మాలెగావ్‌లో 2006లో ఒకసారి, 2008లో మరోసారి పేలుళ్లు జరిగాయి. రెండు సంఘటనలూ మసీదుల్ని లక్ష్యంగా చేసుకుని జరిగాయి. మొదటి సంఘటన ముస్లింల పవిత్ర దినమైన షబే బరాత్, శుక్రవారం కలిసివచ్చిన సెప్టెంబర్ 8న జరిగితే, రెండో సంఘటన పవిత్ర రంజాన్ మాసంలో సెప్టెంబర్ 29న జరిగింది. సాధ్యమైనంత ఎక్కువ మందిని అంతం చేయాలనే లక్ష్యంతో ఉన్న ఉగ్రవాదులు రెండుసార్లూ మసీదులు భక్తులతో కిటకిటలాడే సందర్భాలనే ఎంచుకున్నారు. రెండు పేలుళ్లలోనూ ఆర్‌డిఎక్స్, అమ్మోనియమ్ నైట్రేట్ మిశ్రమాలను వాడారు. 2006 మాలెగావ్ పేలుళ్లలో 37 మంది చనిపోగా, 125 మంది తీవ్రంగా గాయపడ్డారు. 2008 పేలుళ్లలో 8 మంది చనిపోగా, 80 మంది తీవ్రంగా గాయపడ్డారు. చనిపోయిన వాళ్లు, గాయపడినవాళ్లలో అత్యధికులు ముస్లింలే అని విడిగా చెప్పాల్సిన పనిలేదు. మొదటిసారి పేలుళ్లు జరిగినప్పుడు ఎవరికీ పెద్దగా సాహసం చిక్కలేదు గానీ, రెండో పేలుళ్ల సందర్భంగా మాత్రమే హిందుత్వ ఉగ్రవాదం వెలుగులోకి వచ్చింది.

2006 పేలుళ్లు జరగ్గానే పోలీసులు, మీడియా కలిసి తమకు అలవాటైన పద్ధతుల్లో పాకిస్తాన్ ప్రేరేపిత ఉగ్రవాదుల దాడిగా ప్రచారం చేశారు. గుజరాత్‌లో కొందరు ముస్లింలు అహ్మదాబాద్ వీధుల్లో పాకిస్తాన్ వ్యతిరేక ప్రదర్శన కూడ చేశారు. లష్కరే తోయిబా, హర్కతుల్ జియాదల్ ఇస్లామీ తదితర సంస్థలతో సంబంధాలున్నాయని ఆరోపణలున్న స్టూడెంట్స్ ఇస్లామిక్ మూవ్‌మెంట్ ఆఫ్ ఇండియా (సిమి) సభ్యులు కొందర్ని అరెస్టు చేశారు. జాతీయ పరిశోధనా సంస్థ (ఎన్ఐఏ), మహారాష్ట్ర పోలీసు అధికారులు ఒక దశలో భజరంగ్ దళ్ ప్రమేయాన్ని కూడా అనుమానించారు కానీ, యాంటీ టెర్రరిస్ట్ స్క్వాడ్ (ఏటిఎస్)తో పాటు, మీడియా విశ్లేషకులు కూడా ఇలాంటి అనుమానాల్ని తీవ్రంగా ఖండించారు. అప్పటికే కొన్ని చోట్ల మసీదులపై భజరంగ్ దళ్ బాంబు దాడులు చేసిన సంఘటనలు వెలుగులోకి వచ్చాయి. అయితే వాటిల్లో నాటు బాంబులు మాత్రమే వాడారనీ, ఆర్‌డిఎక్స్, అమ్మోనియం నైట్రేట్‌ను సమకూర్చుకునే వనరులు గానీ, వాడే నైపుణ్యం గానీ భజరంగ్ దళ్‌కు లేవంటూ ఈ అనుమానాల్ని అప్పట్లో ఏటిఎస్ కొట్టిపడేసింది.

2008 పేలుళ్ల నాటికి పరిస్థితి మారింది. అభినవ్ భారత్‌కు చెందిన సాధ్వీ ప్రజ్ఞాసింగ్ ఠాకూర్, శివనారాయణ్ గోపాల్ సింగ్ కల్సంగ్రా, శ్యామ్ భవర్‌లాల్ సాహుల్ని ప్రధాన నిందితులుగా గుర్తించి అరెస్టు చేశారు. కాషాయ ఉగ్రవాదం అనే పదప్రయోగం 2002 నుండే వాడుక లో ఉన్నప్పటికీ 2008 మాలెగావ్ పేలుళ్ల తరువాత అది స్థిరపడింది. 2010లో నిర్వహించిన డిజిపిల జాతీయ సమావేశంలో అప్పటి కేంద్ర హోంమంత్రి పి. చిదంబరం కాషాయ ఉగ్రవాద ప్రమాదాన్ని వివరించడంతో ఈ పదప్రయోగానికి అధికార ముద్ర పడినట్టయింది.

కాషాయ ఉగ్రవాదం అనడం మీద కొంతమంది సాధువులతో పాటు, బిజెపి, శివసేన తదితర సంఘ్ పరివారం పెద్ద దుమారం రేపాయి. కాషాయం అనేది హిందూ మతానికి చిహ్నంగా ఉందనీ, అది శాంతి సంకేతమనీ, భారత జాతీయ పతాకం అగ్రభాగాన ఆ రంగే ఉంటుందనీ వాళ్లు గుర్తు చేశారు. అంతకు ముందూ, ఆ తరువాత కూడా ఇస్లామిక్ టెర్రరిజం అనే పదప్రయోగాన్ని రాజకీయ పక్షాలు, మీడియా కూడ విచ్చలవిడిగా వాడాయి. వాడుతున్నాయి. ఇస్లాం అంటేనే నిఘంటువు అర్థం శాంతి అని. భారత జాతీయ పతాకం దిగువ భాగాన ఉండే హరిత వర్ణం మొదట్లో ముస్లింల ప్రతీకే అన్నది వీరు మరచిపోతున్నారు.

కాషాయ ఉగ్రవాదం అనడం 'రాజకీయ కుట్ర' అని సంఘ్ పరివారం గట్టిగా అన్నప్పుడు దాన్ని కాంగ్రెస్ కూడ గట్టిగా ఖండించదు. 'అది ఉన్నదనీ చెప్పలేం, లేదనీ చెప్పలేం' వంటి గోడ మీద పిల్లి మాటలతో తప్పుకుంటుంది.

అణగారిన వర్గాల మీద దాడి జరిగిన ప్రతి సందర్భంలోనూ ప్రభుత్వాలు ఒకే విధానాన్ని అనుసరిస్తాయి. ముందుగా అణగారిన వర్గాల మీదే కేసులు పెడతారు. ఎంతో ఒత్తిడి వస్తే తప్ప ఆధిపత్య వర్గాల మీద కేసులు పెట్టరు. ఒకవేళ పెట్టినా వాళ్లకు శిక్షలు పడకుండా చూడడానికి న్యాయ ప్రక్రియలో వంద మార్గాలు ఉంటాయి. ముందు ఆధిపత్య వర్గాలకు బెయిల్ వచ్చేలా చేస్తారు. ఆ తరువాత కేసు విచారణను దశాబ్దాల పాటు సాగదీస్తారు. ఆధిపత్య వర్గాల మీద ఉన్న ఆరోపణల్ని నిరూపించడానికి పోలీసులు, ప్రాసిక్యూటర్లకు ఏ మాత్రం ఆసక్తి ఉండదు. ఒకవేళ కొందరు ఆసక్తి చూపినా వాళ్లను ఆధిపత్య వర్గాలో, ప్రభుత్వ పెద్దలో మేనేజ్ చేయగలరు. ఈలోపులో ఆరోపణ చేసినవాళ్లకు, వాళ్ల పక్షాన నిలబడినవాళ్లకు శక్తులుడుగిపోతాయి. విచారణ సాగదీయడంతో సాక్షులు చనిపోతారు, సాక్ష్యాధారాలు శిథిలమైపోతాయి. అంతిమంగా న్యాయం చనిపోతుంది. అప్పుడు న్యాయమూర్తి నిదానంగా తీర్పు చెపుతారు. నేరారోపణ చేసినవాళ్లు నేరాన్ని నిరూపించలేకపోయారంటూ ఒక నిందవేసి, నిందితుల్ని సగౌరవంగా విడుదల చేస్తారు.

వంద మందిని క్రూరంగా చంపేసి తప్పించుకోవడానికి భారత న్యాయవ్యవస్థ అవకాశం కల్పిస్తున్నదని హాషింపుర ఊచకోత మీద ఢిల్లీ కోర్టు తీర్పు నిరూపించింది. 40 మంది ముస్లింలని చంపేసిన స్పెషల్ పోలీసుల్ని తగిన సాక్ష్యం లేదనే సాకుతో నిర్దోషులుగా వదిలివేసింది. ఆంధ్రప్రదేశ్‌లో కారంచేడు, చుండూరు నరమేధం కేసుల్లో జరిగింది ఇదే. రేపు మాలెగావ్ పేలుళ్ల కేసులోనూ జరిగేది ఇదే.

ఏదో ఒక అద్భుతం జరిగితే తప్ప, అణగారిన వర్గాల మీద జరిగే దాడుల కేసులన్నింటిలోనూ అంతిమ తీర్పు అణగారిన వర్గాలకు వ్యతిరేకంగానే వస్తుంది. మాలెగావ్ కేసులో జరిగిన ఒక మేలు ఏమంటే తెరవెనుక జరుగుతూ వస్తున్నది తెరమీదికి వచ్చింది. అదొక్కటే బోనస్.

న్యాయ వ్యవస్థకున్న మత కోణాన్ని ఇక్కడ ప్రస్తావించాల్సి ఉన్నది. 1993 నాటి ముంబాయి పేలుళ్ల నిందితుడు, 'ఇస్లామిక్ ఉగ్రవాది' యాకూబ్ మెమెన్‌ను ఉరి తీయడానికి రంగం సిద్ధమైన సమయంలో, మాలెగావ్ పేలుళ్ల ప్రధాన నిందితురాలు, 'హిందూత్వ ఉగ్రవాది' సాధ్వీ ప్రజ్ఞాసింగ్ ఠాకూర్‌ను కాపాడడానికి కేంద్ర పరిశోధనా సంస్థలు ప్రయత్నం చేయడాన్ని ఎవరయినా ఎలా అర్థం చేసుకోవాలి? ఇలాంటి పరిణామాలు ఉగ్రవాదాన్ని పరిష్కరిస్తాయా? పెంచుతాయా?

*(రచయిత సీనియర్ పాత్రికేయులు, సమాజ విశ్లేషకులు)* వీ

# అంబేద్కర్ పేరుతో ఆర్ఎస్ఎస్ వంచన

***క్రమబద్ధంగా, పథకం ప్రకారం భావజాల దాడిలో భాగంగానే నిజమైన అంబేద్కర్ విధానాన్ని ధ్వంసం చేస్తూ, వక్రీకరిస్తూ ఆయనను హిందూత్వ వాదిగా చిత్రీకరిస్తున్న విధానాన్ని సమర్థంగా తిప్పికొట్టాలని అంటున్నారు*** **కె. సత్యనారాయణ**

*'హిందూ రాజ్యం వాస్తవమయితే అది నిస్సందేహంగా దేశానికి పెనుముప్పు. హిందువులు ఏమి చెప్పినప్పటికీ, హిందూ మతం స్వేచ్ఛకు, సమానత్వానికి, సౌభ్రాతృత్వానికి వ్యతిరేక మహమ్మారి. దానికీ, ప్రజాస్వామ్యానికీ పొసగదు. హిందూ రాజ్యాన్ని ఎలాగైనా ఆపాలి.'*

***– డా. బి.ఆర్. అంబేద్కర్,***

*(పాకిస్థాన్ ఆర్ పార్టిషన్ ఆఫ్ ఇండియా, పే. 358)*

125వ అంబేద్కర్ జయంతి వార్షికోత్సవ సందర్భంగా ఆర్ఎస్ఎస్ ఇంగ్లీష్ పత్రిక ఆర్గనైజర్ ఏప్రిల్ 2015లో ఒక ప్రత్యేక సంచికను ప్రచురించింది. 'అంబేద్కర్ పునర్దర్శనం' శీర్షికతో ప్రచురించిన ఈ సంచికలో ఆర్ఎస్ఎస్ భావజాలానికి చెందిన వారు రాసిన 24 వ్యాసాలు ఉన్నాయి. (ఒక్క నరేంద్రజాదవ్ వ్యాసం తప్ప) ఈ వ్యాసాలు మొత్తం చదివితే ఆర్ఎస్ఎస్ కుట్రపూరితంగా అంబేద్కర్ అభిప్రాయాలను పూర్తిగా వక్రీకరించినట్లు తెలుస్తుంది. ఈ వ్యాసాల్లో అంబేద్కర్‌ని ఒక హిందూ సంస్కరణవాదిగా, ముస్లిం వ్యతిరేకిగా, కమ్యూనిస్టు వ్యతిరేకిగా చిత్రీకరించారు. అంబేద్కర్‌ని ప్రజాస్వామ్య వ్యతిరేకిగా, హిందూత్వ భావజాల ప్రతినిధిగా ఆర్ఎస్ఎస్ చిత్రించింది. ఈ పునర్దర్శనంలో అంబేద్కర్ ఆలోచనలు, సిద్ధాంతాలు, అభిప్రాయాలు పూర్తిగా వక్రీకరించ బడ్డాయి. నిజానికి 'వక్రీకరణ' అన్నమాట సరిపోదు. ఒక రకంగా నిజమైన అంబేద్కర్ ఆలోచనా విధానాన్ని ధ్వంసం చేయడమే ఆర్ఎస్ఎస్ లక్ష్యమని ఈ వ్యాసాలు చదివితే తెలుస్తుంది. పూర్తిగా తప్పుడు కొటేషన్లతో, అబద్ధాలతో, అర్ధ సత్యాలతో, వక్రీకరణలతో సాగిన ఈ ప్రత్యేక సంచిక ఒక పథకం ప్రకారం హిందూత్వ శక్తులు చేస్తున్న భావజాల దాడిలో భాగంగా, అంబేద్కర్ హిందూత్వ వాదిగా, తమలో ఒకడిగా నమ్మించే ప్రయత్నంగా మనం అర్థం చేసుకోవాలి.

కేంద్రంలో బిజెపి ప్రభుత్వం 125వ అంబేద్కర్ జయంతి వార్షికోత్సవం పెద్ద ఎత్తున జరపాలని నిర్ణయించడం, లండన్‌లో అంబేద్కర్ అద్దెకున్న ఇంటిని కొని స్మారక భవనంగా చేసే ప్రయత్నం 'ఘర్‌వాపసీ' (తిరిగి ఇంటికి రండి) అంటూసాగే బలవంతపు మతాంతీకరణ (నిజానికి హిందువులుగా మార్చే) కార్యక్రమం – వీటన్నిటినీ దళిత ప్రజానీకంలో తమ పునాదిని పెంచుకోవడానికి, సమాజంలో మతపరమైన, కుల పరమైన ఘర్షణల్ని పెంచి పోషించడానికి హిందూత్వ శక్తులు చేస్తున్న ప్రయత్నాల్లో భాగంగా చూడాలి. అంబేద్కర్‌ని ఒక ముసుగుగా వాడుకుని దళితుల్ని హిందూత్వ వాదులుగా లేదా కనీసం ప్రజాస్వామ్య వ్యతిరేక శక్తులుగా మార్చే ప్రయత్నం ఆర్ఎస్ఎస్ పత్రికలోని వ్యాసాల్లోనూ, వారి ప్రచార కార్యక్రమాల్లోను కనిపిస్తుంది. ఆర్ఎస్ఎస్ పత్రికలోని వ్యాసాల్లో నిజా నిజాలను పరిశీలించి, వారి అబద్ధాల్ని, తప్పుడు వ్యాఖ్యానాల్ని, కుట్రపూరిత ప్రచారాన్ని ఎండగట్టడానికి ఈ వ్యాసంలో ప్రయత్నిస్తాను.

ఆర్ఎస్ఎస్ పత్రిక 'అంబేద్కర్ పునర్దర్శనం' పైన, మొత్తంగా హిందూత్వ సంస్థలు చేస్తున్న విష ప్రచారం పైన దళిత మేధావి వర్గం మౌనంగా ఉంది. ఎవరో కొద్ది మంది అంబేద్కర్ వాదులు తప్ప మిగతా వారంతా మౌనంగా ఉంటున్నారు. ఈ 'మౌనం' దేనికి సంకేతం? అంబేద్కర్‌పై చిన్న తప్పుడు వ్యాఖ్యానం చేసినా, అంబేద్కర్‌ని తక్కువ చేసి చూపే కార్టూన్ వేసినా, అంబేద్కర్‌ని గాంధీతో పోల్చినా వెంటనే స్పందించి, విమర్శించే దళిత యువత, మేధావి వర్గం నుంచి, అలాగే అభ్యుదయ శక్తులు సంఘపరివార్ శక్తుల కుట్రల పట్ల నిర్లిప్తంగా ఉండడం ప్రమాదకరం. ఎలాగూ హిందూత్వ శక్తుల రాతలూ, మాటలూ అన్నీ పచ్చి అబద్ధాలే, అర్ధ సత్యాలే, పుక్కిటి పురాణాలే అనే అభిప్రాయం ఉండవచ్చు. సరిగ్గా ఇలాంటి అసత్యాల పునాదిగానే, విష ప్రచారాల ద్వారానే, బాబ్రీమసీదు ఉన్నచోటే రాముడు పుట్టాడనే పుక్కిటి పురాణంతో ఈరోజు హిందూత్వ శక్తులు అధికారంలోకి వచ్చాయి. ప్రజల్ని మతం పేరుతో చీల్చి మారణ హోమం సృష్టించాయి. అందుకే ఈ గోబెల్స్ ప్రచారాన్ని కేవలం తప్పుడు ప్రచారమని అనుకుని, ఊరుకుంటే పెద్ద నష్టం జరుగుతుంది. అబద్ధాల్ని అబద్ధాలుగా, అసత్యాలను అసత్యాలుగా, కట్టుకథల్ని కట్టుకథలుగా తెలియజేస్తూ పెద్ద ప్రచారం చేయనిదే హిందూత్వ శక్తుల భావజాల దాడిని ఎదుర్కోవడం కష్టం.

ఆర్ఎస్ఎస్ పత్రికలోని వ్యాసాల్లో ఉన్న విషయాల్ని పరిశీలించే ముందు, హిందూత్వ శక్తులు అంబేద్కర్ ఆలోచనల్ని, అభిప్రాయాల్ని వక్రీకరించే ప్రయత్నం చేస్తున్న క్రమాన్ని గుర్తు చేసుకోవడం అవసరం. కేవలం ఇప్పుడే అంబేద్కర్‌పై ఆర్ఎస్ఎస్‌కి 'ప్రేమ' పుట్టిందని అనుకోవడం వాస్తవం కాదు. 1970ల నుంచి ఆర్ఎస్ఎస్ అంబేద్కర్‌ని వక్రీకరించి, గందరగోళం సృష్టించి దళితుల్ని తనవైపు తిప్పుకునే ప్రయత్నాలు చేస్తున్నది. 1990లలో ఈ ప్రయత్నం మరింత ఉధృతమైంది. దళితులని హిందూత్వ రాజకీయాల్లోకి తీసుకురావడానికి స్థాపించిన సామాజిక సామరస్యతా మంచ్ (1983)తో మొదలై, 1990లలో పూలే – అంబేద్కర్ సందేశ యాత్ర (పూనే నుంచి నాగపూర్ దాకా)తో ఈ ప్రయత్నాలు కొనసాగాయి. సరిగ్గా ఈ కాలంలోనే అంబేద్కర్‌ని తప్పుడుగా వ్యాఖ్యానించే ప్రయత్నం మొదలైంది. అంబేద్కర్ బౌద్ధ మతంలోకి మారడం వెనుక బౌద్ధమతం హిందూ మతంలో ఒక శాఖ కావడమే కారణమని ఒక ప్రచారం, అంబేద్కర్‌ని ఆర్ఎస్ఎస్ నాయకులు హెడ్గేవార్, సావర్కార్‌లతో పోలుస్తూ అంబేద్కర్‌ని హిందూ భావజాల అనుకూలుడుగా చిత్రీకరించడం జరిగింది. ఈ ప్రయత్నాల్ని విమర్శిస్తూ దళిత మేధావి ప్రొ. గోపాల్‌గురు ఇపిడబ్ల్యు పత్రికలో 90లలో ఒక పెద్ద వ్యాసం రాశారు. హిందూత్వ భావజాలానికి చెందిన అరుణ్‌శౌరీ 1997లో వర్షిప్పింగ్ ఫాల్స్‌గాడ్స్ అనే పుస్తకం రాశారు. అంబేద్కర్ ఒక తప్పుడు దేవుడని, రాజ్యాంగ రచనలో అంబేద్కర్ పాత్ర లేదని,

అంబేద్కర్‌ని రాజ్యాంగ నిర్మాతగా చెప్పడం తప్పని రాసి అరుణ్‌శౌరీ విష ప్రచారానికి, వక్రీకరణకు పాల్పడ్డారు. దళిత, అభ్యుదయ శక్తులు అరుణ్‌శౌరీ ప్రయత్నాల్ని తిప్పి కొట్టాయి. మళ్లీ 2000లో బిజెపి నేతృత్వం లోని ఎన్‌డిఎ ప్రభుత్వం అధికారంలో ఉన్నప్పుడు, రాజ్యాంగాన్ని సమీక్షించాలని అప్పటి ప్రధాని వాజ్‌పేయి, ప్రభుత్వం నిర్ణయించాయి. రాజ్యాంగంలో కనీస ప్రజాస్వామిక విలువల్ని ధ్వంసం చేసే ప్రయత్నంలో భాగమే రాజ్యాంగ 'సమీక్ష' అని దళిత మేధావులు, ప్రజలు రాజ్యాంగ 'సమీక్ష'ను అడ్డుకున్నారు.

2002లో గుజరాత్ మారణకాండ తరువాత అంబేద్కర్‌పై వక్రీకరణ, అంబేద్కర్‌ని హిందూత్వ అనుకూలుడుగా చిత్రించే ప్రచారం ఉధృత మైంది. దీనికి తక్షణ కారణం గుజరాత్ ప్రయోగంలో, అప్పటి ఊచకోత లో దళితులు, ఆదివాసులు పాల్గొన్నారని వార్తలు రావడం. కొద్ది మంది దళిత, ఆదివాసులు ఈ హిందూత్వ ఊచకోతలో భాగమయ్యారని నిజ నిర్ధారణ కమిటీలు చెప్పాయి. హిందూత్వ శక్తులు పీడిత ప్రజలైన దళిత, ఆదివాసులను ముస్లిం వ్యతిరేకులుగా మార్చడంలో గల ప్రయోజనాన్ని అర్థం చేసుకున్నారు. ప్రజల మధ్య విద్వేషాల్ని రగిలిస్తే తమ పని సులువని హిందూ ఫాసిస్టు శక్తులు అనుభవం ద్వారా తెలుసుకున్నాయి. ఈ క్రమంలో యుపి ఎన్నికల ప్రచారంలో వినయ కతియార్ (బిజెపి రాష్ట్ర అధ్యక్షులు) అంబేద్కర్‌ని ముస్లిం వ్యతిరేకి అని అనేక సభల్లో మాట్లాడారు. ఈ ప్రచారాన్ని ఖండిస్తూ, అంబేద్కర్ రచనల్ని ఉటంకిస్తూ, డా. ఆనంద్ తెల్‌తుంబ్డే అంబేద్కర్ ఆన్ ముస్లిమ్స్ : మిత్స్ అండ్ ఫాక్ట్స్ అనే పుస్తకాన్ని 2003లో రాశారు. తెలుగులో అంబేద్కర్ – ముస్లింల పేరుతో కుల నిర్మూలనా పోరాట సమితి ఈ పుస్తకాన్ని ప్రచురించి, విస్తృతంగా ప్రచారం చేసింది.

ఆర్‌ఎస్‌ఎస్, తదితర సంఘపరివార్ శక్తులు 70ల నుంచి అంబేద్కర్ ఆలోచనల్ని వక్రీకరించే ప్రయత్నాల్ని పరిశీలిస్తే ఆర్‌ఎస్‌ఎస్ 'అంబేద్కర్ పునర్దర్శనం' యాదృచ్ఛికంగా చేపట్టినది కాదు. దళిత ప్రజల్ని హిందూత్వ భావజాలంలోకి లాగడానికి, ప్రజల మధ్య ఘర్షణలు పెంచి, తమ అధికారాన్ని నిలబెట్టుకోవడానికి సంఘపరివార్ శక్తులు చేస్తున్న దీర్ఘకాలిక వ్యూహంలో భాగంగానే ఆర్‌ఎస్‌ఎస్ ప్రత్యేక సంచికలో అంబేద్కర్ భావాల్ని వక్రీకరించాయి. అంబేద్కర్‌ని అవమానించాయి. స్వార్థ ప్రయోజనాల కోసం పుక్కిటి పురాణాల్ని, కట్టు కథల్ని ప్రచారం చేస్తున్నాయి.

ఆర్గనైజర్ సంచికలోని 24 వ్యాసాల్లో (ఒక్క వ్యాసం నరేంద్రజాదవ్ గతంలో రాసినది పునర్ముద్రించారు) అంబేద్కర్ జీవితం, కృషిలో వెలుగులోకి రాని కోణాలను పరిశీలించామని ప్రచురణ కర్తలు రాశారు. అయితే, ఈ పరిశీలనలో అంబేద్కర్ రచనల్ని, ఇంటర్వ్యూలని ఉటంకించడం కాని, అంబేద్కర్ కార్యాచరణని ఉదాహరించడం కాని కనిపించదు. ఒకవేళ ఎక్కడైనా అంబేద్కర్ రచనల్ని ఉటంకిస్తే, ఆ మాటలు కూడా వక్రీకరించబడతాయి, లేదా సగమే ఉటంకించ బడతాయి. అంబేద్కర్ చెప్పినట్లుగా కొన్ని మాటల్ని ఆర్‌ఎస్‌ఎస్ భావజాల ప్రతినిధుల పుస్తకాల్నించి ఉటంకిస్తారు. లేదా అంబేద్కర్ ఆర్‌ఎస్‌ఎస్ నాయకులకి చెప్పారని రాస్తారు. సుమారు 25 సంపుటాల రచనలు, ఇంటర్వ్యూలు, రాజ్యాంగ నిర్మాణ క్రమంలో చేసిన చర్చలు – ఇన్ని ఆధారాల ద్వారా అంబేద్కర్ ఆలోచనలపై పుస్తకాలు రాయవచ్చు. ఏ శాస్త్రీయ ఆధారాల్ని ఉటంకించకుండా, కేవలం ఆర్‌ఎస్‌ఎస్ తమ అభిప్రాయాల్ని, తమ భావజాలాన్ని అంబేద్కర్ నోట్లో పెట్టి, ఆయనే చెప్పారని ప్రచారం చేస్తున్నది. హిందూ సమాజాన్ని ఐక్యం చేయాలని అన్నారని, దళితుల్ని కమ్యూనిస్టులు కాకుండా అడ్డుకుంటానని అన్నారని, ముస్లింలు దేశానికి ప్రమాదమని భావించారని, ప్రపంచీకరణని సమర్థించారనీ – మొత్తంగా అంబేద్కర్ అభిప్రాయాలు హిందూత్వ అనుకూల అభిప్రాయాలని, మోడీ ప్రభుత్వ అనుకూల భావాలని ఆర్‌ఎస్‌ఎస్ ప్రత్యేక సంచికలో చెప్పే ప్రయత్నం చేశారు. ఈ ప్రయత్నంలో అంబేద్కర్‌ని చారిత్రకంగా చూసే పద్ధతిని, ఆయన రచనల్ని, ఇతర ఆధారాల ద్వారా వ్యాఖ్యానించవలసిన కనీస బాధ్యతని పక్కన పెట్టారు. అంబేద్కర్‌ని ఆర్‌ఎస్‌ఎస్ నాయకుల్లో ఒకరిగా, హిందూ సంస్కర్తలలో ఒకరుగా కలిపేసుకునే కుట్రపన్నారు.

అంబేద్కర్ హిందూ సంస్కరణ కోరుకున్నారని, ఆయన హిందూ మతాన్ని ధ్వంసం చేయాలని చెప్పలేదని ఒక వాదన చేశారు. అంటరాని తనానికి వ్యతిరేకంగా, హిందూ మతానికి వ్యతిరేకంగా అంబేద్కర్ చేసిన పోరాటాల్ని కేవలం హిందూ మతాన్ని సంస్కరించే ప్రయత్నంగా, హిందువుల ఐక్యత కోసం చేసిన ప్రయత్నాలుగా చెపుతూ వక్రీకరించారు. హిందువుల మధ్య సౌభ్రాతృత్వం కోరుకున్నారని రాశారు. ఈ వాదనలు మొత్తం వ్యాసాల్లో చాలా చోట్లా వస్తాయి.

ఆర్గనైజర్ మొదటి వ్యాసంలోనే అంబేద్కర్ దళితులు హిందువులే అన్నారని, 'అంబేద్కర్ దృష్టిలో కుల, మత ఆధారంగా విభజనకు చోటులేదని' రాశారు. అలాగే అంబేద్కర్ 'భగవద్గీత నాకు స్ఫూర్తి దాయకమని' అన్నారని రాశారు. ఈ అసత్య వాదనలకి ఏరకమైన ఆధారాల్ని ఇవ్వలేదు. అంబేద్కర్ ఎప్పుడు, ఎక్కడ పైన చెప్పిన మాటలు అన్నారో ఆధారాలు ఇవ్వలేదు. అంబేద్కర్ రచనల్ని ఉటంకించలేదు. రమేష్ పతంగే రాసిన వ్యాసంలో కూడా అంబేద్కర్ హిందూ మతంలో మార్పులు కోరుకున్నారని కానీ పూర్తిగా ధ్వంసం చేయాలని అనలేదని రాశారు. ఈ తప్పుడు వ్యాఖ్యల్లో భాగంగా అంబేద్కర్ బ్రహ్మ సిద్ధాంతాన్ని ప్రజాస్వామ్యానికి పునాదిగా భావించారని రమేష్ పతంగే అన్నారు. అంబేద్కర్ రచనల్ని ఉటంకించారు. వాల్యూం 4, పేజి. 285 తిరగేసి చూస్తే – అంబేద్కర్ అందరూ 'బ్రహ్మ'లో భాగమైతే, అందరికీ సమానంగా స్వేచ్ఛ లభిస్తుంది. ప్రజాస్వామ్య పునాదిగా ఇంతకంటే సరైన సిద్ధాంతం ఏముంటుంది? అని హిందూ అభిప్రాయాన్ని విశ్లేషిస్తారు. అయితే, అంబేద్కర్ ఇక్కడితో ఆగలేదు. 'బ్రహ్మ' సిద్ధాంతం బ్రాహ్మణునికి శూద్రునికి మధ్య మనిషికీ మనిషికీ మధ్య, కుల జనానికి, కులానికి బయట ఉన్న జనానికి మధ్య అసమానతల్ని సమర్థించినదని విమర్శించారు. (వాల్యూం 4, పేజి. 286) 'బ్రహ్మ' సిద్ధాంతాన్ని అంబేద్కర్ తిరస్కరించారు. కానీ ఆయన మాటల్లో ముందు భాగాన్ని ఉటంకించి అంబేద్కర్‌ని హిందూ అనుకూలురుగా చెప్పే ప్రయత్నం జరిగింది. మరొక్క ఉదాహరణతో ఈ భాగం ముగిస్తాను. పతంగే వ్యాసం అంబేద్కర్ కుల నిర్మూలన గ్రంథంలో మాటల్ని ఉటంకిస్తూ ముగించారు. 'మీది జాతీయ సమస్య... ఇది స్వరాజ్యం కంటే ముఖ్యమైనది' అని అంబేద్కర్ అన్నారు. స్వరాజ్యం కోసం పోరాడడం కంటే హిందువుల కోసం పోరాడడమే చాలా ముఖ్యం, హిందువుల అంతర్గత ఐక్యత చాలా అవసరమని అంబేద్కర్ చెప్పారని పతంగే రాశారు. ఈ మాటలు కుల నిర్మూలన పుస్తకంలోని చివరి పేరాలో నుంచి తీసుకున్నవే. ఇంత వరకు అవి సరిగానే ఉన్నాయి. అయితే ఈ పేరాలోని కొన్ని లైన్లు పతంగే తొలగించారు. స్వరాజ్యం కంటే హిందువుల ఐక్యత ముఖ్యమని అంబేద్కర్ అభిప్రాయమని పతంగే వాఖ్యానించారు. మిగతా లైన్లు చదివితే అంబేద్కర్ ఏమన్నారో పూర్తిగా తెలుస్తుంది. 'నా అభిప్రాయంలో హిందూ సమాజం కుల రహిత

సమాజంగా మారినపుడు మాత్రమే, తనను తాను రక్షించుకునే శక్తి ఆ సమాజానికి వస్తుంది.' కుల నిర్మూలన జరగనిదే హిందూ ఐక్యత సాధ్యం కాదని, కుల నిర్మూలన స్వరాజ్యం కంటే ముఖ్యమైన లక్ష్యమని అంబేద్కర్ ఉద్దేశం. కాని అర్ధ కొటేషన్ల ద్వారా అంబేద్కర్‌ని హిందూ సంస్కరణ వాదిగా ప్రచారం చేసే ప్రయత్నం ఆర్‌ఎస్‌ఎస్ చేసింది. ఇలాంటివి ఎన్నో వాఖ్యలు ఆర్‌ఎస్‌ఎస్ పత్రికలో ఉన్నాయి. స్థలాభావం వల్ల వాటిని ఇక్కడ ఉదహరించడం లేదు.

అంబేద్కర్ హిందూ మతం ధ్వంసం కానిదే కుల నిర్మూలన సాధ్యం కాదని పలుమార్లు చెప్పారు. కుల నిర్మూలన గ్రంథంలో హిందూ మతం అసమానతలు దేవుడే సృష్టించాడని చెపుతుందని, హిందూ మతం, మత గ్రంథాల పవిత్రత ధ్వంసం కానిదే కుల నిర్మూలన సాధ్యం కాదని స్పష్టంగా చెప్పారు. అలాగే, హిందువుగా పుట్టడం తన చేతుల్లో లేకపోయినా, హిందువుగా మరణించనని ప్రకటించారు. ఆ మాట ప్రకారం ఆయన తన చివరి రోజుల్లో బౌద్ధమతంలోకి మారారు. బౌద్ధమతాన్ని ఆయన పునఃపరిశీలించారు, పునఃవాఖ్యానించారు. బుద్ధుడు, ఆయన ఆలోచనలు సమానత్వాన్ని సౌభ్రాతృత్వాన్ని పెంపొందిస్తాయని అంబేద్కర్ భావించి బౌద్ధంలో చేరారు. బౌద్ధమతం హిందూ మత శాఖ అనడం కూడా హిందుత్వ వక్రీకరణ ప్రచారంలో భాగమే. కాషాయీకరణ కుట్రలో భాగమే. అలాగే అంబేద్కర్ రాజా రామ్మోహన్‌రాయ్, వివేకానందల్లాంటి హిందూ సంస్కర్త అనడం, అంబేద్కర్‌ని సావర్కార్, హెడ్గేవార్ లాంటి హిందూత్వ నాయకుల్తో పోల్చడం – ఇవన్నీ ఆర్‌ఎస్‌ఎస్ ప్రచార వ్యూహంలో భాగం తప్ప, అంబేద్కర్ హిందూ సంస్కరణ వాదికాదు, ఆర్‌ఎస్‌ఎస్ భావజాల అనుకూలుడు కాదు.

1920, 30లలో ఆర్‌ఎస్‌ఎస్, ఇతర సంఘ పరివార్ సంస్థలు మహారాష్ట్రలో, దేశంలో చాలా చిన్న సంస్థలు. వాటి ప్రాబల్యం అంతంత మాత్రమే. అంబేద్కర్ ప్రధానమైన శక్తిగా కాంగ్రెస్‌పైనే తన పోరాటం చేశారు. అలాగే, కమ్యూనిస్టు పార్టీలతో ఐక్యత – ఘర్షణ కొనసాగించారు. ఈ రోజు ఆర్‌ఎస్‌ఎస్ తదితర హిందూత్వ శక్తులు తమను తాము పెద్ద రాజకీయ శక్తిగా ప్రచారం చేసుకోవడానికి అంబేద్కర్ ఆర్‌ఎస్‌ఎస్ ఆఫీసుకు వచ్చారని, ఆర్‌ఎస్‌ఎస్ నాయకులతో సన్నిహితంగా ఉండేవారని చెప్పుకుంటున్నారు. దీనిలో భాగంగానే ఆర్‌ఎస్‌ఎస్ ప్రచారక్‌లు, అంబేద్కర్‌ది ఒకే మార్గమని ఇదాతే పెద్ద వ్యాసం రాశారు. గోల్వాల్కర్, దేవరస్ అంబేద్కర్‌కి నివాళులర్పించారని, పొగిడారని రాశారు. ఈ పొగడ్తల్లో కూడా అంబేద్కర్‌ని వక్రీకరించారు, అవమానించారు. అంబేద్కర్ బౌద్ధమతంలోకి మారడం 'ధర్మాన్ని' శుద్ధి చేయడానికే అని, ప్రత్యేక గుర్తింపు కోసం కాదని గోల్వాల్కర్ అన్నారని రాశారు. హిందూ సమాజాన్ని ఏకం చేయడానికి, సామాజిక ఐక్యతకు అంబేద్కర్ పాటుపడ్డారని దేవరస్ అన్నారట. సామాజిక సమానత్వానికి హిందూ మత ధ్వంసం తప్పదని అంబేద్కర్ నినదించారు. ఈ వాస్తవం చెప్పరు. అలాగే బౌద్ధమతం అంటే హేతుబద్ధమైన, మానవీయమైన, శాస్త్రీయమైన, దేవుడులేని మతమని అంబేద్కర్ భావించారు.

అంబేద్కర్ హిందూ సంస్కర్త కాబట్టి ఆయన ముస్లిం వ్యతిరేకి అని ఆర్‌ఎస్‌ఎస్ మరొక వాదన. ఇస్లాంలోకి మారకపోవడం ఆయన ముస్లిం వ్యతిరేకి అనడానికి ఒక కారణంగా చూపారు. అలాగే – అంబేద్కర్ 75 ఏళ్ల క్రితమే ఇస్లామిక్ తీవ్రవాదం గురించి విశ్లేషించారని పచ్చి అబద్ధాలు రాశారు. అంబేద్కర్ కాలం నాటికి ఇస్లామిక్ తీవ్రవాదం అనేమాట కూడా అంతగా ప్రచారంలోకి రాలేదు. 'బుజ్జగింపు వద్దు, ప్రత్యేక ప్రతిపత్తి వద్దు' అన్న డా. కులదీప్‌చంద్ అగ్నిహోత్రి రాసిన వ్యాసంలో జమ్ము–కశ్మీర్ సమస్యపై అంబేద్కర్ అభిప్రాయాలు వక్రీకరించారు. ఆర్టికల్ 370 ని అంబేద్కర్ వ్యతిరేకించారని, కశ్మీర్‌కి స్వతంత్ర ప్రతిపత్తిని వ్యతిరేకించడంలో ఆయన ముస్లిం వ్యతిరేకతే కారణమని ఆర్గనైజర్ వాదన. ఆర్టికల్ 370ని అంబేద్కర్ వ్యతిరేకించినట్లు ఆయన మాటల్ని ఉదహరించలేదు. ఏ ఆధారాలు చూపలేదు. ఆర్‌ఎస్‌ఎస్ తన ముస్లిం వ్యతిరేకతను అంబేద్కర్‌కి అంటగట్టింది.

అలాగే – అంబేద్కర్ కశ్మీర్ సమస్యపై నెహ్రూతో విభేదించారు. కానీ దానర్థం, అంబేద్కర్ అభిప్రాయాలు ఆర్‌ఎస్‌ఎస్ అభిప్రాయాలు ఒకటని కాదు. ఆర్‌ఎస్‌ఎస్‌లా ముస్లిం వ్యతిరేకతతో హిందూ దురహంకారంతో కాకుండా, అంబేద్కర్ కొన్ని ప్రజాస్వామిక సూత్రాల ఆధారంగా కశ్మీర్‌ని మూడు భాగాలుగా విభజించాలని అన్నారు. నెహ్రూ కశ్మీర్ సమస్యపై తీసుకున్న వైఖరి వల్ల సరిహద్దుల్లో ఘర్షణ పెరిగి సైనిక ఖర్చు పెరిగిందని అన్నారు. కశ్మీర్‌ని మూడు భాగాలుగా, దీసీస్ ఫైర్‌జోన్, కశ్మీర్‌లోయ, జమ్ము – లడక్ ప్రాంతం విభజించాలని ఆయన సూచించారు. అంబేద్కర్ అభిప్రాయాలు కొన్ని ప్రజాస్వామిక, పరిపాలనా సంబంధమైన సూత్రాల ఆధారంగా చేసింది. దీన్ని వక్రీకరించడం, అంబేద్కర్ ముస్లిం వ్యతిరేక హిందూ చాందసవాదిగా చిత్రీకరించడం తప్పు. అంబేద్కర్ ముస్లిం ప్రజల పట్ల చాలా మంచి అభిప్రాయాలతో ఉన్నారు. ఇస్లాంలోకి మారాలని కూడా ఆయన యోచించారు. మహారాష్ట్రలో కొందరు దళితులు ముస్లింలుగా మారారు. దీనికి ప్రేరణ అంబేద్కరే. అలాగే – పాకిస్థాన్ ఏర్పాటుకు తాను వ్యతిరేకమైనా ప్రజాస్వామిక సూత్రాల ద్వారా పాకిస్థాన్ ఏర్పాటు సరైనదే అని ఆయన పాకిస్థాన్ ఆర్ ది పార్టిషన్ ఆఫ్ ఇండియా పుస్తకంలో చెప్పారు. అంబేద్కర్ ముస్లిం వ్యతిరేకి అనడం అంబేద్కర్ ప్రజాస్వామిక, లౌకిక దృష్టిని అవమానించడం, తమ హిందూ ఫాసిజాన్ని అంబేద్కర్ మీద రుద్దే ప్రయత్నం తప్ప మరేమీ కాదు.

అంబేద్కర్ కమ్యూనిస్టు వ్యతిరేకి అనేది మరో ప్రచారం. అనేక వ్యాసాల్లో ఈ ప్రస్తావన వస్తుంది. సరైన ఆధారాలు, వాదనలు లేకుండా చేసిన తప్పుడు వాదన ఇది. ఆర్గనైజర్‌లోని 3వ వ్యాసంలో 'అంబేద్కర్ కమ్యూనిజాన్ని వ్యతిరేకించారు. తనను కమ్యూనిస్టు వ్యతిరేకిగా ప్రకటించుకున్నారు.' ఈ వాదనకి ఏ ఆధారాలు చూపకుండా పదేపదే చెపుతారు. అంబేద్కర్‌కి కమ్యూనిస్టు సిద్ధాంతంపై కొన్ని విమర్శలు ఉన్నాయి. అలాగే అప్పటి కమ్యూనిస్టు పార్టీల ఆచరణపై కూడా విమర్శలున్నాయి. అవన్నీ ఆయన తన రచనల్లో రికార్డు చేశారు. 1942 అంబేద్కర్ ఇండిపెండెంట్ లేబర్ పార్టీ స్థాపించి కమ్యూనిస్టు పార్టీలతో కలిసి, ఎన్నికలలో పాల్గొన్నారు. ఇద్దరు సభ్యులు బొంబాయి నియోజకవర్గంలో ఎస్.ఎ. డాంగే, కమ్యూనిస్టు నాయకులతో కలిసి ఎన్నికల్లో పాల్గొన్నారు. షెడ్యూల్డ్ కాస్ట్ ఫెడరేషన్ కమ్యూనిస్టు పార్టీలతో కలిసి పని చేసింది అంబేద్కర్ కుల రహిత – వర్గ రహిత సమాజం కోరుకున్నాడు. అంతే తప్ప ఆయన కమ్యూనిస్టు వ్యతిరేకి కాదు. ఇది తప్పుడు ప్రచారం. అంబేద్కర్ రచనల్లో, ఆచరణలో ఎక్కడా ఆయన కమ్యూనిస్టులను శత్రువులుగా వ్యతిరేకించలేదు.

ఆర్గనైజర్ ప్రత్యేక సంచికలో అంబేద్కర్ ఆలోచనల్ని వక్రీకరిస్తూ, గందరగోళం సృష్టించే ప్రయత్నం జరిగింది. అంబేద్కర్‌ని వాడుకుని దళితుల్లో ముస్లిం వ్యతిరేకత, కమ్యూనిస్టు వ్యతిరేకత రెచ్చగొట్టే ప్రయత్నం

# మన ప్రజా ప్రతినిధులు రోగగ్రస్తులా?

*పాలకులు అక్రమాలకు పాల్పడుతూ అవి వెలుగులోకి వచ్చినప్పుడు చట్టానికి పట్టుబడకుండా అనారోగ్య నెపంతో తప్పించుకు తిరుగుతున్న తీరును వివరిస్తున్నారు* **వై.ఎచ్. కె. మోహన్‌రావు**

మన పాలకులు, రాజకీయ నాయకులు బయటకు చెప్పుకోలేని తీవ్రమైన రోగాలతో బాధపడుతున్నారా? అంటే! ఏమో నిజమేనేమో అనిపిస్తుంది. వీళ్లు రోగాలనూ, రొష్టులనూ బహుగుట్టుగా ఉంచుతున్నట్లుగా కూడా తోస్తుంది. ఎందుకంటే! ఏదో ఒక విచారణ సంస్థ సంబంధిత వ్యక్తులకు నోటీసులు జారీ చేయడంతోనే రకరకాల జబ్బులతో బాధపడుతున్నట్లు బేలమొఖం వేస్తారు. అరెస్టుకు గురైన వ్యక్తులు (నిందితులు) ఒకవైపు తొడగొట్టి సవాళ్లు విసురుతుంటే ఆయా నిందితుల తరఫున వకాల్తా తీసుకున్న న్యాయవాదులు మాత్రం న్యాయమూర్తి ఎదుటకు వచ్చి తమ క్లైంటు ఏదో ఒక తీవ్రమైన రుగ్మతతో బాధపడుతున్నాడని, ఆయన జైలు పరిస్థితులను తట్టుకోలేడని, సరైన వైద్యం అందదని, అందువలన బెయిల్ మంజూరు చేయాలంటూ దీనంగా ప్రాధేయపడుతుంటారు.

పై విషయాలకు మద్దతుగా ఇటీవలి పరిణామాలను నెమరు వేసుకుంటే ఓటుకు కోట్ల కేసులో 50 లక్షల రూపాయలతో ఎసిబి ప్రత్యక్షంగా పట్టుకున్న సందర్భంలో పట్టుబడిన టిడిపి శాసనసభ్యుడు రేవంత్‌రెడ్డి మీసాలు మెలిదిప్పి రంకెలేస్తుంటే ఆ సీన్ చూసిన ఏ ఒక్కరూ రేవంత్‌రెడ్డి రోగి అనుకుని ఉంటారని నేనైతే విశ్వసించడం లేదు. అయితే ఆయనను ఎసిబి పోలీసులు అరెస్టు చేసి న్యాయమూర్తి ముందు ప్రవేశ పెట్టినప్పుడు రేవంత్ న్యాయవాదులు నిందితుడు గుండె సంబంధమైన తీవ్రరోగంతో సతమతమౌతున్నాడని, జైలు వైద్యం సరిపడదని, బెయిల్ మంజూరు చేయాలని వేడుకున్నారు.

ఇక ఇదే కేసుతో సంబంధమున్న ఖమ్మం జిల్లా సత్తుపల్లి నియోజకవర్గ శాసనసభ్యుడు సండ్ర వెంకట వీరయ్య వెన్ను నొప్పికి వైద్యమంటూ తెలంగాణ నుండి ఏపికి పారిపోయారు. వైద్యులు పదిరోజుల పాటు విశ్రాంతి తీసుకోవాలని సలహా ఇచ్చారట. ఆ తరువాత విచారణకు హాజరవుతానని ఎసిబి సంస్థకు ఉత్తరం రాశాడు. కావాలంటే ఎసిబి తనవద్దకొచ్చి విచారించుకోవచ్చని ఒక వెసులుబాటు కల్పించాడు. అయితే తను ఎక్కడ వైద్యం చేయించుకుంటుంది మాత్రం ఆయన తన లేఖలో పేర్కొనక పోవడం కొసమెరుపు. వెనుకటి ఒక ఆచారాన్ని సండ్ర గొప్పగా పాటించారు. అదేంటంటే 'ఆకాశరామన్న' ఉత్తరాలని ఊరు, పేరు లేకుండా వస్తుంటాయి పాత కాలంలో. కనీసం సండ్ర తన పేరును రాసుకున్నందుకు సంతోషిద్దాం. ఒకవేళ ఎసిబి విచారించాలనుకుంటే ఎక్కడకు వెళ్లి విచారించాలో చిలక ప్రశ్నకు వెళ్లాల్సిందే. ఈ కేసుకు సంబంధించిన టిడిపి ఎంఎల్‌సి అభ్యర్థి వేం నరసింహారెడ్డిని ఎసిబి అదుపులోకి తీసుకుని విచారించాలని ఆయన ఇంటికి చేరుకున్నప్పుడు తాను హృద్రోగినని, ఈ రాత్రివేళ రాలేనని తెలిపి మరురోజు హాజరయ్యారు. అయితే ఈ మొత్తం ఎపిసోడ్‌లో ఒకే లాజిక్ మన ముందు ఆవిష్కృతమైంది. అదేంటంటే! రోగం. ఇంకా చెప్పుకోవాలంటే మహా మాయ రోగం.

నిజానికి స్వేచ్ఛా కోణంతో దర్శిస్తే ఎసిబికి పట్టుబడి రిమాండుకు వెళ్లిన రేవంత్‌రెడ్డి కంటే సండ్ర వెంకట వీరయ్య ఎసిబికి చిక్కకుండా ఎక్కువ మానసిక సంఘర్షణ అనుభవించినట్లు చెప్పుకోవచ్చు. ఆయన వెలుగు చూడకపోవడమే కాకుండా వీరయ్యను కలిసే వాళ్లు కూడా చాటుమాటుగా, దొంగచాటుగా వెళ్లవలసిన పరిస్థితి నెలకొంది. ఎవరికంట పడితే ఏమవుతుందోననే భయంతో పది రోజులు కాలం వెళ్లదీయాల్సి వచ్చింది. రెండు సంఘటనలను బేరీజు వేసి చూస్తే రేవంత్ పరిస్థితే కొంత మెరుగని చెప్పాలి. రేవంత్ రిమాండ్ జైలులో ఉండి పరిమిత స్వేచ్ఛనైనా అనుభవించాడు. రేవంత్‌ను కలవాల్సిన వారు కూడా బహిరంగంగా జైలు అధికారుల అనుమతితో కలిశారు. సండ్ర తాను చీకటి జీవితంలోకి వెళ్లడమే కాకుండా తనకు కావలసిన వారికి కూడా దుర్గతి పట్టించాడు. కాగా సండ్ర, రేవంత్‌ను బెయిల్‌పై కోర్టు విడుదల చేసిన తరువాత ఆరోగ్యంగా ఉన్నానని విచారణకు హాజరవుతానని మరో లేఖ రాసి అందులో సెల్ ఫోన్ నెంబర్ పొందుపరిచాడు. బహుశా అరెస్టు చూపిన వెంటనే బెయిల్ పొందగలననే నమ్మకంతో ఈ పనికి పూనుకుని ఉండవచ్చు. ఈ కేసులో ప్రథమ ముద్దాయి రేవంత్‌కు బెయిల్ ఇచ్చిన న్యాయస్థానం ఇక ఎవరికీ రిమాండు విధించదనే భరోసా ఆయనకు ఉండి ఉండవచ్చు.

మొత్తం మీద ఇటీవలి సంఘటనలకు సంబంధించి రోగాలు వింటుంటే మన రాష్ట్రంలోనూ, దేశంలోనూ ఉన్న మన పాలకులు, ప్రజా ప్రతినిధులు, రాజకీయ నాయకులు రోగాలతో పీడింపబడుతున్నట్లు తోస్తున్నది. ముద్దాయిగా మారిన ప్రతి వారికి భరించలేని రోగం బయటకు వెల్లడవుతుంది. రోగులతో పరిపాలించడం భారతీయులంతా చిన్నబుచ్చుకోవాల్సిన అంశం. ఆరోగ్యవంతమైన పాలకుల పాలన ప్రజలంతా కోరుకుంటున్నారు. ఆరోగ్యవంతమైన పాలనను కూడా

---

చేశారు. అంబేద్కర్‌ని హిందూత్వ అనుకూలుడుగా చిత్రీకరించే ప్రయత్నం చేశారు. మొత్తంగా ఈ హిందూత్వ ప్రచారం అంబేద్కర్‌ని వక్రీకరించి, తమలో కలుపుకుని దేశంలో హిందూ రాజ్యం బలపడడానికి, ఫాసిజం అమలుకు, మనుధర్మం తీసుకురావడానికి చేసిన ప్రయత్నమే ఆర్‌ఎస్‌ఎస్ 'అంబేద్కర్ పునర్దర్శనం'. ఈ 'పునర్దర్శనం'లో ఎక్కడా అంబేద్కర్ కుల నిర్మూలనపై, అంటరానితనం మూలాలపై, ప్రజాస్వామిక సంస్కృతిపై చర్చలేదు. ప్రతీ పేజీ కార్పొరేట్ స్పాన్సర్‌షిప్‌తో కార్పొరేట్ హిందూ భావజాలం ఈ ప్రత్యేక సంచిక నిండా కనిపిస్తుంది. దీన్ని ఎండగడుతూ ప్రచారం చేయాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

*(రచయిత ఇఫ్లూ యూనివర్సిటీలో అధ్యాపకులు)* వీ

ఆశిస్తున్నారు. అందువలన ఎన్నికలలో పోటీ చేసే అన్ని స్థాయిల అభ్యర్థులకు ఆరోగ్య పరీక్షలు నిర్వహించి దీర్ఘకాల, భయంకర వ్యాధులు లేవని స్పష్టం చేస్తూ నామినేషన్ పత్రంతో ఆరోగ్య నిర్ధారణ పత్రాలు కూడా జత చేస్తే బాగుంటుంది. బహుశా రోగాలన్నీ తమకు ఎన్నికల ఫలితాల తరువాత వచ్చాయంటారేమో! మన ప్రబుద్ధులు. మరో సంశయం లేకుండా అదే సమాధానం వస్తుంది. ఇకపోతే బెయిల్‌పై బయటకు వచ్చిన రేవంత్‌రెడ్డి తీరు, ప్రవర్తన, ప్రసంగాలలో ఎక్కడా కూడా తను దోషిననే భావన కనిపించలేదు. పైగా అరెస్టు అయినప్పుడు మాదిరిగానే ఏమాత్రం తగ్గకుండా మరోమారు మీసం తిప్పి, తొడగొట్టి ఛాలెంజ్ విసిరారు. తప్పు చేశానన్న పశ్చాత్తాపం ఏకోశానా వ్యక్తం చేయకపోగా మరింత రెచ్చిపోయి దూషణలకు దిగారు. రాజకీయాలను, వ్యవస్థలను భ్రష్టు పట్టించడంలో మన రాజకీయ నాయకులు పరాకాష్టకు చేరిపోయారనడానికి ఇదో మచ్చుతునక.

ఇదే కేసులో టిఆర్ఎస్ తెలంగాణ ఎంఎల్ఎ స్టీఫెన్‌సన్‌తో ఫోన్‌లో సంభాషించినట్లుగా ఆరోపణలు ఎదుర్కొంటున్న ఎపి ముఖ్యమంత్రి, టిడిపి జాతీయ పార్టీ అధ్యక్షులు చంద్రబాబు నాయుడి స్పందనలు మరింత విడ్డూరంగా ఉన్నాయి. 'మా వారు నాకు స్థూలంగా చెప్పారు. మీకు ఇచ్చిన హామీలన్నీ నెరవేరుస్తాం. మీకు అండగా ఉంటాం. స్వేచ్ఛగా ఓటును (టిడిపి అభ్యర్థికి) వేయండి' అంటూ ఫోన్‌లో ఏకరువు పెట్టిన బాబు రహస్య సంభాషణ బయటకు పొక్కగానే ఉక్కిరి బిక్కిరయ్యారు. నిద్రపట్టలేదని చెప్పుకున్నారు. ఏమి చేస్తున్నారో అర్థం కాకుండా ప్రవర్తించారు. తనకు తెలంగాణ ఎసిబి శాఖ నోటీసులు పంపుతుందేమో నని కిందా మీదా అయ్యారు. ఈ పూర్వ రంగంలో ఆయన స్వర తీవ్రత పెంచారు. విజయవాడలో జరిగిన మహాసంకల్ప యాత్రలో రెచ్చిపోయారు. తన స్వరాన్ని ఫాబ్రికేట్ చేశారని అన్నారు. తనకు నోటీసులు పంపితే టిఆర్ఎస్ ప్రభుత్వానికి అవే చివరి ఘడియలంటూ హెచ్చరించారు.

నెలరోజులుగా ఈ కేసులో నెలకొన్న పరిణామాలను అంచనా వేస్తే చంద్రబాబు బెదిరింపు టిఆర్ఎస్ ప్రభుత్వం మీద ప్రభావం చూపినట్లుగా అనుకోవచ్చు. విచారణ కాస్త మందగించినట్లు చెప్పుకోవచ్చు. ఎందుకంటే కెసిఆర్‌తో పాటు ఆ రాష్ట్ర టిఆర్ఎస్ మంత్రులు, ఎంపిలు, ఎంఎల్ఎలు చేసిన వ్యాఖ్యానాలను బట్టి చంద్రబాబు కూడా అరెస్టు అవుతారేమోనని రెండు రాష్ట్రాల ప్రజలు భావించారు. అదే కోవలో చంద్రబాబు ప్రవర్తన కూడా అందుకు తగ్గట్లుగానే ఎంతో హడావిడిని సంతరించుకుంది. పలు దఫాలు సంయుక్త రాష్ట్ర గవర్నర్ నరసింహంను కలవడం, ఢిల్లీ వెళ్లి ప్రధాని నరేంద్రమోడీని , రాష్ట్రపతి ప్రణబ్ ముఖర్జీని కలిసి కష్టాలు చెప్పుకోవడం ఆయన ఆందోళనకు మద్దతుగా నిలిచింది. అంతేగాక కోట్లకు ఓటు కేసును అడ్డుకోవడానికి ఆయన అప్పటికప్పుడే గుర్తుకొచ్చినట్లు విభజన చట్టంలోని సెక్షన్ 8ను, మరో అస్త్రంగా ఫోన్ ట్యాపింగ్ అంశాన్ని పెద్ద ఎత్తున ప్రజలలోకి తీసుకవచ్చి విపరీత ప్రచారం చేశారు. అయితే కొన్ని రోజులుగా ఇటు ఓటుకు కోట్లు కేసు, అటు ఫోన్ ట్యాపింగ్ కేసు నత్తతో పోటీ పడుతున్న తీరును గమనిస్తే ఏదో మతలబు చోటు చేసుకున్నట్లు ప్రజలు భావిస్తున్నారు. నెల రోజులైనా చంద్రబాబుకు కనీసం నోటీసులు ఎందుకు పంపలేదని టిఆర్ఎస్ ప్రభుత్వాన్ని, ఫోన్ ట్యాపింగ్ అంశాలలో ఒక్కదాన్ని కూడా కోర్టు ముందు ఎందుకు ఉంచలేక పోయారని ఎపి టిడిపి ప్రభుత్వాన్ని ప్రజలు ప్రశ్నిస్తున్నారు. ఈ రాజీ వాతావరణానికి దన్నుగా ఒక కథాంశం ప్రచారంలోకి వచ్చింది. ఓటుకు కోట్లు కేసు గురించి ఢిల్లీ వెళ్లి గోడు చెప్పుకున్న బాబుకు తానున్నానని నరేంద్రుడి హామీ లభించినట్లు మౌఖిక వార్తా వాహిని జోరుగా దూకుళ్లు పెడుతుంది. ప్రధాని ఇచ్చిన భరోసాతోనే బాబు కుదుటపడినట్లు, తాపం తగ్గి సాధారణ పరిస్థితులకు చేరుకున్నట్లు ప్రజానీకం చెవులు కొరుక్కుంటున్నారు.

వ్యవస్థలను దారికి తెచ్చుకోవడంలో చంద్రబాబు సిద్ధహస్తుడనేది బహిరంగ రహస్యమే. ప్రతి రంగంలో తన మనుషులను ప్రవేశ పెట్టడం ఆయనకు వెన్నతో లభించిన విద్య. ఈ దొరబాట్లతో ఆయా వ్యవస్థల తీరు తెన్నులు మార్చడం, కుప్పకూల్చడం ఆయన సాధారణ వ్యక్తిత్వ లక్షణాలలో ఒకటి మాత్రమే. ఇప్పటికే న్యాయ వ్యవస్థలో న్యాయవాదుల రంగం ఇక చెడిపోవలసి లేదన్నంతగా మారింది. న్యాయస్థాన సిబ్బంది విషయం కూడా మనకు తెలియందేమీ కాదు. న్యాయ మూర్తుల వ్యవస్థపై అపారమైన నమ్మకముంచిన పౌర సమాజం గాలి జనార్ధనరెడ్డి బెయిల్ విచారణ సందర్భంలో అప్పటి సిబిఐ కోర్టు న్యాయమూర్తి పట్టాభి, మాజీ న్యాయమూర్తి హనుమంతరావు నెరపిన అవినీతి నిర్వాకంతో బిత్తరపోయింది. భారత ప్రజాస్వామ్యం అపహాస్యానికి లోనైంది. ప్రజా సమూహాలన్నీ భయాందోళనలకు గురైయ్యాయి. మిగతా రెండు వ్యవస్థల జాఢ్యం న్యాయమూర్తులకు కూడా సోకిందని ఆవిష్కృతమైంది. న్యాయమూర్తుల ఎడల భారత ప్రజానీకానికి ఉన్న అపారమైన విశ్వాసం సన్నగిల్లడం మొదలైంది. సుప్రీంకోర్టు న్యాయమూర్తి జస్టిస్ చలమేశ్వర్, మరో సుప్రీంకోర్టు న్యాయమూర్తి జస్టిస్ ఎన్‌వి రమణ, ఢిల్లీ రాష్ట్ర అత్యున్నత న్యాయస్థాన సి.జె జస్టిస్ రోహిణి చంద్రబాబు ప్రమోట్ చేసిన వారుగా చెప్పుకుంటారు.

చంద్రబాబుపై సిబిఐ విచారణ జరపాలని న్యాయస్థానం ఆదేశించి నప్పుడు బాబు హైకోర్టులో పెట్టుకున్న స్క్వాష్ పిటిషన్ ఆరునాట్ బిఫోర్ల పిదప ఏడవ బెంచిలో ఉన్న జస్టిస్ రోహిణి వద్దకు వచ్చే వరకూ పిల్లిమొగ్గలేస్తూ వెళ్లింది. రోహిణి వద్ద సిబిఐ న్యాయవాది నాట్ బిఫోర్ చెపితే ఆమె పక్కకు పంపేందుకు తిరస్కరిస్తూ కేసు ప్రాథమిక న్యాయ సూత్రాలకు విరుద్ధంగా ఉందంటూ అడ్డంగా కొట్టి పడేశారు. అప్పటిలోనే జస్టిస్ రోహిణి టిడిపిలో ముఖ్య నాయకుడైన యనమల రామకృష్ణునికి స్వయానా మరదలని వివిధ కథనాలు విస్తృతంగా నడిచాయి. ఓటుకు కోట్లు కేసు మొదలైన తరువాత ఈ రాష్ట్రంలో జస్టిస్ ఎన్.వి. రమణ పర్యటించి వెళ్లారు. జస్టిస్ చలమేశ్వరైతే ఏకంగా రాష్ట్ర గవర్నర్ నరసింహన్‌తో రాజ భవన్‌లో గంట పాటు ఏకాంత చర్చలు జరిపి వెళ్లారు. సంభాషణలన్నీ రహస్యం.

నెల రోజుల కేసు నేపథ్యంలో తాజాగా నాలుగో నిందితుడైన మత్తయ్య స్క్వాష్ పిటిషన్ న్యాయ వ్యవస్థలో మరో సంచలన వివాదానికి కేంద్ర బిందువైంది. అంతకు క్రితం మత్తయ్య హైకోర్టుకు ముందస్తు బెయిల్ దరఖాస్తు పెట్టుకున్నప్పుడు విచారణకు స్వీకరించిన జస్టిస్ బి. శివశంకరరావు పెద్ద దుమారమే లేపాడు. మత్తయ్యకు వారం రోజుల పాటు ముందస్తు బెయిల్ మంజూరు చేస్తూ ఉత్తర్వులు జారీ చేశారు. అయితే ఈ తీర్పును ఎవరూ తప్పుపట్ట లేదు.

అంతకుముందు జరిగిన సంఘటనలే ప్రజా సమూహాలలో, న్యాయవాద వర్గాలలో చర్చకు దారితీశాయి. ముందస్తు బెయిల్ దరఖాస్తు విచారించిన రోజు ఆ కోర్టులో ఈ కేసు క్రమ సంఖ్య 156గా ఉంది. మత్తయ్య న్యాయవాది అభ్యర్థన మేరకు అత్యవసర కేసుగా పరిగణిస్తూ న్యాయమూర్తి స్వీకరించడం, కేసు వాదనల సందర్భంగా కోర్టులో ఉన్న మిగిలిన న్యాయవాదులందరినీ కోర్టు హాలు విడిచి వెళ్లాలని కోరడం,

అట్లా అనుసరించని ఎడల ఆదేశిస్తానని హెచ్చరించడం, ఈ కేసు విచారణ అనంతరం మరోకేసు చేపట్టక కోర్టును ముగించడం వంటి అంశాలు వివాదాస్పదమయ్యాయి. ఈ కారణంగానే జస్టిస్ శివశంకర్‌రావు వద్ద మత్తయ్య స్క్వాష్ పిటీషన్ విచారణ జరిగితే ఈ కేసుకు న్యాయం జరగదని స్టీఫెన్‌సన్ సంశయాన్ని వ్యక్తం చేస్తూ కేసును వదిలిపెట్టాలని ఆయనకే ధరఖాస్తు చేసుకున్నారు. అయితే స్టీఫెన్‌సన్ పిటీషన్ న్యాయమూర్తిని మానసికంగా క్షోభకు, ఒత్తిడికి గురి చేసినట్లుంది. స్టీఫెన్‌సన్ ధరఖాస్తును తీవ్రంగా నిరసించారు. ఘాటైన వ్యాఖ్యానాలు చేశారు. పిటీషన్‌ను కొట్టివేశారు. మత్తయ్య ధరఖాస్తును ప్రధాన న్యాయమూర్తికి పంపుతూ విచారణ నిర్ణయాన్ని ఆయనకే వదిలారు జస్టిస్ శివశంకరరావు. సున్నిత మనస్కులుగా తమ మీద వచ్చే ఆరోపణలకు తీవ్రంగా స్పందించే న్యాయమూర్తుల వ్యక్తిత్వాలను జస్టిస్ శివశంకరరావు కొత్త ములుపు తిప్పారు. కేసు విచారణ విషయం ప్రధాన న్యాయమూర్తికి అప్పగిస్తూ మత్తయ్య పిటీషన్ దస్త్రాన్ని పంపిన న్యాయమూర్తి అదే కోవలో స్టీఫెన్‌సన్ అభ్యర్థనను అంగీకరిస్తూ నిర్ణయం తీసుకుంటే హుందాగా ఉండేదని న్యాయవాదులు అభిప్రాయ పడుతున్నారు.

ఈ వ్యవహారంలోనే మరో కోణమేమంటే చంద్రబాబు వ్యవహార శైలి. వాస్తవానికి భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత అనేక మంది పాలకులు వివిధ ఆరోపణలపై కేసులలో నిందితులుగా చేరారు. మాజీ ప్రధాని ఇందిరాగాంధీ మొదలు లాలూప్రసాద్ యాదవ్, శిబూసోరెన్, అర్జున్‌ముండా, జయలలిత, పి.వి. నరసింహరావు, పి.వి. రంగారావు, ఎన్‌టి రామారావు, రాజా, కనిమొళి, వైఎస్ జగన్మోహన్‌రెడ్డి, నిన్నటి ప్రధాని మన్మోహన్‌సింగ్ వరకూ చాలా మంది పాలకులు, ప్రజా ప్రతినిధులు పలు కేసులలో నిందితులుగా ఉన్నవారే! అయితే వీరిలో న్యాయ స్థానాల మెట్లెక్కి దిగినవారు కొందరైతే, జైలు గోడలు తట్టినవారు మరికొందరుంటే, కటకటాలు లెక్కించి కృష్ణ జన్మ స్థానాన్ని అనుభవించిన వారు ఇంకొందరు. ఎవరూ కూడా చట్టాలకూ, విచారణా సంస్థలకూ, న్యాయ స్థానాలకు అతీతులమని గానీ, తమకు ఏ వ్యవస్థ ఎలాంటి నోటీసులూ, సమన్లు జారీ చేయకూడదని గానీ చెప్పి ఉండలేదు. ఇందుకు భిన్నంగా చంద్రబాబు ఓటుకు కోట్ల కేసులో ఆగ్రహంతో ఊగిపోతూ తనకు నోటీసులు జారీ చేస్తారా? అంటూ తెలంగాణ ప్రభుత్వాన్ని, ఆ రాష్ట్ర ఎసిబి సంస్థను నిలదీశారు. తనకు నోటీసులివ్వడానికి ఆయనెవరు? అంటూ కెసిఆర్‌ను ఉద్దేశించి ప్రశ్నించారు. విజయవాడలో జరిగిన నవ నిర్మాణ దీక్ష సభలో ఆయన మాట్లాడుతూ తాను నిప్పు, నిజాయితీ, నీతి అంటూ గొంతు పెద్దది చేసి చెలరేగిపోయారు. రేవంత్‌రెడ్డి నామినేటెడ్ ఎంఎల్ఏ స్టీఫెన్‌సన్‌ని ప్రలోభానికి ప్రయత్నించాడో? లేదో? తెలుపకుండా, 50 లక్షలు అడ్వాన్సుగా ఇవ్వజూపాడో? లేదో? చెప్పకుండా విషయాన్ని రకరకాల వింత భంగిమలు తిప్పి విషయాన్ని నృత్యం చేయించాడు. అసలు విషయానికి పోకుండా మన నాయకులు ఎంత సుదీర్ఘంగానైనా మాట్లాడగలరని చంద్రబాబు నిరూపించారు. చట్టాలు, కేసులు, శిక్షలు ప్రజలకూ, బలహీనులకే గానీ, తనలాంటి వారికి వర్తించవని చంద్రబాబు తెగేసి మరోమారు గుట్టు విప్పారు.

అభివృద్ధి చెందిన దేశాల స్థితిగతులను తరచూ వల్లె వేసే చంద్రబాబు అక్కడి క్రమశిక్షణ తనకు వర్తించదని భావిస్తాడు. ఇతర దేశాలకు వెళ్లే మన భారతీయులు ఆయా దేశాలలో ఉన్నప్పుడు పాటించే క్రమశిక్షణను తిరిగి మనదేశానికి వస్తే విమానాలు దిగుతూ వదిలేస్తారని దెప్పి పొడిచారు. ఆయనకు మాత్రం ఎందుకు తెలియదూ! అమెరికా మాజీ అధ్యక్షులు బిల్ క్లింటన్ కుమార్తె మద్యం సీసా కొనుగోలు చేసిన సందర్భంలో అక్కడి ఎస్ఎచ్ఓ క్లింటన్, భార్య హిల్లరీ క్లింటన్‌ను స్టేషన్‌కు పిలిపించి పిల్లలను ఇట్లాగేనా పెంచేది? అంటూ క్లాస్ తీసుకున్నాడు. క్లింటన్ కుమార్తెకు అప్పటికి ఇంకా 12 సంవత్సరాల వయసు దాటలేదు. 12 సంవత్సరాల వయసులోపు వారు అక్కడ మద్యం కొనుగోలు చేయ కూడదనే చట్టం అమలులో ఉంది. చట్టానికి భిన్నంగా జరిగితే తల్లిదండ్రులనూ, సంరక్షకులనూ బాధ్యులు చేస్తారు. బ్రిటన్ ప్రధాని సోదరుడు అతి వేగంగా కారు నడిపినందుకు గాను రెండు సంవత్సరాల జైలు శిక్షకు గురయ్యాడు. పదేపదే సింగపూర్, జపాన్, చైనా అంటూ జపం చేస్తున్న బాబు ఆ దేశాల చట్టాలు కూడా పై విధంగానే అమలు జరుగుతాయనేది తెలిసి కూడా నటించడం సమంజసం కాదు. చట్టాల ఎదుట, న్యాయస్థానాల వద్ద, విచారణా సంస్థల ముందు అందరూ సమానులేనన్న విషయాన్ని విస్మరిస్తే వ్యవస్థలు కుప్పకూలుతాయి అన్నది నగ్న సత్యం.

ఈ కేసులో మరో అంశం గవర్నర్ పాత్ర. గవర్నర్ నరసింహన్ స్పందనా రహితంగా ఉన్నారని తెలుగుదేశం రెండు రాష్ట్రాల నాయకులు ఏకస్వరం అందుకున్నారు. ఎపి మంత్రి ఒకరు గవర్నర్‌ను గంగిరెద్దు అంటే, మరొకరు ధృతరాష్ట్రుడు అన్నారు. నిజంగా ఆయన ధృతరాష్ట్ర పాత్ర పోషించారా? రెండు రాష్ట్రాలలో జరిగే సంఘటనల పట్ల ఆయన చూస్తూ ఊరుకున్నారా? సమస్యలు గాలికొదిలి గుళ్ల చుట్టూ తిరుగుతూ గుండుకొట్టించుకున్నాడని కూడా వ్యాఖ్యానించారు. ఆరోపణల్లో కొంత నిజముందేమో అనిపిస్తుంది. ఎందుకంటే ఓటుకు కోట్ల సంఘటనపై గానీ, ఫోన్ ట్యాపింగ్ విషయంలో గానీ ఆయన పెదవి విప్పిన సందర్భం లేదు. పైగా ఈ సంఘటనలపై ఢిల్లీ పాలకుల పిలుపందుకుని అక్కడకు వెళ్లినప్పుడు కూడా విలేఖరులు గుచ్చి గుచ్చి అడిగినా ఆయన స్వరం పెగల లేదు. తెలంగాణ ప్రభుత్వం ఆంధ్ర పాలకుల ఫోన్లు ట్యాపింగ్ చేసిందని ఎపిలో 86 కేసులు నమోదయ్యాయి. అదే విధంగా చంద్రబాబు తెలంగాణలో పాలనలో ఉన్న టిఆర్ఎస్ ప్రభుత్వాన్ని కూల్చి వేస్తానని బెదిరించాడని తెలంగాణ రాష్ట్రంలో కేసులు నమోదయ్యాయి. వాస్తవానికి ఈ రెండు సందర్భాలు విశ్లేషించుకుంటే తెలంగాణ పరిధిలో ట్యాపింగ్‌పై చేసిన నేరారోపణ కేసులు తెలంగాణలోనే రిజిష్టరు చేయాల్సి ఉంది. అదే విధంగా విజయవాడలో బాబు చేసిన హెచ్చరికపై ఎపిలో కేసులు పెట్టాల్సి ఉంది. అయితే పరస్పర విరుద్ధంగా జరిగినట్లు అర్థమవుతుంది. ఇట్లా జరుగుతుంటే గవర్నర్ నిరాపేక్షంగా నిమ్మకు నీరెత్తినట్లు వ్యవహరించారని చెప్పవచ్చు. మరో సంఘటనను విశ్లేషించుకున్నా గవర్నర్ పాత్ర అభ్యంతర కరంగా ఉంటుంది. టిడిపి ఎంఎల్ఏ తలసాని శ్రీనివాస్ యాదవ్‌ను తెలంగాణ ప్రభుత్వంలోకి తీసుకుని మంత్రి పదవి ఇచ్చారు కెసిఆర్. తలసాని తన ఎంఎల్ఏ పదవికి రాజీనామా చేసి స్పీకర్‌కు పంపారు. ఈ పూర్వ రంగంలో తలసానిని మంత్రిగా ప్రమాణ స్వీకారం చేయించిన గవర్నర్ ఆయన రాజీనామాను ఆమోదింపజేసుకుని రాజభవన్‌కు రావాలని సలహా ఇస్తే జంటిల్‌గా ఉండేది. బహుశా ఈ సలహా చట్టబద్ధమైనది కాకపోవచ్చు. అయితే రాజకీయాలలో ఒక నూతన సత్ సాంప్రదాయానికి శ్రీకారం చుట్టే ప్రయత్నంగా మారుతుంది. నిజంగా గవర్నర్ క్లిష్ట సమయాల్లో వేగంగా, ఖచ్చితమైన నిర్ణయాలు తీసుకోవడంలో మెతకగా ఉన్నాడనే నిందకు ఆయన తావిస్తున్నట్లు అగుపిస్తుంది.

*(రచయిత పల్నాడు రచయితల సంఘం అధ్యక్షులు)* వీ

# అభివృద్ధి పేరుతో గ్రీన్‌హంట్

***పాలకులు అభివృద్ధి పేరుతో ఆదివాసుల భూములను సామ్రాజ్యవాద, బహుళజాతి సంస్థలు కొల్లగొట్టడానికి అనుమతిస్తూ, దాన్ని వ్యతిరేకిస్తూ ఉద్యమిస్తున్న ప్రజలను తీవ్రంగా అణచివేస్తున్నారని అంటున్నారు* కొర్రజ్యోతి**

**2014** మేలో జరిగిన 16వ లోక్‌సభ ఎన్నికల్లో కేంద్రంలో బిజెపి, అవిభక్త ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో టిడిపి, తెలంగాణలో టిఆర్ఎస్ పార్టీలూ భారీ మెజారిటీతో అధికారంలోకి వచ్చాయి. అధికారం చేపట్టిన సంవత్సర కాలంలో రోజుకొక దేశ పర్యటన చేస్తున్నారు. ప్రధాని మేక్ ఇన్ ఇండియా, స్వచ్ఛ భారత్, మన్ కీ బాత్ (మనసులో మాట) మెగా సిటీలు, స్మార్ట్ నగరాల పేర్లతోనూ, చంద్రబాబు స్వర్ణాంధ్రప్రదేశ్, చంద్రశేఖర్‌రావు బంగారు తెలంగాణగా మార్చుతాం అంటూ గావు కేకలు వేస్తూ మనకు అరచేతిలో వైకుంఠం చూపిస్తున్నారు. వీరి విధానాలు ఎవరికి మేలు చేస్తాయో మనం తెలుసుకోవాల్సిన అవసరం ఉంది.

భారతదేశానికి వలస పేరుతో బ్రిటిష్ వాళ్లు ప్రవేశించి రెండు వందల సంవత్సరాలు దోపిడీ చేసి 1947 ఆగస్టు 15న అర్ధరాత్రి దేశాన్ని వదిలిపోతూ అధికారాన్ని ఈ దేశ పాలకుల చేతుల్లో పెట్టి పోయారు. దీన్నే మన పాలకులు స్వాతంత్ర్యం అంటున్నారు. మన దేశంలో ఎన్నికల ప్రక్రియ 1920లో మొదలై మొదటిసారి 1952లో సార్వత్రిక ఎన్నికలు జరిగిన నాటి నుండి నేటి వరకు రాజకీయాలకు ప్రజల మౌలిక సమస్యలకు ఎలాంటి సంబంధం లేకుండానే ఉంది. ఈ 67 సంవత్సరాల కాలంలో ప్రజల్లో ఎలాంటి మార్పు రాకపోగా మరింత కటిక దారిద్ర్యంలోకి నెట్టబడ్డారు. దేశంలో స్వాతంత్ర్యం అనేది వట్టి బూటకం. ఆనాడు దేశంలో నిజమైన స్వాతంత్ర్యం కోసం దేశవ్యాప్తంగా ఉద్యమిస్తున్న సమయం. బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా 1857 ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం నుండి దేశంలో బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా భగత్‌సింగ్, చంద్రశేఖర్ ఆజాద్ నాయకత్వాన జరుగుతున్న పోరాటాలు ప్రధానం. ఇవే కాకుండా దండకారణ్యంలో 1910లో కోయ భూమ్‌కాల్, 1914లో ఒడిసాలోని దసపల్లా నాయకత్వాన, చోటనాగ్‌పూర్‌లోని 1914లో ఒరావున్ ముండాల తిరుగుబాటు, మణిపూర్‌లో మయూర్‌బంజ్ సంతాల్ తిరుగుబాటు, 1917లో రాజస్థాన్‌లోని భిల్లులకు వ్యతిరేకంగా తిరుగుబాటు, 1922-24లో రంప చోడవరంలో అల్లూరి సీతారామరాజు తిరుగుబాటు, అదిలాబాద్‌లో కొమురం భీం నాయకత్వంలో 1940లో తిరుగుబాటు, వీరోచితమైన తెలంగాణ సాయుధ రైతాంగ తిరుగుబాటు, 1941-51 వరకు జరిగిన 3000 గ్రామాలను విముక్తి చేసి పది లక్షల ఎకరాల భూమి పంపకాలు జరిగాయి. తర్వాత నిజాం ప్రభుత్వం నెహ్రూ సైన్యానికి అప్పగించగా తెలంగాణ ప్రాంతాన్ని చుట్టుముట్టి వేల మంది కార్యకర్తలను, ప్రజలను కాల్చిచంపి ప్రజల వద్ద ఉన్న భూమిని మళ్లీ దొరల చేతికి అప్పగించారు. ఈ దాడిని (సమయాన్ని) సరిగ్గా అర్థం చేసుకొని నూతన ఎత్తుగడల్ని రూపొందించుకొనేది పోయి, నాయకత్వం, పోరాటానికి ద్రోహం చేసి పార్లమెంటరీ ప్రజాస్వామ్య ఎన్నికల వైపు వెళ్లారు. ప్రపంచ వ్యాప్తంగా రెండు దేశాలలో సోషలిస్టు శిబిరాలు ఏర్పడి ఉన్నాయి. కొన్ని దేశాలలో విప్లవాలు జరుగుతున్న సమయం. ఆ విప్లవాలను అడ్డుకోవడానికి సామ్రాజ్యవాదులు, దళారీ నిరంకుశ పెట్టుబడిదారీ వర్గం, నిరంకుశ భూస్వామ్య వర్గం కలగలిపి (అప్పటికీ మన దేశంలోని భూస్వామ్య సమాజ గర్భంలో పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందడం మొదలైంది) ప్రజల శ్రమశక్తిని దోచుకోవడం కోసం దేశంలోని బూర్జువా ప్రజాస్వామిక విప్లవం జరగకుండా అడ్డుకున్నారు. అందుకు ఈ రోజు నూతన ప్రజాస్వామిక విప్లవంతో పాటు జాతీయ విప్లవం కూడా జరగవలసిన అవసరం ఉంది.

ఇక దేశంలో నిజమైన స్వాతంత్ర్య ఉద్యమాలు జరుగుతుండగా, బ్రిటిష్ వలసవాదులు మన దేశంపైన తమ ప్రత్యక్ష పాలనను గత్యంతరం లేని స్థితిలో వదులుకున్నారు. తర్వాత సామ్రాజ్యవాద పెట్టుబడిని, ప్రయోజనాలను పరిరక్షించే షరతుపైన తమ దళారులైన బడా బూర్జువా వర్గానికి, బడా భూస్వాములకు అధికారాన్ని బదలాయించారు. మన దేశాన్ని పీడించి దోచుకునే విషయంలో బ్రిటిష్ సామ్రాజ్యవాదుల స్థానంలో పలు సామ్రాజ్యవాద శక్తులు ప్రవేశించాయి. అంతఃసారంలో బూటకమైనదైన, లాంఛన ప్రాయమైన స్వాతంత్ర్యం అనే సైను బోర్డు కింద సామ్రాజ్యవాద శక్తులే వాస్తవానికి భారత ఆర్థిక వ్యవస్థను, రాజకీయాలను, సంస్కృతిని నియంత్రిస్తూ, భారత పాలకవర్గాల కీలక విధానాలను నిర్ణయిస్తున్నాయి.

మన దేశంలో కానీ, ప్రపంచంలో కానీ అత్యంత సంపన్నుల చేతుల్లోనే సంపద అంతా దాగి ఉంది. వంద కోట్ల మంది ప్రజలు ఆకలితో అలమటిస్తున్నారు. ప్రపంచ వ్యాప్తంగా కేవలం 85 మంది అపర కుబేరుల చేతుల్లోనే అపార సంపద పోగుపడి ఉంది. నిరుపేదలు 300 కోట్లకు పైగానే ఉన్నారు. 2008లో 1.29 బిలియన్‌ల ప్రజలు పేదరికంలో ఉన్నట్లు ప్రపంచ బ్యాంక్ అంచనా వేసింది. వీరిలో 400 మిలియన్‌ల ప్రజలు భారత్‌లోను, 173 మిలియన్‌ల ప్రజలు చైనాలోను దారిద్ర్య లేఖకు దిగువన నివసిస్తున్నారు. ఒక్క మన భారతదేశంలోనే 688 కుటుంబాల చేతిలోనే దేశ సంపదలో 98 శాతానికి పైగానే ఉంది. 250 బిలియన్ డాలర్ల సంపద ఒక డజన్ మంది చేతుల్లోనే కేంద్రీకృతమై ఉంది అంటే రాజ్యం, పెట్టుబడిదారీ వర్గం, అభివృద్ధి నిరోధక భూస్వామ్య వర్గం, సామ్రాజ్యవాద వర్గాలు కలగలిసిన మిలాఖత్ లేని చోటు అంటూ ఉండదు. వీరి ఆర్థిక ఆధిపత్య ప్రయోజనాల కోసం పీడిత ప్రజలపై యుద్ధం చేస్తారు. వీరి ఆధిపత్య దోపిడీ రూపాలకు వ్యతిరేకంగా దేశంలో అనేక రూపాల్లో పోరాటాలు జరుగుతున్నాయి.

ఈనాటికి కూడ దేశంలో దోపిడీకి వ్యతిరేకంగా ఉద్యమిస్తున్నారు. ఈ దోపిడీ నిర్మూలన కోసం 1967లో చారుమజుందార్ నాయకత్వాన నగ్జల్‌బరీ నిప్పు రవ్వ మొదలై 1978 జగిత్యాల ఉద్యమం దేశవ్యాప్తంగా విస్తరించింది. ఈ పోరాటాన్ని అణిచిపెట్టడానికి పాలకులు తీవ్రమైన ప్రయత్నాలు చేశారు. దేశంలో కానీ ప్రపంచంలోకానీ న్యాయమైన పోరాటాలను అణచడం అసాధ్యం అనేది రుజువయింది.

ఈ న్యాయమైన పోరాటాలను అణచడానికి అమెరికా సామ్రాజ్యవాదులు 1980లో ఎల్ఐసి (తక్కువ తీవ్రతతో కూడుకున్న యుద్ధం) బహుముఖ దాడిని సామ, బేధ, భావ, దండోపాయం లేద కర్రకందా (ఒక చేత్తో మిఠాయి, మరో చేత్తో కర్ర) రూపొందించి అమలు చేస్తున్నారు. ముఖ్యంగా మన దేశంలో 1991లో ఎల్‌పిజి విధానాలు వచ్చిన తర్వాత (సామ్రాజ్యవాద అనుకూల విధానాలు) విప్లవ పార్టీలను అణచడానికి తీవ్రమైన ప్రయత్నాలు చేస్తూ వస్తున్నారు. మావోయిస్టు పార్టీ దేశానికే ప్రమాదకారి అంటూ దేశ ప్రధాని 2005లోనే తన ఆందోళనను వ్యక్తపరిచాడు. దేశ అభివృద్ధిని అడ్డుకుంటుందని మన పాలకులు అంటున్నారు. అసలు వాస్తవానికి దేశానికి ప్రమాదకారి ఎవరు?

2008లో ఆర్థిక ద్రవ్య సంక్షోభం 1930 నాటి సంక్షోభాన్ని తలదన్నే విధంగా ఉంది. ఈ సంక్షోభం నుండి బయటపడి గట్టెక్కాలని మన దేశ పాలకులు తీవ్రంగా ప్రయత్నాలు చేస్తున్నారు. దేశంలో ఉన్న ఖనిజాల్ని సామ్రాజ్యవాదులకు దోచిపెట్టడానికి మన దేశ పాలకులు ఆదివాసీ ప్రాంతాల్లో ఉన్న గనులను వెలికితీయడానికి తీవ్రంగా ప్రయత్నాలు చేస్తున్నారు. ఆదివాసీ ప్రాంతాల్లో గనుల స్థాపన రాజ్యాంగంలోని 244 షెడ్యూల్ ప్రకారం ఆదివాసీ ప్రయోజనాలకు వ్యతిరేకమైంది. మరీ ముఖ్యంగా భారత రాజ్యాంగ 5వ, 6వ షెడ్యూల్ ప్రకారం 1996లో 73 రాజ్యాంగ సవరణ ద్వారా సంకల్పించిన పంచాయితీరాజ్ షెడ్యూల్డ్ ప్రాంతాల విస్తరణ చట్టాన్ని (పెసా) అటవీ హక్కుల చట్టం 2006 ప్రకారం ఆదివాసీలు నివసించే ప్రాంతాల్లో సామాజిక, ఆర్థిక, అభివృద్ధి కార్యక్రమాలను చేపట్టాలన్న పథకాలు కార్యక్రమాలు ప్రాజెక్టులకు అనుమతులను మంజూరు చేయాలన్నా గ్రామసభల అనుమతి ఉండాలి. కానీ మన పాలకులు ఇత్యాది విషయాలను నిరాకరిస్తూ, ఆదివాసీలు నివసిస్తున్న ప్రాంతాలను ధ్వంసం చేసి సామ్రాజ్యవాదుల ప్రయోజనాల్ని కాపాడడానికి ప్రయత్నాలు ముమ్మరంగా చేస్తున్నారు. ఆదివాసీ పీడిత ప్రజానీకానికి అండగా ఉంటూ అడవిపై హక్కు ఆదివాసీలది, పీడిత ప్రజలదే అంటూ ఖనిజ తవ్వకాలను అడ్డుకుంటున్న మావోయిస్టు పార్టీనేమో అభివృద్ధి నిరోధకులైనారు. పిడికెడు మంది స్వార్థం కోసం లక్షల మందిని నిర్వాసితులుగా మార్చుతున్న వారు అభివృద్ధి ఛాంపియన్స్ అయ్యారు. 5 శాతం మంది కోసం హింస సృష్టిస్తున్న పాలకులు అహింసావాదులైనారు. 95 శాతం మంది ప్రజల ప్రయోజనాల్ని కాపాడడానికి ప్రతిహింస చేస్తున్న మావోయిస్టు పార్టీ హింసాయుతమయింది.

మరీ ముఖ్యంగా 2009లో దేశవ్యాప్తంగా ఆపరేషన్ గ్రీన్‌హంట్ దాడిని ప్రారంభించి వందలాది మందిని కాంగ్రెస్ ప్రభుత్వం కాల్చి చంపింది. కాంగ్రెస్ ప్రభుత్వం దేశంలో సామ్రాజ్యవాదుల ప్రయోజనాలను బలంగా అమలు చేయడంలో వెనక పడి ఉండడంతో సామ్రాజ్యవాదుల విధానాలను బలంగా అమలు చేయగలిగే పార్టీ అవసరం ఏర్పడింది.

అది కూడ దేశంలో ఏకైక పార్టీ అవసరం అనేదానితో తమ ప్రయోజనాలు సాఫీగా నెరవేరుతాయని కోరుకొనే కార్పొరేట్ సంస్థలు సంఘపరివార్, మీడియా బిజెపిని కేంద్రంలో, రాష్ట్రంలో (అవిభక్త ఆంధ్రప్రదేశ్‌లో) టిడిపి, టిఆర్‌ఎస్‌లను అధికారంలోకి తెచ్చాయి. ముఖ్యంగా దేశంలో నరేంద్ర మోడీ అవతార పురుషుడుగా, సమర్థవంతమైన నాయకుడుగా, కార్పొరేట్ మీడియా సంస్థలు ప్రచారం చేపట్టాయి. దేశంలో, రాష్ట్రంలో కాంగ్రెస్ ప్రభుత్వం పట్ల అవినీతి కుంభకోణాల ద్వారా దేశ ప్రజల్లో తీవ్రమైన వ్యతిరేకత మొదలైంది. దీనికి తోడు కేంద్రంలో కానీ (రాష్ట్రంలో కానీ) బలమైన పార్టీ అనేది లేకపోవడం ద్వారా నరేంద్రమోడీకి కలిసివచ్చిన అవకాశమే తప్ప బిజెపి అధికారంలోకి వస్తే ప్రజల ప్రయోజనాల్ని కాపాడుతుంది అని మాత్రం కాదు. ఆ నమ్మకం ఏనాడో పోయింది ప్రజలకు. కేంద్రంలో ప్రత్యామ్నాయ పార్టీ ఉండి ఉంటే నరేంద్రమోడీ అధికారంలోకి వచ్చేవాడు కాదు.

కేంద్రంలో, రాష్ట్రంలో బిజెపి, టిడిపి, టిఆర్‌ఎస్ పార్టీలు అధికారం చేపట్టి సంవత్సరం తిరగకమునుపే దేశ దేశాలు తిరిగి సామ్రాజ్యవాదులను మన దేశానికి రావల్సిందిగా పిలుపునిస్తున్నారు. 'మా దేశానికి రండి, పెట్టుబడులు పెట్టండి' అంటూ విదేశీ సామ్రాజ్యవాదులకు స్వాగతం పలుకుతున్నారు. మన ప్రధాని పది నెలల కాలంలో 19 దేశాలు తిరిగాడు. చంద్రబాబు చైనా పర్యటన చేసి చాక్లెట్లు కొనుక్కునే తీరిక లేక రెండు కేజీలు తగ్గాడంట. మన కోసం, మన రాష్ట్రం కోసం 29 ఒప్పందాలు చేసుకొచ్చాడు. వీటిలో ఇరు ప్రభుత్వాల మధ్య 8, ప్రభుత్వానికి వ్యాపార సంస్థలకు మధ్య 10, ఇరు దేశాల వ్యాపారస్తుల మధ్య 11 కుదుర్చుకున్నారు. కెనడా ప్రభుత్వం తాను 160 మిలియన్ కెనడా డాలర్లు (దాదాపు 8200 కోట్ల రూపాయలు) ఒప్పందాలు చేసుకున్నాడు. తమ బడ్జెట్‌లో ప్రతిపాదించిన 22,000 కోట్ల రూపాయల అప్పుతో రాష్ట్రం అప్పుల కుప్పగా మారనుంది. రాష్ట్ర అప్పు లక్షా నలభై ఆరు వేల కోట్లకు చేరనుంది. మరో పక్కన దేశంలో ఉన్న రక్షణ రంగం, బీమా రంగం, రైల్వే రంగం, భారీ ప్రాజెక్టులు, రోడ్లతో సహా ప్రైవేట్ పరం చేస్తున్నారు. అధికారంలోకి వస్తే వంద రోజుల్లో నల్లధనాన్ని దేశానికి రప్పిస్తానన్న బిజెపి దాని ఊసే లేదు. చంద్రబాబు రైతు సంక్షేమమే మా సంక్షేమం, దేశానికి రైతు వెన్నుముక అంటూనే రాజధాని పేరుతో 30,000 వేల ఎకరాల భూమి సరిపడక మరో 500-600 ఎకరాల వరకు భూమిని అప్పగించాలంటూ మునిసిపల్ శాఖ మంత్రి నారాయణ మాట్లాడుతున్నాడు. లేదా ప్రభుత్వం పని ప్రభుత్వం చేసుకుపోతుంది అంటాడు. భూమిని ఇవ్వం అని ప్రజలు మొర్రో అంటూంటే ప్రభుత్వం కోర్టులో డిపాజిట్ చేస్తేనే స్వాధీనం చేసుకుంటాం అంటూ రైతుల్ని బెదిరిస్తున్నారు. ఇది సరిపడక ప్రపంచంలో ఎక్కడ లేని విధంగా విజయనగరం జిల్లా బోగపురం ప్రాంతంలో విమానాశ్రయం కోసం 15,200 ఎకరాల భూమి కావాలి అంటు రైతుల్ని బలవంతం చేస్తున్నారు. బోగపురం రైతులు ఆందోళన చేయగా ఇప్పుడు మాట మార్చి 6000 ఎకరాలు సరిపోతుంది అంటూ ప్రకటిస్తున్నారు. భూమి లేకుండా మేము జీవించలేం అంటూ ఆ ప్రాంత రైతులు ఆందోళన చేసినా ప్రభుత్వం పెడచెవిన పెడుతున్నది. మరో పక్కన విశాఖ మన్యంలో బాక్సైట్ గనుల కోసం రంగం సిద్ధం చేసుకుంటోంది. ఆ ప్రాంత ఆదివాసీలు 15 సంవత్సరాల నుండి బాక్సైట్ తవ్వకాలను

తీవ్రంగా వ్యతిరేకిస్తున్నారు. అయినా ప్రభుత్వానికి చీమకుట్టినట్లుగా కూడా లేదు. రాష్ట్ర పంచాయితీరాజ్ శాఖ మంత్రి అయ్యన్నపాత్రుడు బాక్సైట్ తవ్వకాలు జరిగితేనే అభివృద్ధి అని బహిరంగంగానే మాట్లాడుతున్నాడు. ప్రతిపక్షంలో ఉన్నప్పుడు బాక్సైట్‌ను వ్యతిరేకించిన టిడిపి మాట మార్చింది.

అభివృద్ధి అంటేనే భారీ ప్రాజెక్టులు, గనులు, రాజధానులు, విమానాశ్రయాలు, సెజ్‌లు, రియల్ ఎస్టేట్, వ్యాపారం, రింగు రోడ్లు, పలు సంరక్షణ కేంద్రాలు అంటూ మన పాలకులు నమ్మపలికిస్తున్నారు. ఈ యాభై సంవత్సరాల అభివృద్ధిలో భారీ ప్రాజెక్టుల ద్వారా ఐదు కోట్ల మందికి పైగానే నిర్వాసితులైనారు. పోలవరం ప్రాజెక్టు ద్వారానే ఏడు మండలాల పరిధిలో 277 గ్రామాలు, 11,17,034 మంది వివిధ తెగలకు చెందిన గిరిజనులు నిర్వాసితులవుతారు. 2011 జనాభా లెక్కల ప్రకారం 4.30 కోట్ల కుటుంబాలు ఆస్తులంటూ ఏమీ లేకుండా జీవనం సాగిస్తున్నారు. ఒక్క కుటుంబంలో ఐదుగురు సభ్యులు ఉన్నారని అనుకున్నా అసలేమీ ఆదాయం లేకుండా జీవనం సాగిస్తున్నారు. ఇది జర్మనీ దేశ జనాభాతో సమానం.

మన దేశంలో 10.43 కోట్ల గిరిజనులు ఉన్నారు. ఇది దేశ జనాభాలో 8.6 శాతం. వీరందరూ సామాజిక హక్కులైన విద్య, వసతి, వైద్యం, భూమి ప్రభుత్వ పథకాలు వంటి వాటికి ఆమడ దూరంలో ఉన్నారు. 40 శాతం పైగా అడవి బిడ్డలు నిరాక్షరాస్యులుగా ఉన్నారు. వాస్తవానికి ఇది జాతీయ సగటు కన్నా 13 శాతం ఎక్కువగానే ఉంటుంది. భారతదేశంలో 20.10 కోట్ల మంది దళితులు, 10.4 కోట్ల మంది గిరిజనులు జీవనం సాగిస్తుండగా, వీరిలో ఆదివాసీలు విద్య విషయంలో నేటికీ అట్టడుగున ఉన్నారు. ఇలాంటి మౌలికమైన సమస్యలను పక్కన పెట్టి, భారీ ప్రాజెక్టులు, రింగ్‌రోడ్లు, విమానాశ్రయాలు, సెజ్‌లు, రియల్ ఎస్టేట్, రాజధానులు, గనుల తవ్వకాలు, సంరక్షణ కేంద్రాలు ఉంటేనే అభివృద్ధి అని చెప్పడం పచ్చి మోసం. లేదా ప్రజల మౌలికమైన సమస్యల నుండి పక్కదారి మళ్లించడమే. ఈ మౌలికమైన సమస్యలను పక్కనపెట్టి బిజెపి నాయకులు ప్రజల మధ్యన మతఘర్షణలకు ఆజ్యం పోస్తున్నారు.

రాజ్యాంగం ఆర్టికల్ 15 ఏమి చెప్పింది చూద్దాం. 1) ప్రభుత్వం ఏ పౌరునికి కేవలం మత, జాతి, కుల, లింగ భేదం లేదా జన్మస్థాన కారణాలను బట్టి వాటిలో దేనినైనను బట్టి వివక్షత చూపరాదు అని స్పష్టంగా పేర్కొంది. కానీ మన పాలకులు చేస్తుంది ఏమిటి? వారు ప్రమాణ స్వీకారంలో భారత దేశ సార్వభౌమత్వాన్ని కాపాడుతామని అంటారు. కాని చేస్తుంది ఏమిటీ అంటే ప్రజల మధ్యన మతఘర్షణలు సృష్టిస్తున్నారు.

పార్లమెంట్ సభ్యుడు సాక్షి మహరాజ్, ముస్లిం బాలల కోసం నిర్వహించే మదర్‌సాలలో పిల్లలకు తీవ్రవాదం పాఠాలు బోధిస్తున్నారని, ఆ విధంగా అవి ఉగ్రవాదాన్ని తయారు చేస్తున్న కర్మాగారాలని పార్లమెంట్‌లో బహిరంగంగానే మాట్లాడుతున్నాడు. ఆర్‌ఎస్‌ఎస్ నేత దత్తాత్రేయ హోస్బలే మాట్లాడుతూ పుట్టుకతోనే భారతీయులు అంతా హిందువులు, దేశంలో మైనారిటీలు లేరు అంటాడు.

మన రాజ్యాంగాన్ని, చట్టాలను ఉల్లంఘిస్తూ మాట్లాడుతున్న వారిపై చర్యలు ఏమి తీసుకున్నట్లు? మన ప్రధాని ఈ మధ్య మాట్లాడుతూ కుబేరుడికైనా, గరీబోడికైనా ఒకటే రూల్స్ అన్నాడు. మరి దేశంలోని అసోసియేషన్ ఆఫ్ డెమోక్రటిక్ రిఫోర్మ్స్ వెలువరించిన ఒక నివేదిక ప్రకారం 543 మంది ఎంపిల్లో 186 మంది క్రిమినల్ కేసుల్లోను, పది మంది దొంగతనం కేసుల్లోను, 17 మంది హత్య కేసుల్లోను, 200 మంది అత్యాచారం కేసుల్లోను, 16 మంది మతకల్లోలాల కేసుల్లోను, ఏడుగురు కిడ్నాప్ కేసుల్లోను ఉన్నారు. ఇందులో బిజెపి ఎంపిలే ఎక్కువగా ఉన్నారు. వీరిపైన ఏ రూల్స్ , ఏ చట్ట ప్రకారం చర్యలు తీసుకున్నారో? అంతెందుకు నిన్నగాక మొన్న (ఏప్రిల్ 9న) అవిభక్త ఆంధ్రప్రదేశ్‌లో 25 మంది కూలీలను కాల్చి చంపిన పోలీసు అధికారులపై కానీ, ఆ మంత్రివర్గంపై కానీ ఏ చట్టం ప్రకారం కేసు నమోదు చేసారు?

తమ న్యాయమైన హక్కులను అమలు చేయమని అడిగిన ప్రజలు తీవ్రవాదులుగా, ఉగ్రవాదులుగా, టెర్రరిస్టులుగా కనిపిస్తారు. రాజ్యాంగాన్ని, చట్టాలను ఉల్లంఘిస్తూ మీ స్వార్థం కోసం దేశ సంపదను దోచుకొని విదేశాల్లో ఆస్తులు పోగేస్తూ, దేశ ప్రజల్ని నిరాశ్రయులుగా మార్చుతున్న మీరు దేశానికే అధినాయకులై ఉన్నారు. ఇదేనా చట్టం, రూల్స్ అంటే? అభివృద్ధి అంటే ఇదేనా? మీరు చేస్తున్న విధానాలు కార్పొరేట్ సంస్థలకు, విదేశీ సామ్రాజ్యవాదులకు ఆదివాసీ పీడిత ప్రజల్ని అప్పగించి మీరు మాత్రం విదేశీ ప్రయాణాలు (పలాయనాలు) ముందుగానే చేస్తారు. ఆదివాసీ జీవితాలను వారి పిల్లల భవిష్యత్‌ను సామ్రాజ్యవాద పెట్టుబడిదారీ బహుళజాతి కంపెనీలకు బలిచేస్తున్నారు. ఇప్పుడు కానీ ఆదివాసీలు అంతా తమ భవిష్యత్‌ను కాపాడుకోవడానికి సిద్ధం కాకుంటే మన దేశ పాలకులు మళ్లీ బానిస సమాజాన్ని తలపించే విధంగా చేస్తారు.

దేశంలో, రాష్ట్రంలో అభివృద్ధి అభివృద్ధి అంటూ మన పాలకులు పాడిందే పాటగా గోరంతల్ని కొండంతలుగా చేసి చూపిస్తున్నారు. వీరి అభివృద్ధి మాట ఎంత అనేది చిన్న ఉదాహరణలో చూద్దాం. గ్రామీణ భారతం నుండి ఢిల్లీ అక్రమంగా వసూలు చేస్తుంది వెయ్యి రూపాయలు. అందులో నుంచి 900 వారి అల్కాపురిలకు ఉంచుకొని మిగిలిన 100 రూపాయలు గ్రామీణ అభివృద్ధి కోసం పంపుతుంది. 100 నుంచి 85 రూపాయలు దొంగలించబడగా (అవినీతి జరగగా) 15 రూపాయలు మాత్రమే గ్రామీణాభివృద్ధి కోసం గమ్యం చేరుతుంది. దీన్నే మన పాలకులు అభివృద్ధి అంటారు.

మరో ఉదాహరణలో చూద్దాం. 2011 లెక్కల ప్రకారం పార్లమెంట్ సభ్యుడి నెల జీతం లక్ష రూపాయలు. ప్రత్యేక అలవెన్స్ కింద 25 వేలు, నియోజకవర్గ పరిధిలో ప్రచారంలో పాల్గొంటే రోజుకు 20 వేలు, పార్లమెంట్ సమావేశాలకు హాజరు అయితే రోజుకు 1000 రూపాయలు, టీ, టిఫిన్, భోజనం ఉచితం. రైల్, విమానం, హెలికాప్టర్, బస్సు ప్రయాణాలు ఉచితం. వైద్యం, కరెంట్ సదుపాయం ఉచితం. కాలంచేస్తే నెల పించన్ 50 వేలు అందుతుంది. ఇది మన పాలకుల అభివృద్ధి మాటా? దీని కోసం మన పాలకులు గావుకేకలు వేస్తున్నారు.

వాస్తవానికి దేశంలో జరుగుతున్న పార్లమెంటరీ ప్రజాస్వామ్య ఎన్నికలు అనేవి పిడికెడు మంది స్వార్థం కోసమే. వీరి స్వార్థ ప్రయోజనాల కోసం మనం జీవిస్తున్న నేలతల్లిని ఖనిజాల కోసం, భూమిని బద్దలు కొడుతూ, భూకంపాలు సృష్టిస్తూ భూకంపాలకు మనల్ని బలిచేస్తున్నారు. మన నేలతల్లిని కాపాడుకోవడానికి జల్-జంగల్-జమీన్-ఇజ్జత్ కోసం మూడు దశాబ్దాలుగా ఉద్యమిస్తున్నా మన న్యాయమైన పోరాటాలను అణిచివేయడానికి ఆపరేషన్ గ్రీన్‌హంట్ దాడిని, తీవ్రతరం చేస్తున్నారు. కేంద్రంలో బిజెపి, రాష్ట్రంలో టిడిపి అధికారం చేపట్టిన సంవత్సర

# రాజ్యాంగ యంత్రం వర్గాతీతమా?

*ఇటీవలి కాలంలో కొందరు మేధావులలో రాజ్యాంగ యంత్ర స్వభావం గురించి వ్యక్తమవుతున్న తప్పుడు ఆలోచనలను విశ్లేషిస్తున్నారు* **మాదిరాజు రాంబాబు**

**పా**లితులు, పాలకులుగా విభజితమై ఉన్న ఈ నాగరిక సమాజంలో ప్రతిదీ ద్విముఖమై ఉంటుంది. విలువలు, న్యాయం – ధర్మం, చట్టాలు, నియమాలు, వ్యవస్థలు, సంస్థలు అన్నీ ద్విముఖమైనవే. సమాజంలోని పరస్పర విరుద్ధ ప్రయోజనాలతో ఉన్న సమూహాలతో వ్యవహరిస్తున్న రాజ్యాంగ/రాజ్యాంగేతర సంస్థలూ, వ్యవస్థలన్నీ నిష్పాక్షిక పక్షపాతంతో కొనసాగుతుండడం కద్దు. సమాజంలో కొనసాగుతున్న అసమానతలు చెక్కు చెదరకుండా సమాజంలోని వివిధ వర్గాల మధ్య యథాస్థితిని, శాంతిని కొనసాగించే సాధనంగా రూపొందించిన చట్టం కూడా ద్విముఖమైనదే. చట్టం ముందు అందరూ సమానులే (రూల్ ఆఫ్ లా) అనేది దృగంశం (పైకి కనిపించే) మాత్రమే. సమాజంలోని వర్గ స్థితిని బట్టి, సామాజికార్థిక అసమానతలను ప్రశ్నిస్తున్న వైఖరిని బట్టి న్యాయం, చట్టం అనుకూలంగా అందుబాటులోకి వస్తుంటాయి. ఉనికిలో ఉన్న అసమాన సామాజికార్థిక వ్యవస్థను పక్షపాతరహితంగా కాపాడేందుకు ఏర్పడిన చట్టం తన పని తాను చేసుకుపోతుందనడంలో ఎవరికీ సందేహం ఉండనక్కరలేదు. నోటుకు ఓటు కేసులో అరెస్టయి, నెల రోజుల జైలు జీవితం గడిపి బెయిల్‌పై విడుదలయిన తెలంగాణ టిడిపి నేత రేవంత్‌రెడ్డి ఉదంతమైనా, పద్నాలుగు నెలల ఖైదు తరువాత మూడు నెలల తాత్కాలిక స్వేచ్ఛ పొందిన మావోయిస్టుగా నేరారోపణను ఎదుర్కొంటున్న జి.ఎన్. సాయిబాబా ఉదంతమైనా న్యాయ వ్యవస్థ నిష్పాక్షిక పక్షపాతానికి సజీవ సాక్ష్యాలుగా నిలుస్తాయి.

పౌరహక్కుల ఉద్యమంతో అప్రతిష్ఠ పాలైన రాజ్యం ప్రోత్సాహంతో కోబ్రా, నల్లదండు మూకల చేతిలో కిడ్నాప్‌కు గురైన బాలగోపాల్ ప్రాణ భయంతో విప్లవోద్యమాన్ని విమర్శిస్తూ, మార్క్సిజంలో ఖాళీలున్నాయంటూ ప్రచారం చేస్తున్నారని అప్పట్లో కొందరు బలంగా వాదించారు. కాకతాళీయమే అయినా, సందర్భాన్ని బట్టి అలాంటి అపోహలు కలగొచ్చు. అయితే అంతకు ముందు చాలా కాలం క్రితమే 1980లలో సృజనలో పరంపరగా వచ్చిన బాలగోపాల్ వ్యాసాలపై 'బాలగోపాల్ అవగాహన మార్క్సిజం కాదని, ఆయన ట్రాట్స్కీయిస్టు తాత్విక పునాదితో ఆలోచిస్తున్నార'ని అప్పటి విరసం ప్రముఖులు త్రిపురనేని మధుసూధన రావు వ్యాఖ్యానించారు. ప్రజా ఉద్యమాలపై ప్రభుత్వం ఉక్కు పాదాన్ని ప్రశ్నిస్తున్న పౌర హక్కుల ఉద్యమంలో కీలక పాత్ర పోషించిన బాలగోపాల్ రచనల్ని మార్క్సిస్టు తాత్వికతతో చేసిన రచనలుగా తెలుగు మేధావులు, ప్రజలు ఆమోదించారు. నిజాయితీతో కూడిన కార్యాచరణ ఆయన్ని ఒక విలక్షణ మార్క్సిస్టు చింతనాపరుడుగా తెలుగునాట నిలిపింది. అదే సమయంలో వివిధ వామపక్ష పార్టీల, ప్రజా సంఘాల ఉద్యమాలతో క్రియాశీలంగా ఉన్న తెలుగు సామాజిక వాతావరణంలో, మార్క్సిజం అధ్యయన క్రమంలో తన అవగాహనలో ఏర్పడిన ఖాళీలను బాలగోపాల్ ఎన్నడూ సూటిగా బయట పెట్టలేదు. దానికితోడు ఆయన మార్క్సిస్టు తాత్విక అజీర్తిని ఎవరూ ప్రశ్నించనూ లేదు.

ఇది మరీ విస్తరించి కిడ్నాప్ ఉదంతం అనంతరం రాగో నవలకు ముందుమాటలో ఆయన ఎంతో కొంత స్పష్టంగా బహిర్గతమయ్యారు. అప్పటికే తెలుగునాట క్రియాశీల వామపక్ష ఉద్యమాల జోరు బాగా తగ్గిపోయి, రాష్ట్రంలో, ముఖ్యంగా తెలంగాణలోని వివిధ అస్తిత్వవాద ఉద్యమాలు, ఫలిత ప్రాధాన్యతవాద తాత్విక స్రవంతి అయిన పోస్ట్ మాడర్నిజం దృక్పథంలో ప్రబలమయ్యాయి. ఈ నేపథ్యంలో బాలగోపాల్ తనలోని తాత్విక గందరగోళాన్ని మార్క్సిజానికి ఆపాదించారు. తన అవగాహన లోని రిక్తాలను సమాజంలో కొత్తగా ప్రబలుతున్న 'ఫలిత ప్రాధాన్యతావాద' తాత్విక వ్యక్తీకరణగా వచ్చిన పోస్ట్ మాడర్నిజంతో

---

కాలం తిరిగి రాకమునుపే ప్రజా పోరాటాలను రక్తపుటేరుల్లో ముంచుతున్నారు. ఆంధ్ర ఒడిసా బార్డర్‌లో ఈ పది నెలల కాలంలోనే పదికి పైగా ఆపరేషన్స్ చేసుకొని గ్రామాలపై తోడేలు గుంపు మేకల మందపై పడ్డట్టు పడి విధ్వంసాలు సృష్టిస్తున్నారు. జనవరి మొదటి వారంలో ఆలవుట్ పేరుతో వేల మంది బలగాలు మొహరించి బలిమెల డ్యాంపై ఓడలో ప్రయాణం చేస్తున్న నారింజ గ్రామస్తులపై విచక్షణా రహితంగా కాల్పులు జరపగా ఒక గిరిజనుడు ప్రాణాలు కోల్పోగా ఇద్దరు తీవ్రంగా గాయపడ్డారు.

ఈ మధ్యకాలంలో (మే 13న) డి.ఆర్. డిపోకు వెళ్లి తిరిగి వస్తున్న చెరుకుంపాక గ్రామస్తులపై కాల్పులు జరపగా ప్రాణాపాయం నుండి బయటపడ్డారు. మరో దగ్గర మే 27న అడవికి వెళ్లిన పోకపాలెం గ్రామ మహిళలపైన కాల్పులు జరపగా ప్రాణాపాయం నుండి బయటపడ్డారు.

దేశంలో, రాష్ట్రంలో మరీ ముఖ్యంగా బాక్సైట్ ఉద్యమానికి అండగా ఉంటున్న గిరిజనుల్ని భయభ్రాంతులకు గురిచేయడానికి మన పాలకులు తీవ్రంగా అణిచివేయ ప్రయత్నం చేస్తున్నారు. అడవిని ధ్వంసం చేయడానికి సామ్రాజ్యవాదులకు దేశ తలుపులను బార్లా తెరిచారు. మరోపక్కన దీన్నే అభివృద్ధి అంటూ మనల్ని నమ్మపలికిస్తున్నారు. సామ్రాజ్యవాదుల కబంద హస్తాల నుంచి మన దేశాన్ని రక్షించుకోవడానికి ప్రజా ఉద్యమాలను కాపాడుకుంటూనే, దేశంలో నిజమైన సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటానికి భగత్‌సింగ్, కొమురంభీం, మన్యం వీరుడు అల్లూరి సీతారామరాజు స్ఫూర్తిని కొనసాగించండి.

*(రచయిత ఆదివాసి మహిళా సంఘం సభ్యులు)* వీ

పూరించేందుకు ఆయన ప్రయత్నించారు. ఈ క్రమంలో పోస్ట్ మాడర్నిజం అనేది ఒక తాత్విక ధోరణి కాదని, అందుకు భిన్నంగా ఉనికిలో ఉన్న ఘనీభవించిన ప్రతి అంశాన్ని ప్రశ్నించే జ్ఞాన సిద్ధాంతమని ఆయన సూత్రీకరించారు. ప్రాపంచిక దృక్పథం, పరిశీలనా పద్ధతి, జ్ఞాన సిద్ధాంతం, భావజాలం అనే నాలుగు అంశీభూతాలతో తత్వశాస్త్రం రూపొందుతున్న ప్రాథమిక తత్వశాస్త్ర అవగాహన అర్థం కాకపోవడం వల్ల అలాంటి తప్పుడు నిర్ధారణకు బాలగోపాల్ వచ్చారు. అదే అవగాహనను తెలుగు నాట మెజారిటీ మేధావులు కొనసాగించారు.

'ఫలిత ప్రాధాన్యవాదమ'నేది అమెరికాలో ప్రారంభమై, ప్రపంచ మంతా ప్రబలమైన నయా పాజిటివిజం (స్వీయాత్మక భావవాదం) అనే పెట్టుబడిదారీ తాత్విక ధోరణి వ్యక్తీకరణ మాత్రమే. అయితే అప్పటికే ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఆర్థిక, రాజకీయ, భావజాల కేంద్రంగా ఉన్న హైదరాబాద్‌లో కుల, మత, ప్రాంత, జాతి, జండర్ రూపాల్లోని వివిధ అస్తిత్వ ఉద్యమాలు పోస్ట్ మాడర్నిస్ట్ ధోరణిని పుణికిపుచ్చుకుని ఉన్నాయి. ఈ భావజాల వాతావరణంలో వివిధ ఉద్యమకారులు తమ సామాజిక మూలాలు అన్వేషిస్తూ ఆ ప్రాతిపదికగా సంఘటితం కావడం ప్రారంభించారు. అయితే నిజాం కాలం నాటి నుంచి తెలంగాణ సమాజంలో వైష్ణవ మతం ప్రధాన సాంస్కృతిక అంతర్వాహినిగా కొనసాగుతున్నందున, ఆ సంస్కృతి నేపథ్యం గల వివిధ కులాలు, వర్గాల్లోని మేధావులు, అస్తిత్వ ఉద్యమకారులు తమలోని విభిన్న రాజకీయ, తాత్విక విశ్వాసాలకు అతీతంగా పరస్పర తాదాత్మ్యం పొందే వాతావరణం ఒకటి నెలకొంది.

వైష్ణవ మత సాంస్కృతిక నేపథ్యంలో ఉన్న పోస్ట్ మాడర్నిజం దృక్కోణంలోని మెజారిటీ తెలంగాణ బుద్ధిజీవులు మార్క్సిజాన్ని అహేతుకంగా ప్రశ్నిస్తున్న బాలగోపాల్ రచనల్ని ఆకాశానికెత్తారు. ఇప్పటికీ అదే ధోరణి కొనసాగుతుండడం దురదృష్టకరం. చట్టం, ధర్మం, న్యాయం, సామాజిక విలువలనేవి సామాజికార్థిక వ్యవస్థ స్వభావంతో నేరుగా సంబంధంలేని, చారిత్రకంగా ప్రత్యేకంగా పరిణామం చెందుతున్న వ్యవస్థలుగా బాలగోపాల్‌తో సహా, ఆ సాంస్కృతిక మేధో సమూహం ప్రగాఢంగా విశ్వసించి, ప్రచారం చేసింది. తమ అస్తిత్వ సమస్యలు ఇతరులతో ముడిపడి ఉన్నాయని, వాటి పరిష్కారం ఇతర అస్తిత్వాల సమస్యల పరిష్కారంతో ముడిపడి ఉందని వారు గుర్తించరు. అదీ కాక ఒక అస్తిత్వ సమస్యను ఆ అస్తిత్వానికి చెందినవారే (సహజ మేధావులు – ఆర్గానిక్ ఇంటలెక్చువల్స్) సరిగా రాయగలరని, రాయాలని ఆంక్షలు విధించే సంకుచిత దృక్పథంతో వైయక్తిక – సామూహిక ప్రత్యక్ష, పరోక్ష జ్ఞానాల ఆదాన ప్రదానాలను కట్టడి చేసే ప్రయత్నం చేస్తున్నారు. పెట్టుబడిదారీ సమాజమైనా, సోషలిస్టు సమాజమైనా రాజ్యం ఉన్నంతవరకూ పౌర సమాజ హక్కుల హననం అనివార్యంగా కొనసాగుతుందని ఆ బృందం భావించింది. బాలగోపాల్ క్రమంగా ఆ సాంస్కృతిక మేధావి సెక్షన్లకు ఇప్పటికీ అప్రకటిత భావ ప్రతినిధిగా ఆరాధ్యుడిగా మారారు. ఎలాంటి వర్గ భావజాలాలతో సంబంధం లేకుండా మానవ హక్కుల ఉద్యమాలు, కుల, మత, జెండర్ తదితర అస్తిత్వ ఉద్యమాలు కొనసాగాలని బాలగోపాల్ అభిప్రాయపడ్డారు. ఉనికిలో ఉన్న అసమాన ఆర్థిక వ్యవస్థ మౌలికంగా మారవలసిన, సమగ్ర సామాజిక విప్లవంతో కలసి ప్రయాణించవలసిన అవసరంలేని శుద్ధ హక్కుల ఉద్యమాన్ని ఆయన స్వప్నించారు.

పౌర సమాజమనేది న్యాయం, చట్టం, ధర్మం తదితర వివిధ సాపేక్ష సంపూర్ణ ప్రతిపత్తిగల రాజ్యాంగ, రాజ్యాంగేతర సంస్థలు, వ్యవస్థలతో కూడినదన్న ఆధునికానంతరవాద పాజిటివిస్టు ధోరణిలో ఆయన రచనలు సాగాయి. తెలుగు మేధో జీవితాన్ని అవి గాఢంగా ప్రభావితం చేశాయి. సమాజంలోని ఆధిపత్య పాలక వర్గంతో సంబంధంలేని స్వతంత్ర అధిపత్య సంస్థగా రాజ్యం, దాని అణచివేతకు గురవుతున్న పాలితులతో సంబంధంలేని పౌర సమాజం అనే సర్వ సాధారణ వర్గీకరణ మేధావుల అవగాహనలో స్థిరపడింది. చట్టం అనేది ఉన్నవారి చుట్టమనే సాధారణ భావజాలానికి భిన్నంగా చట్టం అనేది చారిత్రకంగా పరిణామం చెందిన ప్రత్యేక ప్రతిపత్తిగల ప్రజలందరికీ ప్రాతినిధ్యం వహించే ఉమ్మడి రాజ్యాంగ వ్యవస్థగా పరిగణించడం పరిపాటి అయింది. ప్రజలందరి పక్షాన నిష్పాక్షికంగా నిలిచినట్లుగా కనపడుతున్న రాజ్యాంగం అంతిమంగా ఆధిపత్య వర్గాల ప్రయోజనాలను కాపాడుతుంది.

ఈ కోణంలో రాజ్యాంగం రచనలో డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ వ్యక్తిగతంగా నిజాయితీతో పనిచేసి ఉండొచ్చు. అయితే ఆయన తాత్వికత, కృషి అందుకు భిన్నమైన చారిత్రక ఫలితాన్ని ఇచ్చిందనడంలో సందేహం లేదు. రాజ్యాంగం పాలక వర్గాల ఆధిపత్య సాధనమనేది ప్రపంచంలో ఏ దేశానికైనా వర్తించే వస్తుగత సామాజిక నియమం. దళిత మేధావి అయిన అంబేద్కర్ భారత రాజ్యాంగ రచనలో కీలక పాత్ర పోషించినంత మాత్రాన రాజ్యాంగం పాలకుల అణచివేత సాధనం కాకుండా పోదు. దేశంలోని ఆధిపత్య వర్గాల ప్రయోజనాలను కాపాడే రాజ్యాంగాన్ని విమర్శించడమంటే అంబేద్కర్‌ని, దళితులని విమర్శించడంగా భావిస్తే, అది విశాల పీడిత ప్రజానీకంలో భాగమైన దళిత ప్రజల్ని అవమానించినట్లే. ఉద్విగ్న బెదిరింపుతో ఒప్పించడం (ఎమోషనల్ బ్లాక్‌మెయిల్) అనే పద్ధతిలో రాజ్యాంగాన్ని విమర్శించిన వారితో వ్యవహరించడం వల్ల ఆ అస్తిత్వ ప్రజానీకపు ప్రయోజనాలకు భంగం కలిగించినట్టవుతుంది.

ఇలాంటి సున్నిత సామాజిక సన్నివేశం ఆధారంగా రాజ్యాంగ చట్టం సహా వివిధ రాజ్యాంగ వ్యవస్థలు, సంస్థలు వర్గ స్వభావంలేని స్వతంత్ర సంస్థలుగా ఆమోదించే ఈ పోస్ట్ మాడర్నిస్టులు ప్రచారం సాగిస్తున్నారు. ఇది ప్రజా సమూహాల్ని విముక్తి మార్గం నుంచి తప్పించి, ఉనికిలో ఉన్న రాజ్య వ్యవస్థలపై పీడిత ప్రజలకు భ్రమల్ని పెంచుతుంది, యథాస్థితి కొనసాగింపుకు ఒక తాత్విక సమర్థనగా నిలుస్తుంది. చట్టంలోని లొసుగులను తెలివైన వర్గాలు, వ్యక్తులు వినియోగించుకొని మనుగడ సాగిస్తుంటే, ఆ లొసుగులను వినియోగించుకునే లౌక్యం లేనివారు ఇబ్బందులకు గురవుతుంటారనే భావన రాజ్యాంగ చట్టం వాస్తవిక స్వభావాన్ని మరుగున పరుస్తుంది. ప్రజలకు రాజ్యాంగ వ్యవస్థలపై భ్రమలు పెంచి తరచూ మోసపోయేట్లు చేస్తుంది. 'వ్యవస్థలు తాము రూపొందించుకున్న సూత్రాలను ఉల్లంఘించడానికి కొన్ని దారులు మిగులుస్తారు. వాటిని సమర్థంగా స్వార్థంతో వినియోగించుకో గలిగినవారే వ్యవస్థలకు శాసకులవుతారు.

నేరం అధికారమై తానే నేరాన్ని నిర్వచిస్తుంది. ఎంపిక చేసిన వ్యక్తులను నేరస్థులుగా నిర్వచిస్తుంది. వ్యవస్థ పెరటి దోవలకు పాస్‌వర్డ్‌లు లేనివారూ వ్యవస్థను తలకిందులు చేయాలనుకునేవారే సాధారణంగా చెరసాలల పాలవుతారు, భౌతికంగా అంతరించిపోతారు'. అన్న ఒక మేధావి విశ్లేషణ చూసి ఆశ్చర్యం వేసింది. దాని ప్రకారం పాలక వర్గాల

ప్రతినిధి అయిన ఓటుకు నోటు వ్యవహారంలో అడ్డంగా దొరికిన టిడిపి నేత రేవంత్‌రెడ్డి, మావోయిస్టు ఆరోపణలు ఎదుర్కొంటున్న ప్రజాస్వామిక మేధావి సాయిబాబా అరెస్టుల విషయంలో రాజ్యం, చట్టం తన నియమాల ప్రకారం అరెస్టు చేసిందని ఆ విశ్లేషణ సమర్థిస్తోంది. అయితే బెయిల్ విషయంలో చట్టం వదిలిన అడ్డదారుల్ని వినియోగించు కోవడంలో నేర్పరితనం వల్ల ఇద్దరి బెయిల్స్‌లో తేడా ఉందనే దురవగాహనను అది కలిగిస్తుంది.

ఇక్కడ రేవంత్‌రెడ్డి, సాయిబాబాలు ప్రాతినిధ్యం వహించే వర్గం, సంబంధిత వర్గ రాజకీయాల పునాదిగా చట్టం వ్యవహరించిందన్న సంగతిని ఆ వ్యాఖ్యానం తెలివిగా పక్కకు తప్పించింది. రాజ్యం, రాజ్యాంగం, చట్టాలు అనేవి సమకాలీన అసమ సామాజిక వ్యవస్థను యథాతథంగా కొనసాగేందుకు రూపొందించినవే.

బాలగోపాల్ సాంస్కృతిక వారసత్వ మేధావులు ఈ విషయాన్ని తలకిందులు చేసి, రాజ్యాంగ వ్యవస్థలు పూర్తిగా స్వయం చలితమైనవిగా ప్రచారం చేస్తున్నారు. వివిధ సామాజిక వ్యవస్థల, సంస్థల వర్గ స్వభావాన్ని గుర్తించ నిరాకరిస్తూ వర్గం అనేది అనేక సామాజిక వర్గీకరణల్లో ఒకటిగా పరిగణిస్తూ, కులం, మతం, జాతి, ప్రాంతీయత వంటి సామాజిక ప్రతిఫలన సంబంధాలు మాత్రమే వాస్తవమైనవి. అలాంటి ప్రతి అస్తిత్వానికి వర్గరహిత ప్రత్యేక పరిష్కారం ఉంటుందని, సమాజం మొత్తానికి ఏకైక పరిష్కారం ఉంటుందనేది ఒక కల్పన అని వారు ప్రచారం చేస్తున్నారు. ఆ క్రమంలో అణచివేస్తున్న ప్రజానీకం మొత్తంగా ఒక సామాజిక పరిష్కారం కోసం ఐక్యంగా చేసే కృషికి గండి కొడుతున్నారు.

సమాజం మొత్తం పరిష్కారంలో అంతర్భాగంగా తమ ప్రత్యేక అస్తిత్వ సమస్యకు పరిష్కారం కొనసాగాలన్న స్పృహ నుంచి అస్తిత్వ ఉద్యమాలు దారి తప్పాయి. ఆ విధంగా వీరు ఆయా అస్తిత్వవాద ఉద్యమకారులను ప్రోత్సహిస్తున్నారు. పర్యవసానంగా పీడిత అస్తిత్వాల మధ్య ఉన్న పొరపొచ్చాలను అగాధాల స్థాయికి పెంచేందుకు వారి ప్రోత్సాహం దారితీస్తోంది. పైకి వివిధ అస్తిత్వాల ప్రత్యేక సమస్యల పట్ల చాలా ప్రజాస్వామికంగా ప్రోత్సహిస్తున్నట్లు ఈ మేధావుల వాదనలు కనిపిస్తున్నాయి.

అంతర్గతంగా సమాజంలోని పీడిత వర్గాలందరికి ఉమ్మడి శత్రువుకు వ్యతిరేకంగా జరగాల్సిన పోరాటం బలహీనపడేందుకు వారి పోస్ట్ మాడర్నిస్టు వాదనలు దోహదం చేస్తున్నాయి. అణగారిన వర్గాల్లో సాధికారత సాధించాలన్న లక్ష్యంతో కొనసాగుతూ వర్గదృక్పథం కొరవడిన ఈ ఉద్యమాలు ఆయా అస్తిత్వాల్లో ఒక క్రీమీలేయర్ ఏదో ఒక స్థాయిలో అభివృద్ధి చెందేందుకు దోహదం చేసింది. రాజ్యాధికారంలో వాటా పేరు మీద ఓటు బ్యాంకు ప్రాతిపదికన వివిధ అస్తిత్వాలకు చెందిన నాయకులు తమ ప్రజలకు రాజయకీయ పార్టీలకు అనుసంధాన కర్తలుగా మారడం దురదృష్టకరం.

ప్రపంచంలో ఎక్కడైనా సాధికారత అంటే నిజమైన అర్థంలో సంబంధిత అస్తిత్వ ప్రజానీకంలో ఏదో ఒక మేరకు వర్గ విభజన ఏర్పరచడమే. వివిధ రాజకీయ పార్టీల్లో, ఉద్యమాల్లో నాయకులుగా ఎదిగినవారు, రిజర్వేషన్ల సహాయంతో ఉద్యోగాల్లో, ప్రభుత్వ ఉన్నత పదవుల్లోకి ఎదిగినవారు ఒక క్రీమీలేయర్‌గా నేడు అస్తిత్వాలన్నిటిలో అవతరించారు. వివిధ అస్తిత్వాల్లోని అణగారిన ప్రజల సమస్యల్ని పరిష్కరించే ఎజెండా నుంచి అస్తిత్వ ఉద్యమాలు దూరమైనాయనే విషయం ఆత్మపరిశీలన చేసుకోవాల్సి ఉంటుంది. ప్రతి అస్తిత్వంలోని క్రీమీలేయర్ అవసరాలు, సమస్యలు, పరిష్కారాలు ఆ అస్తిత్వాల్లోని సాధారణ ప్రజల ఎజెండాగా మారడం వల్ల ప్రయోజనమేమిటి? అసమాన సామాజిక వ్యవస్థకు సంబంధించిన ఈ రాజ్య వ్యవస్థలో భాగస్వామ్యం వల్ల అస్తిత్వాల్లోని సాధారణ ప్రజలకు ఒనగూరేదేమి ఉండదని, ఈ రెండున్నర దశాబ్దాల అస్తిత్వ ఉద్యమాల అనుభవం చెపుతోంది.

రాజ్యాంగ వ్యవస్థలు, సంస్థలు సమాజంలోని పాలక, పాలిత వర్గాలకు అతీతంగా, స్వతంత్రంగా పనిచేసే సంస్థలుగా జరుగుతున్న ప్రచారం నేపథ్యంలో అందులో భాగస్వామ్యం కావడంతో తమ అస్తిత్వానికి సామాజిక న్యాయం జరుగుతుందని సామాన్య ప్రజలు భ్రమలకు లోనవుతున్నారు. దీనికి అవసరమైన తర్కాన్ని బాలగోపాల్ అతని పోస్ట్ మాడర్నిస్టు (అధునికానంతరవాద) అనుచర బృందం అందిస్తోంది. రాజ్యం, రాజ్యాంగ యంత్రం, చట్టాలు అనేవి వర్గాధిపత్య సాధనాలుగా గుర్తించకపోతే రేవంత్‌రెడ్డి, సాయిబాబా ఉదంతాల్లోని తేడా స్వాభావిక అర్థంలో కాక, సాంకేతికార్థానికే పరిమితమవుతాం.

సమాజంలోని వివిధ రాజ్యాంగ, రాజ్యాంగేతర వ్యవస్థలు, సంస్థలు అంతిమంగా ఆధిపత్య వర్గాల ప్రయోజనం కోసం పనిచేస్తాయని గుర్తించకపోతే ప్రజలు మోసపోతారు. సంక్షోభ సమయాల్లో ప్రజలు సాధారణంగా రాజకీయార్థిక విధానాల మీద, వాటిని రూపొందించే రాజకీయ వ్యవస్థల, సంస్థల మీద విశ్వాసాన్ని కోల్పోతారు. ఆ సమయాల్లో రాజ్యాంగ యంత్రాంగంలోని ఏదేని ఒక వ్యవస్థ స్వతంత్రంగా, చురుకుగా పనిచేసేందుకు పాలక వర్గాలు అనుమతిస్తాయి. తద్వారా ఉనికిలో ఉన్న సామాజిక, రాజ్యాంగ వ్యవస్థల విశ్వాసం చెదిరిపోయి, తిరుగుబాటు ప్రమాదం రాకుండా నివారించేందుకు ప్రయత్నిస్తాయి.

గతంలో ఎన్నికల కమిషన్, యుపిఎ అవినీతి కుంభకోణాల వ్యవహారాలు బయటపడిన తరుణంలో న్యాయ వ్యవస్థ క్రియాశీలకంగా వ్యవహరించిన ఉదంతాలను చూసి వాటి స్వతంత్రను గూర్చి వర్గాతీతంగా ఊహించడం పొరపాటు. అలాంటి సమయాల్లో 'చట్టం తన పని తాను చేస్తుంది' వంటి వేదాలు వల్లిస్తున్న పాలక వర్గాల కుట్రల్ని బహిర్గతం చేయడం వామపక్ష, ప్రజాస్వామిక మేధావుల కర్తవ్యంగా ఉండాలి.

వర్గం – కులం సమస్యల్లో ఏది ప్రధానం అనే మీమాంసతో ఆధునికానంతర వాద భ్రమలకు లోనైన శుద్ధ అస్తిత్వ ఉద్యమాలు నేడు ఏ స్థితిలో ఉన్నాయో ఒకసారి సింహావలోకనం చేసుకోవాలి. బాలగోపాల్ సాంస్కృతిక వారసత్వ తాత్విక మేధావులు సృష్టించిన సామాజిక ఉద్యమాల విధ్వంస స్వభావాన్ని అర్థం చేసుకుంటేనే అస్తిత్వ ఉద్యమాలు గురి, దిశ, దశ తప్పకుండా ఉంటాయి. ప్రతి అస్తిత్వంలోని అట్టడుగు ప్రజల ప్రయోజనాలే ఎజెండాగా ఉన్న వర్గ దృక్పథంతో కూడిన (విడివిడి అస్తిత్వవాద ఉద్యమ స్రవంతుల సంశ్లేషణతో సమగ్ర సామాజిక విప్లవం రూపొందే తీరులో) అస్తిత్వ ఉద్యమాలు నేటి అవసరమని అందరూ గుర్తించాలి.

*(రచయిత పాత్రికేయులు)* వీ

# సహజ వనరులకు ఆదివాసుల రక్షణ

***వనరుల దోపిడీకోసం పెట్టుబడి విస్తరించినంత మేర పాలకుల అవినీతి అక్రమాలు కొనసాగుతున్నాయని, వనరులను రక్షించుకునే క్రమంలో స్థానిక ప్రజలు వారి జీవితాలనే పణంగా పెడుతున్న పరిస్థితిని వివరిస్తున్నారు వై. రామచంద్రం***

ప్రపంచ వ్యాప్తంగా ప్రకృతి వనరులు ఎక్కడెక్కడైతే ఉన్నాయో అవి అక్కడి ప్రజల జీవితాల్లో మౌలికమైన మార్పుకు దోహదపడేలా ప్రభుత్వ విధానాలు రూపకల్పన జరగాలి. కాని భారత పాలకుల విధానాలు ప్రజల్ని నిర్వాసితుల్ని చేస్తూ వారి జీవన మనుగడకే ముప్పుగా పరిణమిస్తున్నాయి. ఈ మధ్య కాలంలో దేశ నలుమూలల్లో జర్నలిస్టులు, రెవెన్యూ ఉద్యోగులు, విజిల్ బ్లోయర్లు తమ వృత్తిలో భాగంగా రాజకీయ నాయకులు అక్రమంగా కొల్లగొడుతున్న సహజ వనరుల వివరాలను సమాజం ముందు ఉంచారు. దీనికి ప్రతి చర్యగా రాజకీయ నాయకుల ముసుగులో ఉన్న మాఫియా, వారి గూండాలు, వారికి ఎల్లవేళలా రక్షణగా నిలుస్తున్న పోలీసులు సాక్ష్యం కూడా మిగల కుండా వారిని పెట్రోలు పోసి, బుల్‌డోజర్లతో, ట్రాక్టర్లతో తొక్కించి హత్యలు చేస్తున్నారు. అవినీతి ఎంత దూరం వెళ్లిందంటే, ముఖ్యంగా రాజకీయ నాయకులు చేసే అక్రమాలు ఎక్కడ బయటపడుతాయోనని దానితో ప్రత్యక్షంగా కాని, పరోక్షంగా కాని సంబంధం ఉన్న వారినందరిని చంపి సాక్ష్యం కూడా మిగలకుండా చేస్తున్నారు. ఈ మధ్య మధ్యప్రదేశ్‌లో జరిగిన వ్యాపం కుంభకోణంలో ఇప్పటి వరకు 49 మంది అసహజ మరణాలకు గురయిన విషయం మనకు తెలిసిందే. ఈ పరంపర వేరు వేరు పద్ధతుల్లో ఇంకా కొనసాగుతూనే ఉంది. ఈ హత్యలన్నీ ఈ సమాజ స్వభావాన్ని వ్యక్తపరుస్తున్నాయి.

వివిధ రాష్ట్రాలో ఈ మధ్య జరిగిన సంఘటనలను పరిశీలిస్తే ఉత్తరప్రదేశ్‌లో సమాజ్‌వాదీ పార్టీ ఎంఎల్ఎ మంత్రి రామ్మూర్తి సింగ్ వర్మ చేస్తున్న అక్రమ మైనింగ్, భూకబ్జాలకు సంబంధించిన వివరాలను జగేంద్ర సింగ్ అనే జర్నలిస్టు ఫేస్‌బుక్‌లో ఉంచారు. మంత్రి పంపిన పోలీసులు ఆయన ఇంట్లో సోదాలు జరిపి ఆయనపై పెట్రోలు పోసి తగులబెట్టి చంపారు. అట్లాగే మహారాష్ట్రలోని బాలాఘాట్ జిల్లాలోని విలేఖరి సందీప్ కొఠారి ఇసుక మాఫియాపై కోర్టులో కేసు వేశాడు. ఈ కేసును ఉపసంహరించుకొమ్మని ఆయనపై రాజకీయ మాఫియా తీవ్ర ఒత్తిడి తెచ్చింది. ఇసుక మాఫియాకు లొంగనందుకు ఆయన్ను కిడ్నాప్ చేసి రెండు రోజుల తరువాత తీవ్రమైన చిత్రహింసలకు గురిచేసి చంపి, జూన్ 21న పట్టణ సమీపంలోని రైల్వే పట్టాల పక్కన మృతదేహాన్ని పడేశారు. అదే విధంగా గుజరాత్‌లోని సురేంద్రనగర్ జిల్లాకు చెందిన శైలేష్ కాంతి పటేల్ అక్రమ మద్యం సరఫరాకు సంబంధించిన వివరాల కోసం సమాచార హక్కు చట్టం కింద జూన్ 15న డిస్ట్రిక్ట్ సూపరెండెంట్ ఆఫ్ పోలీసుకు దరఖాస్తు చేసుకున్నాడు. అదేరోజు ఆయన హత్యకు గురయ్యాడు.

ఈ మధ్యనే ఆంధ్రప్రదేశ్‌లోని కృష్ణా జిల్లా సరిహద్దుల్లో టిడిపికి చెందిన ఎంఎల్ఎ చింతమనేని ప్రభాకర్ అక్రమ ఇసుక రవాణాను అడ్డుకున్న మహిళా తహసీల్దార్‌పై ఎంఎల్ఎ, ఆయన గూండాలు దాడి చేశారు. దాడి జరిగిన విషయాన్ని ఆమె జర్నలిస్టులకు చెప్పారు. రెండు జిల్లాల సరిహద్దు నిర్ణయించాక ఇసుక తోలుకోవచ్చని అన్నందుకు తహసీల్దార్‌ను, ఆమెతో వచ్చిన ఆర్ఐని ఎంఎల్ఎ కాళ్లమీద పడి క్షమాపణ అడగమన్నారని తెలిపారు. తన అనుచరులను మాపై రెచ్చగొడుతూ తహసీల్దార్‌ను ఈడ్చి పడేసి తొక్కండి, ఎవరు అడ్డు వస్తారో నేను చూసుకుంటా అంటూ రెచ్చగొట్టారన్నారు. ఆ సమయంలో అక్కడే ఉన్న ఎస్ఐ, మరో ముగ్గురు కానిస్టేబుళ్లు ఏమి పట్టనట్టు చూస్తుండిపోయారని తెలిపారు. దీనికి నిరసనగా ఎపి రెవెన్యూ ఉద్యోగులు నిరసనకు దిగడంతో ప్రభుత్వం దీనిపై రిటైర్డ్ జడ్జీతో న్యాయవిచారణ జరిపిస్తానంది. చివరికి ముఖ్యమంత్రి చంద్రబాబు నాయకత్వంలో మంత్రివర్గం సమావేశమై ఆ అధికారినే అతిగా వ్యవహరించిందని తీర్పు చెప్పారు. ఇదీ న్యాయం కోసం అడిగినందుకు తీర్పు. ఇంతకంటే ఏదో మేలు జరుగుతుందనుకుంటే పొరపాటే. ఎందుకంటే అక్రమాలకు పాల్పడేది వాళ్లే, వాటిపై తీర్పులు ఇచ్చేది వాళ్లే. ఈ ఘటనకు బాధ్యుడైన ఎంఎల్ఎ పై 14 కేసులు పెండింగ్‌లో ఉన్నాయి. ఏలూరు పోలీసు స్టేషన్‌లో ఆయనపై రౌడీషీటర్‌గా కేసు నమోదై ఉంది.

ఈ అక్రమాలు దేశ వ్యాప్తంగా ఉన్న అన్ని పార్టీల రాజకీయ నాయకులు కొనసాగిస్తున్నారు. అసెంబ్లీ, పార్లమెంట్‌లలో ఉన్నవారిలో అక్రమ సంపాదన, అవినీతి, గూండాగిరి లాంటి కేసులు ఎదుర్కొంటున్న వారే ఎక్కువగా ఉన్నారు. ఇలాంటి పాలకులు ఉన్న చోట ఈ హత్యలు మొదటివి కావు. చివరివి కావు. సమాజం స్పందించేంత వరకు ఈ హత్యలు ఇలాగే కొనసాగుతుంటాయి. పరిస్థితులు చేయిదాటి పోతున్నాయని అనుకున్నపుడు కోర్టులు మేమున్నామంటూ నష్ట పరిహారాలు లెక్కకడుతుంటాయి తప్ప ప్రజలు లేవనెత్తిన ప్రశ్నలకు పరిష్కారాలు చూపవు. ప్రజలే ప్రత్యామ్నాయ మార్గాలు వెతుక్కోవాల్సింది తప్పిస్తే ఎక్కడా న్యాయం జరిగే పరిస్థితి లేదు. ఎందుకంటే న్యాయ స్థానాలు ఎవరి పక్షమో కోర్టుల తీర్పులు తెలుపుతున్నాయి. ఈ మధ్యనే సత్యం రామలింగరాజు చేసిన రు. 7,800 కోట్ల అవినీతికి కోర్టు ఏడేళ్ల జైలు శిక్ష విధించింది. ఎర్ర చందనం కూలీలకు పది రోజులకు రు.30,000 ఇస్తారని తెలుపుతున్నారు. వేల కోట్ల ఆర్థిక కుంభకోణానికి సత్యం రాజుకు విధించిన శిక్ష ఏడు సంవత్సరాలు. అదే సమయంలో 30,000 వేల ఆర్థిక నేరానికి పాల్పడ్డ తమిళ కూలీలను నిలబెట్టి కాల్చి చంపింది చంద్రబాబు ప్రభుత్వం. ఇది ఈ వ్యవస్థ ఇస్తున్న తీర్పులు.

సహజ వనరులు ఎక్కడెక్కడయితే ఉన్నాయో అంతమేర అక్కడి ప్రజల జీవితాలు విధ్వంసానికి గురవుతున్నాయి. అవి తెలంగాణలోని గుట్టలు, వాగులు కావచ్చు, ఆంధ్రప్రదేశ్‌లోని బీల భూములున్న ప్రాంతాలు కావచ్చు. అట్లాగే తమ కాళ్ల కింద సహజ సంపదలు ఉన్నందుకు ఆదివాసీ ప్రాంతాలు కావచ్చు. మరీ ముఖ్యంగా 500 ఏళ్ల నుంచి ఆదివాసీ ప్రజలు ప్రకృతి వనరులను రక్షించే క్రమంలో నాడు బ్రిటిష్ పాలకులలో నేడు భారత పాలకవర్గాలతో తమ పోరాటాన్ని కొనసాగిస్తూనే ఉన్నారు. ఆదివాసీలు తమ మనుగడ కోసం, స్వయం నిర్ణయాధికారం కోసం జీవన్మరణ పోరాటమే చేస్తున్నారు. బహుళజాతి కంపెనీల భద్రతకోసం ఆదివాసీ ప్రాంతాలకు వస్తున్న వేలాది బలగాల అకృత్యాలను, అత్యాచారాలను, హత్యలను ఎదుర్కొనే క్రమంలో తమ ప్రాణాలను బలిపెడుతూ మిగతా వారికి మార్గదర్శకంగా నిలుస్తున్నారు.

ఈ అక్రమాలను అడ్డుకోవడానికి ప్రజలు ఉద్యమిస్తుంటే వారిపై తీవ్రమైన అణిచివేతను ప్రయోగిస్తూ, హత్యలు చేస్తూ, జైళ్లలో నిర్బంధిస్తూ పాలకులు పెట్టుబడికి అండగా నిలుస్తున్నారు. నిత్యం దేశ భక్తి పేరును జపం చేస్తూ ఇక్కడి వనరులను దోచుకుపోవడానికి విదేశీ కార్పొరేట్ కంపెనీలను ఆహ్వానించాడానికి నరేంద్రమోడీ ప్రధాని అయింది మొదలు దేశాలు తిరుగుతున్నారు. చివరికి భూ ఆర్డినెన్స్‌లు జారీ చేసి ప్రజల భూములను బలవంతంగా లాక్కొని విదేశీ కంపెనీలకు కట్టబెట్టడానికి పాలకులు వెనుకాడడం లేదు.

భారతదేశంలో రెండు అభివృద్ధి నమూనాలు కొనసాగుతున్నాయి. ఒకటి పాలకులు తీసుకువస్తున్న అభివృద్ధి నమూనా. ఈ నమూనాలో స్థానిక ప్రకృతి వనరులను, స్థానిక మార్కెట్‌ను కొల్లగొట్టుకు పోవడానికి జాతీయ, అంతర్జాతీయ గుత్త పెట్టుబడిదారీ సంస్థలకు ఆటంకంగా ఉన్న అంతర్జాతీయ నిబంధనలను సరళీకరించడం. దేశ వ్యాప్తంగా మైదాన, అటవి ప్రాంతాల్లో ఉన్న వనరులను కొల్లగొట్టుకు పోవడానికి రహదారులు, రైల్వే మార్గాలు, విమానాశ్రయాలు నిర్మించడం, ఆయా ప్రాంతాల్లోని సహజ వనరులను వెలికితీసి శుద్ధిచేయడానికి, మైనింగ్ కంపెనీలు, విద్యుత్ ప్లాంట్‌లు, అణువిద్యుత్ కేంద్రాలు నిర్మించడం చేస్తున్నారు. సెజ్‌ల పేరుతో సముద్రతీర ప్రాంతాల్లో వేలాది ఎకరాల భూమిని ఆక్రమిస్తూ ప్రజలను నిర్వాసితులను చేస్తున్నారు. నిర్వాసితులైన ప్రజలు అనివార్యమైన పరిస్థితిలో జీవికకోసం పోరాడుతున్న వారిపై పాలకులు అణిచివేతను ప్రయోగిస్తున్నారు. ఇదే పాలకులు గుత్తపెట్టుబడిదారుల ఆదేశాలతో ముందుకు తెస్తున్న అభివృద్ధి నమూనా. ఇదే అభివృద్ధి అయితే కోట్లాది మంది పేదరికంలో మగ్గుతున్నారని జాతీయ, అంతర్జాతీయ సంస్థలు వెలువరిస్తున్న నివేదికల మాటేమిటి?

ఇక మరో అభివృద్ధి నమూనా భారతపాలన వ్యవస్థకు ప్రత్యామ్నాయంగా రూపుదిద్దుకుంటోంది. అది పీడిత ప్రజల మద్దతుతో ఆదివాసీ ప్రాంతాల్లో బీజ రూపంలో కొనసాగుతున్న 'జనతన సర్కార్'. ఈ పాలన వ్యవస్థలో అక్కడి సహజ వనరులను స్థానిక ప్రజల ప్రమేయంతో, పర్యావరణానికి ముప్పు వాటిల్లకుండా ఉపయోగించు కుంటున్నారు. ఆ వనరులు అక్కడి ప్రజల జీవన మనుగడను పెంపొందిస్తున్నాయి. విద్య, వైద్యం పూర్తిగా జనతన సర్కార్ ఆధ్వర్యంలో నిర్వహించబడుతోంది. అక్కడ రైతుల ఆత్మహత్యలు, హత్యలు, అత్యాచారాలు, ఆకలి చావులు లేవు. అక్కడి పాలనా వ్యవస్థ పూర్తిగా ప్రజల భాగస్వామ్యంతో నడుస్తోందని అక్కడికి ప్రత్యక్షంగా వెళ్లి నెలల తరబడి వారితో చర్చించి, పరిశోధించి వెలువరిస్తున్న విశ్లేషణలు మనకు తెలుపుతున్నాయి.

ఈ వ్యవస్థలో అంతర్భాగమైన అక్రమాలను వ్యక్తులుగా ప్రశ్నించి, ఎదిరించి నిలబడలేరనేది ఎన్నో సందర్భాల్లో వ్యక్తమయింది. ఈ మధ్య జర్నలిస్టులను, సమాచార హక్కు కార్యకర్తలను సహజ న్యాయ సూత్రాలు అమలు జరగాలన్నందుకే సజీవదహనం చేయడంలోనూ వ్యక్తమయింది. బహుళజాతీ కంపెనీల కోసం ఆదివాసీ ప్రజలను అడవుల నుండి కాలిచేయించే ప్రయత్నం కొనసాగుతోంది. ఈ దేశంలోని సహజ వనరులు దేశ ప్రజలకు చెందాలని, స్వయం నిర్ణయాధికారం కోసం పోరాడుతున్న ప్రత్యామ్నాయ ఉద్యమాల ద్వారానే ఈ దేశ సంపద ఈ దేశ ప్రజలకు చెందుతుంది.

*(రచయిత వీక్షణం కరస్పాండెంట్)* వీ

## వీక్షణం విడి ప్రతి కొనుగోలుదారులకు ఒక క్షమాపణ, ఒక విజ్ఞప్తి

వీక్షణం పాఠకులలో దాదాపు సగం మంది వీక్షణంకు చందాదారులు కారు, ఏనెలకానెల తమ తమ ప్రాంతాలలో వార్తాపత్రికలు అమ్మే దుకాణాలలో విడి ప్రతి కొనుక్కుని చదువుతుంటారు. గత ఆరు నెలలుగా ఆ దుకాణాలలో వారికి వీక్షణం దొరకడం లేదు. రెండు రాష్ట్రాలలోని దాదాపు 300 న్యూస్ స్టాల్స్‌లో వీక్షణం పంపిణీ చేస్తూ ఉండిన ఆనంద్ ఏజెన్సీస్ వీక్షణంను ఇప్పుడు పంపిణీ చేయడం లేదు. మరొక రాష్ట్ర వ్యాప్త సోల్ ఏజెన్సీ గాని, ఎక్కడికక్కడ ఏజెన్సీలు గాని ఏర్పడేవరకూ న్యూస్ ఏజెంట్ల దగ్గర వీక్షణం దొరకదని చెప్పడానికి చింతిస్తున్నాం. పాఠకులకు కలుగుతున్న ఈ అసౌకర్యానికి క్షమించవలసిందిగా కోరుతున్నాం.

ఇప్పటిదాకా ఏనెలకానెల విడిప్రతి కొనుక్కుంటున్న పాఠకులు, అభిమానులు చందాదారులుగా చేరవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం. ఎక్కువ కాపీలు అమ్మకం అయ్యే ప్రాంతాలలో, పట్టణాలలో కొత్త, నమ్మకమైన ఏజెంట్లను ఏర్పాటు చేయవలసిందిగా మిత్రులకు విజ్ఞప్తి చేస్తున్నాం.

**– సర్క్యులేషన్ మేనేజర్**
*9949391028*

# కమలనాథుల పాలన కుంభకోణాల మయం

*లలిత్ మోదీ దేశ రాజకీయ యంత్రాంగాన్ని తన కాళ్ల కింద కట్టిపడేసి రోజుకో కథనాన్ని వదులుతున్న తీరునూ, వ్యాపం కుంభకోణం శవాలను బయటకు విసురుతున్న వ్యవస్థ స్వభావాన్నీ వివరిస్తున్నారు* **ఎ. నర్సింహారెడ్డి**

యుపిఏ పాలనలో జరిగిన అవినీతిని చర్చించి కడిగేసి తమ పార్టీ అధికారంలోకి వస్తే స్వచ్ఛమైన పాలన అందిస్తామన్న మోడీ తన సొంత వ్యవహారానికి వచ్చేసరికి భిన్నంగా వ్యవహరించడం ఆయన ద్వంద్వ ప్రమాణాలకు నిదర్శనం. చెప్పేందుకే నీతులు ఉన్నాయని భారత పార్లమెంటరీ రాజకీయాల్లో మరోమారు రుజువైంది. ఇవ్వాళ దేశ రాజకీయ రంగంలో తాండవిస్తున్న అవినీతి, విలువల రాహిత్యం ప్రజాస్వామిక వాదులకు ఆందోళన కలిగిస్తున్నాయి. అవినీతి, అనౌచిత్యం, అధికార దుర్వినియోగం కేసుల్లో అడ్డగోలుగా దొరికిపోయిన వారిని సమర్థించడానికి, వారికి అండగా నిలబడడానికి బిజెపి ప్రయత్నించడం అపహాస్యంగా ఉంది. ఐపిఎల్ అక్రమార్జనల బేహారి లలిత్‌మోదీ ఉదంతం తీగలాగితే డొంక కదిలిన చందంగా బిజెపిని చుట్టుముట్టింది. లలిత్ ఉదంతం ఇప్పుడు భారత రాజకీయ యవనికపై తుఫాన్ రేపుతున్నది.

ఇదే సమయంలో మహారాష్ట్రకు చెందిన స్త్రీ, శిశుసంక్షేమ శాఖ మంత్రి పంకజ ముండే రు.206 కోట్లు సామాజిక సంక్షేమ పథకాలకు సంబంధించిన నిధులు కేటాయించడంలో అక్రమాలకు పాల్పడినట్టు తాజాగా వెల్లడైంది. కేంద్ర మానవ వనరుల శాఖ మంత్రి స్మృతి ఇరాని తన విద్యార్హతలను ఎన్నికల అఫిడవిట్‌లో తప్పుగా పేర్కొని ఇరుక్కుపోయారు. ఐపిఎల్ కుంభకోణంలో నిందితుడు లలిత్ మోదీని వెనకేసుకొచ్చిన గొడవలో కేంద్ర విదేశాంగ మంత్రి సుష్మా స్వరాజ్ ఇబ్బందికర పరిస్థితిని ఎదుర్కొంటున్నారు. ఇదే వివాదంలో రాజస్థాన్ ముఖ్యమంత్రి వసుంధరా రాజే పాత్రపై వివాదం రగులుతున్నది. ఇదే సమయంలో మధ్యప్రదేశ్ ముఖ్యమంత్రి శివరాజ్ సింగ్ చౌహాన్/ మెడికల్ రిక్రూట్‌మెంట్లలో అక్రమాలకు పాల్పడిన తనపై ఉచ్చు బిగియకుండా నానా తంటాలు పడుతున్నారు.

**లలిత్ గేట్... రాజకీయ సునామీ**

లలిత్ మోదీ టి20 క్రికెట్‌లో వందల కోట్ల రూపాయల అక్రమాలకు సంబంధించిన ఆరోపణలు మూటకట్టుకున్నారు. వందల కోట్లు దేశం దాటించేశారు. ప్రభుత్వాలతో ఆడుకున్నారు. ఎందరో హేమా హేమీలతో ఆయనకు సంబంధాలు, పలుకుబడి ఉన్నట్లు స్పష్టమవుతుంది. ఐపిఎల్‌కు వికృత ప్రతినిధి లలిత్ మోదీ. అయితే ఆయనకు ఇంతటి ప్రాపకం లభించడం మన పాలక నేతల స్వభావానికి ఒక సంకేతం. 'మోడీగేట్' గా ఇప్పుడు బయటపడ్డ వ్యవహారాలన్నీ జోరుగా నడిచేటప్పుడు నరేంద్రమోదీ గుజరాత్ క్రికెట్ అసోసియేషన్ అధ్యక్షుడిగా ఉన్నారు. ఆర్థికమంత్రి అరుణ్‌జైట్లీ బిసిసిఐ ఆఫీసు బేరర్‌గా ఉన్నారు. వసుంధర రాజస్థాన్ ముఖ్యమంత్రిగా ఉన్న కాలంలో రాజస్థాన్ క్రికెట్ సంఘాన్ని చేజిక్కించుకోవడంతో లలిత్‌మోదీ జీవితం కొత్త మలుపు తిరిగింది. ఆ తర్వాత భారత క్రికెట్ బోర్డులో సభ్యుడిగా చేరి క్రమంగా మహారాష్ట్ర కీలకనేత శరద్ పవార్‌తో సాన్నిహిత్యం పెంచుకొన్న లలిత్ బిసిసిఐలో జగ్‌మోహన్ దాల్మియా ఆధిపత్యాన్ని బద్దలు కొట్టే క్రమంలో పవార్‌కు అన్ని రకాలుగానూ అండదండలందించాడు. అందుకు ప్రతిగా బిసిసిఐ ఉపాధ్యక్ష పదవిని చేజిక్కించుకొని 'బోర్డు'ను పూర్తిగా వాణిజ్యపథం తొక్కించాడు. ఇండియన్ ప్రీమియర్ లీగ్ (ఐపిఎల్) ఏర్పాటుతో క్రికెట్‌ను డబ్బుల కోసం మాత్రమే ఆడే ఆటగా మార్చేశాడు. 400 కోట్ల రూపాయల మొత్తంతో తొలి ఐపిఎల్‌ను దేశం నివ్వెరపోయేలా నిర్వహించిన లలిత్ - 2009లో ఎన్నికల సందర్భంగా ప్రభుత్వం అనుమతి ఇవ్వకపోవడంతో రెండో ఐపిఎల్‌ను ఏకంగా దక్షిణాఫ్రికాలో నిర్వహించి యుపిఏకే సవాలు విసిరాడు.

లలిత్‌మోదీ దేశవ్యాప్తంగా క్రికెట్‌కు పెరుగుతున్న ఆదరణను గుర్తించి భారత్‌లో క్రీడలకు సంబంధించిన ఇఎస్‌పిఎన్ ఛానల్ పంపిణీ హక్కులను పదేళ్ల కాలానికి తీసుకున్నాడు. ఆ క్రమంలో ఛానల్ యాజమాన్యానికి దగ్గరై వారితో ప్రపంచ వ్యాప్తంగా క్రికెట్ మ్యాచ్‌ల ప్రసార హక్కులను కొనిపించడం ద్వారా మొట్టమొదటిసారిగా జాతీయ స్థాయిలో వెలుగు లోకి వచ్చాడు. కానీ ఆ ఘటనే అతడికి మీడియా మొఘల్ రూపర్ట్ మర్డోక్‌తో విరోధాన్ని కొనితెచ్చిపెట్టింది. కొంతకాలం గడిచిన తరువాత క్రికెట్ ప్రసార హక్కులకు సంబంధించి మర్డోక్‌కు చెందిన స్టార్ నెట్‌వర్క్‌కు, ఇఎస్‌పిఎన్‌కు మధ్య సంధి కుదిర్చే క్రమంలో లలిత్ మోదీ ప్రదర్శించిన అతి తెలివితేటలు - ఆయనను ఆ రెండు ఛానళ్ల యాజమాన్యాలకూ దూరం చేశాయి. ఐపిఎల్ క్రీడల ఆర్థిక లావాదేవీల్లో అక్రమాలు, విదేశీ నిధుల చట్ట ఉల్లంఘనలకు పెద్ద ఎత్తున పాల్పడడంతో లలిత్ పతనం ప్రారంభమైంది.

ఐపిఎల్ భాగోతాలపై దుమారం రేగిన తర్వాత ఎట్టకేలకు ఎన్‌ఫోర్స్‌మెంట్ డైరెక్టరేట్ (ఇడి) ఆయనపై 16 కేసులు నమోదు చేసింది. రు. 425 కోట్లు జరిమానా విధించింది. ఈ అక్రమాలు మొత్తం రు.1700 కోట్లుగా అంచనా, లలిత్ మోదీ 2010లో లండన్ పారిపోయాడు! భారత్ ఆయన పాస్‌పోర్టును రద్దు చేసింది. 'పారిపోయిన నేరస్తుడు' గా ప్రకటించింది. ఆయన్ను భారత్‌కు అప్పగించవల్సిందిగా బ్రిటన్‌ను కోరింది. తద్వారా బ్రిటన్ నుండి మరో దేశానికి వెళ్లకుండా నిరోధించింది. ఆయనను భారత్‌కు అప్పగించకపోతే రెండు దేశాల సంబంధాలపై ప్రభావం పడుతుందని యుపిఏ ప్రభుత్వం తెలిపింది. వీటిపై 2011లో హైకోర్టులో కేసువేసుకోగా లలిత్‌కు చుక్కెదురైంది.

2012లో ఆయన తమ దేశంలో ఆరోపణలు ఎదుర్కొంటున్న వ్యక్తి గనక బ్రిటన్ నుండి తప్పించుకుపోకుండా చూడవలసిందిగా అధికారికంగా భారత ప్రభుత్వం బ్లూకార్నర్ నోటీసు ఇచ్చింది.

అవినీతి-అక్రమాలకు సంబంధించి స్వదేశంలో ఎన్నో ఆరోపణలు ఎదుర్కొంటున్న లలిత్ మోదీ బ్రిటన్‌లో నివాసం ఉండేందుకు రాజస్థాన్ ముఖ్యమంత్రి వసుంధరా రాజే ఇమ్మిగ్రేషన్ పత్రాలపై సంతకం చేసి సహకరించింది. ఆయన పాస్‌పోర్టు పునరుద్ధరణకు అప్పట్లో రాజస్థాన్ ప్రతిపక్ష నాయకురాలుగా ఉన్న వసుంధరా రాజే స్వయంగా హాజరై సంతకాలు చేసినట్లు వెల్లడి కావడంతో మోడీ ప్రభుత్వం ఇరకాటంలో పడింది. లలిత్ భార్య వెంట వసుంధరా క్యాన్సర్ చికిత్స కొరకు పోర్చుగల్ వెళ్లారు. ఆ ఆస్పత్రికి తర్వాత రాజస్థాన్‌లో కూడా శాఖ ప్రారంభిం చేందుకు భూమిని కూడా ఆమె మంజూరు చేశారు! ఇక ఆమె కుమారుడు దుష్యంత్ రాజే నడిపే భారీ హోటల్‌లో లలిత్ మోదీ రు.11 కోట్లకు పైగా పెట్టుబడి పెట్టారు.

కేంద్రంలో నరేంద్ర మోదీ ప్రభుత్వం 2014 మే లో అధికారంలోకి వచ్చాక పరిస్థితులు చకచకా మారిపోయాయి. విదేశీ మారక ద్రవ్య చట్టాన్ని (ఫెమా) ఉల్లంఘించి, అరెస్టు నుండి తప్పించుకుని బ్రిటన్‌కు పారిపోయిన లలిత్ మోదీని విదేశాలకు వెళ్లేందుకు అవకాశమిచ్చినంత మాత్రాన భారత్-ఇంగ్లాండ్ సంబంధాలపై ఎలాంటి ప్రభావం ఉండదని బ్రిటిష్ ప్రభుత్వం కొత్త పాస్‌పోర్టు జారీ చేయడానికి భారత ప్రభుత్వానికి ఎలాంటి అభ్యంతరం లేదని స్వయంగా సుష్మా స్వరాజ్ బ్రిటిష్ ప్రభుత్వానికి లేఖ ద్వారా తెలియజేశారు. ఆ తర్వాత 2014 ఆగస్టులో ఢిల్లీ హైకోర్టు సింగిల్ జడ్జి లలిత్ పాస్‌పోర్టును పునరుద్ధరించాలని ఆదేశాలిచ్చారు. దీనిపై కేంద్ర ప్రభుత్వం అప్పీలుకు వెళ్లకుండా మెతకవైఖరి ప్రదర్శించింది. లలిత్ మోదీ భార్య కేన్సర్ చికిత్స కోసం పోర్చుగల్ వెళ్తున్నందున మానవతా దృక్పథంతో తాను సహాయం చేశానని సుష్మా చెబుతున్నారు గానీ వాస్తవానికి ఆమె భర్త స్వరాజ్ కౌశల్, లలిత్ తరపున న్యాయవాదిగా పనిచేస్తున్నారు! ఆమె కుమార్తె బాసురి కూడా ఈ వ్యవహారంలో ఉన్నారు. కనుక లలిత్ నేరుగా సుష్మాతో మాట్లాడి సిఫార్సు చేయించుకున్నారనేది స్పష్టం. ఇక ముంబాయి పోలీసు కమిషనర్ అనధికారికంగా లలిత్‌ని లండన్‌లో కలసి మాట్లాడారు.

కొన్నాళ్ల క్రితం లండన్‌లోని ఒక రెస్టారెంట్‌లో రాబర్ట్ వదేరా (సోనియాగాంధీ అల్లుడు), ప్రియాంకా గాంధీలను తాను కలుసుకొన్నట్లు లలిత్ మోదీ ట్వీట్ చేశాడు. ఆయన సోనియాగాంధీ, బిజెపి నేత సుధాంశ్ మిట్టల్‌లపై కూడ తన అస్త్రాన్ని సంధించాడు. తనంటే ప్రణబ్ ముఖర్జీకి పడేది కాదని కూడా ఆయన వ్యాఖ్యానించడమే గాక రోజుకో నేత పేరు బయటపెడుతున్నారు. మరోవైపు కేంద్ర మాజీమంత్రి శరద్‌పవార్‌కు చెందిన నేషనలిస్టు కాంగ్రెస్ పార్టీ లలిత్ మోదీ పరాయైన వ్యక్తి కాదని, బాధితుడంటూ వెనకేసుకు రావడం విశేషం. ఐపిఎల్ సారథిగా క్రికెట్ ప్రపంచాన్ని శాసించిన లలిత్ మోదీ సొంత అవసరాల కోసం ఎవరినైనా, ఎంతైనా వాడుకోవడానికి ఏనాడూ వెనకాడలేదు. విలాసాలు, వినోదాలు, మోసాలే జీవితంగా మారిన ఆయన రాజకీయ నాయకులు, వివిధ రంగాల ప్రముఖులతోనే కాకుండా కరడుగట్టిన నేరగాళ్లతోనూ మిలాఖాత్ అయ్యాడు. చట్టమన్నా, నిబంధనలన్నా లలిత్‌కు లెక్కలేదు.

కేంద్ర హోం మంత్రి రాజ్‌నాథ్‌సింగ్ పరిస్థితి మరీ ఆసక్తికరం. సుష్మాస్వరాజ్ వ్యవహారం వెల్లడికాగానే ముందుగా ఆమెకు అండగా నిలిచినవాడు ఆయనే. వసుంధర రాజే కేసులో కచ్చితమైన సాక్ష్యాధారాలు బయటపడగానే వెంటనే ఆమె సమర్ధకుడిగా నిలబడిందీ ఆయనే. 'ఇది కాంగ్రెస్ ప్రభుత్వం కాదు ఎన్‌డిఎ ప్రభుత్వం. ఆరోపణలు ఎదుర్కొంటున్న మంత్రులెవరూ రాజీనామా చేయరు' అని కరాఖండిగా ప్రకటించారు. నిజమే, వాజ్‌పేయి ప్రభుత్వకాలంలో కూడా అటువంటి ఘటనలనేకం జరిగాయి. మసిపూసి మారేడుకాయ చేశారే గాని ఎవరూ తమ పదవులకు రాజీనామా చేయలేదు. అటువంటి చర్యలు వేటినైనా, "జాతీయవాదం", "దేశభక్తి" అంటూ సమర్థించే గురుపీఠం బిజెపికి ఉందిగదా! రాజ్‌నాథ్ సింగ్ కుమారుడి అవినీతి పనులకుగాను కొన్ని మాసాల క్రితం ప్రధానమంత్రి ఆయన్ను మందలించడం గుర్తు చేసుకో దగింది. దాంతో ప్రభుత్వంలో రాజ్‌నాథ్‌సింగ్ నెంబర్ టు కల చెదిరింది. తన కుమారుడి విషయంలో ప్రధాని మోదీ చూపిన దయకు ప్రత్యుపకా రంగానో లేక మోదీ ఆదేశంతోనో మంత్రుల అవినీతిని ఆయన సమర్థిస్తు న్నట్లున్నారు. అదలా ఉంచితే, అవినీతిని సహించం 'మేము తినం ఇంకొకరిని తిననివ్వం' అన్న నరేంద్రమోదీ ప్రతిజ్ఞలు ఏమైనాయి?

2008లో కాంగ్రెస్ పార్టీ రాజస్థాన్ శాసనసభా ఎన్నికలలో వసుంధరా రాజే- దుష్యంత్- లలిత్ మోదీ కలసికట్టుగా పాల్పడిన అవినీతి వ్యవహారాలను బహిర్గతం చేస్తామని హామీ ఇవ్వడం ద్వారా విజయం సాధించింది. అధికారంలోకి వచ్చిన తరువాత ముఖ్యమంత్రి అశోక్ గెహ్లాట్ మౌనంగా ఉండిపోయారని ప్రజలు భావిస్తున్నారు. గత ఏడాది హర్యానా శాసనసభా ఎన్నికలకు ముందు తాము అధికారంలోకి వస్తే రాబర్ట్ వాద్రా అక్రమాలను బహిర్గతం చేస్తామని భారతీయ జనతా పార్టీ ప్రజలకు పదే పదే చెప్పింది. అధికారంలోకి వచ్చిన తరువాత దర్యాప్తునకు ఆదేశించారు. కానీ, అది ఎంతకూ ముందుకు సాగడం లేదు. అంటే పాలక ముఠాలు ప్రజలను మభ్యపెడుతారు కాని వారి అక్రమాలను బయటకు రానివ్వరు. మాటల యుద్ధాలేగాని చేతలుండవు.

బిజెపి లోనే రెండు ముఠాలు ఉన్నాయని వారి ఘర్షణలో భాగంగానే సుష్మా స్వరాజ్‌ను అప్రతిష్టపాలు చేసే ప్రయత్నం జరుగుతోందని కీర్తి అజాద్ లాంటి బిజెపి ఎంపిలు గగ్గోలు చేస్తున్నారు. సుష్మాస్వరాజ్ ఎల్‌కె అద్వానీ శిబిరంలోని వ్యక్తి గనుక ఆమెను కంటిలోని నలుసుగా నరేంద్ర మోదీ-జైట్లీ శిబిరం భావిస్తోందని అందుకే పొమ్మనలేక పొగపెట్టారని కొన్ని పత్రికలు సైతం వ్యాఖ్యానించాయి.

లలిత్ రోజుకో ట్వీట్ ఇస్తూ ఆదాయపు పన్నుశాఖ అధికారుల గురించి, స్విస్‌బ్యాంకు అకౌంట్ల గురించి, హవాలా లావాదేవీల గురించి, అన్ని పార్టీల నాయకుల పేర్లు ప్రస్తావిస్తున్నాడు. చివరికి రాష్ట్రపతి కార్యదర్శిని కూడా రచ్చకీడుస్తూ పలువురి గుండెల్లో రైళ్లు పరుగెత్తి స్తున్నాడు. ఒక్కో సందర్భంలో ఒక్కో రంగానికి చెందిన వ్యక్తిని రచ్చకీడు స్తున్నాడు. 'వంద మంది నాయకులు నా ఆతిథ్యాన్ని అందుకున్నారు' అంటున్నాడు. సోషల్ మీడియాలో లలిత్‌ను 'ఇండియన్ అసాంజేగా' అభివర్ణిస్తున్నారు. ఈ వాతావరణం అంతిమంగా అన్ని పార్టీలను ఆత్మ రక్షణలో పడవేసి, చివరకు 'మోదీ గేట్' మూతపడే అవకాశం కూడా లేకపోలేదు. లలిత్ మోదీకి కావల్సింది కూడా ఇదే. మొత్తంగా చూస్తే లలిత్ అతి తెలివిగా అందరినీ మభ్యపెట్టి తన నేరాన్ని కప్పిపుచ్చుకునే కుట్ర ఉద్దేశ్యపూర్వకంగానే చేస్తున్నాడు. అయితే ప్రజల అప్రమత్తత, కేంద్రంపై ఒత్తిడి తెచ్చి నేరస్తునికి శిక్ష పడేలా చూడాల్సిన బాధ్యత అంతిమంగా ప్రజాస్వామిక వాదులపైననే ఉంది.

**మధ్యప్రదేశ్‌లో 'వ్యాపం' కుంభకోణం :**

మధ్యప్రదేశ్ రాష్ట్ర వృత్తి విద్యా పరీక్షల బోర్డు 'వ్యవసాయిక్ పరీక్ష మండల్' (వ్యాపం) ను సాంకేతిక విద్యా డైరెక్టరేట్ నిర్వహిస్తుంది. ఈ బోర్డు నిర్వహించిన ఉన్నత విద్యా వృత్తి కోర్సులలోకి ప్రవేశాలు, ఉద్యోగ నియామకాల కొరకు జరిపిన పరీక్షలలో కుంభకోణాలు 2013లో బయటపడ్డాయి. ఇందులో కోట్ల రూపాయల గోల్‌మాల్, పెద్దల హస్తం, పెద్దన్నల పాత్ర, ఆరోపణలు, ప్రత్యారోపణలు, మొక్కుబడి దర్యాప్తులు అన్నింటికంటే ముఖ్యంగా అసాధారణ, అసహజ, అనుమానాస్పద మరణాలు, మాఫియా ముఠాలు కన్పిస్తాయి. ఈ స్కామ్ విచారణలో 2008-13 మధ్య మెడికల్ ఎంట్రెన్స్‌ల ద్వారా ఎంపికైన 2200 మంది డాక్టర్లు అనర్హులేనని తేలింది. ఈ కుంభకోణంలో దాదాపు 3 వేల మంది నిందితులుగా ఉన్నారు. వీరిలో విద్యార్థులు, తల్లిదండ్రులు, రాజకీయ నేతలు, వ్యాపారులు, ఘరానా దళారులు ఉన్నారు. ఈ కేసులో 1700 మంది అరెస్టయ్యారు. వీరిలో కొందరు బెయిల్‌పై ఉండగా, మిగతా వాళ్లు జైలులో ఉన్నారు. అక్రమాలకు పాల్పడిన విద్యార్థులు చాలా మంది జైలులో ఉండగా 500 మంది పరారీలో ఉన్నారు.

వ్యాపంకే మరోపేరు ప్రొఫెషనల్ ఎగ్జామినేషన్ బోర్డ్ (పిఇబి). మధ్యప్రదేశ్‌లో మెడికల్ కాలేజీల్లో ప్రవేశ పరీక్షల నిర్వహణ కోసం 1970లో ప్రి మెడికల్ టెస్ట్ బోర్డ్‌గా ఇది ఏర్పడింది. 1981లో ప్రి ఇంజనీరింగ్ ఎంట్రెన్స్ పరీక్షల నిర్వహణ కోసం ఏర్పడింది. అనంతరం 1982లో ఈ రెండింటినీ విలీనం చేసి వ్యాపం లేదా పిఇబిగా మార్చారు. ఆ తరువాత రాష్ట్ర పబ్లిక్ సర్వీస్ కమిషన్ పరిధిలో లేని ప్రభుత్వ నాన్ గెజిటెడ్ ఉద్యోగాల నియామక పరీక్షల నిర్వహణను కూడా దీనికే అప్పగించారు. పోలీస్, రెవెన్యూ, ఎక్సైజ్, టీచర్, నర్స్ వంటి తదితర ప్రభుత్వ ఉద్యోగాల నియామక బాధ్యతను వ్యాపం చేపట్టింది.

మెడిసిన్ వంటి వృత్తి విద్యా కోర్సుల్లో ప్రవేశాలనూ, ముఖ్యమైన ప్రభుత్వోద్యోగాలనూ అంగట్లో సరుకులా అమ్ముకున్న మాఫియాపై ఒకపక్క ఎడతెగని దర్యాప్తు సాగుతుండగానే ఆ స్కాంలో నిందితులు, సాక్షులు పిట్టల్లా 40కి పైగా అనుమానాస్పద పరిస్థితుల్లో మృతి చెందడం మాత్రం ఆశ్చర్యంగా, ఆందోళనగా ఉంది. ఈ కుంభకోణాన్ని దర్యాప్తు చేస్తున్న ఎస్‌టిఎఫ్ ఉన్నతాధికారులకు బెదిరింపులు వస్తున్నాయని, కేసులో ఆరోపణలు ఎదుర్కొంటున్న ప్రముఖ వ్యక్తుల నుండి తమ ప్రాణాలకు ముప్పు ఉందని ఉన్నతాధికారులకు ఫిర్యాదు చేశారు. చట్టం తన పనిలో తానుంది తప్ప ఈ అసహజ మరణాలపై ఆరా తీసి కారకుల్ని గుర్తించిన దాఖలాలు కనబడడం లేదు. తమ పేర్లు బయటపడకుండా, సాక్ష్యాలు దొరక్కుండా చేయడానికి ఉన్నతస్థాయి వ్యక్తులే ఈ హత్యలకు పాల్పడుతున్నారన్న ఆరోపణలున్నా ఆ దిశగా ఎవరినీ అరెస్టు చేసిన దాఖలాలు లేవు. దేశంలో ఇంత పెద్ద స్కామ్ పూర్వాపరాలను చూస్తే ఎవరికైనా హిందీ చిత్రం మున్నాభాయ్ ఎంబిబిఎస్ గుర్తొస్తుంది. అయితే, ఆ చిత్రం జనానికి మంచి వినోదం అందిస్తే, ఈ స్కామ్ మాత్రం ఎన్నో కుటుంబాల్లో మరణ మృదంగాన్ని మోగిస్తూ విషాదాన్ని చూపుతున్నది. మృతుల్లో నిందితులు, సాక్షులు, టీవీ విలేకరితో పాటు, దర్యాప్తు చేస్తున్న మెడికల్ కాలేజ్ డీన్, మధ్యప్రదేశ్ రాష్ట్ర గవర్నర్ కుమారుడు కూడా ఉన్నాడు. ఇటీవల నరేంద్రసింగ్ తోమర్ అనే వ్యాపం ముద్దాయి ఇండోర్ సెంట్రల్ జైలులో అనుమానాస్పద పరిస్థితిలో మృతి చెందడంతో వ్యాపం స్కాం ఇప్పుడు దేశమంతటా చర్చనీయాంశమైంది. వందల కోట్లు కొల్లగొట్టి అయోగ్యులను అందలం ఎక్కించిన ఈ వ్యవహారంలో నిందితులపై దర్యాప్తు ఇంకా ఒక కొలిక్కిరాలేదు. ఈలోగానే సాక్ష్యాధారాలను శాశ్వతంగా చెరిపేసే పనిలో మాఫియా పెద్దలు విజయవంతమవుతున్నట్టు జరుగుతున్న పరిణామాలను గమనిస్తే బోధపడుతుంది.

2013 జూలైలో వ్యాపం కుంభకోణం మొదటగా బయటపడింది. ఆనంద్‌రాయ్ అనే విజిల్‌బ్లోయర్ ఇచ్చిన సమాచారంతో ప్రి మెడికల్ టెస్ట్ స్కామ్‌ను పోలీసులు బయట పెట్టారు. గ్వాలియర్‌కు చెందిన సామాజిక కార్యకర్త ఆశిష్ చతుర్వేది ఈ స్కామ్‌లో ముఖ్యమంత్రి శివరాజ్‌సింగ్ చౌహాన్ బంధువుల పాత్రను బయట పెట్టారు. దాంతో, ఈ కుంభకోణం దర్యాప్తును స్పెషల్ టాస్క్‌ఫోర్స్ (ఎస్‌టిఎఫ్)కు అప్పగిస్తున్నట్లు ముఖ్యమంత్రి చౌహాన్ అసెంబ్లీలో ప్రకటించక తప్పలేదు. ఎస్‌టిఎఫ్ దర్యాప్తును పర్యవేక్షించేందుకు రిటైర్డ్ జడ్జి చంద్రేష్ భూషణ్ నేతృత్వంలో ఒక ప్రత్యేక విచారణ బృందం (సిట్)ను మధ్యప్రదేశ్ హైకోర్టు ఏర్పాటు చేసింది. విచారణ సందర్భంగా డాక్టర్ జగదీష్ సాగర్ పేరు బైటికి వచ్చింది. ఇతడే ఈ మొత్తం వ్యవహారంలో కీలకం అని తేలింది.

నిజానికి, బోర్డు పరీక్షలలో మున్నాభాయ్‌ల వ్యవహారం గురించి మధ్యప్రదేశ్ పోలీసులకు ముందు నుంచే తెలుసు. అయితే జూలైలో సాగర్ అరెస్టుతో అక్రమార్కుల చిట్టా మొత్తం బైటపడింది. సెప్టెంబర్‌లో వ్యాపం పరీక్షల కంట్రోలర్ పంకజ్ త్రివేది అరెస్టుకు దారి తీసింది. పంకజ్‌ను విచారించగా ఈ కుంభకోణం వైద్య ప్రవేశ పరీక్షలకే పరిమితం కాదని, బోర్డు నిర్వహణలో జరిగే డజనుకు పైగా నియామకాల పరీక్షలలోనూ అక్రమాలు జరిగాయని పంకజ్ వెల్లడించాడు. ఇందుకోసం కంప్యూటర్ సిస్టంను దుర్వినియోగం చేస్తారని, ఇందులో చిప్ సిస్టం విశ్లేషకుడు నితిన్ మహీంద్ర, అతని కింద పనిచేసే ఉద్యోగుల హస్తం ఉందని ఆయన చెప్పారు. వ్యాపం అధికారులు, మధ్యవర్తులైన మాఫియా, రాజకీయ నేతలు ప్రభుత్వ అధికారులు అందరి కుమ్మక్కుతోనే ఇదంతా జరుగుతోందని విచారణలో బైట పడింది. ఎంపి డిమ్యాట్ ప్రవేశ పరీక్షలో అభ్యర్థుల నుంచి ఎంబిబిఎస్ సీటు కోసం రు. 25 లక్షలు, పోస్ట్ గ్రాడ్యుయేట్ సీటు కోసం రు. 1 కోటి దాకా వసూలు చేస్తారు.

ప్రవేశాలు-నియామకాలకు నిర్వహించిన అర్హత పరీక్షల్లో అనర్హులకు మెడిసిన్, పిజి మెడికల్ కాలేజీల్లో సీట్లు ఇప్పించడానికి, కానిస్టేబుల్, కాంట్రాక్ట్ టీచర్, ఫుడ్ ఇన్‌స్పెక్టర్, తదితర ప్రభుత్వ ఉద్యోగ నియామకాల్లోనూ విస్తృత స్థాయిలో అవినీతికి పాల్పడి కోట్ల రూపాయలు వసూలు చేసుకున్నారు. ఒకరి స్థానంలో మరొకరితో పరీక్ష రాయించడం, పరీక్ష హాల్లో ఒక తెలివైన అభ్యర్థిని కూర్చోబెట్టి, అతని వెనుక ముందు తమ అభ్యర్థులుండేలా సీటింగ్ ఏర్పాట్లు చేసుకుని చూసి రాసే అవకాశం కల్పించడం, తెలివైన వారితో బయటే జవాబు పత్రాలు రాయించడం, ఓఎంఆర్ షీట్లను మార్చడం, ఇలా ఏ పద్ధతిలో వీలైతే ఆ పద్ధతిలో అనర్హులకు మెడికల్ సీట్లు, కనీస విద్యార్హతలు లేనివారికి ప్రభుత్వోద్యోగాలు కల్పించారు. అర్హతలేని వాళ్లు డాక్టర్లు అయ్యాక ఎటువంటి వైద్యం అందిస్తారని ఆలోచిస్తే భయమేస్తుంది.

2004 నుండి మధ్యప్రదేశ్‌లో ప్రైవేట్ మెడికల్, ఇంజనీరింగ్ కళాశాలలు ఏర్పడ్డాయి. వీటిలోకి ప్రవేశాలు 50 శాతం యాజమాన్యాలు, 50 శాతం ప్రభుత్వం భర్తీ చేసేది. అందుకు ప్రవేశ పరీక్షలు నిర్వహించడం ప్రారంభించింది. అప్పటి నుంచే బోర్డులో ఉన్న అధికారులు దురాశతో అవకతవకలకు పాల్పడడం మొదలైంది.

2007లో బిజెపి అధికారంలోకి రాగానే నాన్-గెజిటెడ్ ఉద్యోగాలకు ఎంపిక పరీక్షలు నిర్వహించే బాధ్యత 'వ్యాపం' పైనే పెట్టింది. మొత్తం 40 శాఖలలో నియామకాలు ఈ బోర్డు నియంత్రణలోకి తెచ్చారు. దాంతో అనర్హులను ప్రభుత్వ శాఖలలో ఉద్యోగాలలో నియమించే అవకాశాలు బాగా పెరిగిపోయాయి. ముఖ్యంగా కాంట్రాక్టు టీచర్ల, పోలీసు సిబ్బంది ఉద్యోగాలకు డిమాండ్ బాగా ఉండడంతో ఇందులో అక్రమాలు ఎక్కువ జరిగాయి. అరెస్టయిన వాళ్లలో ఎక్కువ మంది ఈ రెండు పరీక్షలతో సంబంధం ఉన్నవాళ్లే.

వ్యాపం నిర్వహించే పరీక్షలలో రాజకీయ నాయకులు, అధికారులు కుమ్మక్కై అర్హులైనవారి జీవితాలను నాశనం చేసి అనర్హులైన తమ పిల్లలకు వృత్తి విద్యలో అడ్మిషన్లు , ఉద్యోగాలు పొందారు. గవర్నర్ ,ముఖ్యమంత్రి, ఒక బిజెపి జాతీయ అధికారప్రతినిధి, ఇద్దరు సీనియర్ ఆర్ఎస్ఎస్ నేతలతో పాటు చాలా మంది మంత్రులకు, ఐపిఎస్, ఐఎఎస్ అధికారులకు ఈ కుంభకోణంలో ప్రత్యక్ష భాగస్వామ్యం ఉందని చెబుతున్నారు. ముఖ్యమంత్రి శివరాజ్‌సింగ్ చౌహాన్‌కు సన్నిహితుడైన డాక్టర్ అజయ్ మెహతా ఈ కేసులో ప్రధాన నిందితుడు. మెహతా గతంలో రాష్ట్ర మంత్రిగా ఉన్నారు. ముఖ్యమంత్రి శివరాజ్‌కు ఓఎస్‌డిగా ఉన్న ప్రేమ్‌ప్రసాద్, అతని కూతురు కూడా ఈ కుంభకోణంలో ఇరుక్కున్నారు. వ్యాపం పరీక్షల కంట్రోలర్ సుధీర్ భదౌరియా కేంద్ర మంత్రి నరేంద్రసింగ్ తోమర్‌కు దగ్గరివాడని చెబుతారు. భదౌరియా ఇప్పటికీ ఇండోర్‌లోని ప్రభుత్వ ఇంజనీరింగ్ కాలేజీ డైరెక్టర్ పదవిలో ఉన్నారు. మధ్యప్రదేశ్ మాజీ ఉన్నత విద్యాశాఖ మంత్రి లక్ష్మీకాంత్ శర్మ జైలులో ఉన్నారు. ఇంకా చాలా మంది న్యాయమూర్తుల, బిజెపి నేతల కుమారుల పేర్లు ఈ కుంభకోణంలో బయటికి వచ్చాయి. 2012లో సిఎం శివరాజ్ చౌహాన్ చెల్లెలి కూతురు సైతం అక్రమంగా సీటు పొందిందనే ఆరోపణలున్నాయి.

వ్యాపం భారత పాలకులకు, మాఫియాలకు,అధికారులకు అలవాటైన, సాధారణమైపోయిన కుంభకోణం కావచ్చు. ఇంకా అఖిల భారత వైద్య సంస్థ ప్రవేశ పరీక్షలు కావచ్చు, ఇటీవల బీహార్‌లో బాగా ప్రచారమైన మాస్ కాపీయింగ్ అయినా కావచ్చు... అన్నింటికీ మూలాలు లోపభూయిష్టమైన మన విద్యావ్యవస్థలో ప్రధానంగా మన రాజకీయార్థిక వ్యవస్థలో ఉన్నాయి. విద్యను ప్రైవేటుపరం చేసి, దాన్ని కార్పొరేట్ శక్తుల విచ్చలవిడి లాభార్జనకు సరుకుగా మార్చిన ప్రభుత్వ విధానాలే ఇలాంటి అవకతవకలకు, అక్రమాలకు వీలు కల్పిస్తున్నాయి. విద్యకు ప్రభుత్వాలు కేటాయించే నిధుల్ని నామమాత్రం చేసిన ఫలితంగా ప్రభుత్వ విద్యాలయాలు కునారిల్లుతున్నాయి. మరోవైపు పుట్టగొడుగుల్లా పుట్టుకొచ్చిన ప్రైవేటు విద్యా సంస్థలు నాసిరకం చదువులు చెప్పి కోట్లకు కోట్లు ఆర్జిస్తున్నాయి. విద్యా విధానాన్ని సమాజ ప్రయోజనాలకు అనుగుణంగా మార్చనంత వరకు, దాన్ని కార్పొరేట్ శక్తుల కబంధ హస్తాల నుంచి విముక్తం చేయనంత వరకు 'వ్యాపం' పరివ్యాప్తం కాకుండా ఆపడం సాధ్యం కాదు.

**మహారాష్ట్రలో పంకజ్ ముండే అవినీతి :**

మహారాష్ట్ర స్త్రీ, శిశుసంక్షేమ శాఖ మంత్రి పంకజ్ ముండే రు.206 కోట్ల కుంభకోణాన్ని ప్రతిపక్షాలు వెలుగులోకి తెచ్చాయి. గిరిజన పాఠశాలలకు సంబంధించి కొనుగోలు చేసిన వస్తువుల విషయంలో కనీస ప్రమాణాలు పాటించలేదు. ఈ కుంభకోణానికి సంబంధించిన పూర్తి ఆధారాలు తమ వద్ద ఉన్నాయని కాంగ్రెస్ పార్టీ పేర్కొంది. పుస్తకాలు, వాటర్ ఫిల్టర్స్, తినుబండారాలు కొనుగోలు చేసే విషయంలో ప్రాథమిక విధివిధానాలు పాటించలేదని, గిరిజన విద్యార్థులకు, విద్యాబుద్ధులు చెప్పించి, వారిని బాధ్యతాయుతమైన పౌరులుగా తీర్చిదిద్దాల్సిన మంత్రి ఇలాంటి అవినీతికి పాల్పడడం క్షంతవ్యం కాదని ప్రజలు అసహ్యించుకుంటున్నారు.

ఈ సంవత్సరం ఫిబ్రవరి 13న పాఠశాలల పరికరాల కోసం ఆమె మొత్తం 24 కాంట్రాక్టులకు ఆమోదం తెలిపారని, ఆ సమయంలో కనీస ప్రమాణాలు పాటించకుండా కుంభకోణానికి పాల్పడ్డారని ఆరోపణలు వెల్లువెత్తాయి. కాంట్రాక్టులు పొందిన వారిలో ఆమె సమీప బంధువులుండడం గమనార్హం.

**ముగింపు**

కేంద్రం-రాష్ట్రం అనే తారతమ్యాలు లేకుండా అధికార పార్టీ నేతలు అవినీతి సోపానాలు అధిరోహిస్తూ అక్కడక్కడా బయట పడుతూ ప్రజల ఛీత్కారానికి గురవుతున్నారు. ఏది ఏమైనా నిశ్శబ్దమే మహాయుధంగా మోదీ మౌనం దాల్చారు. పోనీ ఏదో కాలమే కొన్ని సమస్యలకు పరిష్కారాలు చూపుతుందని అనుకుంటున్నారని కాసేపు అనుకుందామన్నా ఘటనల పరంపర ఆగేది లేదని సంకేతాలు అందుతున్నాయి. లలిత్ మోదీ ఎవర్నీ దేన్నీ లెక్కచేయని తెంపరి, ఆయన రాజకీయ నేతలపై చేస్తున్న దాడులు, వాదనలు, ఆరోపణలు రాజకీయ సునామీని సృష్టిస్తున్నాయి. మధ్యప్రదేశ్‌లో వ్యాపం స్కాం రోజుకో నిందితుని హత్యను బ్యానర్ వార్తగా ప్రకటిస్తోంది. అధికార బిజెపికి అక్కడ చెమటలు పడుతున్నాయి. క్లీన్ సర్కారుకు తామే అసలు సిసలు వారసులం అని చెప్పుకుంటున్న వారికి ఈ అవరోధాలేంటి? స్వచ్ఛ భారత్ సాధకులకు గొంతుదాకా పేరుకున్న ఈ బురదేంటి? ఏడాది పాలనలో అవినీతి రహిత పాలన ఎలా ఉంటుందో చూపించామని గప్పాలు కొట్టుకున్న కమలనాథులు ఈ పరిణామాలకు ఏం జవాబులిస్తారు?

లలిత్ అవినీతి, వ్యాపం కుంభకోణం సంబంధించిన సాక్ష్యాధారాలు ప్రజాక్షేత్రంలో విస్తృత ప్రచారంలో ఉన్నాయి. ఇదే సమయంలో అద్వానీ తనపై హవాలా ఆరోపణలు వచ్చినప్పుడు తాను రాజీనామా చేశానని, తనను చూసి స్వచ్ఛ రాజకీయాలు నేర్చుకోవాలని పరోక్షంగా మోదీకి హెచ్చరికలు పంపడం గమనార్హం. ఆర్ఎస్ఎస్ అధినేత గోవిందా చార్య కూడా నేర సంబంధం కలిగి ఉన్న మంత్రులు రాజీనామాలు చేయాలని అద్వానీ మాటలను బలపరిచారు. ఇదంతా గమనిస్తే మోదీ వ్యతిరేకత బిజెపిలో అంతర్గత కుమ్ములాటలు తారాస్థాయికి చేరాయనిపిస్తుంది.

మన దేశంలో సామ్రాజ్యవాద ప్రపంచీకరణ విధానాలు అమలు ప్రారంభమైన 1990 దశకం నుంచి అవినీతి, అక్రమాలు, బంధుప్రీతి, ఆశ్రిత పక్షపాతం పెరిగింది. ఆర్థిక విధానాలలో వచ్చిన మార్పులు రాజకీయ రంగంలో వికృత పోకడలను పెంచి పోషిస్తున్నాయి. అవినీతి వ్యవస్థీకృతమైంది. అవినీతి ఆక్రమాలు నివారించాలంటే రాజకీయార్థిక విధానాలలో మౌలిక మార్పులు రావాలి . స్వావలంబన కొరకు జాతీయ రాజకీయార్థిక విధానాలు సామ్రాజ్యవాద కార్పొరేట్ దోపిడీ విధానాలకు వ్యతిరేకంగా మారాలి.

*(రచయిత ఉపాధ్యాయ నాయకులు, రాజనీతి శాస్త్ర విద్యార్థి)* వీ

# ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్‌పై కాషాయపు పడగ

*సమాజానికి శాస్త్రీయ జ్ఞానాన్ని అందించాల్సిన విశ్వవిద్యాలయాల్లో, పరిశోధనా సంస్థల్లో అధికారాన్ని అడ్డం పెట్టుకొని మతోన్మాద శక్తులను నింపి పాలకులు సమాజాన్ని చీకటిలోకి నెడుతున్నారని అంటున్నారు* **బి. రామకృష్ణ**

కేంద్రంలో అధికారం చేపట్టినప్పటి నుంచి మోడీ ప్రభుత్వం ఉన్నత స్థాయి విద్య, శిక్షణ, పరిశోధనా తదితర సంస్థలను తన నియంత్రణలోకి తెచ్చుకుంటున్నది. భారత చరిత్ర పరిశోధనా సంస్థ (ఐసిఎచ్‌ఆర్), నేషనల్ బుక్ ట్రస్ట్ (ఎన్‌బిటి) లకు చైర్మన్‌లుగా రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్ అనుబంధ సంస్థల్లో పనిచేసినవారిని నియమించారు. హిందూ భావజాలం కలిగి ఉన్న ప్రొ. ఇందర్‌మోహన్ మహతిని యుజిసి సభ్యునిగా, విశ్రమ్ రామచంద్రజర్ధార్‌ను నాగపూర్‌లోని విశ్వేశ్వరయ్య నేషనల్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ అధిపతిగా నియమించారు. జాతీయ విద్యా పరిశోధన శిక్షణా సంస్థ (ఎన్‌సిఇఆర్‌టి) డైరెక్టర్‌ను తొలగించారు. ముంబై ఐఐటి చైర్మన్, ఢిల్లీ ఐఐటి డైరెక్టర్లను రాజీనామాలు చేసేలా చేశారు. నోబుల్ అవార్డు గ్రహీత అమర్త్యసేన్‌ను నలంద యూనివర్సిటీకి వైస్ చాన్సలర్‌గా రిజైన్ చేసే పరిస్థితిని కలిగించారు. నూతన విద్యా విధానం అంటూ దేశవ్యాప్తంగా విద్యా విధానంపై తమ ప్రభావాన్ని చూపే ప్రయత్నంలో ఉన్నారు. ఆర్‌ఎస్‌ఎస్ కనుసన్నలలో నడిచే వ్యక్తిని మానవ వనరుల అభివృద్ధి మంత్రిగా నియమించి తద్వారా తమ అజెండాను అమలు చేయించే తీవ్ర ప్రయత్నాలు జరుగుతున్నాయి. స్వదేశీ అంటూ గొంతు చించుకునే వారు విదేశీ యూనివర్సిటీలకు స్వేచ్ఛ ద్వారాలను తెరిచే ప్రయత్నంలో పడ్డారు. మేక్ ఇన్ ఇండియా అంటూ విదేశీ కంపెనీలను వేడుకుంటున్నారు. వారికి సులువుగా అనుమతులు ఇచ్చేందుకు ప్రజానుకూల చట్టాలను మార్చే ప్రయత్నాలు చేస్తున్నారు. కార్మిక చట్టాలను సవరిస్తున్నారు. కేంద్రీయ ఉన్నత స్థాయి సంస్థల అధిపతులుగా, వాటిని నడిపే గవర్నింగ్ బాడీలలో సభ్యులుగా ఆర్‌ఎస్‌ఎస్ భావజాల అనుకూల వ్యక్తులను నియమిస్తూ వస్తున్నారు. ఇలా నియమించబడే వారికి అధిపతులుగా ఉండగలిగే శక్తి సామర్థ్యాలు, స్థాయి ఉండనవసరం లేదు. అలా ఉండడం కూడా వారికి గిట్టదు. కేవలం హిందూ మత భావజాలాన్ని ఆయా సంస్థల్లో స్థిరీకరించడానికి పనిముట్టుగా ఉంటే చాలు. అవే వారికి అర్హతలుగా ఉంటున్నాయంటే అతిశయోక్తి కాదు.

కొంతమేరకైనా ప్రజాస్వామిక భావాలున్నవారు ఉన్నత స్థాయి సంస్థల్లో నిర్ణయాత్మక స్థానాల్లో ఉండడం ఈ ప్రభుత్వానికి కంటగింపుగా మారింది. ఈ సంస్థల్లో ఉన్న ప్రజాస్వామిక పని పద్ధతులను, లౌకిక విలువలను, ఆచరణలను సహించలేక ఎలాగైనా వాటిని విచ్ఛిన్నం చేయబూనుకున్న పరిస్థితి స్పష్టం అవుతున్నది. మోడీ ప్రభుత్వానికి తాత్విక ఆధారమైన ఆర్‌ఎస్‌ఎస్ తన పంజాను విస్తృతం చేసుకునే పనిలో నిమగ్నం అయింది. ప్రభుత్వాన్ని తన చెప్పు చేతుల్లో నడిపే ప్రయత్నం చేస్తున్నది. కేంద్రీయ ఉన్నత, విద్యా, శిక్షణా, పరిశోధనా, శాస్త్ర, సాంకేతిక సంస్థలను భ్రష్టు పట్టించే పనిలో మరో అడుగుగా ఫిల్మ్ అండ్ టెలివిజన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ ఇండియా (ఎఫ్‌టిఐఐ), పూణె అధ్యక్షునిగా గజేంద్ర సింగ్ చౌహాన్‌ను కేంద్ర ప్రభుత్వం 2015 జూన్ 9న నియమించింది.

ఎఫ్‌టిఐఐకి సంబంధించి ఫీజులు, కోర్సులు, సిలబస్ వంటి అన్ని రకాల నిర్ణయాలు తీసుకుని అమలు చేసే అత్యున్నత నిర్ణయాత్మకమైన పాత్ర దాని గవర్నింగ్ కౌన్సిల్‌కు ఉంటుంది. కేంద్ర ప్రభుత్వం నియమించే అధ్యక్షుడే గవర్నింగ్ కౌన్సిల్‌కు చైర్మన్‌గా కూడా ఉంటారు. గజేందర్‌సింగ్ చౌహాన్ గతంలో మహాభారత్ టెలి సీరియల్‌లో యుధిష్టిర్ పాత్రను పోషించాడు. కొన్ని సినిమాలలో నటించాడు. మూఢ నమ్మకాలను బలపరిచే వజ్రాల టెలి మార్కెటింగ్ ప్రకటనల్లో కనిపించాడు. అనేక నేరారోపణలతో ఆశారాంబాపు జైలు పాలు కాకముందు ఆశారం లాంటి గురువులు ఈ సమాజానికి అవసరమని ఉపన్యసించాడు. ఇతనికి సినిమా, కళలు, డాక్యుమెంటరీలపై గానీ అందులో ఉండే సృజనాత్మ కతలు, సాంకేతిక, సామాజిక, మానవీయ కోణాల విలువలపై అవగాహన లేదని ఎఫ్‌టిఐఐ విద్యార్థులు, మరెందరో ప్రజాస్వామిక వాదులు అంటున్నారు. గతంలో ఈ అధ్యక్ష పదవిలో మృణాల్‌సేన్ వంటి దక్షత కలిగిన సామాజిక విలువలున్న వారు ఉన్నారని అంతటి స్థాయి చౌహాన్‌కు లేదని విద్యార్థులు నిరసిస్తున్నారు. ఎఫ్‌టిఐఐని నడపగలిగే అనుభవం గాని, నైపుణ్యం గాని, సమర్థతలు గాని చౌహాన్‌కు లేవని అతని నియామకాన్ని వ్యతిరేకిస్తున్నారు.

ఎఫ్‌టిఐఐలో పాటించే తాత్వికతతో గాని, మేధోపరమైన వాటితో గాని చౌహాన్‌కు సంబంధం లేదని, అతను ఈ సంస్థలో పాత విద్యార్థి కాదని, ఇక్కడ విద్యార్థులతో, కళాకారులతో కలిసి పనిచేసినదీ లేదని విద్యార్థులు చౌహాన్ నియామకాన్ని వ్యతిరేకిస్తున్నారు.

సినిమా లేదా దృశ్య మాధ్యమం అనేది వినోదాన్ని పంచగలదు. చైతన్య పరిచేలా అన్యాయాలను, దురాచారాలను నిరసించేలా ప్రజల దృష్టిని ఆకర్షించగలిగే సామర్థ్యంను కలిగి ఉన్నది. ఇలాంటి సినిమా రంగంలో విస్తృతమైన మార్పులు, సాంకేతికంగా మరెన్నో మార్పులు చేర్పులు తెచ్చేటప్పుడు వాటిపై అవగాహన కలిగిన వారిని కాకుండా సంబంధంలేని వ్యక్తిని ఎఫ్‌టిఐఐకు అధ్యక్షునిగా నియమించడాన్ని విద్యార్థులు తీవ్రంగా వ్యతిరేకిస్తూ ఆందోళనలు చేస్తున్నారు.

చౌహాన్ బిజెపి సభ్యుడిగా ఉండడం, మోడీకి విధేయుడిగా ఉండడం వల్లనే అతనికి చైర్మన్ పదవి దక్కింది. ప్రేమికుల దినంగా గుర్తించబడిన ఫిబ్రవరి 14ని వ్యతిరేకిస్తూ ఆరోజును మాతృ పితృ దినంగా జరుపు

కోవాలని చెప్పాడు. గత ఎన్నికల్లో బిజెపి తరపున ప్రచారం నిర్వహించాడు. చౌహాన్ బిజెపి, ఆర్ఎస్ఎస్‌కు విధేయులై వాటి అడుగులకు మడుగులొత్తే పరాధీనత కలిగి ఉండి హిందూ మత భావజాలాన్ని వ్యాపింపచేయడంలో భాగంగా నియామకం జరిగింది. ఎఫ్‌టిఐఐకి ఉండే స్వతంత్ర ప్రతిపత్తి గాని, అందులో భావ ప్రకటన స్వేచ్ఛ గాని ప్రమాదంలో పడతాయని, సృజనాత్మకతకు ఉరితాళ్లు వేసినట్లవుతుందని అందోళనకారులు అంటున్నవి వాస్తవాలు కాకుండా పోవు.

ఎఫ్‌టిఐఐ గవర్నింగ్ కౌన్సిల్‌లో ఫిల్మ్, టెలివిజన్, విద్య, జర్నలిజం, సాహిత్యం, ఫైన్ ఆర్ట్స్, డ్రమటిక్స్, పర్ఫార్మింగ్ ఆర్ట్ మొదలగు రంగాలకు సంబంధించిన సమర్థత నైపుణ్యం కలిగిన వ్యక్తుల సభ్యత్వ విభాగంలో నలుగురు సభ్యులుగా ఆర్ఎస్ఎస్ నేపథ్యం ఉన్న అనఘా ఘైసాస్, నరేంద్రపాథక్, ప్రంజాల్ సైకియా, రాహుల్ సోలాపుర్కర్‌లను నియమించారు. అనఘా ఘైసాస్ రాంమందిర్, అదాలత్ ఔర్ ఆస్థా (రామమందిరం, కోర్టులు, విశ్వాసాలు), మోడీపై అసమాన్య నాయకత్వ గాథ అనే డాక్యుమెంటరీలను నిర్మించారు. తాను నూటికి నూరు శాతం ఆర్ఎస్ఎస్ అని గర్వపడుతున్నానని చెపుతారు. ఆమె భర్త రెండు దశాబ్దాలకు పైగా ఆర్ఎస్ఎస్ ప్రచారక్‌గా ఉంటున్నాడు. ఎఫ్‌టిఐఐలలో కొత్త ఆలోచనా ప్రక్రియ మొదలవ్వాలని విద్యార్థులు, జాతీయ భావాలను కలిగి ఉండాలని ఈమె ప్రకటించారు. ఎఫ్‌టిఐఐలో జాతి వ్యతిరేక కార్యకలాపాలు (ఆర్ఎస్ఎస్ భావజాల వ్యతిరేక) ఉండకూడదు. అలాంటి వారికి తగిన గుణపాఠం చెప్పాలని ఆర్ఎస్ఎస్ భావజాలానికి భిన్నంగా ఉండే వారికి, ప్రగతిశీల శక్తులకు హెచ్చరికలు చేశారు.

ఆర్ఎస్ఎస్ విద్యార్థి విభాగమైన అఖిల భారతీయ విద్యార్థి పరిషత్ (ఎబివిపి) మహారాష్ట్ర కమిటీకి నరేంద్రపాథక్ అధ్యక్షుడిగా పనిచేశాడు. అతడు ఎబివిపి పత్రికకు 14 ఏళ్లు సంపాదకుడిగా ఉన్నాడు. 2013 ఆగస్టు 21న కబీర్ కళామంచ్ వారిచే పూణెలో నిర్వహించబడిన సినిమా ప్రదర్శన, సాంస్కృతిక కార్యక్రమం సందర్భంలో ఎఫ్‌టిఐఐ విద్యార్థులపై మహారాష్ట్ర ఎబివిపి కార్యకర్తలు దాడి చేశారు. ప్రంజాల్ సైఖియా ఆర్ఎస్ఎస్‌తో సంబంధమున్న సంస్కార భారతి అనే సంస్థలో నాయకత్వ స్థానంలో ఉండేవాడు. ఎఫ్‌టిఐఐ విద్యార్థులకు సినిమా తీసే నైపుణ్యాలతో పాటు సంప్రదాయక, ధార్మిక, నైతిక విలువలు ఉండాలని ఇతను అంటాడు. రాహుల్ సోలాపుర్కర్ గతంలో పూణె అసెంబ్లీ స్థానం నుంచి బిజెపి టికెట్‌ను ఆశించాడు. శైలేష్‌గుప్తా అనే మరో సభ్యుడు 'శపథ్ మోడీకి' అనే ప్రచార సినిమా నిర్మించాడు. ఈ అందరూ కూడా ఆర్ఎస్ఎస్ లేదా బిజెపితో సంబంధాల్లో ఉన్నవారే తప్పిస్తే ఎఫ్‌టిఐఐలో సభ్యులయ్యే సమర్థతలు గానీ, అర్హతలు గానీ లేవు. ఇలాంటి నియామకాల ద్వారా ఆర్ఎస్ఎస్ తన విద్వేషపూరిత భావజాలాన్ని చొప్పించే ప్రయత్నం, అలాగే ఆయా సంస్థల్లో బతికి ఉన్న లౌకిక ప్రజాస్వామిక భావ ప్రకటనా స్వేచ్ఛ విలువలను హరించేసే ప్రణాళికలతో సాగుతున్న సందర్భం స్పష్టంగా కనిపిస్తున్నది.

ఎఫ్‌టిఐఐ విషయంలో మాత్రమే కాకుండా సెంట్రల్ బోర్డ్ ఆఫ్ ఫిల్మ్ సర్టిఫికేషన్ (సిబిఎఫ్‌సి), చిల్డ్రన్ ఫిల్మ్ సొసైటీ (సిఎఫ్ఎస్) నేషనల్ ఫిల్మ్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ (ఎన్ఎఫ్‌డిసి) లకు కూడా ఇలాంటి నియామకాలే చేశారు. సిబిఎఫ్‌సికి అధిపతిగా పహ్లాజ్ నిహ్లానీని నియమించారు. ఇతడు బిజెపి, మోడీలకు ప్రచార వీడియోలను తయారు చేశాడు. సిఎఫ్ఎస్‌కు చైర్‌పర్సన్‌గా ముఖేష్‌ఖన్నాను నియమించారు. ఇతను శక్తిమాన్ అనే టెలి సీరియల్‌లో నటించారు. రుద్రాక్షల టెలి మార్కెటింగ్ ప్రకటనలో కనిపించాడు. ఆశారం బాపూతో సన్నిహితంగా మెలిగాడు. మోడీకి ఎన్నికల్లో ప్రచారం చేశాడు. మోడీని గుజరాత్ శక్తిమాన్‌గా కీర్తిస్తూ గత ఎన్నికల్లో బిజెపికి ప్రచారం చేశాడు.

ఎన్ఎఫ్‌డిసికి అధిపతిగా సురేష్‌గోపిని నియమించారు. ఇతను గోవును తల్లిగా భావిస్తూ బీఫ్‌ను ముట్టుకోనని పటేల్ విగ్రహ ప్రతిష్ఠాపన కోసం కేరళలో జరిగిన పరుగు ర్యాలీలో ప్రస్తావించాడు. అది అతని వ్యక్తిగత విషయం, దానిని గౌరవించవచ్చు కాని బీఫ్ అనేది ఎన్నో ఏళ్లుగా ఎందరికో ఆహారంగా ఉన్నది. దీన్ని ఆహారంగా తీసుకుంటున్న బ్రాహ్మణేతరులను, ముస్లింలను చిన్నచూపు చూస్తూ, అసహ్యించుకుంటూ దానిని దూరం చేసే ప్రయత్నాలు ఏ విలువలకు సంకేతం. ఇతడు బిజెపికి మద్దతుదారుడు.

వీరందరికి కూడా ఆయా సంస్థలను నడపగలిగే సామర్థ్యాలు లేవు. కాని, వీరందరూ బిజెపి లేదా ఆర్ఎస్ఎస్ కనుసన్నలలో నడిచే విశ్వాసపాత్రులుగా, అవి చెప్పిందల్లా చేసే వారుగా ఉంటారు. వీరి ద్వారా ఆర్ఎస్ఎస్ వారు తామనుకున్నట్లుగా పనులను చక్కబెట్టుకుంటారన్నమాట. నాకిదిచ్చావు నీకదిస్తాను అన్న చందంగా తమకు మద్దతుదారులుగా, కడు విశ్వసనీయంగా ఉంటూ ఎన్నికల ప్రచారాల్లో తమకు చేదోడు వాదోడుగా ఉన్న వారికి పదవులను పంచడంలో భాగంగా కూడా ఈ నియామకాలు జరిగినట్లు అర్థం చేసుకోవచ్చు. అలాగని అందరికీ ఆ పదవులు వస్తాయా అంటే రావనేది వేరే విషయం అనుకోండి. ఇలా ఆర్ఎస్ఎస్, బిజెపి భావజాలం ఉన్నవారు ఈ సంస్థల్లో జరిగే కార్యక్రమాలలో మహిళల పట్ల, ఇతర మతాల పట్ల, మైనారిటీల పట్ల వారికున్న సామాజిక, సాంస్కృతిక ప్రమాదకర సంకుచిత భావాలను రుద్దకుండా ఉండగలరా? వీరు ప్రగతిశీల, అభ్యుదయకర భావాలను అణచి వేయకుండా ఉండగలరా? స్వతంత్ర, సృజనాత్మక, ప్రజాస్వామిక, లౌకిక, సామ్యవాద విలువల, భావాల గొంతుకలపై కత్తులు దూయకుండా ఉండగలరా?

బిజెపి అధికారంలోకి వచ్చాక నేషనల్ స్కూల్ ఆఫ్ డ్రామా (ఎన్ఎస్‌డి), కేంద్రీయ సాహిత్య అకాడమీలకు 50 శాతం నిధులు తగ్గించారు. ఎఫ్‌టిఐఐని ప్రైవేట్ పరం చేద్దామని గతంలో ఆలోచనలు వచ్చాయి. నేడు బిజెపి ప్రభుత్వం ఈ విషయాన్ని పక్కనపెట్టినట్లేమి లేదు. చౌహాన్ నియామకాన్ని వ్యతిరేకిస్తూ ఎఫ్‌టిఐఐ విద్యార్థులు చేస్తున్న ఆందోళనలో భాగంగా సమాచార ప్రసార శాఖా మంత్రి అరుణ్‌జైట్లీతో జరిగిన చర్చలో ఈ విషయం అన్యాపదేశంగా ప్రస్తావించబడింది. ఎఫ్‌టిఐఐ విద్యార్థులు 2015 జూన్ 12 నుండి నిరవధికంగా స్ట్రైక్ చేస్తున్నారు. ఎఫ్‌టిఐఐ అధ్యక్షునిగా గజేంద్ర చౌహాన్ నియామకాన్ని రద్దు చేయమని, ఎందుకు రద్దు చేయాలో కూడా తగిన కారణాలు చూపిస్తున్నారు. ప్రభుత్వం మాత్రం విద్యార్థులు ముందుకు తెస్తున్న వాదనలను పట్టించుకున్న దాఖలాలు లేవు. వారి వాదనలు ఎలా సరైనవి కావో లేదా తమ నియామక పద్ధతి ఎలా సరైనదో వివరించిందీ లేదు. కాని 2015 జూలై 14న ఎఫ్‌టిఐఐ డైరెక్టర్ మాత్రం విద్యార్థులను వెంటనే స్ట్రైక్ విరమించాలని, విద్యార్థులందరూ తమ అకడమిక్

కార్యకలాపాల్లోకి చేరిపోవాలని, లేదంటే తీవ్రమైన పాలనా పరమైన చర్యలు తీసుకోబడతాయని, విద్యార్థులను బహిష్కరించే చర్యలకు వెనుకాడబోమని హెచ్చరిస్తూ ఎఫ్‌టిఐఐ విద్యార్థి సంఘ అధ్యక్షుడు నచిముత్తును రాత పూర్వకంగా ఆదేశించారు. తద్వారా ప్రశ్నించే గొంతులను ఎలా అణచివేయదలచుకున్నారో తెలిసిపోతున్నది. ఎఫ్‌టిఐఐ విద్యార్థులతో చర్చించి ప్రభుత్వ నిర్ణయం ఎలా సరైందో తెలియచెప్పడం లేదా విద్యార్థుల కోరికను మన్నించడం చేయాల్సింది పోయి బెదిరింపులకు పాల్పడడం సరైంది కాదు.

దృశ్య మాధ్యమమేదైనా కాని (సినిమా, టివి) సమాజంపై చాలా ప్రభావాన్ని కలిగిస్తున్నాయి. అది సృజనాత్మకంగా, సామాజిక సమస్యలను, వాటి పరిష్కారాలను నిలబెట్టేందుకు, సున్నితంగా చెప్పగలిగి, ప్రజలను సమానత్వం వైపుకు, అందరి ఆత్మగౌరవాలను, ఆత్మవిశ్వాసాలను పెంపొందిస్తూ, రాజ్యాంగ లక్ష్యాలైన ప్రజాస్వామిక, లౌకిక, సామ్యవాద విలువలను వ్యాప్తి చెందించేందుకు వాటిని సాధించుకునే క్రమంలో సినిమాలు, టివిలు గణనీయమైన పాత్రను పోషిస్తాయి. మానవ సంబంధాల్లో రావాల్సిన, పెంపొందించవల్సిన మానవీయ కోణాలు, విలువలు ఎన్నింటినో రకరకాల రీతుల్లో ప్రతిబింబించేలా చేయడంలో ఎలాక్ట్రానిక్ మీడియాకున్న ప్రాధాన్యతను తక్కువ చేసి చూడలేం. సినిమా నిర్మాణం, ప్రదర్శన అనేవి సాంస్కృతిక రంగంలో ముఖ్యమైన స్థానాన్ని కలిగి ఉన్నది. ప్రజా సంప్రదాయాలకు, జీవితాలకు సంబంధించిన అవగాహనను, జ్ఞానాన్ని అందించడంలో, ప్రజాభిప్రాయాన్ని నిర్మించడంలో సినిమాలు ప్రముఖ పాత్ర పోషిస్తాయి. అయితే ఇవి ప్రస్తుతం ఇలా పనిచేస్తున్నాయా? అంటే లేదనే చెప్పవచ్చు. ఎక్కడో ఒకటో అరో అలా చేసే ప్రయత్నాలకు కూడా అడ్డు తగిలేలా బిజెపి ప్రభుత్వం ప్రయత్నిస్తున్నది. ఈ నేపథ్యంలో ఎఫ్‌టిఐఐ లాంటి సంస్థలకు ఎంతో ప్రాముఖ్యత ఉంటుంది. అటువంటి సంస్థను తమ నియంత్రణలోకి తెచ్చుకోవడంలో ఉద్దేశాన్ని సులభంగానే అర్థం చేసుకోవచ్చు. తమ భావజాలాన్ని వ్యాప్తి చేసుకోవడానికి, హిందూ మత భావాలను, అశాస్త్రీయ నమ్మకాలను, విశ్వాసాలను పుక్కిటి పురాణాలను ప్రచారంలో పెట్టి ప్రజల ఆలోచనలను వీలైనంత మేరకు మౌలిక సమస్యల కారణాలు-వాటి పరిష్కార మార్గాల నుండి పక్కదోవ పట్టించడం అనేది వారికి కావాలి. అలాగే ఆయా సంస్థల్లో ఉన్నటువంటి ప్రజాస్వామిక, శాస్త్రీయ దృక్పథం ఉన్న శక్తులను తొలగించడం వారి ఉద్దేశంగా తెలుసుకోవచ్చు. సృజనాత్మకతతో, శాస్త్రీయ విలువలతో నడిచే లేదా నడుస్తున్న సంస్థలను విచ్ఛిన్నం చేయగలిగినా చాలు, ఇది వారికి మేలు చేసేదిగానే ఉంటుంది. వామపక్ష భావజాలం ఉన్నవారిని జాతి వ్యతిరేకులుగా (యాంటి నేషనల్స్) చిత్రీకరిస్తూ పలు సంస్థల్లో మిగిలి ఉన్న ప్రగతిశీల, అభ్యుదయ, ప్రజాస్వామిక, లౌకిక స్వతంత్ర భావజాల వ్యక్తీకరణలను ధ్వంసం చేస్తే తప్ప తమ కాషాయీకరణ అజెండాను అమలులోకి తేవడం సాధ్యం కాదనే విషయం వారికి స్పష్టంగానే తెలుసు. ఎక్కడ వీలైతే అక్కడ, ఎంతమేరకు వీలతై అంతగా సంస్థలను బలహీన పరుస్తూ వాటిలోకి తమ అనుంగు సైన్యాన్ని నింపే అన్ని రకాల అవకాశాలను వినియోగించుకుంటున్నారు. తద్వారా ఆయా సంస్థల స్వయం ప్రతిపత్తిని అకడమిక్ స్వేచ్ఛలను దెబ్బ తీస్తున్నారు.

హిందూ జాతీయవాదం నిచ్చెనమెట్ల కుల వ్యవస్థను, పితృస్వామిక భావజాలాన్ని సమర్థిస్తుంది. ఇవి గొప్ప భారతీయ విలువలని అంగీకరిస్తుంది, ఆచరిస్తుంది. కొద్దిమంది హిందూ మత అగ్రకులాలకు చెందిన వేద సంస్కృతి, హిందూ పురాణాలను ప్రోత్సహిస్తూ, భారతీయు లందరిపై రుద్దే ప్రయత్నం జరుగుతున్నది. తద్వారా సామాజిక, ఆర్థిక అసమానతలతో ఉన్న వ్యవస్థను ప్రశ్నించకుండా, సమానత్వ దిశలో మార్పును కోరుకోకుండా, అసమాన నిచ్చెనమెట్ల ఆధిపత్య నిర్మాణాలను అంగీకరిస్తూ, అవి సహజమైనవేనని భావించడాన్ని, అశేష ప్రజానీకం శ్రమ వల్ల దేశ సంపద సృష్టించబడుతుందని కాకుండా కొద్ది మంది ధనవంతుల, పారిశ్రామిక వేత్తల కృషివల్లో జరుగుతుందనుకోవడాన్ని స్థిరపరచదలుచుకున్నారు. ఇందుకోసం ఆర్‌ఎస్‌ఎస్ హిందూ మత భావజాలాన్ని వ్యాపింపచేయబూనుకున్నది. దానికి రాజకీయ అధికారం బిజెపి రూపంలో వచ్చింది.

రాతలు, పాటలు, వివిధ కళారూపాలు, పెయింటింగ్స్, మాటలు, సినిమాల ద్వారా రాజ్యాన్ని ప్రశ్నించే వారు తీవ్రవాదులుగా, జాతి వ్యతిరేకులుగా, దేశ ద్రోహులుగా చిత్రీకరించబడుతున్నారు. అశాస్త్రీయతలను ప్రశ్నించిన నరేంద్ర దబోల్కర్, గోవింద్ పన్సరేలు ఇటీవల చంపబడ్డారు. ఢిల్లీ యూనివర్సిటీ అధ్యాపకుడు డాక్టర్ సాయిబాబాను సంవత్సరానికి పైగా జైల్లో నిర్బంధించారు. తీవ్రమైన అణచివేతను ప్రయోగించారు. ఇలాంటి తరుణంలో ఆర్‌ఎస్‌ఎస్ లేదా బిజెపి భావజాలం ఉన్నవారిని ఉన్నత స్థాయి సంస్థల్లో నియమించడం అంటే లౌకిక, సామ్యవాద, ప్రజాస్వామిక విలువలు ఎంత ప్రమాదంలో ఉన్నాయో అర్థం చేసుకోవచ్చు.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

**రాబోయే సంచికలలో...**

- **కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల ప్రజా వ్యతిరేక విధానాలు - రవిచందన్**
- **రాజ్యాంగ విలువలు - హక్కులు - సంక్షేమం - షేక్ కరిముల్లా**
- **ప్రాథమిక హక్కుల్లో విద్య మిథ్యేనా? - దుర్గం సారయ్య**
- **రైతుల ఆత్మహత్యలు - వందనా శివ**
- **గతం కన్నా క్షీణిస్తున్న విలువలు - టంకశాల అశోక్**

# నిర్దోషికి ఎనిమిదేళ్ల నిర్బంధం

***ఇప్పటికి ఐదు కేసులలో నిర్దోషిగా విడుదలై, రెండుసార్లు తిరిగి అరెస్టుకు గురై ఎనిమిది సంవత్సరాలుగా జైలులో గడుపుతున్న దుర్భర నిర్బంధ అనుభవాలు చెపుతున్నారు పద్మ***

**వినతి పత్రము**

*జిల్లా న్యాయ సేవా విభాగం,*
*కొండగాంవ్, ఛత్తీస్‌గఢ్*

**విషయం : న్యాయ సహాయానికి సంబంధించి**

*గౌరవనీయులకు,*

నా పేరు పద్మ. (భర్త: బాలకృష్ణ). అందరికి నమస్కారం. నేను 13 ఆగస్టు 2007 నుండి జగదల్‌పూర్ కేంద్ర కారాగారంలో విచారణలో ఉన్న ఖైదిగా ఉన్నాను.

నేను దాదాపు గత ఎనిమిది సంవత్సరాల నుండి జైలు జీవితాన్ని గడుపుతున్నాను. 2007 ఆగస్టు 3 న పోలీసులు నన్ను అనుమానంపై అరెస్టు చేసి, పదిరోజుల వరకు తమ అధీనంలో ఉంచుకొని, నేర సంఖ్య: 17/06 కేసులో నిందితురాలిని చేసి 2007 ఆగస్టు 13న జగదల్‌పూర్ కేంద్ర కారాగారానికి పంపారు. దంతెవాడలోని సెషన్స్ కోర్టులో రెండు సంవత్సరాల పాటు విచారణ ప్రక్రియ కొనసాగిన తరువాత, 2007 ఆగస్టు 10, ఉదయం 11 గంటలకు నిర్దోషిగా పేర్కొంటూ సెషన్స్ జడ్జి తీర్పునిచ్చారు.

నియమానుసారం వెంటనే జైలుకు పంపి, లాంఛనాలను పూర్తి చేసి వదిలిపెట్టాల్సి ఉండింది. కానీ పోలీసులు నన్ను వెంట తీసుకొని వేర్వేరు పోలీసు స్టేషన్లు, న్యాయస్థానాలు తిరిగి దొంగ వారంటు కోసం ప్రయత్నాలు చేశారు. ఇందు కోసం ఏవేవో సాకులు చూపి చట్ట వ్యతిరేక పద్ధతిలో నన్ను 36 గంటల పాటు తమ అధీనంలో ఉంచుకున్నారు. నకిలీ వారంట్ దొరికిన తరువాత 2009 ఆగస్టు 11 రాత్రి 11-12 గంటల మధ్య నన్ను రాయపూర్ సెంట్రల్ జైలుకి పంపారు. 12వ తేదీ పొద్దున్న విడుదలకు సంబందించిన లాంఛనాలు హడావిడిగా పూర్తి అయ్యి ఇంకా బయట అడుగు పెట్టక ముందే, కాంకేర్ పోలీసులు గేటు బయటనే ఘెరావ్ చేసి నకిలీ వారంట్ తో అరెస్టు చేశారు.

ఒక నెల రోజుల తరువాత 2009 సెప్టెంబర్ 6న బిజాపుర్ జిల్లా, మద్దేడ్ పోలీసు స్టేషన్ కి చెందిన ఇద్దరు ASIలు, సెంట్రల్ జైలు మహిళా విభాగంలోకి వచ్చి నవంబర్ 2006, జనవరి 2007 ఘటనల్లో నిందితురాలిని అని చెప్పి ఏవేవో ప్రశ్నలు వేస్తూ ఫారమ్‌లు నింపారు. అలా ఇష్టం వచ్చినప్పుడు కేసులు పెట్టడం అనేది ఇక్కడితో ఆగిపోలేదు. జనవరి, 2010లో జగదల్‌పూర్ సెషన్స్ జడ్జి జారీ చేసిన వారంట్‌లో బిజాపూర్ జిల్లా, భోపాలపట్నం పోలీసు స్టేషన్ పరిధిలో 1989లో జరిగిన ఘటనలో నిందితురాలిగా పేర్కొన్నారు.

వివిధ న్యాయస్థానాల్లో జరిగిన చట్టపర ప్రక్రియల తరువాత పైన పేర్కొన్న కేసులన్నింటిలో నిర్దోషిగా పేర్కొంటూ, 2014 డిసెంబర్ 17 సాయంత్రం 4.30 గంటలకు తీర్పు చెప్పారు. లాకప్ సమయానికంటే ముందుగానే, అంటే 7 గంటలవకముందే జైలుకి చేరుకున్నప్పటికీ, వెంటనే బయటకు పంపకుండా, ముందుగానే లాకప్ చేసి మర్నాడు (18-12-2014) జైలు ముందర పోలీసుల మోహరింపు జరిగాక విడుదల లాంఛనాలను హడావిడిగా పూర్తి చేశారు.

నారాయణ్‌పూర్ జిల్లాకి సంబంధించి 1998 నాటి ఒక వారంట్ పెండింగ్‌లో ఉందనీ, ఐజితో మాట్లాడితే ఆ వారంటు రద్దు కావచ్చనీ, జైలు బయట ఉన్న పోలీసులు నా వకీలుకి చెప్పారు. కానీ ఈ వంకతో అనధికారంగా అరెస్టు చేసి జగదల్‌పూర్ పోలీసు స్టేషన్‌లో ఉంచారు. నారాయణపూర్ ఎస్ఐ నా పేరు, అడ్రసు అడిగి ఒక తెల్లకాయితం మీద రాసింది. 2014 డిసెంబర్ 18న మధ్యాహ్నం దాదాపు ఒంటి గంట ప్రాంతంలో అరెస్టు చేసినట్లు చూపించి జగదల్‌పూర్‌లో గౌరవనియులైన ప్రధాన మేజిస్ట్రేట్ ముందు హాజరు పరచారు. ఆ తరువాత నారాయణపూర్ పోలీసు స్టేషన్ పరిధిలో 1998 సంవత్సరానికి చెందిన రెండు వారంట్లు వున్నాయని జగదల్‌పూర్ II అప్పర్ కోర్టు న్యాయస్థానంలో సంతకం చేయించారు. నారాయణపూర్ జిల్లా బెనూర్ పోలీసు స్టేషన్ పరిధిలో 1998 నాటి ఒక వారంట్ వుందని చెప్పి, అక్కడ నుంచి జగదల్‌పూర్‌లోని III అప్పర్ సెషన్స్ కోర్టుకు తీసుకువెళ్లి గౌరవనీయులైన న్యాయాధీశుల ముందు ప్రవేశపెట్టారు. నాతో పోలీసులు వ్యవహరించిన తీరు, నా జుడీషియల్ కస్టడీ అవధి వగైరాల గురించి జడ్జిగారికి మౌఖికంగా తెలియచేశాను.

2007లో తమ అధీనంలో నన్ను చాలా కాలం వరకు వుంచుకొని, కేవలం ఛత్తీస్‌గఢ్ పోలీసులే కాదు, వేర్వేరు రాష్ట్రాల నుంచి వచ్చిన పోలీసులు కూడా ఇంటరాగేషన్ చేశారు. వందల కొద్ది ప్రశ్నలు వేసీ, రికార్డ్‌లను తిరగేసినప్పటికీ, నాకు వ్యతిరేకంగా పోలీసులకు నిర్దిష్టమైన సాక్ష్యమేమీ దొరకలేదు. ఏ గ్రామ ప్రజలు కూడా నన్ను గుర్తు పట్టలేదు. ఎందుకంటే, నేను ఆ గ్రామాలకు పోవడం మాట అటుంచి, వాటి పేర్లను కూడా వినలేదు. అయినప్పటికి, జైలుకు పంపాలనే ఉద్దేశ్యంతో నకిలీ వారంట్ తో 17/06 (సంకెన పల్లి, మద్దెడ్ పోలీసు స్టేషన్) కేసులో నిందితురాలిగా చూపించారు. జైలులో వుండగానే కేసుల సంఖ్య పెరిగిపోతోంది. జైలులో మా హక్కుల గురించి గొంతెత్తడమే నేరమైపోతోంది.

2014 డిసెంబర్ 18న మూడోసారి అరెస్టు చేసి, ఒక వారంట్

పెండింగ్ వుందని చెప్పి, కోర్టులో ఉన్నప్పుడే కొన్ని గంటల వ్యవధిలో 4 వారంట్లను తయారు చేశారు. మరుసటి రోజు 2014 డిసెంబర్ 19 సాయంత్రం 7 గంటలకు జైలు అధికారుల నుంచి పిలుపు వచ్చిందని చెప్పి లాకప్ చేసిన బ్యారక్ తాళం తీసి నన్ను వారంట్ శాఖకు తీసుకువెళ్లారు. అక్కడ సివిల్ దుస్తుల్లో ఉన్న వ్యక్తులు ఇద్దరు తాము ఫరస్ గఢ్, మద్దెడ్ పోలీసు స్టేషన్ లకు చెందిన ఏఎస్ఐలమని పరిచయం చేసుకుని, 'బస్తర్ డివిజన్ ఐ.జి, 2014 డిసెంబర్ 17నాడు పోలీసు స్టేషన్ లన్నింటికి పంపిన వైర్ లెస్ ఆదేశానుసారం మా రికార్డ్స్ ని వెతికిన తరువాత, పద్మ (భర్త పేరు – తెలియదు) పేరుతో ఫరస్ గఢ్ పోలీసు స్టేషన్లో 2008, 2004 కు సంబందించిన రెండు కేసులు; మద్దేడ్ స్టేషన్ లో 2010లో ఒక కేసు ఉన్నాయి' అని చెప్పారు. నేను వారికి నా వాదనను వినిపించి నా పై కేసు పెట్టాలా వద్దా అనే విషయాన్ని వారి విచక్షణా జ్ఞానానికి వదిలివేశాను. వాళ్లిద్దరూ లేచి వెళ్లిపోతుంటే, 'నన్ను ఆ కేసుల్లో ఆరోపిని చేయదల్చుకోకుంటే కనుక, మరింకెప్పుడూ కూడా నాపై ఆ కేసులను (అంటే విడుదలైన తరువాత కూడా) పెట్టమని రాసియ్యండి' అని విన్నవించుకున్నాను. 'ఈ విషయం పై ఆఫీసర్లకు రిపోర్టు చేస్తాము' అంటూ వెళ్లి పోయారు. కానీ ఇంతవరకు వారి నుండి ఎలాంటి ప్రతిస్పందన లభించలేదు.

III ADJ, కొండగాంవ్‌లో 2015 జనవరి 24న నన్ను హాజరు పరిచినప్పుడు, ఒక వ్యక్తి వచ్చి ఇక్కడ పని అయిన తరువాత II ADJ కోర్టులో కూడా ప్రవేశ పెట్టాలనే జడ్జి గారి ఆదేశాన్ని మౌఖికంగా ఎస్ఐకి చెప్పి వెళ్లాడు. ADJ కోర్టులో హాజరు పరిచిన తరువాత, గౌరవనీయులైన జడ్జిగారు – 2005లో బస్తర్ జిల్లా, మార్దూమ్ పోలీసు స్టేషన్ పరిధిలో జరిగిన ఘటనలకు (2 కేసులు) సంబంధించిన కేసు చలాన్‌లో పద్మ పేరు ఉందని చెప్పారు. నా వాదనను వినిపించిన తరువాత, చలాన్‌లో పద్మ తండ్రి పేరు, ఇంటి అడ్రసు వగైరాలు లేవు కాబట్టి నేను విడుదలయ్యే అవకాశం ఉందని అన్నారు. నన్ను కేసులన్నింటి నుంచి పూర్తిగా విముక్తి చేయాలని వారికి విజ్ఞప్తి చేశాను.

2015 ఫిబ్రవరి 7న జైలు అధికారులు పిలిచారని చెప్పి వారంట్ శాఖకు తీసుకువెళ్లి జగదల్‌పూర్ గౌరవ ఫస్ట్ క్లాస్ జుడీషియల్ మేజిస్ట్రేట్ జారీ చేసిన ప్రొడక్షన్ వారంట్ ను చూపించారు. 'బిజాపుర్ జిల్లా ఉసూర్ పోలీసు స్టేషన్ పరిధిలో 1992లో జరిగిన ఘటన నేరం సంఖ్య 736/92, సెక్షన్లు IPC 147, 148, 435/34 కింద నిందితురాలు పద్మక్క, భర్త సత్యన్న టగోపన్న, అడ్రసు: దుర్గాబాద్, కరీంనగర్ జిల్లా. పద్మక్క జగదల్‌పూర్ కేంద్ర కారాగారంలో ఉంటే కనుక అక్కడి కోర్టులో హాజరు పరచాలనీ, లేకపోతే ఆ విషయాన్ని కోర్టుకి తెలియచేయాలి' అని ఆ వారంట్‌లో వుండింది. కేవలం పద్మ అనే పేరు తప్ప మిగతా ఏ వివరాలు నాతో సరిపోలవనీ, 1992లో నేను 12వ తరగతి చదువుతున్నాననీ, నా గురించిన మొత్తం వివరాలను తెలియచేస్తూ 2015 ఫిబ్రవరి 12న గౌరవనీయులైన JMFC కి విజ్ఞప్తిని పంపి, ఏం చేయాలో చెప్పమని కోరాను. కానీ ఇంతవరకు నాకు ఏ సమాధానమూ రాలేదు. (చట్టపరమైన విషయాలు తెలియకపోవడం వల్ల జైలు అధికారులు చెప్పినట్లుగా ఆ విజ్ఞప్తిని పంపించాను.)

2014 డిసెంబర్ 17న I/C, C/Room, KKP ద్వారా పంపబడిన వైర్‌లెస్ మెసేజ్‌కి జవాబుగా, డిసెంబర్ 19న కాంకేర్ జిల్లా, రావ్ ఘాట్ పోలీసు స్టేషన్ నుండి, పద్మ @ పద్మక్క (నక్సల్ మహిళ, కేస్కల్ దళం) పేరుతో (క్రైమ్ సంఖ్య 15/97, సెక్షన్ 147, 148, 149, 307 IPC 25, 27AA) ఉన్న వారంట్ పెండింగ్‌లో ఉన్నదనే సమాచారం వచ్చిందనే విషయాన్ని జైలు అధికారులు నాకు 2015 ఫిబ్రవరి 16న తెలియచేసారు.

ఇలా కొత్త కొత్త కేసులు రావడమనే పరంపర అంతటితో ఆగలేదు. చాలా కాలం నుండి మానసిక వేదనకు గురవుతూండడం వల్ల ఆ ప్రభావం నా ఆరోగ్యంపై పడుతోంది.

2007లో నా అరెస్టు కేవలం అనుమానంతో జరిగిందని గౌరవనీయులైన సెషన్స్ జడ్జి 2009లోనే ప్రకటించారు. అయినా, పోలీసులు తమ తప్పును ఒప్పుకోవడానికి బదులు, నిర్దోషినని తీర్పు వచ్చిన తరువాత కూడా మళ్లీ మళ్లీ అరెస్టు చేస్తూ, దొంగ కేసులు పెడుతూ మానవ హక్కులను ఉల్లంఘిస్తున్నారు. 2007లో పెట్టిన 17/06 కేసు, 2009లో పెట్టిన 5/07, 31/06 కేసులు ఒకే పోలీసు స్టేషన్‌కి సంబంధించినవి. ఆ కేసు డాక్యుమెంట్ల ప్రకారం ఆ ఘటనలు కూడా 4,5 నెలల వ్యవధిలో జరిగాయి. 31/06 కేసులోనైతే 2009 జులై 25న పరారీలో ఉన్నాననే పేరుతో చలాన్ జారీ అయింది. ఒకవేళ పోలీసులు చెప్పేది నిజమే అయితే నేను 2007లో అదే పోలీసు స్టేషన్లో, వారి ఆధీనంలోనే ఉన్నాను, తరువాత కూడా జుడీషియల్ కస్టడీలోనే ఉన్నాను. కేవలం బంధించి ఉంచడమనేదే పోలీసుల లక్ష్యంగా స్పష్టమవుతోంది.

బీజాపూర్ జిల్లా, భోపాల పట్నం సరిహద్దులో 1989లో జరిగిన ఘటనలో ఉండిన 25–27 సంవత్సరాల పద్మ, కాంకేర్ జిల్లా, అమాబేడా సరిహద్దులో 1999లో జరిగిన ఘటనలో ఉన్న పద్మ, 2008లో బిజాపుర్ జిల్లా, ఫరస్‌గఢ్ సరిహద్దులో జరిగిన ఘటనలో ఉన్న 25 సంవత్సరాల పద్మ– వీరందరూ ఒకే వ్యక్తి కావడం అనేది అసంభవం. కానీ పోలీసుల ప్రకారం మూడు ఘటనల్లోనూ జారీ అయిన వారంట్ నా పేరు మీదనే. ఆ వారంటులను చూసిన గౌరవనీయులైన జడ్జిగారే స్వయంగా, అనధికారికంగా, ఈ వారంట్లు నకిలీవి అనే విషయాన్ని ఒప్పుకున్నారు. న్యాయ ప్రక్రియ పేరుతో దాదాపు ఎనిమిది సంవత్సరాల నుంచి నిర్బంధ జీవితాన్ని గడుపుతున్నాను.

వారంటులో పంచనామాలు వేర్వేరుగా ఉన్నప్పటికి ప్రక్రియలు జరుగుతూనే ఉంటాయి. కొన్ని వారంట్లలోనయితే వివరాలను నన్ను అడిగి నింపారు. వారంట్లలో చట్ట ఉల్లంఘన కూడా జరిగింది. చలాన్‌లో ఉండే తప్పులకైతే లెక్కే ఉండదు. 2014 డిసెంబర్‌లో పెట్టిన కేసులకి సంబంధించిన డాక్యుమెంట్లు నాకు అందనేలేదు. ఆరోపణలు తప్పు అని తెలిసినప్పటికి పోలీసులు తమకు ఇవ్వబడిన ప్రత్యేక అధికారాల్ని ఉపయోగిస్తూనే ఉన్నారు. ఇందువల్ల కుటుంబాలు విచ్ఛిన్నమవు తున్నాయి. ఎంతోమందిలో నైపుణ్యము, సామర్థ్యత వృథా అవుతున్నాయి. గడచిపోయిన అమూల్యమైన సమయం, జీవితాలు మళ్లీ తిరిగిరావు. అయినప్పటికి ఇలాంటి అవ్యవస్థతకి బాధ్యతను ఎవరూ వహించరు. ఏళ్ల తరబడి న్యాయ ప్రక్రియ పేరుతో ఇనుప చువ్వల వెనుక న్యాయం కోసం ఆశతో ఎదురుచూస్తూ కూచోవాల్సొస్తుంది. ఆటంకాలు కేవలం

## వివరాలు సంక్షిప్తంగా

| | |
|---|---|
| మొదటి సారి అరెస్టు | : 03.08.2007, రాత్రి 11 గంటల సమయంలో, భిలాయ్‌లో |
| ట్రాంజిట్ రిమాండ్ కోసం బిజాపూర్ కి పంపారు | : 08–08.2007 (07.08.2007 రాత్రి 2 గంటలకు ఆధునిక ఆయుధాలను ధరించిన పోలీసు దళాలు, బూట్లను టకటకలాడించుకుంటూ ధడేల్మని తలుపులు తెరచుకొని వచ్చి చిటికెలేస్తూ 'బీజాపూర్‌లో చూపిస్తాం నిన్ను' అంటూ పోలీసు నిఘాలో ఆసుపత్రిలో వున్న నన్ను బెదిరించారు) |
| జైలులో పెట్టింది | : 13.08.2007 రాత్రి 8.30 – 9 గంటల ప్రాంతంలో |
| పెట్టిన కేసులు | : 17/06, సెక్షన్ : 302, 147, 148, 149 IPC; 25, 27 Arms Act (ఘటన తేది: 16.06.2006, మద్దెడ్ పోలీసు స్టేషన్) |
| వారంట్ జారీ | : JMFC, బీజాపూర్ (07.08.2007) |
| ట్రయల్ | : సెషన్స్ కోర్టు, దంతేవాడ |
| న్యాయవాది | : శ్రీ కె.కె. దేవాంగన్ |
| ముఖ్య సమస్య | : కేవలం 3 వాయిదాలకే కోర్టుకు తీసుకువెళ్లారు. 1: 28.08.2008, 2: 1.07.2009, 3: 10.08.2009 |
| ప్రస్తుత పరిస్తితి | : 10.08.2009 ఉదయం 11 గంటల ప్రాంతంలో సెషన్స్ కోర్టు జడ్జి నిర్దోషిగా తీర్పు ఇచ్చారు. |
| జైల్లో పెట్టింది (రాయపూర్) | : 11.08.2009 రాత్రి 11–12 గంటల మధ్య |
| విడుదల | : 12.08.2009 ఉదయం దాదాపు 10 గంటల ప్రాంతంలో (నకిలీ వారంటు దొరికిన తరువాత, గేటు దగ్గర పోలీసులను మోహరించాక) |

భౌతిక రూపంలో మాత్రమే ఉండవు. అడుగడుగునా అవమానాల పాలయ్యే పరిస్థితులను ఎదుర్కోవాల్సి వస్తూంటుంది. అభివృద్ధి వుండదు. కనీస సౌకర్యాల కోసం దేబిరించాల్సొస్తుంది. హక్కుల ఉల్లంఘన జరుగుతున్నప్పటికి భరించాల్సొస్తుంది. పద్ధతి ప్రకారం విచారణ జరగాలనే ప్రాథమిక హక్కుని డిమాండ్ చేయడం జైలు అధికారుల, పోలీసుల దృష్టిలో నేరమవుతోంది. ఇలాంటి స్థితిలో ప్రశాంతంగా ఎలా జీవించగలం?

దుఃఖభరితమైన జీవితాన్ని గురించి చెప్పడానికి ఈ వినతిపత్రం సరిపోయే మాధ్యమం కాదు. 'ఎక్కడైతే అన్యాయం లేదా ఇష్టారాజ్యం అమలవుతుందో అక్కడ న్యాయస్థానం కలిగించుకోవాలి' అని గౌరవనీయులైన సుప్రీంకోర్టు న్యాయమూర్తి అన్న మాటలు విని నమ్మకం రేకెత్తుతుంది. మా దుఃఖాన్ని వినేవాళ్లు ఉన్నారు అనే ఊరట కలుగుతుంది.

కానీ పోలీసుల ఇష్టారాజ్యం, అన్యాయాల గురించి అక్కడి వరకు తెలిపే మాధ్యమాలు కావాలి. నాకు న్యాయాన్ని కలిగిస్తారని ఆశిస్తున్నాను.

అపరిమిత కాలం జైలులో బందీగా ఉండడం వల్ల నిరంతరం, ఆందోళన, మానసిక ఒత్తిడికి గురవుతూ, శారీరక, మానసిక అస్వస్థతల పాలవుతున్నాను. నాతో పాటు నా కుటుంబం కూడా ఆందోళన చెందుతున్నది. నా మీద బెంగ వల్ల వృద్ధురాలైన మా అమ్మ అనారోగ్యం పాలైంది. నన్ను కలవడానికి ఇంత దూరం రావడానికి ఆర్థిక ఇబ్బందులు ఒక కారణమైతే భాష మరొక సమస్యగా ఉంది. కనీసం అమ్మ గొంతు వినడానికి కూడా ఏళ్ల తరబడి తహతహలాడాల్సి వస్తోంది. కాలం గడుస్తున్న కొద్ది శక్తి, సామర్థ్యాలు తగ్గిపోతున్నాయి. దీర్ఘకాలం నుండి అనేక సౌకర్యాలు, హక్కుల నుండి వంచితురాలనవుతున్నాను. న్యాయాన్నందించి సమాజంలో గౌరవంగా జీవించే అవకాశాన్ని కల్పించండి.

ఏళ్ల తరబడి జైలులో ఉన్న తరువాత, విడుదలయ్యే రోజున స్వేచ్ఛ నుంచి వంచితురాల్ని చేసి పాత, అబద్ధపు వారంట్లతో అరెస్టు చేయడం అనేది మానవ హక్కుల ఉల్లంఘనే అవుతుంది. ఇలాంటి స్థితిలో నా అరెస్టుని చట్టవ్యతిరేకమైనదిగా ప్రకటించడానికి ఈ వినతిని ఉన్నత న్యాయ స్థానానికి తీసుకెళ్లండి.

మానవ హక్కులను పరిరక్షించడంలో మద్దత్తునిచ్చి న్యాయవ్యవస్థ మీద విశ్వాసాన్ని కలిగించండి. నాకు నిర్బంధ జీవితాన్నుండి విముక్తిని కలిగించి గౌరవంగా జీవించే అవకాశాన్ని కలగచేయండి. దయచేసి నా విన్నపాన్ని ఉన్నత న్యాయస్థానానికి తీసుకు వెళ్లడానికి సహాయం చేయండి. నాపై పెట్టిన కేసులకు సంబంధించిన డాక్యుమెంట్లని ఇప్పించండి.

సానుకూలంగా స్పందిస్తారని ఆశిస్తూ

మీ విధేయురాలు,

*(పద్మ)* (భర్త: బాలకృష్ణ)

జగదల్ పూర్, 05.05.2015.

*(కాంకేర్ జిల్లా లీగల్ సర్వీసెస్ అథారిటీకి పద్మ రాసిన హిందీ ఉత్తరానికి అనువాదం)* వీ

# ఉగ్రవాదులను తయారు చేస్తున్న భారత రాజ్యం

***సామాజిక శాస్త్రవేత్త మనీషా సేఠీ రాసిన 'కాఫ్కాలాండ్: ప్రెజుడిస్, లా అండ్ కౌంటర్ టెర్రరిజం ఇన్ ఇండియా' అనే పుస్తకంలో అనుబంధంగా ప్రచురించిన 'ఒక ఉగ్రవాది ప్రధానమంత్రికి రాసిన ఉత్తరం'***

*అల్ బదర్ అనే ఉగ్రవాద సంస్థకు చెందినవారని ఆరోపిస్తూ ముహమ్మద్ ఇర్షాద్ అలీని, మారిఫ్ ఖమర్‌ను ఢిల్లీ పోలీసు ప్రత్యేక సెల్ ఫిబ్రవరి 9, 2006న 'అరెస్టు' చేసింది. అలీ, ఖమర్‌లు సిబిఐ విచారణ కోరుతూ ఢిల్లీ హైకోర్టుకు అభ్యర్థన పంపారు. హైకోర్టు సిబిఐ విచారణకు ఆదేశించింది. వాళ్లు ఇద్దరూ ఉగ్రవాద సంస్థ సభ్యులు కాదనీ, జమ్మూ-కశ్మీర్‌లో ఉగ్రవాద సంస్థలలోకి చొరబడే బాధ్యత తీసుకున్న పోలీసు ఇన్‌ఫార్మర్లనీ సిబిఐ విచారణలో తేలింది. తీహార్ జైలులోని అతి భద్రతా సెల్‌లో ఉన్నప్పుడు ఇర్షాద్ అలీ అప్పటి ప్రధాన మంత్రి డా. మన్మోహన్ సింగ్‌కు ఒక ఉత్తరం రాశాడు. ఆ ఉత్తరాన్ని ఉర్దూ మూలం నుండి ఇంగ్లిషులోకి కశ్మీర్ టైమ్స్ సంపాదకుడు ఇఫ్తికార్ గిలానీ అనువాదం చేయగా, న్యూఢిల్లీలోని జామియా మిలియా ఇస్లామియా విశ్వవిద్యాలయంలో సెంటర్ ఫర్ కంపారిటివ్ రిలీజియన్స్ అండ్ సివిలిజేషన్స్‌లో అధ్యాపకురాలిగా ఉన్న మనీషా సేఠీ రాసిన 'కాఫ్కాలాండ్ : ప్రెజుడిస్, లా అండ్ కౌంటర్ టెర్రరిజం ఇన్ ఇండియా' వ్యాస సంకలనంలో అనుబంధంగా చేర్చారు. ఆ పుస్తకాన్ని త్రీ ఎస్సెన్స్ కలెక్టివ్ ప్రచురణ సంస్థ 2014 అక్టోబర్‌లో ప్రచురించింది. ఆ ఉత్తరం:*

**ప్రధాన మంత్రి గారికి,**
**సౌత్ బ్లాక్, ఢిల్లీ**

అయ్యా,

నా పేరు ఇర్షాద్ అలీ. తండ్రి పేరు మహమ్మద్ యూనస్. తీహార్‌లోని ఎనిమిదో నంబర్ జైల్లో 5వ నంబర్ వార్డు సెల్ నంబర్ 13లో ఉన్నాను.

ఉగ్రవాదంతో పోరాడే పేరుమీద అడ్డదారులు తొక్కే రక్షణ బలగాలు పురస్కారాల కోసం, పదోన్నతుల కోసం పన్నే వలల నుంచి అమాయక యువకులను రక్షించాలనే ఉద్దేశంతో తీహార్ జైలు నుంచి ఈ ఉత్తరం రాస్తున్నాను. ప్రజలూ, పాఠకులూ తమను తాము రక్షించుకోవడానికి ఈ ఉత్తరం ఉపయోగపడుతుందని ఆశ.

2007 సెప్టెంబర్ 13 'టైమ్స్ ఆఫ్ ఇండియా' లో నా గురించి వచ్చిన కథనాన్ని మీలో చాలా మంది చదివే ఉంటారు. ఇంటెలిజెన్స్ బ్యూరో (ఐబి), ఢిల్లీ పోలీస్ స్పెషల్ సెల్ మా ఇద్దరినీ తప్పుడుగా ఇరికించినట్లు సిబిఐ నిర్ధారించిందని ఆ కథనంలో ఉంది. అయితే సిబిఐ ఇంకా ముందుకు వెళ్లి అసలు దోషులు ఎవరో నిర్ధారిస్తుందా, పట్టుకుంటుందా అని నా అనుమానం.

నేను ఢిల్లీ పోలీసు ప్రత్యేక సెల్ కింద పనిచేసే ఇన్‌ఫార్మర్‌ను. ఈ ప్రత్యేక సెల్ ఉగ్రవాదుల్ని పట్టుకోవడంలో ఐబితో కలిసి పనిచేస్తుంది. నేను ఈ సంస్థలతో సన్నిహితంగా పనిచేశాను. అయితే ఈ సంస్థలే ఉగ్రవాదుల్ని ఎట్లా తయారు చేస్తున్నాయో మీకు చెప్పాలి. 'ఉగ్రవాదులపై యుద్ధం' అనేదాన్ని ప్రహసనంగా మార్చేశారు. చాలసార్లు ఈ సంస్థలు నేరం చేయక ముందే నేరస్తుల్ని పట్టేసుకుంటాయని మీరు ఎప్పుడైనా గమనించారా? కాని, ముంబయిలో, ఢిల్లీలో జరిగిన పేలుళ్లకు కారణమైన ఉగ్రవాదుల్ని మాత్రం ఈ సంస్థలు ఇంతవరకూ పట్టుకోలేక పోవడం ఆశ్చర్యంగా ఉందా? ఎందుకూ? జవాబులు నా దగ్గరున్నాయి.

పురస్కారాల కోసం, ర్యాంకుల కోసం, స్పెషల్ సెల్ ఉగ్రవాదుల్ని పుట్టిస్తుంది. ఈ సంస్థలు ఎట్లా పనిచేస్తాయో వివరిస్తాను.

స్పెషల్ సెల్ అధికారులు పదో పరకో ఇస్తూ చాలా మంది యువకుల్ని పనిలో పెట్టుకున్నారు. ఈ యువకులు ముఖ్యంగా తిరుగుబోతులు. ఇవేవీ నియమిత ఉద్యోగాలు కావు. ఈ యువకులకు మొబైల్ ఫోనులిస్తారు. రక్షణ కల్పిస్తారు. వీరు ఢిల్లీ పట్టణంలో వివిధ ప్రాంతాలకు విస్తరించి, ఉండేందుకు ఏర్పాట్లు చేసుకుంటారు. ఇలా ఏజెంట్లుగా మారిన యువకులు స్థానిక నిరుద్యోగ యువకులతో కలిసి మెలిసి, స్నేహంగా ఉంటారు. వాళ్లలో కొంతమందిని లక్ష్యంగా చేసుకొని, ఒక బృందాన్ని తయారు చేస్తారు. వారికి ఆయుధాలు ఇస్తారు. దోపిడీలు చేయాలని వారిని ప్రోత్సహిస్తారు. పేరుపొందిన కారు దొంగలు మాయం చేసిన వాహనాల్ని ఈ స్పెషల్ సెల్ వాళ్లు తీసుకొని, ఈ బృందానికి ఇస్తారు.

అలా ప్రత్యేక సెల్ ఏజెంట్ మీద ఆ బృందానికి గురి కుదిరిన తర్వాత, వాళ్లందరినీ ఒక రోజు ఆపరేషన్ కోసం అని చెప్పి బయల్దేరదీసి టార్గెట్ స్థలానికి చేరుతారు. ఇంతలో అందరికందరూ వలలో పడ్డ చేపల్లా దొరికిపోతారు. ఎట్లా? వాళ్లు చేరబోయే స్థలం ఏజెంట్ ద్వారా పోలీసులకు ముందే తెలిసిపోతుంది. ఇంకేముంది? పోలీసులు ఎదురు లేకుండా దాడి చేసి వారందరినీ ఇట్టే పట్టుకుంటారు. ఈ మొత్తం ఆపరేషన్‌లో కీలకమైన ఏజెంట్ మాత్రం ఎంచక్కా మాయమైపోతాడు. పోలీసు వలలో ఎప్పుడూ పడడు. అలా ఉగ్రవాదుల బృందాన్ని వీరోచితంగా పట్టుకున్నందుకు గుట్టలుగా పురస్కారాలూ, వీరత్వ అవార్డులూ అధికారులకు అందుతాయి.

ఈ మొత్తం పరిణామంలో తాము ఎట్లా అరెస్టయ్యామన్న అసలు విషయం యువకులకు ఎంతమాత్రం తెలియదు. వాళ్లు అది తమ దురదృష్టమని భావిస్తారు. తమ రాత బాగులేదనుకుంటారు. ఇంకేం

చేయగలం అని నిరాశపడతారు. ఏళ్లూ పూళ్లూ జైళ్లలో గడుపుతారు.

ఇంటెలిజెన్స్ బ్యూరో ఎట్లా పని చేస్తుందో మరికొంత చెప్పనివ్వండి. నిజానికి ఇది ఒట్టి పనికిమాలిన సంస్థ. ఇది చేసే నిర్వాకమేదీ లేదు. ప్రభుత్వానికీ, మీడియాకూ కాకమ్మ కథలు సరఫరా చేయడమే దానికి తెలుసు. అందుకు గాను, ఆ సంస్థకు ప్రత్యేక అధికారాలతో పాటు కోట్ల కొద్ది రూపాయలు అందుతాయి. వాళ్లు ఎవరికీ జవాబుదారీ కాదు. ఎందుకంటే వారు చేసే పని అంతా రహస్యం కదా అంటారు. డజన్ల కొద్దీ ఉగ్రవాదులు ఢిల్లీకి వచ్చారనీ, అరడజను మంది ఉగ్రవాదులు ముంబయిలో తిరుగుతున్నారనీ, ఉత్తరప్రదేశ్‌లో ఐఎస్ఐ ఊడలు దిగుతున్నాయనీ, వగైరా, వగైరా కథలు మీరు చాలాసార్లు వినలేదూ? ఈ కథలన్నీ ప్రజలచేత నమ్మించాలి. ముస్లింలు నివసించే ఏదో ఒక ప్రాంతంలో పొడుగాటి గడ్డం పెంచుకున్న మౌల్వీ వేషం వేసుకున్న ఏజెంట్‌ను ప్రవేశపెడతారు. మసీదులో గాని, మసీదు దగ్గర్లో గాని తన మకాం పెడతాడా మౌల్వీ. మౌల్వీకుండే పవిత్రత వల్లా, అతను చెప్పే హృదయ విదారక కథల వల్లా స్థానికుల సానుభూతిని చూరగొంటాడు. అతను ఏరికోరి చదువుకున్న ముస్లిం యువకులతో నేస్తం కడతాడు. తన లక్ష్యాలను నిదానంగా ఎంచుకుంటాడు. భారత వ్యతిరేక ప్రచారంతో, ఉపన్యాసాలతో వాళ్లను ఉద్రేకపరుస్తాడు. ముస్లింల కడగండ్లపై కన్నీరొలికిస్తూ జిహాద్ (పవిత్ర యుద్ధం) అవసరాన్ని నూరిపోస్తాడు.

ఒకానొక రోజున, నిజానికి తానొక లష్కర్-ఎ-తయ్యిబా లేదా వేరే ఏదో సంస్థ కమాండర్‌నని ఆ బృందాన్ని నమ్మిస్తాడు. ఇప్పటికే ఆ మౌల్వీ (ఏజెంట్) మాటలతో ప్రభావితమైన యువకులు అతణ్ని విశ్వసిస్తారు. భావోద్వేగులవుతారు. ఆ ఏజెంట్ వాళ్లందరికీ చిన్న తుపాకులు పంచి, వాటిని ఉపయోగించడంలో తర్ఫీదు ఇస్తాడు. మందుగుండూ, వాహనాలూ సిద్ధమవుతాయి. ఇంటెలిజెన్స్ బ్యూరోతో అనుక్షణం సంబంధంలో ఉంటూ ఆ ఏజెంట్ ఎప్పటికప్పుడు తాజా సమాచారాన్ని ఇస్తుంటాడు.

ఆఖరుకు రంగం సిద్ధమవుతుంది. 'కమాండర్' చర్యకు పిలుపు నిస్తాడు. అప్పటికే రెక్కీ పూర్తయి ఉంటుంది. ఈ లోపల ఐబి ప్రత్యేక సెల్‌కు సమాచారం ఇస్తుంది. చర్య జరగాల్సిన స్థలంలో వల ఏర్పాటవుతుంది. మగ్గిన పళ్లు రాలినట్లుగా ఈ యువకులంతా ఏ ప్రతిఘటనా లేకుండా పోలీసుల వలలో పడతారు. పోలీసుల వలలో ఎలా పడ్డామో ఆ యువకులకు ఎప్పటికీ తెలిసే అవకాశం లేదు. ఆ ఆపరేషన్‌లో 'కమాండర్' పారిపోతాడు. తిరిగి ఐబి నెట్‌వర్క్‌లోకి, అంటే, మళ్లీ కొత్త లక్ష్యాల వేటలోకి వెళ్తాడు. ఇంతమంది టెర్రరిస్టులు పట్టుబడ్డారనీ, ఒకరు మాత్రం పోలీసుల కళ్లుగప్పి పారిపోయారనీ మర్నాడు వార్తలు వస్తాయి.

దొరికిపోయిన యువకులు తమను తామే నిందించుకుంటారు. తప్పు చేశామన్న భావనతో జీవితాంతం కుమిలిపోతారు. 'మీరు చేసిన నేరాలకు నిజానికి మిమ్మల్ని ఎన్‌కౌంటర్ చేయాలి. దయతలచి జైలుకు పంపుతున్నాం. ఆరేడేళ్లు జైలులో ఉండాలి' అనే ప్రత్యేక సెల్ అధికారుల మాటలు విని, తెర వెనుక ఏమి జరిగిందో తెలియని ఈ అమాయక యువకులు మాకు వీళ్లేదో మేలు చేస్తున్నారని మురిసిపోతారు.

పోలీసులు అరెస్టు చేసిన వారి దగ్గర దొరికినట్లుగా పేలుడు పదార్థాలు, డ్రగ్స్ చూపిస్తారు. ఇవన్నీ ఎక్కడ్నించి వస్తాయి? చాలా సులభం. ఉదాహరణ రు. 50 లక్షల దొంగ నోట్లతో ఒకతను దొరికినప్పుడు, రు. 5 లక్షలు దొరికినట్లుగా కేసు పెడతారు. నిజానికి దొంగ నోట్ల కేసు రు. 50 లక్షలైనా, రు. 5 లక్షలైనా నేరమొకటే. నేరస్తుడికి తెలియక, 'ఇదేదో బాగుందిలే, తక్కువే చూపిస్తున్నారు' అనుకుంటాడు. మిగిలిన రు. 45 లక్షల దొంగనోట్లను భద్రంగా ఉంచి, ఇటువంటి కేసుల్లో ఉపయోగిస్తారు. గంజాయి, హెరాయిన్, పేలుడు పదార్థాలు లాటి వాటిని కూడ ఇలాగే ఉపయోగిస్తారు.

ఢిల్లీ ప్రత్యేక సెల్, ఐబి ఇలాంటి చట్ట వ్యతిరేక కార్యకలాపాల కోసమే ఢిల్లీ నగర శివార్లలో పెద్ద పెద్ద ఫామ్‌హౌస్‌లను నిర్వహిస్తున్నాయి. ఎన్‌కౌంటర్ చేయదలచుకున్న వాళ్లను పోలీస్ స్టేషన్‌లో కాని, అందరికీ తెలిసిన ప్రాంతాల్లో కాని ఉంచరు. ఈ ఫామ్‌హౌస్‌లలో ఉంచుతారు. నెలలు, సంవత్సరాల తరబడి అక్కడ ఉంచి, 'తగిన సమయంలో' చంపుతారు.

ఇలాంటి ఎన్‌కౌంటర్లు సాయంకాలం కాని, అర్ధరాత్రి కాని జరుగుతాయి. ఒక దొంగిలించబడ్డ వాహనం, ఒక తుపాకి దొరుకుతాయి. ఈ ఎన్‌కౌంటర్లలో చంపదలచుకున్నవాళ్లను పోలీసులు మూడో కంటికి తెలియకుండా ఎత్తుకుపోతారు. అపహరణకు గురయ్యాడనే కేసు కూడ నమోదు కాకుండా చూసుకుంటారు. ఫలానా వ్యక్తి మాయమయ్యాడని అలజడి మొదలయితే, పరిస్థితులు చల్లబడేదాకా వేచి చూస్తారు. వేరు వేరు రాష్ట్రాల పోలీసులు ఇటువంటి బాధితుల్ని మార్చుకుంటారు. ప్రతి రాష్ట్రంలోనూ ప్రత్యేక శాఖలు, సెల్స్, స్క్వాడ్స్ ఉంటాయి. అవన్నీ ఐబి నుంచి ప్రత్యక్షంగా ఆదేశాలు తీసుకుంటాయి.

బాధితుల్ని మార్చుకోవడం ఎలా జరుగుతుంది? ఉదాహరణకు, జమ్ము-కశ్మీర్‌కు చెందిన ప్రత్యేక ఆపరేషన్స్ గ్రూప్ నుంచి ఇద్దరు కశ్మీరీ యువకులను తీసుకొని ఢిల్లీ ప్రత్యేక సెల్ వాళ్లు తమవైపు నుంచి ఇద్దర్ని అప్పజెపుతారు. ఈ ఢిల్లీ వాళ్లను కశ్మీర్‌లో చంపి పడేసి, పాకిస్తానీ ఉగ్రవాదులుగా ప్రకటిస్తారు. వాళ్లు స్థానికులు కాదు కాబట్టి అక్కడ ఎవరూ గుర్తు పట్టలేరు. పోలీసులు చెప్పే కథనం నమ్మదగినదనే అనిపిస్తుంది.

ఈ ఎత్తుగడలన్నీ చాలా పైస్థాయిలో నడుస్తాయి. స్థానిక పోలీసులు కేవలం ప్రేక్షకులే. చాలాసార్లు, నిజానికి ఏం జరుగుతోందో స్థానిక పోలీసులెవరికీ తెలియదు. తమ కుటుంబంలోని వ్యక్తి అపహరణకు గురయినట్లు కుటుంబ సభ్యులు ఫిర్యాదు చేస్తే అదేదో సాధారణంగా జరిగిన అపహరణ అని స్థానిక పోలీసులు అనుకుంటారు.

'ఎన్‌కౌంటర్ల' ఆదేశాలు హోం మంత్రిత్వ శాఖలోని పై అధికారుల నుంచే వస్తాయనే విషయాన్ని ఘంటాపథంగా చెప్పగలను. భద్రతా సంస్థలకు ఏ రోజు ఏ 'ఎన్‌కౌంటర్' జరుగుతుందో ముందే తెలుస్తుంది. ఆ రిపోర్టును ముందే తయారు చేస్తారు. ఇదంతా గొప్ప నాటకం కాదూ?

'ఎన్‌కౌంటర్ల'లో చనిపోయిన వాళ్లందరి దగ్గరా వాళ్ల వివరాలు, పేర్లు, ఏ సంస్థలో ఏ ర్యాంకులో ఉన్నారో వగైరా, వగైరా విషయాలు రాసిపెట్టుకున్న కాగితాలు వాళ్ల జేబుల్లో దొరకడం మీరు గమనించలేదా? హోరాహోరీ ఎదురుకాల్పులు జరిగితే, బాధితులు మాత్రం ఎన్నడూ ఒక్క బుల్లెట్ కాల్చిన పాపాన పోయి ఉండరు. ఒకవేళ కాల్చారని చెప్పినా,

అవి ఎప్పుడూ టార్గెట్‌కు తగిలిన దాఖలాలు లేవు. ఈ విషయాన్ని గమనించండి. గత కొన్ని సంవత్సరాలలో జరిగిన 100 'ఎన్‌కౌంటర్ల' జాబితా తెరవండి. ఎప్పుడైనా, ఒక్కగానొక్క పోలీసైనా గాయపడ్డాడా చూడండి. నిజమైన ఉగ్రవాదులతో సైన్యం తలపడే ఎన్‌కౌంటర్లను పరిశీలించండి. ప్రతి పోరులోను ఒకరో, ఇద్దరో సైనికులకు గాయాలు తగులుతూనే ఉంటాయి. దాని అర్థం ఏమిటి? ఢిల్లీ ప్రత్యేక సెల్ పోలీసులకు సైనిక తర్ఫీదు ఇవ్వడం లేదా? లేక ఇవన్నీ బూటకపు ఎన్‌కౌంటర్లేనా? నా సలహా ఏమంటే, ఢిల్లీ ప్రత్యేక పోలీస్ సెల్ బలగాల్ని సైన్యం స్థానంలో పంపండి. ఈ దేశ ప్రజలు వాళ్ల సాహసాన్ని ఎప్పటికీ స్మరించుకుంటారు. వాళ్లు ఎంత భీరువులో తెలిస్తే మీరు ఆశ్చర్యపోతారు. నేరస్తుడి చేతిలో చాకు మాత్రమే ఉందని తెలిసినా, చచ్చినా ఆ దరిదాపులకు పోరు. అతను నిరాయుధుడని తెలిస్తేనే, పట్టుకోవడానికి ధైర్యం చేస్తారు.

**అయ్యా,**

ఈ ప్రత్యేక సెల్ అనేది, లైసెన్సున్న దోపిడీ ముఠా. వీళ్లకు నరనరానా మతతత్వం ఉంది. ముస్లింల పట్ల చెప్పలేనంత కసి. తమ చర్యల వల్ల బాధితుల కుటుంబాలు కూలిపోతాయనే చింత ఏ మాత్రం ఉండదు. తమకు మాత్రం అవార్డులూ, రివార్డులూ కావాలి. నా ఉద్దేశంలో ఈ ప్రత్యేక సెల్ వాళ్లవి మానవ శరీరాలే కాని, వాటిలో ఉన్నవి క్రూరమృగాల ఆత్మలు. వాళ్లు చిత్రహింసలు పెట్టే పద్ధతులు మన ఊహలకు అందనివి. సినిమాల్లో చూస్తామే వాటికంటే క్రూరంగా ఉంటాయవి.

నా పొరపాటేమిటంటే, వాళ్లు ఆడిందే ఆట పాడిందే పాట అంటూ వాళ్లతో మరింత ముందుకు పోకపోవడం. వాళ్లకు తెలుసు. ఇస్లామిక్ ఉగ్రవాది పేరుతో ఎవరినైనా అరెస్టు చేయచ్చు. పేలుడు పదార్థాలు పెట్టవచ్చు. ఏదో ఒక సంస్థ పేరు చెప్పి మీడియాలో బద్‌నామ్ చేయవచ్చు. ఎంతో దుఃఖంతో చెప్తున్నా. మన న్యాయస్థానాలు కూడా గంగిరెద్దులా తలూపుతాయి. నేను రెండు నెలలు వీళ్ల నిర్బంధంలో ఉన్నా. మా నాన్న స్థానిక పోలీస్‌స్టేషన్‌లో ఫిర్యాదు చేశాడు. నా సహముద్దాయి ఖమర్ గురించి వాళ్లబ్బాయి టివిలో 'కనపడుట లేదు' ప్రకటన ఇప్పించాడు. అప్పుడు గాని మమ్మల్ని కోర్టుకు హాజరుపరచలేదు. స్పెషల్ పోలీసుల ఆరోపణ ఏమిటో తెలుసా? 'రెండు నెలల తర్ఫీదు తరువాత తిరిగి వస్తుంటే మేం వీళ్లను పేలుడు పదార్థాలతో పట్టుకున్నాం.' హైకోర్టులో దీన్ని మేం సవాల్ చేశాం. హైకోర్టు సిబిఐ విచారణకు ఆదేశించింది. సిబిఐ తన ప్రాథమిక రిపోర్టును కోర్టుకిచ్చింది.

అయితే ఎంతైనా ఐబి, ప్రత్యేక సెల్, సిబిఐ సోదర సంస్థలే కదా? అంతకంటే మించి ఏమీ చేయరు. ఇది చూడండి. మమ్మల్ని రెండు నెలల పాటు నిర్బంధించిన ప్రదేశాన్ని చూపిస్తామని ఏడాదిన్నరగా చెపుతున్నాం. ఈ విషయాన్ని రికార్డుకెక్కించడానికి సిబిఐ తాత్సారం చేస్తూ వస్తోంది. ప్రధానమంత్రి డా. మన్‌మోహన్ సింగ్‌కు నా విజ్ఞప్తి. దయచేసి ఇలాంటి కార్యకలాపాల్ని ఆపించండి. ఈ సంస్థలు దేశాన్ని సురక్షితం చేయటం లేదు సరిగదా తీవ్రమైన అభద్రతలోకి నెడుతున్నాయి. దేశ నిర్మాణానికి ఉపయోగ పడవలసిన యువకులు జైళ్లలో మగ్గిపోతున్నారు. ఎన్‌కౌంటర్లలో హతమైపోతున్నారు. దేశం కోసం ఏమైనా చేయాలని కలలు కనే యువకుడ్ని తప్పుడు కేసులో ఇరికించి, ఉగ్రవాదిగా ముద్రేస్తే, అతనిక మీకు విశ్వాసపాత్రుడుగా ఉంటాడనుకోవడం మూర్ఖత్వం కాదా?

తప్పుడు కేసుల్లో ఇరుక్కున్న వ్యక్తులు, ఎలాగూ తీవ్రమైన శిక్షలు పడతాయి కాబట్టి, నిజంగానే నేరాలు చేసి అరెస్టయినా ఫర్వాలేదు అనుకుంటారు. ఇది ప్రమాదకరమైన ధోరణి. తిరుగుబాటు ఆలోచనలకు ఇక్కడే నాంది పడుతుంది. విడుదలయ్యాక కూడా ఈ బాధితుల్ని ఎవరూ చేరదీయరు.

**ప్రధాన మంత్రి గారూ,**

ఇప్పటికే మించిపోయింది. మీ భద్రతా సంస్థలకి నచ్చజెప్పండి. అగ్గిని అగ్గి ఆర్పలేదు. నిప్పును ఆర్పాలంటే నీళ్లు కావాలి. నిజానికి మీ భద్రతా సంస్థలు మంటలమీద పెట్రోలు చల్లుతున్నాయి.

హైకోర్టులో సిబిఐ సమర్పించిన రిపోర్టు చదవమని మిమ్మల్ని కోరుతున్నా. ఆ రిపోర్టులో ఏ ఐబి అధికారుల కింద నేను ఇన్ఫార్మర్ గా పనిచేశానో స్పష్టంగా రాశారు. నన్నెవరు అపహరించారో వారి పేర్లు కూడా ఉన్నాయి. నేను ఏ అధికారుల కింద పని చేశానో వారి పేర్లు, వివరాలు: ఐబి ఆఫీసర్ ఖలీద్ అలియాస్ మజీద్, ఫోన్ నం. 9810702004, ఐబి ఆఫీసర్ ఆఫ్తాబ్ 9810702004, ఎసిపి సంజీవ్ యాదవ్ 9810058002, ఇనస్పెక్టర్ లలిత్ మోహన్, హరదేవ్ భూషణ్ 9811980604, 8711980601. నాకిచ్చిన మొబైల్ నం. 9873303646. ఐబి ఆఫీసర్లతో మాట్లాడేందుకు నేను ఉపయోగించిన ఫోన్ నంబర్ 9873131845. నిజాల్ని వెలికితీయదలచుకుంటే ఏ సంస్థకైనా మీడియాకైనా ఇంతకంటే ఏ వివరాలు కావాలి?

ఇట్లు

**ఇర్షాద్ అలీ,**

తండ్రి పేరు మహమ్మద్ యూనస్

వార్డు నం. 3 (హైరిస్క్), సెల్ నం. 13, జైల్ నం. 8

తీహార్, ఢిల్లీ – 110 064.

*(రచయిత మనీషా సేఠీ జామియా టీచర్స్ సాలిడారిటీ అసోసియేషన్ ఏర్పరచి, ఉగ్రవాదం పేరుమీద మానవ హక్కులను కాలరాచే రాజ్యహింసకు వ్యతిరేకంగా పోరాడుతున్నారు.)* వీ

మరొక పత్రికకు పంపిన, మరొక పత్రిక పరిశీలనలో ఉన్న, మరొక పత్రిక ప్రచురణకు ఆమోదించిన రచనను వీక్షణంకు పంపగూడదు. – సం.

# పెట్టుబడి, అవినీతి తోబుట్టువులే

***పెట్టుబడులు ఎక్కడికైతే ప్రవహిస్తాయో అక్కడ అవినీతి ఉంటుందనీ, ఆ అవినీతికి పాల్పడడంలో కాంగ్రెస్, బిజెపి అనే పార్టీల తేడాలు ఏమీ లేవనీ అంటున్నారు వి. హనుమంతరావు***

ఏ రెండు సమస్యలను పరిష్కరించడంలో ఘోరంగా విఫలమై కాంగ్రెస్ మొన్నటి సాధారణ ఎన్నికల్లో ఓటమిని కొని తెచ్చుకుందో, అవే సమస్యలు ప్రధాని మోడీ పీక పట్టుకున్నాయి. అవే అవినీతి, ధరల పెరుగుదల. నేరుగా కేంద్ర ప్రభుత్వంలో, రాజస్థాన్‌లో, మధ్యప్రదేశ్‌లో అవినీతి గుప్పుమంది. హిందూ మతోన్మాదులు ఇటు ముస్లింల మీద అటు క్రిస్టియన్ల మీద దాడులు జరుపుతుంటే గుడ్లప్పగించి చూస్తున్న మోడీకి అమెరికా అధ్యక్షుడు ఒబామా బహిరంగంగానే చివాట్లు పెట్టే సరికి ఏదో లాంఛనంగా ప్రకటన చేయాల్సి వచ్చింది.

గోధ్రా మారణ హోమం తర్వాత అమెరికన్ ప్రభుత్వం మోడీ జనరల్ ఎన్నికల్లో గెలిచేవరకూ తనగడ్డ మీద అడుగు పెట్టనివ్వలేదు. అమెరికన్ ప్రభుత్వమే కాదు, ఏ దేశం ఆహ్వానించలేదు. అలాంటిది ఎన్నికలవడంతోనే తన స్వప్రయోజనాల కోసం అమెరికా ప్రభుత్వం తన ప్రతినిధిని పంపి ఆహ్వానం పలికింది. పిలవడమే తడవుగా మోడీ లగెత్తాడు. కాంగ్రెస్ ప్రభుత్వం 2005లో ఒక ఒప్పందం చేసుకుంటే, మోడీ రక్షణ రంగంతో సహా అన్ని రంగాల్లోకి అమెరికన్ పెట్టుబడులకు ఎర్ర తివాచీ పరచి వచ్చాడు. అంతే కాదు, ఆకలితో ఆవురావురు మంటున్న వ్యక్తి తిండి లభిస్తే ఆబగా తినేసినట్లు, దేశ దేశాలు తిరిగేస్తున్నారు. మంచి వక్త కాబట్టి ఆయా దేశాల దృష్టిని ఆకర్షిస్తున్నారు. ఇంట గెలిచి రచ్చ గెలవమని సామెత కాని మోడీ ముందు రచ్చగెలవడానికే ప్రాధాన్యత ఇచ్చారు. ఫలితంగా ఇంట్లో అవినీతి భాండం బద్దలైంది. పల్లకీ మోత అయింది, ఈగల మోత ప్రారంభమైంది. నోరు పడిపోయింది. తన పీఠం కిందే బాంబులు పేలుతున్నాయి. నిన్నకాక మొన్ననే ఎన్నికల సందర్భంలో కాంగ్రెస్ మీద ఏ విమర్శలు చేశాడో, సరిగ్గా అవే విమర్శలు తనమీద, తన పార్టీ మీద ఎదుర్కోవాల్సి వచ్చింది. నోరు కుట్టేసుకున్నావే, మాట్లాడు అని ప్రతిపక్షాలు గర్జిస్తున్నాయి. తేనెతుట్ట కదిలింది, ఈగలు కుట్టేస్తున్నాయి. పాపం, మోడీ ఏం చేయాలని చెవులు కొరుక్కుంటున్నారు.

కార్పొరేట్లకు, బహుళజాతి సంస్థలకు భూ సంతర్పణ చేయపూను కున్నాడు. పార్లమెంటు సమావేశాల్లో ప్రతిపక్షాలు కత్తులు నూరుతున్నాయి. బిజెపిలోనే నిరసన ధ్వనులు వినిపిస్తున్నాయి. మామా రాష్ట్రాల్లో ఈ భూపంపకాలేవో మేమే చూసుకుంటాం అంటున్నాయి. మరో మాటలో చెప్పాలంటే ఆమ్యామ్యాలేవో కేంద్రం తన ఒళ్లోవేసుకుంటే, మేం గుటకలు మింగుతూ కూర్చోవాలా, మా వాటా మాకు కావాలని చెప్పడమే. భూములు మామా రాష్ట్రాల్లో ఉన్నాయి, కేంద్రం పెత్తనమేమిటంటున్నాయి. అసలు హక్కుదారైన రైతు కేవలం నిరసన ప్రదర్శనలకే పరిమితమవుతున్నాడేమో, రాజకీయ పార్టీలు సమస్యను రాజకీయం చేస్తున్నాయేమోననిపిస్తుంది. ఒకవేళ ఈ బిల్లు చట్టరూపం దాల్చి రైతుల భూములను లాక్కొనే పరిస్థితి ఏర్పడితే, అప్పుడు కూడా రైతు తన నిరసనను తనకు చేతనైన పద్ధతిలో తెలియచేయవచ్చు. తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటం గుర్తుకొస్తుంది. మోడీజీ హోషియార్.

కాంగ్రెస్ పాలన నాటి నుంచి నానుతూ వస్తోంది వస్తు సేవల బిల్లు (జిఎస్‌టి). ప్రస్తుత ప్రభుత్వం ఈ బిల్లును మళ్లీ లోక్‌సభలో ప్రవేశపెట్టింది. ఈ బిల్లు ప్రకారం రాష్ట్రాలు పన్ను విధించే హక్కును కేంద్రానికి దఖలు పరచాలి. అన్ని రాష్ట్రాలకు ప్రధాన ఆదాయ వనరు అమ్మకం పన్ను. అయితే ఈ పన్ను ఉత్పత్తి దారు నుంచి, హోల్‌సేల్, రిటైల్, గ్రామీణ స్థాయి వరకూ ఎవరి మట్టుకు వారు ఈ పన్ను వారి బిల్లులలో వసూలు చేస్తుంటారు. ఈ భారం అంతా వినియోగదారుని మీద పడుతుంది. ఈ బిల్లు ప్రకారం అమ్మకం పన్ను ఒకేచోట అంటే కేంద్రమే వసూలు చేస్తుంది. అలా వసూలు చేసిన మొత్తాన్ని బిల్లులో పొందుపరిచినట్లు వివిధ రాష్ట్రాలకు పంపకం చేయడం జరుగుతుంది. అయితే దీనికో రాజకీయ కోణం ఉంది. రాష్ట్రాల హక్కులను మొదటి నుంచి కేంద్రం హాంఫట్ చేస్తూనే ఉంది. కేంద్రం ప్రవేశపెట్టే అనేక పాప్యులిస్టు పథకాలకు కేంద్రం 75 శాతం నిధులను రాష్ట్రాలకు ఇస్తుందని, మిగతా 25 శాతం రాష్ట్రాలు భరించాలనే షరతు విధించడం, రాష్ట్రాలకున్న ఆర్థిక పరిమితుల దృష్ట్యా ఆ 25 శాతాన్ని కూడా ఖర్చు చేయలేకపోవడం జరుగుతూ వస్తోంది. రాష్ట్రాల హక్కులను కేంద్రం కొద్ది కొద్దిగా కొరుక్కు తినేస్తూ వస్తోంది. ఈ బిల్లు ఆమోదిస్తే, రాష్ట్రాల హక్కులను మరింత కుదించి వేయడమే జరగవచ్చు.

బ్రహ్మానందరెడ్డి ఫైనాన్స్ కమిషన్ అధ్యక్షునిగా ఉన్నప్పుడు ఇలాంటి పథకాల సంఖ్యను కుదించగా, కేంద్రంలో అధికారులు మరో పేర్లు పెట్టి, అలాంటి పథకాల సంఖ్యను పెంచుతూ వస్తోంది. భారమంతా వినియోగదారుని మీద పడుతుంది అని చెప్పడం జరిగింది. కేంద్రం ఈ భారాన్ని తగ్గని విధంగానే పన్ను మొత్తాన్ని నిర్ణయించడం జరుగుతుంది. రాజ్యాంగం మనది ఫెడరల్ వ్యవస్థ అని పేర్కొనగా, మోడీ దానిని యూనిటరీ వ్యవస్థగా, ఇంకా స్పష్టంగా చెప్పాలంటే అధికారం తన చేతిలో కేంద్రీకృతం అయ్యేలా పరిపాలించడాన్ని గమనిస్తున్నాం. ఈ బిల్లు ఆ దిశగానే ప్రయాణం సాగిస్తుంది. ఇపుడు జరుగుతున్న పార్లమెంటరీ సమావేశాల్లో వేడివేడిగా చర్చ జరగవచ్చు. 5 సంవత్సరాల పాటు రాష్ట్రాలకు కేంద్రం పరిహారం చెల్లించాలనే కొన్ని రాష్ట్రాల కోర్కెలను రాజ్యసభ ప్యానెల్ సిఫార్సు చేసింది. ప్రధాన అడ్డంకి తొలిగింది. అయితే కాంగ్రెస్, వామపక్షాలు తమ వ్యతిరేకతను

ఉపసంహరించుకోలేదు. ఇల్లలుకగానే పండగైపోదు.

కాని మోడీ ఎదుర్కోవల్సింది ఈ విషయాలు మాత్రమే కాదు, మొత్తం దేశ ఆర్థిక పరిస్థితి చతికిల పడిపోయింది. ఇదిగో లేచినిలబడుతుందని కాసేపు, అబ్బే ఇంకా కొంతకాలం వేచి ఉండాలని కాసేపు ఆర్థిక శాస్త్రవేత్తలు భవిష్యద్వాణిని పలికిస్తున్నారు. పారిశ్రామికీకరణే దేశాన్ని గట్టెక్కించగలదని కాళ్లకు బలపాలు కట్టుకొని తిరిగినా, టింగున బోణీ కాలేదు. ఉభయ తెలుగు రాష్ట్ర ముఖ్యమంత్రులు ప్రకటనల మీద ప్రకటనలు చేస్తున్నా, అవి ఎంఒయుల దగ్గరే, అంటే పరిశ్రమలు పెట్టడానికి సూత్ర ప్రాయంగా అంగీకరిస్తున్నాం అని మాత్రమే చెప్పడం జరుగుతోంది. అలూ లేదు, చూలూ లేదు కొడుకు పేరు సోమలింగం అన్నట్లుంది. అప్పుడు కాంగ్రెస్, ఇప్పుడు బిజెపి పాలనా కాలంలో పారిశ్రామికోత్పత్తి సూచి చూడండి.

| | |
|---|---|
| 2008-09 | 2.5 శాతం |
| 2009-10 | 5.3 శాతం |
| 2010-11 | 8.2 శాతం |
| 2011-12 | 2.9 శాతం |
| 2012-13 | 1.1 శాతం |
| 2013-14 | 0.11 శాతం |
| 2014-15 | 2.8 శాతం |

మోడీ పాలన కాలంలో మేము పరిశ్రమలు పెట్టాలనుకుంటున్నాం (ప్రపోజల్స్) అని అంటున్న వారి సంఖ్య 2013 - 14లో 2837 (పెట్టుబడి రు. 5.3 లక్షల కోట్లు) నుంచి 2014 -15లో 1843కు వాటిలో పెట్టుబడి రు. 4.05 లక్షల కోట్లకు దిగజారింది. ఇది కాంగ్రెస్ పాలన కాలంలోనే ప్రారంభమై మోడీ పాలనలో మరింత దిగజారింది.

| సంవత్సరం | ప్రతిపాదనలు | పెట్టుబడులు (వేల కోట్లలో) |
|---|---|---|
| 2009 | 3475 | 1040 |
| 2010 | 4336 | 1736 |
| 2011 | 3900 | 1540 |
| 2012 | 2828 | 568 |
| 2013 | 2387 | 530 |
| 2014 | 1843 | 405 |
| 2014 జన-మే | 868 | 124 |
| 2015 | 826 | 150 |

రిజర్వు బ్యాంకు గవర్నరు అంటున్నారు కదా ప్రపంచ ఆర్థిక వ్యవస్థే 1930 నాటి డిప్రెషన్ దిశగా జారిపోతుందని, అలాగే ఐఎంఎఫ్ అధ్యక్షురాలు 'ఇప్పుడు మనం క్షీణిస్తున్న ఆర్థికాభివృద్ధి దిశలోనే ఉన్నాం' అని అంటోంది. దేశంలో పారిశ్రామిక వేత్తలు మూడేళ్ల ద్రవ్యోల్బణం కారణంగా దేశంలో సరుకులకు గిరాకీ పడిపోవడంతో ఉత్పత్తులు తగ్గిస్తున్నారు ఎగుమతులు గత ఐదు నెలలుగా పడిపోతూనే వస్తున్నాయి. రియల్ ఎస్టేట్ రంగం ఇంకా కునికి పాట్లు పడుతూనే ఉంది. రూపాయి విలువ (డాలర్‌తో పోలిస్తే) తగ్గుతూనే వస్తోంది. ఉక్కు పరిశ్రమ మరీ దయనీయంగా ఉంది. బంగారం ధర దబ్బున పడిపోయింది. గత ఐదేళ్లలో ఇంతగా పడిపోయిందెపుడూ లేదు. స్టేట్ బ్యాంక్ ఇండెక్స్ ప్రకారం తయారీ రంగం వెనుక పట్టు పట్టింది. కాగ్ నివేదిక ప్రకారం చైనాను చూసి సెజ్‌లను అనుమతించి చేతులు కాల్చుకున్నారు. సమాచారం లభించినంత మేరకు 392 సెజ్‌లను పరిశీలించగా 192 మాత్రమే పనిచేస్తున్నాయని, ఫలితంగా 83 వేల కోట్ల రాబడి నష్టం జరిగింది.

ప్రభుత్వ రంగ పరిశ్రమల్లో షేర్లు కార్పొరేట్లకు ప్రభుత్వం అమ్మేసింది. బొగ్గు గనులను ప్రైవేట్ రంగానికి దాఖలు పరిచింది. బొగ్గు గనులను కొనేయడానికి వాళ్లవద్ద కోట్ల రూపాయల ధనం ఉంది. అంత ధనం ఉన్నవాళ్లు దేశంలో మరిన్ని పరిశ్రమలు స్థాపించవచ్చు కదా. బహుళజాతి సంస్థల కాళ్లావేళ్లాపడి మా దేశంలో పరిశ్రమలు పెట్టండి అని ఎర్రతివాచి పరచడమెందుకు? కాన్ఫెడరేషన్ ఆఫ్ ఇండియన్ ఇండస్ట్రీస్ ప్రకారం ఇండియా నుంచి పారిశ్రామిక వేత్తలు విదేశాల్లో ముఖ్యంగా అమెరికాలో 15.3 బిలియన్ డాలర్ల పెట్టుబడులు పెట్టి 91 వేల మందికి ఉద్యోగావకాశాలు కల్పించారు. ఆ పెట్టుబడులు, ఆ ఉద్యోగావకాశాలు భారతదేశంలోనే కల్పించవచ్చు కదా. కాని మోడీ ప్రభుత్వం ఈ సంవత్సరం ప్రవేశపెట్టిన ఎకనమిక్ సర్వే ప్రకారం 1991లో సంస్కరణలు ప్రవేశపెట్టిన అనంతరం 25 సంవత్సరాలు దాటినా దేశంలోని పెట్టుబడి దారులు పెట్టుబడులు పెట్టలేక పోతున్నారని కన్నీళ్లు పెట్టుకుంటుంది. ఎంత దిగజారుడు!

అన్నిటికన్నా ముఖ్యంగా మోడీని ఇరుకున పెట్టింది కేంద్రమంత్రులు, ఇద్దరు ముఖ్యమంత్రులు అవినీతికి పాల్పడడం, అది కూడా ఒక్క సంవత్సర కాలంలో మోడీ పరువు బజారుకెక్కడం అవినీతికి వ్యతిరేకంగా మొన్న మొన్నటి జనరల్ ఎన్నికల్లో శంఖం పూరించిన మోడీకి నోరుపడి పోయింది. రాజుకన్న మొండివాడు బలవంతుడన్నట్లు, మోడీ మొండి కేశాడు. చాలారోజులు నోరు విప్పకుండా రెండు రోజుల్లో పార్లమెంటు సమావేశాలు ప్రారంభం కానుండగా, తానెవరినీ అధికారాల నుంచి తొలగించేది లేదని మీ దిక్కున్న చోట చెప్పుకోండి అని మొండికేశారు. కాంగ్రెస్ పాలనలో మొదటి నుంచి అవినీతి భాగోతాలు వినవస్తూ వచ్చినా, 2003లో కాబోలు కామన్వెల్త్ గేమ్స్‌తో ప్రారంభించి ఆ కుళ్లులో మునిగి తమ పార్టీ ఘోర పరాజయానికి కారణమైంది. ఆ పార్టీకి 12 సంవత్సరాలు పడితే, మోడీ ఒక్క సంవత్సరంలోనే ఆ కుళ్లును ఒంటికి పూసుకున్నారు. పెట్టుబడిదారీ విధానానికి అవినీతి తోబుట్టువు. ఆ విధానం అవలంబించినంత కాలం మోడీయే కాదు, ఆయన తాతలు దిగివచ్చినా ఆ కుళ్లులో దొర్లాల్సిందే. అవినీతి విషయంలో కాంగ్రెస్, బిజెపి పార్టీలు దొందు దొందే.

(రచయిత వీక్షణం వ్యవస్థాపక సంపాదకులు) వీ

***రచయితలకు సూచన :*** *తక్షణ, సమకాలీన అంశాలపై రచనలు చేసి ఆ సంచికలోనే రావాలనుకొనే రచయితలు 20వ తేదీ లోగా పంపగలిగితేనే మరుసటి నెల సంచిక కోసం పరిశీలించడం సాధ్యమవుతుంది. ఆ తరువాత వచ్చిన రచన, అంశం ఎంత ముఖ్యమైనదైనా పరిశీలించడం, ముద్రణకు సిద్ధం చేయడం అసాధ్యమవుతుంది. రచయితలు గుర్తించగలరు. - సం.*

# డబ్ల్యుటిఒ కబంధ హస్తాలలో ఉన్నత విద్య

*సామ్రాజ్యవాద బహుళజాతి, కార్పొరేట్ సంస్థలకు దాసోహం అంటున్న పాలకులు ప్రజలకు రాజ్యాంగ హక్కుగా అందించాల్సిన విద్యను వ్యాపారమయం చేస్తున్నారనీ, ఇది దేశ సార్వభౌమాధికారానికే ప్రమాదమనీ అంటున్నారు* **రమేష్ పట్నాయక్**

సుమారు గత రెండు సంవత్సరాల కాలంగా, ప్రధానంగా 2013 డిసెంబర్‌లో బాలి (ఇండోనేషియా)లో జరిగిన 9వ మంత్రుల స్థాయి సమావేశంలో ప్రపంచ వాణిజ్య సంస్థ (డబ్ల్యుటిఒ) విస్తరణకై జరుగుతున్న వాణిజ్య బేరసారాలు (ట్రేడ్ నెగోషియేషన్స్) తిరిగి ఊపందుకున్నాయి. 2015 డిసెంబర్ 15-18 తేదీలలో కెన్యా రాజధాని నైరోబీలో జరుగనున్న ప్రపంచ వాణిజ్య సంస్థ పదవ మినిస్టీరియల్ సమావేశంలో విస్తృతమైన ఒప్పందాలుగానీ, విస్తృతమైన ఒప్పందాలకు కావలసిన ప్రాతిపదిక ఒప్పందాలు గానీ కుదిరే అవకాశం ఉంది. ప్రధానంగా 2001లో దోహా సమావేశాలలో ప్రారంభించిన వాణిజ్య బేరసారాలు అనేక ప్రతిష్టంబనలు ఎదుర్కొంటున్న నేపథ్యంలో అందులో కొన్ని అంశాలపైన అయినా ఒప్పందం కుదిరే అవకాశంకై పాలకవర్గాలు ప్రయత్నిస్తున్నాయి. నైరోబీ సమావేశాల వైపు బహుళజాతి కంపెనీలు ఆశగా ఎదురు చూస్తున్నాయి. ప్రపంచ వాణిజ్య సంస్థ కార్యకలాపాల విస్తరణ ఎడల ప్రపంచ ప్రజలు ఆందోళనకు గురవుతున్నారు. డబ్ల్యుటిఒ ఒప్పందాలు వివిధ దేశాల ప్రజల హక్కులపైన ఒక సర్వవ్యాపిత దాడి. ఈ ఒప్పందాలలో పారిశ్రామిక, వ్యవసాయిక, పరిశోధన, సేవారంగాలు ఉన్నాయి. ఈ అన్ని రంగాల్లో వెనుకబడిన దేశాలను, అన్ని దేశాలలో సామాన్య ప్రజానీకాన్ని మరింత పీల్చి పిప్పి చేయడం, భవిష్యత్‌ను కూడ దోచుకోవడం బహుళజాతి సంస్థలకు మానవ జాతిని పాదాక్రాంతం చేయడం ప్రపంచ వాణిజ్య సంస్థ అప్రకటిత లక్ష్యం. అయితే ఈ వ్యాసం విద్యారంగానికి మాత్రమే పరిమితమవుతుంది. మిగిలిన రంగాలను సందర్భానుసారం సృజించవచ్చు. ముందుగా ప్రపంచ వాణిజ్య సంస్థ స్థాపన, నిర్మాణం విషయాలు క్లుప్తంగా పరిశీలిద్దాం.

### గాట్-1947 నుంచి డబ్ల్యుటిఒ వరకు

రెండవ ప్రపంచ యుద్ధానంతరం సామ్రాజ్యవాద దేశాలు ప్రపంచ బ్యాంక్ (డబ్ల్యుబి), అంతర్జాతీయ ద్రవ్య నిధి (ఐఎంఎఫ్), సుంకం, వాణిజ్యంపై సాధారణ ఒప్పందం (జెనరల్ అగ్రిమెంట్ ఆన్ టారిఫ్ అండ్ ట్రేడ్ - జిఎటిటి-గాట్) అనే బ్రిటన్ ఉడ్ సంస్థలను స్థాపించిన విషయం తెలిసిందే. ఈ సంస్థ (గాట్)ను స్థాపించినప్పుడు 23 దేశాలు మాత్రమే సభ్యత్వం తీసుకున్నాయి. భారతదేశం కూడా సంస్థాపక సభ్య దేశమే. ఈ గాట్ ఒప్పందం పారిశ్రామిక ఉత్పత్తుల వాణిజ్యానికి మాత్రమే ఆనాడు పరిమితం. అయితే ఆ ఒప్పందంలో ఒక ప్రధాన నిబందన ప్రకారం ఈ సంస్థ సభ్య దేశాల ప్రతినిధులు ఈ ఒప్పందాన్ని విస్తరించడానికి వివిధ కాలాంతరాలలో సమావేశమవుతారు. వీటినే వాణిజ్య బేరసారాలు అంటారు. ఈ సమావేశాలు మొదట్లో వివిధ దేశాలు వాణిజ్య సుంకాలు తగ్గించడానికి, దిగుమతులపై సుంకాలు కాని ఇతర ఆటంకాలను క్రమంగా తగ్గించడానికి, లేదా పూర్తిగా తొలగించడానికి మాత్రమే పరిమితమై ఉండేవి. 1982లో జెనీవాలో జరిగిన గాట్ బేరసారాలలో సామ్రాజ్యవాద దేశాలు చాలా దురాశాపూరితమైన ఎజెండాను ముందుకు తీసుకువచ్చాయి. పారిశ్రామిక వస్తు వాణిజ్యానికి మాత్రమే పరిమితమయి ఉండిన గాట్ ఒప్పందాన్ని వ్యవసాయ రంగానికి, పెట్టుబడుల ఎగుమతులను విస్తరించాలని, అంతేకాక, పరిశోధనా రంగానికి, సేవారంగాలకు కూడా విస్తరించాలని ప్రతిపాదించారు. ఈ ప్రతిపాదనలపై చాలా వ్యతిరేకత వచ్చింది. అయినా 1986 నాటికి, ఉరుగ్వే దేశంలో పుంటా డెల్ ఎస్తే నగరంలో జరిగిన సమావేశంలో ఈ అంశాలు అధికారికంగా ఎజెండాలో చేర్చబడ్డాయి. ఉరుగ్వే సమావేశంలో ప్రారంభమయిన ఈ వాణిజ్య బేరసారాల విడత ఉరుగ్వే బేరసారాల విడతగా ప్రచారం పొందింది. ఈ ఎజెండాపై ప్రపంచ వ్యాప్తంగా నిరసన వెల్లువెత్తింది. అయినా సామ్రాజ్యవాద దేశాలు తమ పంతాన్ని నెగ్గించుకోగలిగాయి. ఈ ఉరుగ్వే విడత వాణిజ్య బేరసారాలు 1994 ఏప్రిల్ 14న ముగిసిన మరకేష్ (మొరాకో) సమావేశంలో ప్రపంచ వాణిజ్య సంస్థ స్థాపనకు దారితీశాయి. 1995 జనవరి 1

**డబ్ల్యుటిఒ ప్రధాన ఒప్పందం**

| మంత్రుల సమావేశ నిర్ణయాలు | | |
|---|---|---|
| **సర్వసభ్య వాణిజ్య ఒప్పందాలు** | **చట్టపరమైన సాధనాలు** | **బహుళ సభ్య వాణిజ్య ఒప్పందాలు** |
| 1. అనెక్స్1ఎ: గాట్ 1994 వస్తు వాణిజ్యంపై ఒప్పందం<br>2. అనెక్స్1బి: గాట్స్ సేవలరంగ వాణిజ్యంపై సార్వత్రిక ఒప్పందం<br>3. అనెక్స్ 1సి: టిఆర్ఐపిఎస్ వాణిజ్య సంబంధ మేథో సంపత్తిహక్కుల ఒప్పందం | 1. అనెక్స్ 2: డిఎస్‌యు వివాద పరిష్కార అవగాహన<br>2. అనెక్స్ 3: టిపిఆర్ఎం వాణిజ్య విధాన పునఃపరిశీలన కార్య విధానం | 1. అనెక్స్ 4ఎ పౌర విమానయానంపై ఒప్పందం<br>2. అనెక్స్ 4బి ప్రభుత్వ సేకరణపై ఒప్పందం |

(గమనిక: చట్టపరమైన సాధనాలు సర్వసభ్య ఒప్పందాలకు పూర్తిగా వర్తిస్తాయి. కాగా బహుళసభ్య వాణిజ్య ఒప్పందాలకు ఆయా ఒప్పందాలలో నిర్దేశించిన మేరకు మాత్రమే వర్తిస్తాయి. 2) వ్యవసాయ ఒప్పందం, వస్త్ర ఒప్పందం, మదుపు చర్యలపై ఒప్పందం మొదలగునవి (గాట్-1994)లో చేర్చారు. 3) పశుమాంసం, పాడిపరిశ్రమ, ఒప్పందాలను (4సి, 4డి) రద్దు చేసారు.

నుండి ప్రపంచ వాణిజ్య సంస్థ ఉనికిలోకి వచ్చింది. 1947 నుండి పారిశ్రామిక వస్తు వాణిజ్యంలో విస్తరిస్తూ వచ్చిన గాట్ ఒప్పందంలో, వ్యవసాయ ఉత్పత్తుల వాణిజ్యాన్ని (అగ్రిమెంట్ ఆన్ అగ్రికల్చర్), వ్యాపార సంబంధ పెట్టుబడి ఒప్పందాన్ని (ట్రేడ్ రిలేటెడ్ ఇన్వెస్ట్‌మెంట్ మెషర్స్ - టిఆర్ఐఎంఎస్) కూడా చేర్చి దాన్ని గాట్-1994గా పునర్వ్యవస్థీకరించారు. విస్తరించిన ఈ గాట్-1994ను డబ్ల్యుటిఒలో ఒక సమ్మిళిత ఒప్పందం (ఇన్టెగ్రల్ అగ్రిమెంట్) చేర్చారు. పరిశోధన ఫలితాల వాణిజ్యాన్ని (ట్రేడ్ రిలేటెడ్ ఇన్‌టలెక్చువల్ ప్రాపర్టీ రైట్స్ - టిఆర్ఐపిఎస్), సేవల రంగ వాణిజ్యాన్ని (జెనరల్ అగ్రిమెంట్ ఆన్ ట్రేడ్ ఇన్ సర్వీసెస్ - గాట్స్)లను వేరు వేరుగా వ్యవస్థీకరించి డబ్ల్యుటిఒలో చేర్చారు. ఇవి కూడ సమ్మిళిత ఒప్పందాలే. ఒకదేశం డబ్ల్యుటిఒ సభ్యదేశం అయితే అది ఈ మూడు ఒప్పందాలకు భాగస్వామి అని అర్థం. డబ్ల్యుటిఒ ఒక ఆక్టోపస్‌గా తయారయ్యింది.

**గాట్**

సుంకాలు, వాణిజ్యంపై సార్వత్రిక ఒప్పందం. ఈ ఒప్పందం పారిశ్రామిక వస్తువులు, వ్యవసాయ ఉత్పత్తులు, వ్యాపార సంబంధ మదుపు చర్యలకు వర్తిస్తుంది. మరికొన్ని అనుబంధ రంగాలకు కూడ వర్తిస్తుంది.

**టిఆర్ఐపిఎస్**

వాణిజ్య సంబంధ మేధో హక్కుల ఒప్పందం, ఈ ఒప్పందం ఫలితంగా అన్ని దేశాలు తమ పేటెంట్ ఒప్పందాలను మార్చుకోవలసి వచ్చింది. మందుల, విత్తనాల ధరలు బాగా పెరిగాయి. ఇంకా పెరుగుతాయి. పరిశోధనలకు అవసరమైన ముడి పదార్థాల ధరలు కూడా బాగా పెరిగి బడుగు బలహీన దేశాలలో పరిశోధనలు కుంటు పడుతున్నాయి.

**గాట్స్**

సేవల రంగ వాణిజ్యంలో సార్వత్రిక ఒప్పందం. విద్య, వైద్యం, బ్యాంకింగ్, ఇన్సూరెన్స్, వినోద రంగం, తాగునీరు. సాగునీరు, అన్నింటినీ ఈ ఒప్పందంలోనే చేర్చారు. దీనిపై మరింత వివరణ తరువాత పేజీలలో ఇవ్వబడింది.

**డిఎస్‌బి**

వివాదాల పరిష్కార సంస్థ. రెండు దేశాల మధ్య వచ్చే వాణిజ్య వివాదాలను పరిష్కరిస్తారు. అత్యధిక సందర్భాలలో సామ్రాజ్యవాద దేశాలకు అనుగుణంగానే తీర్పులు రావడం సహజం.

**టిఆర్‌పిఎం**

వాణిజ్య విధానాల పునః పరిశీలన యంత్రాంగం. ఈ ఒప్పందం చాలా ప్రమాదకరమైనది. ఈ ఒప్పందం కింద వివిధ దేశాలు తమతమ వాణిజ్య విధానాలను డబ్ల్యుటిఒ కు అనుగుణంగా మార్చుకోవలసి ఉంటుంది.

**సేవల రంగ వాణిజ్యంలో సార్వత్రిక ఒప్పందం (గాట్స్)**

సేవల రంగ వాణిజ్యంలో సార్వత్రిక ఒప్పందం (గాట్స్) ప్రపంచ వాణిజ్య సంస్థలో భాగంగా 1 జనవరి, 1995 నుండి అమలులోకి వచ్చింది. ముందుగా చెప్పుకున్నట్లు ఇది ఒక సమ్మిళిత ఒప్పందం. అంటే డబ్ల్యుటిఒ సభ్య దేశాలన్నీ అనివార్యంగా ఈ ఒప్పందానికి కట్టుబడి ఉండాలి. ఈ ఒప్పందం కిందనే విద్యారంగాన్ని చేర్చారు. విద్య, వైద్యం, రవాణా, సమాచారం, బ్యాంకులు, బీమా అన్ని రంగాలు సేవలుగానే గుర్తించబడ్డాయి. హక్కులను సేవలుగా, సేవలను వ్యాపారంగా, వ్యాపారాన్ని గ్లోబల్ వ్యాపారంగా ఈ ఒప్పందం పరిగణిస్తుంది. విద్య నుంచి పబ్‌ల వంటి వికృత వినోదం వరకు ఒకే నిబంధనావళితో నియంత్రించబడతాయి.

**విభాగాలు - పద్ధతులు**

ప్రతి సేవారంగాన్ని విభాగాలుగా విభజించారు. విద్యారంగాన్ని ఎ) ప్రాథమిక విద్య, బి) సెకండరీ విద్య, సి) ఉన్నత విద్య, డి) వయోజన విద్య, ఇ) ఇతర విద్య అనే విభాగాలుగా విభజించారు. భారత ప్రభుత్వం, ప్రస్తుతానికి ఉన్నత విద్యను ప్రపంచ వాణిజ్య సంస్థకు అప్పజెప్పే ప్రక్రియ ప్రయత్నం ప్రారంభించింది. ప్రజల నుండి బలమైన నిరసన రాకపోతే క్రమక్రమంగా మిగిలిన భాగాలను కూడా అప్పజెప్పవచ్చు.

ఈ గాట్స్ ఒప్పందం ప్రతి సేవారంగంలో నాలుగు వాణిజ్య పద్ధతులను గుర్తిస్తుంది. 1) సీమాంతర సరఫరా (క్రాస్ బార్డర్ సప్లై) - ఒక దేశపు విద్యార్థి తన దేశంలో ఉంటూనే దూర విద్య విధానం ద్వారా వేరే దేశపు విద్యా సంస్థ నుండి విద్యను పొందడం, రుసుము చెల్లించడం; 2) విదేశంలో వినియోగం (కన్సంప్షన్ అబ్రాడ్) - ఒక దేశపు విద్యార్థి వేరే సభ్య దేశానికి వెళ్లి అక్కడ విద్య పొంది రుసుము చెల్లించడం; 3) వ్యాపారాత్మక ఉపస్థితి (కమర్షియల్ ప్రెసెన్స్) - ఒక దేశంలో వేరే దేశపు విద్యా సంస్థ తన బ్రాంచిని స్థాపించి విద్యనందించి రుసుము వసూలు చేసుకోవడం; 4) సహజ వ్యక్తి ఉపస్థితి (ప్రెసెన్స్ ఆఫ్ నేచురల్ పర్సన్) - ఒక దేశానికి వేరే దేశపు ఉపాధ్యాయుడు వెళ్లి అక్కడ తాత్కాలికంగా నివాసం ఉండి విద్యా సేవలనందించి రుసుము వసూలు చేసుకోవడం.

భారత ప్రభుత్వం ఈ నాలుగు వాణిజ్య పద్ధతులను ఉన్నత విద్యా రంగంలో తెరవాలని చూస్తోంది. మూడవ విధానం (వ్యాపారాత్మక ఉపస్థితి) ద్వారా సభ్య దేశాల విద్యా వ్యాపారులు మన దేశంలో విద్యా సంస్థను తెరుస్తారు. ఈ విషయంలోనే మేధావులు ఎక్కువ ఆందోళన చెందుతున్నారు. 2000లో ప్రపంచ బ్యాంక్, యునెస్కో సంయుక్తంగా నియమించిన కమిటీ (టాస్క్‌ఫోర్స్) 'అభివృద్ధి చెందిన దేశాలలో పేరెన్నిక గన్న విశ్వవిద్యాలయాలు పేద, వర్ధమాన దేశాలలో నాణ్యతలేని కోర్సులు అందిస్తున్నాయి' అని తన నివేదికలో పేర్కొంది. అదే విధంగా ఈ ఒప్పందం వలన విస్తృతంగా పుట్టుకు వచ్చే విదేశీ విద్యా సంస్థల బ్రాంచీలు ఇచ్చే సర్టిఫికెట్లకు కూడా ఎటువంటి గుర్తింపు ఉండని పరిస్థితి ఏర్పడుతుందని ఆందోళన వ్యక్తమవుతుంది.

**డబ్ల్యుటిఒ - గాట్స్ ఒప్పందం ఒక ముళ్లకంప**

ప్రపంచ వాణిజ్య సంస్థ 160 సేవలను వ్యాపారం చేయదగ్గ సేవలుగా గుర్తించింది. అందులో విద్య నుంచి నైట్ క్లబ్‌ల వరకు ఉన్నాయని గమనించాం. అయితే ఈ ఒప్పందంలో కొన్ని వెసులుబాట్లు ఉన్నాయి. ఆ వెసులుబాట్లను ఉపయోగించుకోకపోతే మాత్రం డబ్ల్యుటిఒ ఉన్నన్నాళ్లూ ఈ పరాధీన సంకెళ్ల నుండి విముక్తి ఉండదు. ఒక దేశం డబ్ల్యుటిఒ సభ్య దేశం అయితే అది గాట్స్ ఒప్పందానికి కూడ ఒడంబడ వలసిందే. అయితే గుర్తించబడిన 160 సేవలలో ఆ దేశం కొన్ని

సర్వీసులలో మాత్రమే సభ్య దేశాలకు వాణిజ్య ప్రవేశాన్ని ఇవ్వవచ్చు. మిగిలిన సేవా రంగాలలో వాణిజ్య ప్రవేశాన్ని నిరాకరించవచ్చు. ఉదాహరణకు, భారతదేశం విద్యా రంగంలో వాణిజ్య అనుమతి (మార్కెట్ యాక్సెస్) నిరాకరించవచ్చు. ఈ వెసులుబాటు అన్ని సభ్య దేశాలకు, అన్ని సర్వీసుల విషయంలో ఉంటుంది. ఆ కారణంగానే అనేక దేశాలు తమ విద్యా రంగాన్ని (డబ్ల్యుటిఒ - గాట్స్) పరిధిలోకి తీసుకు రావడానికి నిరాకరించగలిగాయి. భారతదేశం మాత్రం ఉన్నత విద్యా ఉప విభాగాన్ని (సబ్ సెక్టర్) గాట్స్ పరిధిలో పెట్టడానికి సుముఖంగా ఉంది. అందుకు 2005 ఆగస్టులోనే ప్రారంభ సంసిద్ధతలు అందజేసింది. 2001 నుండి నడుస్తున్న దోహా విడత వాణిజ్య బేరసారాల వృత్తం పూర్తికానందు వల్ల ఆ 'సంసిద్ధతలు' 'ఒప్పుకోళ్లు'గా మారలేదు. నైరోబీలో జరుగనున్న పదవ మంత్రిత్వ స్థాయి సమావేశాలలోగా ఈ సంసిద్ధతలను వెనక్కి తీసుకోక పోతే భారత విద్యారంగం శాశ్వతంగా ప్రపంచ వాణిజ్య సంస్థ కబంద హస్తాలలో నలిగి పోవలసిందే. సభ్య దేశాలకు ఏదేని సర్వీసు రంగంలో, వాణిజ్య అనుమతి ఒప్పుకోలు ఇవ్వకుండా ఉండే హక్కు ఉంది గాని, ఇచ్చిన తరువాత వెనక్కి తీసుకునే హక్కు ఆచరణాత్మకంగా చూసినప్పుడు లేనట్టే. ఎందుకంటే ఇచ్చిన ఒక సర్వీసు రంగాన్ని వెనక్కి తీసుకోవాలంటే ఆ దేశం చెల్లించాల్సిన మూల్యం ఇంకా ఎక్కువగా ఉంటుంది. భారత ప్రభుత్వం ఈ గాట్స్ కౌన్సిల్‌కి ఇచ్చిన సంసిద్ధతలను నైరోబీ సమావేశాలకు ముందే వెనక్కి తీసుకోవాలని అఖిల భారత విద్యా హక్కు వేదిక, దేశ వ్యాప్తంగా దాని సభ్య సంఘాలు విస్తృతంగా ప్రచారం చేస్తున్నాయి. రెండు తెలుగు రాష్ట్రాలలో కూడ ఈ క్యాంపెయిన్ జరుగుతోంది. అధికారికంగా విద్యార్థి ఉపాధ్యాయ సంఘాలు ఈ క్యాంపెయిన్‌లో చేరుతున్నాయి.

విదేశీ విద్యా సంస్థలకు వాణిజ్య ఉపస్థితికి అనుమతించినా అనేక నిబంధనలు విధించే అవకాశం గాట్స్ ఒప్పందంలో ఉంది. కాని భారత ప్రభుత్వం ఆ వెసులుబాటులను ఉపయోగించుకోలేదు. ఫీజుల నియంత్రణ విషయంలో తప్పితే మిగిలిన విషయాలలో ఎటువంటి నిబంధన విధించలేదు. పైగా ఇంకా ప్రమాదకరమైన విషయమేమంటే విదేశీ విద్యా సంస్థలను భారతదేశ ప్రభుత్వ, ప్రైవేట్ విద్యా సంస్థలతో ఫలానా ఫలానా విషయాలలో సమానంగా చూడలేమని ముందుగానే మినహాయింపులు ప్రకటించే అవకాశాన్ని ప్రభుత్వం ఈ సంసిద్ధతలలో పొందు పరచలేదు. ఫలితంగా ఈ సంసిద్ధతలు ఒప్పుకోళ్లుగా మారినప్పుడు భారత ప్రభుత్వం విదేశీ విద్యా సంస్థలను ప్రభుత్వ విద్యా సంస్థలతో సమానంగా పరిగణించి భూములు, నిధులు, స్కాలర్‌షిప్‌లు ఇవ్వవలసి ఉంటుంది. ఈ నిబంధనల వలన ప్రభుత్వ నిధులు, వనరులు విదేశీ విద్యా సంస్థలకు ధారాదత్తం అవుతాయి.

**గాట్స్ చిక్కుముడులు**

ఈ వ్యాస పరిమితులలో గాట్స్ నిబంధనలను పూర్తిగా పేర్కొనడం సాధ్యం కాదు. ఈ ఒప్పందం ఆర్టికల్ 2 ప్రకారం ఒక సభ్య దేశం ఇతర అన్ని సభ్య దేశాలను సమానంగా పరిగణించాలి. అంటే నేపాల్‌కు దాని అభివృద్ధి అవసరాల దృష్ట్యా భారత ప్రభుత్వం ఏదేని సేవారంగంలో వ్యాపార అవకాశాలు కల్పిస్తే అవే అవకాశాలను అమెరికాకు కూడ కల్పించాలి. మరొక రకంగా చెప్పాలంటే ఒక సభ్య దేశం ప్రతి ఇతర సభ్య దేశాన్ని మోస్ట్ ఫేవర్డ్ నేషన్‌గా గుర్తించాలి. మరొక నిబంధన ఆర్టికల్ 17 ప్రకారం ఇంతకు ముందు పేర్కొన్నట్లు విదేశీ సంస్థలకు దేశీయ సంస్థలతో ఏయే విషయాలలో సమాన అవకాశాలు ఉండవో ముందే చెప్పాలి. దీనిని నెగిటివ్‌లిస్ట్ అంటారు. దీనిని సమగ్రంగా తయారు చేయడం చాలా కష్టం. ఏయే అంశాలలో విదేశీ సంస్థలను స్వదేశీ సంస్థలతో సమానంగా చూస్తామో పట్టీ తయారు చేయడం సులభం. కాని నెగిటివ్ లిస్ట్ పద్ధతి అభివృద్ధి చెందుతున్న, వెనుకబడి ఉన్న దేశాలకు చాలా ఇబ్బందులు తెస్తుంది. అసమానతలు గల ప్రపంచంలో నెగిటివ్ లిస్ట్ పద్ధతి చాలా అప్రజాస్వామికమైనది. గాట్స్ ఒప్పందంలో 6వ ఆర్టికల్ దేశీయ నియంత్రణ ఆయా దేశాల వాణిజ్య నిబంధనలు వ్యాపారులకు అనుకూలంగా క్రమంగా మార్చుకోవాలని నిర్దేశించడమే కాకుండా ఆయా దేశాల వాణిజ్య నిబంధనలు రివ్యూ చేయడానికి ట్రేడ్ ప్రాక్టీసెస్ రివ్యూ మెకానిజమ్ అనే చట్టపరమైన సాధనాన్ని డబ్ల్యుటిఒ ఏర్పరచింది. ఈ నిబంధన కింద ప్రతి సభ్య దేశం దేశీయ వాణిజ్య నిబంధనలను డబ్ల్యుటిఒ ప్రతి సంవత్సరం రివ్యూ చేస్తుంది. ఒక విధంగా చెప్పాలంటే దేశ అంతరంగిక విషయాలను డబ్ల్యుటిఒ హస్తగతం చేసుకోవడమే. గాట్స్ ఒప్పందంలో 18వ ఆర్టికల్ అదనపు ఒప్పుకోళ్ల గురించి పేర్కొంటుంది. ఈ అదనపు నిబంధన కిందే భారతదేశంతో సహా అనేక దేశాలలో వివిధ సేవారంగాలలో స్వతంత్ర నియంత్రణ సంస్థలు (ఇండిపెండెంట్ రెగ్యులేటరీ అథారిటీస్) ఏర్పాటు చేయబడుతున్నాయి. విద్యుత్ రంగంలో, బీమా రంగంలో ఇటువంటి రెగ్యులేటరీ సంస్థలున్న విషయం తెలిసిందే. విద్యారంగంలో ఇటువంటి రెగ్యులేటరీ సంస్థ స్థాపించాలని (ఇండిపెండెంట్ రెగ్యులేటరీ అథారిటీ ఫర్ హయ్యర్ ఎడ్యుకేషన్) శ్యాంపెట్రోడా కమిషన్ ప్రభుత్వానికి సూచించింది. 2010లో ప్రభుత్వం కూడ ఇటువంటి బిల్లును పార్లమెంట్‌లో ప్రవేశపెట్టింది. ఆ బిల్లు మురిగిపోయినా ఇప్పటి ఎన్‌డిఎ ప్రభుత్వం అదే ప్రయత్నంలో ఉంది. ఈ స్వతంత్ర నియంత్రణ సాధికార సంస్థలు ప్రజల ఒత్తిడి నుంచి స్వతంత్రంగా ఉంటూ స్వదేశీ విదేశీ కార్పొరేట్ సంస్థలకు అనుకూలంగా వాణిజ్యాన్ని నియంత్రిస్తాయని వేరుగా చెప్పనవసరం లేదు. ప్రజలడిగితే ప్రభుత్వం తన చేతులలో ఏమీ లేదని చేతులెత్తేస్తుంది. అంటే ఈ స్వతంత్ర నియంత్రణ సంస్థలు ప్రజా ఉద్యమ ఒత్తిడి అనే రాజకీయ ప్రక్రియకు అవకాశం లేకుండా చేస్తుంది. ఇది నియో లిబరలిజం నిరాజకీయాకరణకాక మరేమిటి? అలాగే అదనపు ఒప్పుకోళ్లలో భాగంగా వివిధ సర్వీసు రంగాల వ్యాజ్యాలను కోర్టుల నుంచి ట్రిబునల్స్‌కు మారుస్తున్నారు. న్యాయ వ్యవస్థను బైపాస్ చేయడం కూడా నియో లిబరలిజం లక్షణమని మనం గమనిస్తాం. విద్యా రంగానికి మూడు స్థాయిలలో ట్రిబ్యునల్ వ్యవస్థ పెట్టడానికి కపిల్ సిబల్ 2010లో పార్లమెంట్‌లో బిల్లు తీసుకు వచ్చిన విషయం తెలిసిందే. ఈ బిల్లు కూడా మురిగిపోయింది. నైరోబీ సమావేశాలలో భాగంగా భారత ప్రభుత్వం ఉన్నత విద్యారంగాన్ని డబ్ల్యుటిఒ-గాట్స్‌కు దఖలు పరిస్తే, ఒప్పుకోలు సమర్పిస్తే ఈ బిల్లులన్నీ పునరుజ్జీవనాన్ని పొందుతాయి.

ఒక్కమాటలో చెప్పాలంటే భారతదేశం ఉన్నత విద్యారంగంలో డబ్ల్యుటిఒ-గాట్స్‌కు ఒప్పుకోళ్లు ఇస్తే భారతదేశం ఒక స్వతంత్ర విద్యా విధానాన్ని అమలు చేయజాలదు. సమానత్వం, సామాజిక న్యాయం, విద్యలో సామాజిక స్పృహ మాత్రమే కాదు, విద్యా, సాంస్కృతిక రంగాలలో దేశ స్వయం ప్రతిపత్తి, చివరికి దేశ సార్వభౌమాధికారం ప్రమాదంలో పడతాయి. విద్యారంగాన్ని డబ్ల్యుటిఒ-గాట్స్ నుండి కాపాడడానికి బలమైన ప్రచార, ప్రతిఘటన ఉద్యమం అవసరం.

*(రచయిత కన్వీనర్, ఆంధ్రప్రదేశ్ విద్యాపరిరక్షణ కమిటీ)* వీ

# గ్రీస్ పరిణామాలు - సోషలిజం ఆవశ్యకత

*ఎన్నికల రాజకీయాల్లో ఉండే అన్ని పార్టీలు సామ్రాజ్యవాదులతో కుమ్మక్కయి ప్రజలను మోసం చేస్తాయని నిరూపిస్తున్న గ్రీస్ పరిణామాలను వివరిస్తూ, విప్లవం ద్వారా సోషలిజం తెచ్చుకోవడమే ప్రజల ముందున్న ఏకైక మార్గమని అంటున్నారు* **ఎం. నర్సింహ్మా**

కొన్ని సంవత్సరాల క్రితం జరిగిన వాస్తవ సంఘటనతో ఈ వ్యాసం ప్రారంభించడం సందర్భోచితంగా ఉంటుంది. ఒక పేద అమ్మాయిని పనిలో పెట్టిస్తానని ఆమె తండ్రిని నమ్మించిన ఒకతను ఆమెను ఒక ధనవంతుల ఇంట్లో పనిమనిషిగా పని చేయడానికి అమ్మేస్తాడు. అక్కడ 24 గంటల వెట్టిచాకిరి చేసుకుంటూ బతుకుతున్న ఆమెను ఒకబ్బాయి ప్రేమిస్తాడు. తన దుర్భర జీవితానికి అతని ప్రేమ ఎంతో ఊరటను, స్వాంతనను ఇస్తుంది. అక్కడి నుంచి పారిపోవడానికి సిద్ధమైతే పెళ్లి చేసుకుంటానని అతను చెప్పడంతో, ఒక రోజు ఆ ఇల్లు వదిలి అతనితో వెళ్లిపోయింది. ఒక గుడిలో పెళ్లి చేసుకొని ఒక గదిలో సంసారం పెడతారు. తనకు స్వేచ్ఛను ప్రసాదించిన భర్తను ఎంతో ప్రేమగా చూసుకునేది. రెండు నెలల తరువాత తన చుట్టాలంటూ ఇద్దరు వ్యక్తులను భర్త ఇంటికి తెస్తాడు. వారికి ఎంతో ప్రేమగా వండి పెడుతుంది. ఆ రాత్రి వారు ఆమెపై లైంగిక అత్యాచారం జరిపి, ఆమెను భయ భ్రాంతులకు గురిచేస్తారు. తన భర్త ఆమెను ఆసుపత్రికి పోదామని తీసుకెళ్లి ఒక వేశ్యావాటికకు అమ్మేస్తాడు. తండ్రి దగ్గర పేదరికమనే బంధీఖానాలో ఉంటే, ఆ తరువాత ఇంటి యజమాని దగ్గర వెట్టిచాకిరి బంధీఖానా, ఆ తర్వాత వేశ్యా వాటిక అనే బంధీఖానా.

సరిగ్గా గ్రీస్ దేశ ప్రజల ప్రస్తుత పరిస్థితి కూడా ఇలాంటిదే. 2010 ఏప్రిల్‌లో గ్రీస్ ప్రధాని దేశం గడ్డు పరిస్థితిలో ఉన్నదని గతంలో చేసిన అప్పులు కట్టాలంటే మళ్లీ అప్పు చేయాల్సిందేనని ప్రకటించాడు. దాంతో అంతర్జాతీయ ద్రవ్యనిధి (ఐఎంఎఫ్), యురోపియన్ యూనియన్ (ఇయు) లు అప్పు కావాలంటే షరతులు ఒప్పుకోవాలని నిబంధన విధించారు. భారతదేశం అప్పు కొరకు వెళ్లినపుడు వివిధ దేశాలు కాని, ఐఎంఎఫ్, ప్రపంచ బ్యాంకులు ఏ రకమైన షరతులు విధిస్తాయో సరిగ్గా అవే షరతులు ఇవి. గతంలో ఈ షరతులను 'కండిషన్స్' అని సామ్రాజ్యవాదులు పిలిచారు. ఆ పదం భయం గొలిపేదిగా ఉందని అర్థం చేసుకొని, 'మానసిక యుద్ధం'లో భాగంగా దాన్నిపుడు 'ఆస్టెరిటీ మెజర్స్' (పొదుపు చర్యలు) అంటున్నారు. దీన్ని రెండు భాగాలుగా విభజించవచ్చు. ఒకటి, ప్రభుత్వ వ్యయాన్ని తగ్గించడం. రెండు, ప్రభుత్వ ఆదాయాన్ని పెంచడం. ముందుగా, వ్యయాన్ని తగ్గించడం కొరకు ఐఎంఎఫ్, ఇయులు ఇచ్చిన (తప్పనిసరి పాటించవలసిన) సూచనలు పరిశీలిద్దాం.

దీనికి ముందు గ్రీస్ సమాజంను విశ్లేషించాలి. గ్రీస్ దేశంలో బిలియనీర్లు, మిలియనీర్లు, అత్యంత ధనవంతులు కలిపితే మొత్తంగా 25 వేల వరకు ఉంటారు. ఈ పాలక వర్గానికి సేవ చేస్తూ ధనికులయిన వారు ఒక శాతం జనాభా. ఈ ధనికులతో సహా, ప్రజలను శ్రమ దోపిడి చేస్తూ లాభపడిన ఆస్తిపర ఎగువ మధ్యతరగతి మరో నాలుగు శాతం. మిగతా జనాభా అంతా వివిధ మధ్యతరగతి, పేద వర్గాలే.

ఐఎంఎఫ్, ఇయులు సూచించిన పొదుపు చర్యల ప్రకారం గ్రీస్ ప్రభుత్వం ప్రభుత్వ వ్యయాన్ని తగ్గించుకుంది. అంటే, విద్య, వైద్యం, శిశు సంరక్షణలపై బడ్జెట్ కోతలు, నిరుద్యోగ భృతి తగ్గింపు, పెన్షన్ల తగ్గింపు, ప్రభుత్వ సంస్థలను ప్రైవేటీకరించడం లాంటి చర్యలు చేపట్టింది. దాంతో 90 శాతంగా ఉన్న పేద, మధ్యతరగతి ప్రజలపై తీవ్ర ఆర్థిక ప్రభావం పడింది. ఇంకో వైపు ప్రభుత్వ ఆదాయం పెంచడంలో భాగంగా ఐఎంఎఫ్, ఇయులు చేసిన సూచనల ప్రకారం 95 శాతంగా ఉన్న, పేద మధ్యతరగతి ప్రజలు వాడే వస్తువులు, సేవలపై వ్యాట్ పన్నును భారీగా పెంచారు. అదే సమయంలో, ఐదు శాతం ధనిక వర్గం వాడే ఫైవ్-స్టార్ హోటళ్లపై, విమానయానాలపై ఇంకా తదితరాలపై వ్యాట్ పన్ను తగ్గించారు. కంపెనీలపై కార్పొరేట్ ట్యాక్స్‌ను, ధనవంతుల ఆస్తులపై వెల్త్ ట్యాక్స్‌ను భారీగా తగ్గించారు. దాంతో ఐదు శాతం ధనికులకు మరింతగా లాభం జరగ్గా, ప్రభుత్వానికి ఆదాయం తగ్గింది. పెరిగిన పన్నులతో 95 శాతం ప్రజల బతుకులు మరింతగా దిగజారాయి. ఈ చర్యలు చేపట్టినందుకు, ఐఎంఎఫ్, ఇసిబిలు గ్రీస్‌కు 2010, 2011లో రెండు విడతలుగా బిలియన్ల కొలది డాలర్లను 'బెయిల్ ఔట్ ప్యాకేజీ'లో భాగంగా ఇచ్చింది. అయితే ఇక్కడ సామ్రాజ్యవాదులు ప్రజలపై చేస్తున్న 'మానసిక యుద్ధా'న్ని గ్రహించాలి.

ఈ మానసిక యుద్ధంలో భాగంగా వారు భాషను పెద్ద ఎత్తున వాడుకుంటున్నారు. ఎలాగంటే, ఉదాహరణకు ప్రజల జీవితాలను చిన్నాభిన్నం చేసే, దుర్భరంగావించే ఐఎంఎఫ్ షరతులను వారు 'పొదుపు చర్యలు'గా పిలుస్తున్నారు. దాంతో, ఈ చర్యల వలన ఏ ప్రజలకు తీవ్ర నష్టం జరుగుతుందో, వారే ఈ పదజాలంను నమ్మి, 'పొదుపు' మంచిదే కదా అని సమర్థిస్తారు. ఇక 'బెయిల్ ఔట్' పదంను పరిశీలిస్తే, ఎవరైనా తప్పు చేసినపుడు, ఆపదలో ఉన్నపుడు చేసే సహాయాన్ని బెయిల్ ఔట్ అంటారు. మానవ విలువల ప్రకారం చూసినపుడు ఎవరినైనా 'బెయిల్ ఔట్' చేయాలని అనుకున్నపుడు, నిస్వార్థంగా, ఏమీ తిరిగి ఆశించకుండా సహాయం చేయడమని దానర్థం.

కాని, కార్పొరేట్, పెట్టుబడిదారీ, సామ్రాజ్యవాదులలో మానవ విలువలు మైక్రోస్కోప్‌లో వెతికినా దొరకవు కాబట్టి వారి భాషలో 'బెయిల్ ఔట్' అంటే అప్పు ఇవ్వడం. అది కూడా అత్యంత కష్టాల్లో ఉన్న వారిని మరింత కష్టాల్లో కూరుకుపోయే విధంగా చేసే 'పొదుపు చర్యల' పేరు మీద సాఫ్ట్‌గా పిలవబడే అత్యంత క్రూర షరతులు విదించి అప్పు ఇవ్వడం. అసలు ఇంకో వాస్తవం తెలిస్తే ఈ కార్పొరేట్, పెట్టుబడిదారీ, సామ్రాజ్యవాదులు మొత్తం మానవ జాతికి ఎంత ప్రమాదకరమో అర్థమవుతుంది.

అదేమిటంటే, ఒక మానవీయ పదమైన 'బెయిల్ అవుట్'ను వాడి, వారు ఇస్తున్నది అత్యంత అమానవీయమైన షరతులతో కూడిన అప్పు

మాత్రమే కాదు. ఆ ఇచ్చే బిలియన్ల కొలది డాలర్లలో కేవలం పది శాతం మాత్రమే ప్రజలకు చేరుతుంది. మిగితా 90 శాతం రెండు రకాల అప్పులు తీర్చడానికి పోతుంది. ఒకటి, సావరిన్ డెట్ (అంటే ప్రభుత్వ అప్పు). రెండు, ప్రైవేట్ డెట్, అంటే సామ్రాజ్యవాదులకు, దేశ పెట్టుబడిదారులకు చెందిన కార్పొరేట్ కంపెనీలు చేసిన అప్పులను ప్రభుత్వం ఆర్థిక వ్యవస్థకు ఊపు నివ్వడం పేరుతో 'డెట్ రిస్ట్రక్చరింగ్' (కార్పొరేట్ కంపెనీలకు రుణ మాఫీ చేయడం, లేదా భారీగా తగ్గించడం) చేస్తుంది. ఈ ద్రవ్య లోటును ప్రభుత్వమే భరిస్తుంది. అంటే కార్పొరేట్ కంపెనీలు చేసిన అప్పును, ఆర్థిక సంక్షోభం పేరుతో వారు కట్టకపోతే అప్పుచేసి ప్రభుత్వం వారి అప్పు బాధ తీరుస్తుంది. మరి ప్రభుత్వ అప్పు ఎవరు తీర్చాలి? ఇంకెవరు, ప్రజలే. అందుకే కదా, ప్రజలపై పన్నులు పెంచేది! అంటే, వ్యాపారంలో లాభమైనా, నష్టమైనా పెట్టుబడిదారులకు గ్యారంటీ సుఖాలు. ప్రజలకు మాత్రం గ్యారంటీ దుఃఖాలు. ఇదే గ్రీస్ అనుభవం మనకు తెలిపింది.

2012 మేలో జరిగిన ఎన్నికలలో గ్రీస్ ప్రజలు తమ జీవితాన్ని దుర్భరం చేసిన అధికార పార్టీని ఓడించి గ్రీస్ జాతి గొప్పదని (మన బిజెపి లాగా) ఊదరగొట్టిన పార్టీకి పట్టం కట్టారు. ఆ పార్టీ కూడా పాత ప్రభుత్వ విధానాలనే అమలు చేయడంతో, ఈ పార్టీ కూడా సామ్రాజ్యవాదుల తొత్తేనని ప్రజలు అర్థంచేసుకున్నారు. అయితే, పాలక వర్గాలు ఎంత ముందు చూపుతో, ఎంత ప్రణాళికతో ఆలోచిస్తాయనేది మనకు ఇక్కడ అర్థమవుతుంది. ప్రజల్లో పాలక వర్గాల పట్ల పెరుగుతున్న అసంతృప్తిని గ్రహించి, వారే 'సిరిజా' అనే ఒక వామపక్ష ఉద్యమాన్ని తమ మీడియా ద్వారా రహస్య ప్రణాళికలో భాగంగా ప్రోత్సహిస్తూ వచ్చారు. 'పొదుపు చర్యల'ను వ్యతిరేకిస్తూ పాలక వర్గాలను విమర్శిస్తూ, పాలక వర్గాల మీడియా ప్రోత్సాహంతో, వారి ధన సహాయంతో, 'సిరిజా' ఉద్యమం ప్రజలల్లో మంచి పేరు సంపాదించింది. (భారతదేశంలో కూడా అన్నా హజారే, రాందేవ్ బాబా, కేజ్రీవాల్, ఆప్, లోక్‌సత్తా, జయప్రకాశ్ నారాయణ్‌లు ఎన్నికలనే మార్గంగా చూపుతున్న వివిధ వామపక్ష, కుల సంఘాలు, పాలక వర్గాలకు ఇలాంటి సేవనే చేస్తున్నాయి)

2015 జనవరిలో జరిగిన ఎన్నికలలో 'సిరిజా' ఉద్యమం రాజకీయ పార్టీ అవతారమెత్తితే ప్రజలు దానిని గెలిపించారు. (నిజానికి గ్రీస్ పాలక వర్గాలు 'సిరిజా' పార్టీ గెలిచేట్టు చేశారు. ప్రజాస్వామ్యం కాబట్టి ప్రజలను పావులుగా వాడుకున్నారు.) కమ్యూనిస్టు పార్టీ, సోషలిస్ట్ పార్టీల మద్దతుతో వామపక్ష పార్టీ అయిన 'సిరిజా' అధికారంలోకి వచ్చింది. ఈ వామపక్ష సంకీర్ణ ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన తరువాత పాలక వర్గానికి వ్యతిరేకంగా ఏ ఒక్క పని చేయలేదు. ఇంతలోనే ప్రభుత్వం దివాళా తీయడానికి సిద్ధంగా ఉందని, అప్పు చేయక తప్పదని ప్రకటించింది. అప్పు ఎవరిస్తారు? సహజంగా సామ్రాజ్యవాదులే. దాంతో మళ్లీ అదే ఐఎంఎఫ్, ఇసిబిలు. అదే షరతులు. తామేదో గొప్ప ప్రజాస్వామ్య వాదులమని, ప్రజల నిర్ణయం పాటిస్తామని ఫోజ్‌లు ఇవ్వడానికి 'పొదుపు చర్యల'పై ఒక రెఫరెండం (ప్రజాభిప్రాయ సేకరణ) నిర్వహించారు. మళ్లీ ఎన్నికలు నిర్వహిస్తే ఎంత తతంగమో అంత జరిగింది. మెజారిటీ ప్రజలు పొదుపు చర్యలను తిరస్కరించారు. ఇంతకన్నా బతుకులు దుర్భరం కావని ఆ రెఫరెండం ఫలితాల తరువాత అనుకుంటున్న ప్రజలను పది రోజులు తిరగక ముందే వామపక్ష – కమ్యూనిస్టు – సోషలిస్ట్ పార్టీల సంకీర్ణ ప్రభుత్వం ప్రజలను చావుదెబ్బ కొడుతూ గత ప్రభుత్వం కన్నా తీవ్ర పొదుపు చర్యలను ఒప్పుకుంటూ ఐఎంఎఫ్, ఇయుల ముందు మోకరిల్లారు. దేశ సార్వభౌమత్వాన్ని సామ్రాజ్యవాదుల పాదరక్షల దగ్గర పెట్టారు. వామపక్ష, సోషలిస్ట్, కమ్యూనిస్ట్ పార్టీలు సామ్రాజ్యవాదులకు రహస్యంగా అమ్ముడుపోయి, ప్రజలను నమ్మించి, అధికారంలోకి రాగానే ప్రజా వ్యతిరేకులుగా మారడం వారికి అతిపెద్ద షాక్.

గ్రీస్ ప్రజల అనుభవం (ఇంకా ఇతర దేశాల అనుభవంకూడా) భారత ప్రజలకు గొప్ప గుణపాఠాలను నేర్పుతున్నది. భారత పాలక వర్గాలు కూడా ప్రభుత్వం చేత బిలియన్ల కొలది డాలర్లను ఐఎంఎఫ్, ప్రపంచ బ్యాంక్‌ల దగ్గర అమానవీయ షరతులను ఒప్పుకొని అప్పు చేయించారు. 1991 తరువాత మొదలైన ఈ అప్పుల పరంపర ఇంకా నడుస్తూనే ఉన్నది. రానున్న కొన్ని సంవత్సరాలలో భారతదేశం కూడా అప్పులు తీర్చాల్సి ఉంటుంది. ఇప్పటికే వారి షరతుల పుణ్యమాని ప్రజల జీవితాలు దుర్భరంగా తయారయ్యాయి. భారత దేశంలో కూడా గ్రీస్ పరిస్థితులు రానున్నాయి. ఇక్కడ కూడా ప్రజలను మోసం చేయడానికి భవిష్యత్‌లో అవసరమైతే ఆప్, లోక్‌సత్తా నుండి మొదలుకొని వామపక్ష, కమ్యూనిస్ట్ పార్టీల వరకు పాలకవర్గాలు వాడుకుంటాయి. ఇంకోవైపు, ప్రజలను అణచడానికి గ్రీస్‌లో పాలక వర్గం తీవ్ర జాతీయవాద భావజాలం గల ఫాసిస్ట్ శక్తులను ముందుకు తెస్తున్నారు. భారతదేశంలో హిందూత్వ ఫాసిస్ట్ శక్తులు ఇప్పటికే ఉన్నాయి.

అధికార వామపక్ష పార్టీలు ప్రజలను ఒక బంధీఖానా నుండి విముక్తి చేసినట్టు నమ్మించి, మరింత అమానవీయమైన బంధీఖానలో వేశారు. గ్రీస్ అనుభవంతో మనకు అర్థమయ్యేదేమంటే ఆస్తులను పోగేసుకునే వ్యవస్థ ఉన్నంత వరకు మెజారిటీ ప్రజల పరిస్థితి మరింత దుర్భరంగా తయారవుతుంది. ఎందుకంటే 'మెజారిటీ ప్రజలను దోపిడిచేస్తేనే కొందరి చేతిలో ఆస్తులు పోగయితాయనేది వాస్తవం. అందుకే, వ్యక్తిగత ఆస్తులు లేని సోషలిస్ట్ సమాజంలోనే సమానత్వం సాధ్యమవుతుంది. ఆ సోషలిస్ట్ వ్యవస్థను విప్లవాల ద్వారా కాకుండా ఎన్నికల ద్వారా తెస్తామని ఏదైనా వామపక్ష, కమ్యూనిస్ట్ పార్టీలు అంటున్నాయంటే, అది కేవలం పాలక వర్గాల సేవలో తరించి పోవడానికేనని గ్రీస్, ఇతర దేశాల అనుభవం తెలుపుతున్నది. కొసమెరుపు ఏంటంటే, గ్రీస్ జనాభాలో 25 శాతం మంది నిరుద్యోగులుగా ఉన్నారు. వైద్య ఖర్చులు విపరీతంగా పెరిగి ఎందరో రోగాలు ఉన్నప్పటికీ ఆసుపత్రులకు వెళ్లడం లేదు. ఆత్మహత్యలు విపరీతంగా పెరిగాయి. ఇలాంటి పరిస్థితులలో ప్రజలను నమ్మించి మోసం చేసి, మరింత క్రూరమైన 'పొదుపు' చర్యల ప్యాకేజీని ఒప్పుకున్న వామపక్ష ప్రభుత్వం చర్యతో ప్రపంచ వ్యాప్తంగా (భారత్‌తో సహా) స్టాక్ మార్కెట్లు సంతోషంలో మునిగి తేలుతున్నాయంటే పెట్టుబడిదారులు ఎంత క్రూర మనస్థత్వం కలవారో అర్థమవుతుంది.

గ్రీస్ లాగే యురోపియన్ యూనియన్‌లో సభ్యదేశమైన ఫిన్లాండ్ దేశానికి చెందిన ఇయు పార్లమెంట్ మెంబర్ అయిన ఒకరు, గ్రీస్ దేశ ప్రజలు చేస్తున్న ఉద్యమాలను ఉద్దేశించి 'వారిని బుల్‌డోజర్లతో అణిచివేయాలి' అని అన్నారు. మానవ హక్కులకు పుట్టినిల్లు అయిన యూరప్ గడ్డమీద పాలకవర్గ ప్రతినిధి ఆ మాట అన్నాడంటే, వారు ప్రజలను అవసరమైతే సాయుధంగా అణిచివేయడానికి సిద్ధమని అర్థమవుతున్నది. ప్రజలను సాయుధంగా అణిచివేసే పాలక వర్గాన్ని ఓడించడానికి ఎన్నికలు ఏమాత్రం మార్గం కాదని, పాలక వర్గం ఏ పద్ధతిలో అణిచివేస్తున్నదో, ఆ పద్ధతిలోనే దోపిడీ పాలక వర్గాలను కూల్చి అసమానతలు ఉండని సోషలిజం స్థాపించుకోవడమే ప్రపంచ ప్రజల ముందున్న ఏకైక మార్గమని గ్రీస్ చెపుతున్నది. వీ

*(రచయిత సామాజిక పరిశోధకులు)*

# మయన్మార్‌పై దుందుడుకు చర్య

***ఈశాన్య రాష్ట్రాలలో ప్రజలు నిత్యం సైనిక ఆంక్షలతో, మానవ హక్కుల ఉల్లంఘనలతో దుర్భర పరిస్థితులను ఎదుర్కొంటున్నారనీ, దేశ సరిహద్దుల్లో జరిగిన సైనిక చర్య ఇంకా తీవ్ర నిర్బంధానికి దారితీసే ప్రమాదముందనీ అంటున్నారు*** **బైరెడ్డి సతీష్**

ఈశాన్య రాష్ట్రం అయిన మణిపూర్‌లోని మయన్మార్ దేశ సరిహద్దును ఆనుకుని ఉన్న చందేల్ జిల్లాలో కొత్త సంతాల్ ప్రాంతంలో జూన్ 4న ఎన్ఎస్‌సి (కప్లాంగ్) (నాగాలాండ్ సోషలిస్ట్ కౌన్సిల్) వర్గం 6 డోగ్రా రెజిమెంట్‌కు చెందిన వాహన శ్రేణిపై ఆకస్మిక దాడి చేయడంతో 18 మంది సైనికులు చనిపోవడమే కాక అనేక మంది గాయపడ్డారు. అంత క్రియాశీలకంగాలేని కప్లాంగ్ వర్గం అనేక ఈశాన్య రాష్ట్రాల సాయుధ సంస్థలతో కలిసి చేసిన ఈ చర్యతో కేంద్రం ఉలిక్కి పడింది. సహజంగానే జాతి పోరాటాల పట్ల కఠినంగా వ్యవహరించే బిజెపి ప్రభుత్వం తన విధానానికి అనుగుణంగానే స్పందించింది.

బిజెపి అధికారంలోకి వచ్చిన తర్వాత అతిపెద్ద హింసాయుత ఘటన అవడం, అదీ దేశ సరిహద్దులో జరగడం ఈ జాతీయవాదులని అసహనానికి గురిచేసింది. యుద్ధ ప్రాతిపదికన ప్రతి దాడిని (కౌంటర్ స్ట్రైక్) రచించి అమలు జరిపింది. సగటు మనుషులకు, తమకు తాము దేశ భక్తులం అని చెప్పుకునే వారికి ఈ చర్య సమర్థనీయంగా, ప్రశంసనీయంగా కనిపించవచ్చు. కానీ ఈ దుందుడుకు చర్య ఏ అంతర్జాతీయ న్యాయ సూత్రాలను ఉల్లంఘించిందీ, ఏ ప్రజల ఆకాంక్షలను మరుగున పడేసే ప్రయత్నం జరిగిందనేది ఒక ప్రజాస్వామిక దృష్టితో విశ్లేషిస్తే తప్ప అర్థం కాకపోవచ్చు.

దేశ సైనిక వ్యవస్థపై దాడి చేయడం సార్వభౌమాధికారంపై దాడి చేయడంగా అనుకోవచ్చు గానీ ప్రజల ప్రజాస్వామిక ఆకాంక్షల్ని, మరోదేశ సార్వభౌమత్వాన్ని గౌరవించని ఆధిపత్యవాద దుందుడుకుతనం దీనిలో స్పష్టంగా గోచరిస్తుంది.

ప్రతినిత్యం ఈశాన్య ప్రాంత ప్రజలు సైన్యం చేతిలో అనుభవించే హింస, అరాచక చర్యలు ఇలాంటి వాటి చాటున దాచేసి మరింత నిర్బంధానికి పాల్పడవచ్చు. ఈ ఆపరేషన్‌కు ప్రత్యేకమైన సంకేతనామం ఏదీ లేకపోయినా ఈశాన్య రాష్ట్రాల్లో ఉద్యమిస్తున్న స్వయం నిర్ణయాధికార పోరాట సంస్థల అణచివేతకై ఉద్దేశించిన 'ఆపరేషన్ హిఫాజత్' లో భాగంగానే రూపొందించబడింది.

కేంద్ర హోంశాఖ, రక్షణ శాఖ మంత్రులతో పాటు ఆర్మీ చీఫ్, జాతీయ భద్రతా సలహాదారుడు డోవల్ ప్రత్యక్ష పర్యవేక్షణలో ఈ ఆపరేషన్ నిర్వహించింది. ఈ మిలిటరీ చర్యను రూపొందించ డానికి డోవల్ ఆ సమయంలో ప్రధానమంత్రి వెంట బంగ్లాదేశ్ పర్యటనలో ఉండాల్సినది రద్దు చేసుకుని మరీ అత్యంత ప్రాధాన్యత అంశంగా దీన్ని అమలుపరిచారు.

మిలిటరీ కాన్వాయి పైన దాడి జరిగిన జూన్ 4 నుండి 'ప్రతిదాడి' జరిగే జూన్ 8 నాటికి మధ్య ఆ ప్రాంతంలో అనేక మానవ హక్కుల ఉల్లంఘనలు జరిగినట్లు అక్కడి మీడియా పేర్కొన్నది. సహజంగానే ఈశాన్య రాష్ట్ర వార్తలు అందునా మిలటరీ ఉల్లంఘనలు ప్రధాన వార్తా స్రవంతిలో భాగం కాలేకపోతున్నాయి.

సైనిక దళాల ప్రత్యేక అధికారాల చట్టం రద్దుకై (ఎఎఫ్ఎస్‌పిఎ) దాన్ని అడ్డుపెట్టుకుని సైన్యం చేస్తున్న దురాఘతాలకు, తీవ్రమైన హక్కుల ఉల్లంఘనలకు వ్యతిరేకంగా ఇరోం షర్మిల అనే మహిళ గత దశాబ్ద కాలానికి పైగా నిరాహార దీక్ష చేస్తూనే ఉన్నది. సాయుధ పోరాట సంస్థల హింసా చర్యలపై జరిగిన చర్చ అక్కడ మోహరించబడ్డ సైన్యం చేస్తున్న అరాచకాలపై, నిర్బంధకాండపై జరగడం లేదు. హింస ప్రధానంగా జరిగే చర్చలో ఈశాన్య ప్రజల నిజమైన ఆకాంక్షలు బయట ప్రపంచానికి తెలియకుండా పోతున్నాయి. అనేక తెగల, పోరాట సంస్థల మధ్య అంతర్గత పోరుకూడా దీనికి తోడవుతున్నది.

మళ్లీ ఈ మిలటరీ చర్యకే వస్తే దీనిపై అటు ప్రభుత్వ నేతల నుండి ఇటు మిలటరీ అధికారుల నుండి పరస్పర భిన్నమైన ప్రకటనలు వెలువడి అనేక అనుమానాలకు తావిచ్చాయి. మయన్మార్ దేశ సరిహద్దుల్లోకి చొచ్చుకెళ్లి అక్కడున్న సాయుధ సంస్థల క్యాంపులను ధ్వంసం చేసిందని తిరుగుబాటుదారులకు ఆశ్రయమిస్తున్న ఇతర దేశాలకు ఇది ఒక 'హెచ్చరిక' అని సమాచార ప్రచార శాఖ సహాయ మంత్రి రాజవర్ధన్‌సింగ్ రాథోడ్ ప్రకటించాడు. మిలటరీ నాయకత్వం మాత్రం భారత బర్మా (మయన్మార్) సరిహద్దున ఆపరేషన్ జరిగిందని, మయన్మార్ ప్రభుత్వ సహాయ సహకారాలతో తిరుగుబాటుదారులకు తీవ్ర నష్టం కలిగించామని మాత్రమే ప్రకటించింది. భారత వైమానిక దళానికి చెందిన ఎంఐ-17 హెలికాప్టర్స్, అత్యాధునిక ఆయుధాలు ఉపయోగించిన ఈ మిలటరీ చర్యలో 50 మంది తిరుగుబాటుదారులు మరణించారని, బేస్ క్యాంపులు ధ్వంసం అయినాయని కేంద్ర హోం శాఖ ప్రకటించింది.

ఈ సంఘటన జరిగిన ప్రదేశం రెండు దేశాల సరిహద్దున దట్టమైన అటవీ ప్రాంతంలో ఉండడం వల్ల వాస్తవంగా ఏం జరిగిందో, ఎంత మంది చనిపోయారో బయటి ప్రపంచానికి తెలియజెప్పే అవకాశం కూడా మీడియాకు లేకుండా పోయింది. అంత అననుకూలమైన భౌగోళిక ప్రాంతంలో అంత మంది చంపబడ్డారన్న సైనిక చర్య కేవలం 45 నిమిషాలు మాత్రమే సాగిందనేది అధికారిక ప్రకటన. అమాయకమైన సాధారణ ప్రజలను ఏమైనా చంపారా అనే అనుమానాలను కూడా హక్కుల సంస్థలు వ్యక్తం చేస్తున్నాయి. ఈ మొత్తం ఆపరేషన్‌కు సంబంధించి ఒక్క ఫోటోను కూడా ప్రభుత్వం కానీ, సైన్యం కానీ వెల్లడిచేయలేదనేది గమనార్హం.

**ఈ సైనిక చర్య దేన్ని సూచిస్తుంది?**

ఆర్‌ఎస్‌ఎస్ అఖండ భారత్ భావజాలానికి దగ్గరగా ఉన్న జాతీయ భద్రతా సలహాదారులు దోవల్ ఆలోచనలో ప్రధాని మోడీ సంపూర్ణ సమ్మతితో జరిగిన ఈ సైనిక చర్య భవిష్యత్ దూకుడు చర్యలకు ఒక ప్రారంభంగా చెప్పవచ్చు. కౌంటర్ ఇన్‌సర్జెన్సీ పేరుతో దేశం లోపల బటయ మరిన్ని ఇటువంటి చర్యలకు పాల్పడడానికి ఇది ప్రేరేపించవచ్చు. అన్ని రకాలైన ప్రజా పోరాటాలు, ప్రధానంగా సాయుధ పోరాటాలు నడుస్తున్న ప్రాంతాల్లో నిర్బంధం, అణిచివేత మరింత తీవ్రం కావచ్చు. దేశ సమగ్రత, సమైక్యత పేరుతో మరింత దూకుడుగా వ్యవహరించవచ్చు. దేశభక్తి పేరుతో ప్రజల్లో ఇటువంటి చర్యలను వ్యతిరేకించేవారి పట్ల ద్వేషపూరిత భావనను పెంచవచ్చు. సాయుధ దళాల ప్రత్యేక అధికారాల చట్టం రద్దు కాదుకదా కనీస సవరణలను కూడా నిర్ద్వందంగా తిరస్కరించవచ్చు. ఫలితంగా సైనికీకరణ జరిగిన ప్రాంతాల్లో ప్రజల జీవితాలపై సైన్యం పట్టు మరింత పెరగడమే కాకుండా కొత్త ప్రాంతాలకు కూడా ఈ చట్టాన్ని విస్తరించి, విచ్చలవిడి అధికారాలతో విరుచుకుపడేలా చేయవచ్చు. భూసేకరణ చట్టంలాంటి దుర్మార్గమైన చట్టాలకు వ్యతిరేకంగా పోరాడే ప్రజలపై కూడా తీవ్ర నిర్బంధం ప్రయోగించవచ్చు. రాజకీయ అధికారాన్ని సుస్థిరం చేసుకోవడానికి, కార్పొరేట్ శక్తులను మరింత శక్తివంతం చేయడానికి, హిందుత్వ ఎజెండాను బలంగా అమలు చేయడానికి కావలసిన భౌతిక పరిస్థితులను ఏర్పరచుకునే ప్రయత్నం చేయవచ్చు. ప్రత్యేకించి దీని తక్షణ ప్రభావం ఉద్యమిస్తున్న కశ్మీర్ ప్రజలపైన ఉండవచ్చు. అభివృద్ధి ఎజెండా పేరుతో అసలు ఎజెండా అయిన హిందూ సామ్రాజ్య స్థాపనను బలవంతంగా అయినా ముందుకు జరిపే ప్రమాదం ఉంది.

**అంతర్జాతీయ సూత్రాల ఉల్లంఘన**

ప్రభుత్వం, సైన్యం పరస్పర విరుద్ధమైన ప్రకటనలిచ్చినప్పటికీ జాతీయ, అంతర్జాతీయ మీడియా సంస్థల సమాచారం మేరకు ఈ మిలిటరీ ఆపరేషన్ మయన్మార్ దేశ సరిహద్దుల్లోకి 5 కిలోమీటర్ల మేరకు చొచ్చుకెళ్లి జరిపినట్లుగా తెలుస్తున్నది. పొరుగుదేశాల్లో విచ్ఛిన్నకర కార్యకలాపాలకు పాల్పడే శక్తులకు తమ భూబాగాన్ని వాడుకునే అవకాశాన్ని ఇవ్వనని మాత్రమే మయన్మార్ చెపుతున్నది. కానీ మొన్నటి ఆపరేషన్‌కు మద్దతు ఇచ్చానని కానీ ఇవ్వలేదని కానీ విస్పష్టమైన ప్రకటన వెల్లడి చేయలేదు. మయన్మార్ ప్రధానంగా సైనిక ప్రభుత్వం అయినా సైనిక సంపత్తిలో భారత్‌తో ఎక్కడా పోలికలేదు. తిరుగుబాటుదారుల క్యాంపులు ఉన్నాయనే ప్రాంతంపై కూడా అక్కడి ప్రభుత్వానికి పూర్తి స్థాయి పట్టులేకపోవడంతో భారత్ మిలిటరీ చర్యకు బాగా కలిసివచ్చింది. సార్వభౌమాధికారం కలిగిన ఒక దేశం అంతర్జాతీయంగా అదే స్థాయిని కలిగిన మరో దేశం భూభాగంలోకి చొచ్చుకుపోయి అదీ సైనిక చర్యను చేపట్టవచ్చా? దీనికి సంబంధించి అంతర్జాతీయంగా న్యాయ సూత్రాలు ఏమీ రూపొందించబడలేదా అంటే ఐక్యరాజ్య సమితి దగ్గర సమాధానాలు దొరుకుతాయి.

ఒక రాజ్యం మరో రాజ్యం సరిహద్దుల్లోకి వెళ్లాలంటే అనేక ప్రాతిపదికలను ఐక్యరాజ్య సమితి భద్రతామండలి రూపొందించింది. (1) ఇతర రాజ్యాల ముందస్తు అనుమతితో, (2) తీవ్రమైన ప్రకృతి విపత్కరమైన పరిస్థితులు, (3) అనివార్యమైన ఉద్రిక్త పరిస్థితులు, (4) రాజ్యం చేతిలో పరిస్థితులు నియంత్రణలో లేనప్పుడు, ఇవన్నీ ప్రాతిపదికలే అయినా భద్రతా మండలి అనుమతితోనే చేయడానికి వీలుంటుంది. మరి ఈ ప్రత్యేక దాడికి పాల్పడడానికి పై ప్రాతిపదికలు ఈ సందర్భంలో ఏమైనా ఉన్నాయా? నిజానికి ఏ ఒక్కటి కూడా ఈ చర్యలను బలపరిచేదిగా లేదు. ఇటువంటి ప్రాతిపదికలకు రెండు శతాబ్దాల చరిత్రనే ఉంది. ఆధునిక 'ముందస్తుదాడి' అనే భావనకు కూడా అదే ఆధారం. 1837 ప్రాంతంలో కెనడా తిరుగుబాటు దారులు అమెరికా భూభాగాన్ని ఉపయోగించుకుంటూ బ్రిటన్‌పై తిరగబడుతున్న కాలంలో కెరోలైన్ అనే ఓడలో ఆయుధాలను చేరవేసుకునేవారు. ఈ చర్యను సహించని బ్రిటన్ కెరోలైన్ ఓడపై దాడి చేసి ధ్వంసం చేసింది.

ఈ సంఘటన భవిష్యత్ దాడులకు రెండు ప్రమాణాలను ఏర్పరచింది. (1) ప్రమాదం అనివార్యమైనప్పుడు, (2) శాంతియుత ప్రత్యామ్నాయాలు లేనప్పుడు. ప్రమాద తీవ్రతకు తగిన మోతాదులోనే ప్రతిస్పందన ఉండాలనే నిబంధన కూడా ఉన్నది. కాల క్రమంలో ఇదే ఐక్యరాజ్య సమితి పేర్కొన్న ప్రాతిపదికలకు ఆధారం అయింది. అయితే 2011 సెప్టెంబర్ 11న అమెరికా వాణిజ్య సముదాయాలపై దాడి జరిగిన తరువాత ఈ కనీస మాత్రపు ప్రాతిపదికలకు కూడా తిలోదకాలిచ్చి సరాసరి బలప్రయోగానికి దిగే చర్యకే బలవంతపు 'ఆమోదాన్ని' తెచ్చుకుంది అమెరికా. దాని ఫలితంగా అంతర్జాతీయంగా తీవ్రమైన పరిణామాలు చోటుచేసుకుని అనేక దేశాలపై భద్రతా మండలి అనుమతి లేకుండానే దాడుల పరంపర పెరిగిపోయింది.

గతంలో కూడా సైనిక శ్రేణులపై అనేక దాడులు జరిగినాయి. ఈసారి మరణాల రేటు ఎక్కువగా ఉండడమే తప్ప మరో కారణమేదీ ఈ దుందుడుకు చర్యకు సమర్థనగా కనబడదు. ఈ చర్య తక్షణ ప్రభావం అంతంత మాత్రంగానే ఉన్న భారత్ – పాక్ దేశాల సంబంధాలపై తీవ్రంగా చూపింది. ఈ ఘటన నేపథ్యంలో కేంద్ర సమాచార ప్రసార శాఖ సహాయ మంత్రి చేసిన 'హెచ్చరిక' ప్రకటన వేడినీ, తీవ్రతను రెండు దేశాల మధ్య మరింతగా పెంచింది. 'పాకిస్తాన్ మయన్మార్ కాదు' అని పాకిస్తాన్ రాజకీయ నాయకత్వం ఘాటుగానే స్పందించింది. మయన్మార్‌లో రాజ్యేతర శక్తులతో తలపడే ప్రయత్నం ఆ దేశ సరిహద్దుల్లోకి చొచ్చుకెళ్లి చేస్తే, పాక్ రాజ్యంతో కశ్మీర్‌లో భారతదేశ వ్యతిరేక శక్తులను ప్రోత్సహిస్తుందన్న కారణంతో దాడిచేసే సాహసం చేయగలదా? పాకిస్తాన్ అణ్వస్త్ర దేశమనీ, ప్రపంచ సైనిక వ్యవస్థల్లో ఆరో స్థానంలో ఉందనే విషయాన్ని గుర్తుంచుకోవాలి. చైనా పరోక్ష సహాయం కూడా ఆ దేశానికి ఉంటుందనేది మరో కాదనలేని వాస్తవం.

ఈ మొత్తం పరిణామాల సమాహారాన్ని భవిష్యత్ యుద్ధ సన్నాహంగా అనుకుంటే అనేక ప్రమాదకర పరిస్థితులు సంభవిస్తాయి. అంతంత మాత్రంగానే ఉన్న ప్రజాజీవితం అస్తవ్యస్తమవుతుంది. సామాజిక అశాంతి, మత ఘర్షణలు పెరిగే ప్రమాదం ఉంది. ఇదంతా కేవలం రాజకీయ ప్రయోజనాల కోసం హిందుత్వ ఎజెండాను ముందుకు తీసుకెళ్లడం కోసం చేస్తే ప్రజాస్వామ్యం మరింత ప్రమాదంలో పడుతుంది. ఆయా ప్రాంతాల ప్రజల ఆకాంక్షలను ప్రజాస్వామిక దృష్టితో పరిశీలించి పరిష్కారం కనుగొనే ప్రయత్నం చేస్తూనే పొరుగు దేశాలతో సామరస్యం నెలకొల్పుకోవాలే గానీ రెచ్చగొట్టే ధోరణి పనికిరాదు. దీని సాకుతో యుద్ధ గీతాన్ని ఆలపిస్తానంటే భవిష్యత్‌లో మిగిలేది సంక్షోభమే. వీ

*(రచయిత ఆంగ్ల ఉపన్యాసకులు)*

# మరో ఆర్థిక సంక్షోభం దిశగా ప్రపంచం

*సామ్రాజ్యవాద దోపిడీ మితిమీరిపోతూ ప్రపంచ దేశాల ఆర్థిక వ్యవస్థలు కుప్పకూలుతున్నాయనీ, శతాబ్దం కిందటి ఆర్థిక సంక్షోభం కంటే కూడా ప్రమాదకరమైన సంక్షోభం ముంచుకొస్తుందనీ అంటున్నారు* **షేక్ కరిముల్లా**

అప్పుల ఊబిలో కూరుకుపోయిన గ్రీస్ అధికారికంగా దివాళా తీసినట్లు యురోపియన్ యూనియన్ ప్రకటించింది. ఐఎంఎఫ్‌కు 1.7 బిలియన్ డాలర్లు చెల్లించకపోవడంతో గ్రీస్ అనధికారికంగా 'డిఫాల్ట్' అయినట్లయింది. ఈ స్థితిలో కొత్త అప్పు పుట్టదు. దేశ ఆర్థిక స్థితి మరింత దిగజారిపోయింది. ఈ తాజా పరిణామాలతో గ్రీస్ పౌరులు బ్యాంకుల నుంచి తమ నగదు డ్రా చేసుకునేందుకు బ్యాంకులు, ఎటిఎంల ముందు బారులు తీరారు. దీనితో కొద్ది రోజులు బ్యాంకులు మూసి వేస్తున్నట్లు, ఎటిఎం ల నుంచి నగదు డ్రా చేసుకోవడంపైన పరిమితులు విధిస్తున్నట్లు గ్రీస్ ప్రకటించింది. ఈ సంక్షోభం కారణంగా ఇప్పటికే 25 శాతంగా ఉన్న నిరుద్యోగం మరింత పెరిగిపోతుంది. ప్రభుత్వ ఉద్యోగుల జీతాలు, పెన్షనర్లకు పెన్షన్లు చెల్లించడం కష్టమైపోతుంది. ఆస్తుల ధరలు కుప్పకూలి, ద్రవ్యోల్బణం పెరిగిపోతోంది. ఈ పరిణామాలతో యూరప్ గడగడలాడుతున్నది. యూరప్ బెదురు చూసి యావత్ ప్రపంచం వణికిపోతున్నది. పరిధి దాటి ఈ ఆర్థిక సంక్షోభం ప్రపంచాన్నంతటినీ చుట్టుముట్టడంతో ఆసియా, యూరప్, అమెరికా అన్ని దేశాల మార్కెట్లు భారీ నష్టాలతో ట్రేడ్ అవుతున్నాయి.

**అప్పే అసలు కారణం**

అప్పుచేసి పప్పుకూడు తినొద్దు అనేది పెద్దలు చెప్పే సామెత. ధనిక, పేద తేడా లేకుండా అన్ని దేశాలకు ఈ సామెత వర్తిస్తుంది. ప్రస్తుతం గ్రీస్ ఎదుర్కుంటున్న కష్టాలే ఇందుకు నిదర్శనం. ఎడా పెడా అప్పులు చేయడంతో ద్రవ్యలోటు పెరిగిపోయి 2010 నాటికే గ్రీస్ అప్పు 35 వేల కోట్ల యూరోలకు చేరింది. నిజానికి 2008 ప్రపంచ ఆర్థిక సంక్షోభం కంటే ముందే గ్రీస్ ఆర్థిక సంక్షోభానికి బీజాలు పడ్డాయి. దీనికి మూలాలు 2008లో అమెరికాలోని ప్రసిద్ధ ఇన్వెస్ట్‌మెంట్ బ్యాంక్ లేమన్ బ్రదర్స్ దివాళాతో తలెత్తిన ప్రపంచ ఆర్థిక మాంద్యంతో మొదలైన సంక్షోభం ఒక గ్రీస్ దేశానికే పరిమితం కాలేదు. మన రిజర్వు బ్యాంక్ గవర్నర్ రఘురామ్ రాజన్ ఇటీవల హెచ్చరించినట్లు ఇది 1929 ఆర్థిక సంక్షోభంలా ఒక పెద్ద సంక్షోభానికి సూచిక. ధనిక దేశాలు మేలుకోకపోతే ఆ సంక్షోభం త్వరలోనే ముంచుకొస్తుంది. కనుక ఇవాళ గ్రీస్, రేపు స్పెయిన్, ఆ తరువాత ఐర్లాండ్, ఇటలీలు సైతం ఇదే బాటలో సంక్షోభ విషవలయంలో చిక్కుకోక తప్పదని అర్థశాస్త్రం చదువుకున్న వారికే కాక కొద్దిపాటి సామాజిక స్పృహ కలిగిన వారికి ఇట్టే అర్థమవుతుంది. ఈ ఆర్థిక సంక్షోభాలు పెట్టుబడిదారీ సామ్రాజ్యవాద దేశాలలో కొత్తేమీ కాదు. గత 150 సంవత్సరాలుగా మనం చూస్తూనే ఉన్నాం. (1929 – 34) (ది గ్రేట్ ఎకనమిక్ ఫెమైన్) తరువాత 1937లో యూరప్ దేశాల ఆర్థిక వ్యవస్థలు మాంద్యంలో చిక్కుకున్నాయి. మళ్లీ 1970లో అమెరికాలో అతిపెద్ద ఆర్థిక సంక్షోభం తలెత్తింది. సామ్రాజ్యవాదం (ప్రపంచీకరణ) ప్రపంచంలో సంక్షోభం పెంచుతూ వచ్చింది. ఒకదేశం తరువాత మరొక దేశం సంక్షోభంలో కూరుకుపోతున్నాయి. 1995లో మెక్సికో, 1997లో తూర్పు ఆసియా దేశాలు (వీటి వాపు చూసి 'ఏషియన్ టైగర్స్' అని పిలిచారు) 1998లో బ్రెజిల్, తూర్పు యూరప్ దేశాలు, 2002లో అర్జెంటీనా తీవ్రమైన ఆర్థిక సంక్షోభాన్ని చవి చూశాయి. రేపో మాపో భారతదేశంకు కూడా ఈ సంక్షోభం తప్పదు. ఈ వరుస సంక్షోభాల మూలంగా ప్రపంచ దేశాలలో ఉత్పత్తి తగ్గి, నిరుద్యోగం పెరిగి, ప్రజల ఆదాయాలు తగ్గి, ఆర్థిక అసమానతలుపెరిగి సామాజికంగా ఆయా దేశాలు దుర్భర దారిద్ర్యాన్ని అనుభవిస్తున్నాయని ప్రపంచ అభివృద్ధి నివేదికలు స్పష్టం చేస్తున్నాయి. ఈ ఆర్థిక సంక్షోభాలకు గల అసలు కారణాలను మూలాలను ఇప్పుడు చారిత్రకంగా చర్చించుకుందాం.

18వ శతాబ్దం రెండవ అర్ధ భాగంలో నాటి వాణిజ్య పెట్టుబడి దారీ విధానం క్రమంగా పారిశ్రామిక పెట్టుబడిదారీ విధానంగా మార్పు చెందుతున్న దశలో 1776లో ఆడమ్‌స్మిత్ తన రచన 'వెల్త్ ఆఫ్ నేషన్స్' (జాతుల సంపద)లో స్వేచ్ఛా వాణిజ్యం దేశాల సంపదను పెంచుతుందని, కాబట్టి రాజ్యం ఆర్థిక కార్యకలాపాలలో జోక్యం చేసుకోరాదని వాదించి సామ్రాజ్యవాదానికి పునాది వేశాడు. యూరప్‌లో పారిశ్రామిక విప్లవ ఫలితంగా చౌకగా వనరులు, శ్రామికులు అవసరమైంది. బానిసల శ్రమ దోపిడి పైనే పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందింది. వివిధ ఆఫ్రికా, ఆసియా దేశాలలోని అట్టడుగు ప్రజలను బంధించి, సంకెళ్లు బిగించి బానిసలుగా మార్చి యూరప్, అమెరికా దేశాలలోని పొగాకు, చక్కెర, తేయాకు, కాఫీ తోటలలోకి తరలించి బానిసల రక్తాన్ని పీల్చడం ద్వారా తెగబలిసి వనరుల కోసం కొత్త వలసల కోసం వెంపర్లాట మొదలై సామ్రాజ్యవాదం బడుగు బలహీన దేశాలపై పడి వనరులు, సంపదలను దోచుకోవడం మొదలైంది.

అయితే పెట్టుబడిదారీ వ్యవస్థలలో సహజంగానే సంక్షోభం దాని గర్భంలోనే ఉంటుంది అంటారు మార్క్స్. కాబట్టి దానికి పతనం తప్పదని కూడా చెపుతాడు. పెట్టుబడిదారీ అర్థశాస్త్రం కూడా ఈ విషయాన్ని 'వ్యాపార చక్రాలు'గా వర్ణిస్తూ ఒప్పుకుంటుంది. కాని తిరిగి ఆర్థిక వ్యవస్థలు పుంజుకుంటాయని వివరిస్తుంది. కాని ఇది నిజం కాదని చరిత్ర నిరూపించింది.

చాలా మంది అర్థశాస్త్రవేత్తలు ఫైనాన్షియల్ కాపిటల్ మార్కెట్ల పతనం, పాలనా వైఫల్యం సంక్షోభానికి కారణమంటారు. ఇది నిజం కాదు. పెట్టుబడి దారీ వ్యవస్థలోని అంతర్గత వైరుధ్యాలే ఆర్థిక సంక్షోభానికి మూలం. ఈ వ్యవస్థలు సంక్షోభాలమయంగా మారి ఒక సంక్షోభం నుంచి మరొక సంక్షోభంతో కొట్టు మిట్టాడడం సంక్షోభపు విషవలయంలో కూరుకు పోవడం గత రెండు శతాబ్దాల చరిత్రను మానవాళి చూస్తూనే ఉంది.

పెట్టుబడిదారీ ఆర్థిక విధానం ప్రధాన ధ్యేయం లాభాపేక్ష, సామాజిక అవసరాలతో పనిలేదు. ఏ వస్తువుకైతే లాభం వస్తుందను కుంటుందో ఆ వస్తువు ఉత్పత్తి విపరీతంగా చేయబడుతుంది. (సప్లయ్) ప్రజల అవసరం, కొనుగోలు శక్తి (డిమాండ్)తో దానికి పనిలేదు. ఈ స్థితిని ఆర్థిక పరిభాషలో 'బూమ్' అంటారు.

అయితే వస్తు ఉత్పత్తి ఎంత పెరిగినా (సప్లయ్) డిమాండ్ మాత్రం ప్రజల అవసరం, కొనుగోలు శక్తి పైనే ఆధారపడి ఉంటుంది. మార్కెట్‌లో సరుకులు పుష్కలంగా ఉన్నా ప్రజల వైపు నుంచి కొనుగోలు శక్తి (డబ్బు) డిమాండ్ లేనప్పుడు తన సరుకులకు తగిన ధర రాదని గమనించిన పెట్టుబడిదారులు రూటు మార్చి వస్తు ఉత్పత్తి తగ్గించివేస్తారు. ఈ పరిస్థితిని 'స్లంప్' అంటారు. అంటే కృత్రిమ కొరతను సృష్టించి అధిక ధరలకు వస్తువులు అమ్మి అధిక లాభాలను పొందాలని ఆశ పడతారు.

ఉత్పత్తి తగ్గించబడి నిరుద్యోగం పెరుగుతుంది. ఆస్తుల విలువలు క్షీణిస్తాయి. ప్రజల కొనుగోలు శక్తి తగ్గి సరుకుల డిమాండ్ పడిపోతుంది. ఉద్యోగాలలో కోత పారిశ్రామిక ఉత్పత్తి, రుణ సౌకర్యాలు, బ్యాంకు లావాదేవీలు మందగిస్తాయి. స్టాక్ మార్కెట్ల పతనం ద్రవ్యోల్బణంతో ఆర్థిక వ్యవస్థలో తీవ్ర సంక్షోభం ఏర్పడుతుంది. ఇవన్నీ సంక్షోభ లక్షణాలే. పెట్టుబడి దారీ వ్యవస్థలలో సంక్షోభాలు చాలా సహజం. అనివార్యం. ఈ ఆర్థిక నిర్మాణంలోని అంతర్గత వైరుధ్యాలు దాని స్వభావం రీత్యా సంక్షోభాలకు దారితీస్తుంది. మొత్తం వ్యవస్థనే అతలాకుతలం చేస్తుంది. ఫలితంగా ఈ విధానంలో భౌతికంగా, సామాజికంగా దారిద్ర్యం అత్యంత తీవ్ర రూపంలో ఉంటుంది. ఈ విషవలయం నుండి బయటపడడానికి పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానంలో మార్గం లేదు. మొత్తంగా ఈ ఆర్థిక సంక్షోభాలకు మౌలిక కారణం ఉత్పత్తి శక్తులకు, ఉత్పత్తి సంబంధాలకు మధ్యగల వైరుధ్యమే.

సామ్రాజ్యవాద శక్తుల మధ్య వలసలకై వెంపర్లాట – మార్కెట్లను కబ్జా చేసుకోవడానికి తద్వారా భారీ ఎత్తున లాభాలు గడించడానికి తీవ్రమైన పోటీ ఏర్పడి దేశాల మధ్య, వర్గాల మధ్య ఘర్షణలు తలెత్తుతాయి. పోటీ తీవ్రమై సాయుధ ఘర్షణలకు దారి తీసింది. ప్రపంచాన్ని తిరిగి తమ మధ్య పునర్విభజన చేయాలనేంత వరకు వెళ్లి రెండు ప్రపంచ యుద్ధాలకు దారి తీసింది. ఈ యుద్ధాలను మానవాళి మీద రుద్దడం ద్వారా మహామాంద్యం నుండి పెట్టుబడిదారీ విధానం గట్టెక్కాలని చూసింది.

సామ్రాజ్యవాదుల సంకెళ్ల నుండి విముక్తి సాధించడానికి వలస దేశాలు జాతీయ విముక్తి ఉద్యమాలు చేపట్టి 1945 తరువాత అనేక దేశాలు వలసల నుండి విముక్తి చెందాయి. అయితే ప్రజల ముందు తమ ప్రత్యక్ష దోపిడి నగ్నంగా బయటపడడంతో సామ్రాజ్యవాదం నూతన పరోక్ష పద్ధతుల ద్వారా సారంలో ఏమాత్రం తేడా లేకుండా గతంలో వలసలుగా ఉన్న దేశాలను నయా వలసలుగా మార్చబడి ఇప్పటికీ సామ్రాజ్యవాద కబంద హస్తాలలోనే కొట్టుమిట్టాడుతున్నాయి.

ఇక అమెరికా రెండవ ప్రపంచ యుద్ధంలో అన్ని పక్షాలకు ఆయుధాలు అమ్ముకుని దండిగా లాభాలు దండుకుని అవసరం లేకున్నా జపాన్‌లోని హీరోషిమా, నాగసాకిలపై అణుబాంబులను వేసి మానవజాతి గతంలో కనీవినీ ఎరుగని మానవ విధ్వంసాన్ని సృష్టించింది. తన పశు బలాన్ని ప్రదర్శించి ప్రపంచాన్ని భయ భ్రాంతులకు గురిచేసి తన ముందు మోకరిల్లేలా చేయడానికి అమెరికా ఈ దుశ్చర్యకు ఒడిగట్టింది. అమెరికా ప్రపంచ పెట్టుబడిదారీ విధానానికి మొనగాడుగా అవతరించి ప్రపంచ పోలీస్ పాత్ర పోషిస్తూ ఉన్నది. అప్పటి నుండి బడుగు దేశాలలో విధ్వంసం సృష్టిస్తూ ప్రపంచ టెర్రరిస్టుగా మారి ఆ దేశాల ప్రజలను, వనరులను దోచుకుంటూ 'రక్తకోలా'గా మారింది. అయినా ఈ దేశం కూడా తీవ్ర ఆర్థిక సంక్షోభాలతో కునారిల్లుతున్నది.

రెండవ ప్రపంచ యుద్ధానంతర పరిస్థితులు తమకు అనుకూలంగా ఉన్నాయని అమెరికన్ పాలక వర్గాలు గుర్తించాయి. ప్రపంచ రాజకీయాల పగ్గాలను తమ చేతుల్లోకి తీసుకోవాలని నిర్ణయించాయి. యుద్ధ విధ్వంసం కారణంగా దెబ్బతిన్న దేశాలలో పునర్నిర్మాణ కార్య క్రమాలను చేపట్టడంతో పాటు ఆ దేశాలలోని కార్మికవర్గ ఉద్యమాలను అణచివేసి కమ్యూనిస్టు విప్లవాలు తలెత్తకుండా చర్యలు చేపట్టడం తమ ప్రథమ కర్తవ్యంగా నాటి అమెరికన్ పాలక వర్గాలు భావించాయి. పరోక్ష సామ్రాజ్యవాద చర్యలకు వ్యూహాన్ని రూపొందించాయి.

ఈ నేపథ్యంలో 'బ్రిటన్ ఊడ్స్'లో ఇప్పుడు విధ్వంసం సృష్టిస్తున్న ప్రపంచ ఆర్థిక సంస్థలు ఐబిఆర్‌ఒ, ఐఎంఎఫ్, జిఎటిటిలు ఏర్పడినాయి. పునర్నిర్మాణం, దీర్ఘకాలిక రుణాలను అందజేయడం కోసం ప్రపంచ బ్యాంకు, స్వల్పకాలిక రుణాలతో పాటు వివిధ దేశాల మధ్య మారకపు రేట్లను స్థిరీకరించడానికి ఐఎంఎఫ్, బహుళజాతి సంస్థల ద్వారా వ్యాపారానికి అడ్డంకిగా ఉన్న ఆయా దేశాల ఆంక్షలను తొలగించి వ్యాపారం నిరాటంకంగా కొనసాగడానికి అవసరమైన చర్యలను జిఎటిటి చేపడుతుంది. అప్పు ఇచ్చేటప్పుడు ఈ సంస్థలు కఠిన షరతులు విధించి ఆయా దేశాల నడ్డి విరుస్తాయి.

అమెరికా అందించిన ఆర్థిక సహకారంతో కొన్ని దేశాలు తమ ఆర్థిక వ్యవస్థల పునర్నిర్మాణాన్ని చేపట్టాయి. ఇదంతా సామ్రాజ్యవాదుల ఆరాధ్య పెట్టుబడిదారీ ఆర్థిక వేత్త జాన్ మేనార్డు కీన్స్‌యే స్వయంగా పర్యవేక్షించాడు. ఆనాటి సాంప్రదాయక ఆర్థిక విధానాలను కొంత మేరకు వ్యతిరేకించిన కీన్స్ మాంద్యం పరిస్థితులలో ప్రభుత్వాలు చొరవ తీసుకుని ప్రజలకు ఉపాధి అవకాశాలు కల్పించి కొనుగోలు శక్తి పెంచాలని వాదించాడు.

కీన్స్ తన రచన ది జనరల్ థియరీ ఆఫ్ ఎంప్లాయ్‌మెంట్ ఇన్‌ట్రెస్ట్ అండ్ మని – 1936లో యుద్ధానంతరం పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందడానికి అవసరమైన సూచనలు చేశాడు. 1971లో అమెరికా అధ్యక్షుడు రిచెర్డ్ నిక్సన్ ఇలా ప్రకటించాడు. 'ఇప్పుడు మేమంతా కీన్స్ అనుయాయులమే'.

1945 నుండి 1975 వరకు ప్రపంచ పెటుబడిదారీ విధానం

నికరంగా అభివృద్ధి సాధించింది. ఈ కాలాన్ని పెట్టుబడిదారీ విధానపు స్వర్ణ యుగంగా పెట్టుబడిదారీ ఆర్థికవేత్తలు కీర్తిస్తారు. అమెరికా, జర్మనీ, జపాన్ లాంటి దేశాలు కొంత అభివృద్ధి కారణంగా ఆయా దేశాలలోని కార్మికుల జీవితాలు కొంత మెరుగయ్యాయి. ఉపాధి అవకాశాలు ఏర్పడినాయి. కొన్ని సామాజిక భద్రతా పథకాల ప్రవేశం ద్వారా జీవన పరిస్థితులు కొద్ది మేరకు స్థిరపడ్డాయి.

అయితే సామాజిక ఉద్యమాలు ఒకవైపు ఆయా దేశాలు సాధించిన వృద్ధి మరోవైపు ఈ రెండింటి మధ్యే మార్గంగా పెట్టుబడిదారీ దేశాలు ప్రజలకు కొన్ని రాయితీలు ప్రకటించి 'సంక్షేమ రాజ్యాలు'గా అవతార మెత్తాయి. అపారంగా పోగుబడిన సంపదతో ఇక సంక్షోభాల నుండి పెట్టుబడిదారీ వ్యవస్థలు గట్టెక్కాయని, ముమ్ముందు అంతా మంచి కాలమే అని పగటి కలలు కన్నారు.

1975 తర్వాత అమెరికాతో పాటు యూరప్ దేశాల ఆర్థిక వ్యవస్థలన్నీ ఏక కాలంలో పతనమయ్యాయి. 1980ల నాటికి సగటు ఉత్పత్తి అన్ని పెట్టుబడిదారీ దేశాల్లో సగానికి సగం పడిపోయింది. నిరుద్యోగిత 20 శాతం చేరుకుంది. కీన్స్ చెప్పిన సూత్రాలు ఫలితమివ్వని స్థితి తలెత్తింది. ఇక మెల్లిగా సంక్షేమ రాజ్య భావన కనుమరుగైంది. కీన్స్‌ను పక్కనపెట్టి నయా ఉదారవాదాన్ని ప్రవచించిన ఆర్థికవేత్త మిల్టన్ ఫ్రీడ్‌మన్‌ని నెత్తికెక్కించుకున్నారు.

1979లో బ్రిటన్‌లో మార్గరెట్ థాచర్ అధికారంలోకి వచ్చింది. అలాగే 1980లో రోనాల్డ్ రీగన్ అమెరికా అధ్యక్షుడయ్యాడు. ఈ నయా ఉదారవాద విధానాలను అమలు చేయడంలో ఈ ఇద్దరు కీలక పాత్ర పోషించారు. నాటి పాత్రికేయులు థాచర్ ఆర్థిక విధానాలను 'థాచరిజం'గా, రీగన్ ఆర్థిక విధానాలను 'రీగనామిక్స్'గా పేర్కొన్నారు.

థాచరిజం అంటే శ్రామిక వర్గాల పట్ల వ్యతిరేకతను కలిగి ఉండి, ధనిక వర్గాల దురహంకార వైఖరి తప్ప మరొకటి కాదు. స్వేచ్ఛా వాణిజ్యం, ప్రైవేటీకరణ, వ్యక్తి శ్రేయోవాదం ఈ మూడే థాచరిజంలోని కీలక అంశాలు. కొద్ది మంది ధనిక వర్గాల ప్రయోజనాలు తప్ప సమాజ ప్రయోజనం అనేది లేదని ఆమె ఆలోచన.

ఇటు అమెరికాలోను రోనాల్డ్ రీగన్ ఇదే తరహా ఆర్థిక విధానాలు అనుసరించాడు. ధనిక వర్గాలపై పన్నులు తగ్గించాడు. మార్కెట్లపై అన్ని నియంత్రణలు ఎత్తివేశాడు. సామాజిక భద్రతా వ్యవస్థను పూర్తిగా నిర్మూలించి భవిష్యత్తు సంక్షోభాలకు పునాదిరాయి వేశాడు. సామాజిక సంక్షేమం నుండి ప్రభుత్వాలు వైదొలగాలని ఫ్రీడ్‌మన్ నయా ఉదారవాదం ఉద్బోధిస్తుంది.

ఇక్కడ ఒక విషయం చెప్పాలి. చాలా మంది కమ్యూనిస్టు మిత్రులు 'నయా ఉదారవాదం' అనే పదాన్ని సామ్రాజ్యవాద దురాక్రమణ, దోపిడీలకు పర్యాయ పదంగా వాడుతున్నారు. ఇది కరెక్టు కాదు. సామ్రాజ్యవాదం అనే పదాన్నే వాడాలని ఈ సందర్భంగా చెప్పదలచాను.

ఈ నయా ఉదారవాదం పెట్టుబడి కేంద్రీకరణకు దారి తీసింది. బడుగు దేశాల వనరులు కొల్లగొట్టారు. 2006 సంవత్సరం నాటికి ప్రపంచ జనాభాలో 16 శాతం కలిగి ఉన్న ధనిక దేశాలు ప్రపంచ జిడిపిలో 73 శాతం వాటా దక్కించుకున్నాయి. ప్రభుత్వ రంగ సంస్థల ప్రైవేటీకరణ కారణంగా బహుళజాతి కంపెనీలు విపరీతంగా సంపదను పోగేసుకున్నాయి. ఒక అంచనా ప్రకారం బహుళజాతి సంస్థలలో కేవలం 4 తప్ప మిగతావన్ని అమెరికా, యూరోపియన్ యూనియన్, జపాన్‌కు చెందినవే.

1989 -91 నాటికి సోవియట్ యూనియన్, తూర్పు యూరప్ దేశాలలోని సామ్యవాద ముసుగులో ఉన్న పెట్టుబడిదారీ వ్యవస్థలు కుప్పకూలాయి. సామ్యవాద వ్యవస్థను నిర్మించడంలో ఆయా దేశాలలోని ప్రభుత్వాధినేతలు చేసిన పొరపాట్లే పతనానికి కారణం తప్ప లోపం సామ్యవాద వ్యవస్థలో లేదు. ఈ పరిణామాలతో పెట్టుబడిదారీ విధానానికి తిరుగులేదని సంబరాలు జరుపుకున్నారు. ఆర్థిక సంక్షోభాలు తలెత్తే అవకాశం లేదని వాదించారు. పగటి కలలు కన్నారు. వరుసగా ముంచుకొస్తున్న సునామీల లాంటి ఆర్థిక సంక్షోభాలతో బిత్తరపోయారు. 1997లో థాయిలాండ్ కరెన్సీ సంక్షోభం, ఇండోనేషియా మాంద్యం, మలేషియా, హాంకాంగ్, భారత్‌లలో ఆర్థిక ప్రగతి మందగించడం, కొన్ని రోజులకు రష్యన్ ఎకానమీ కూడా కుప్పకూలింది.

**పునాదులు కదిలిన పెను ఆర్థిక సంక్షోభం – 2008**

పెట్టుబడి వ్యవస్థలోనే పెను తుఫాను లాంటి ఆర్థిక సంక్షోభం అమెరికా, యూరప్‌లను 2008లో చుట్టు ముట్టింది. యూరప్, అమెరికాలోని మొత్తం బ్యాంకింగ్ వ్యవస్థే పెద్ద సంక్షోభంలో చిక్కుకుంది. భీమా రంగం సైతం ఈ సంక్షోభం కోరల నుండి తప్పించుకోలేక పోయింది. అమెరికా బ్యాంకులు ఇచ్చిన తనఖా అప్పులు 11 ట్రిలియన్ డాలర్లకు చేరుకుంది. 2007 నుండి తనఖా పెట్టిన ఆస్తుల విలువ క్రమ క్రమంగా తగ్గడం మొదలైంది. 2008 వచ్చే నాటికి అప్పులు తీసుకున్నవారు ఎగ్గొట్టడం మొదలు పెట్టారు. తనఖా పెట్టిన ఆస్తుల విలువ తగ్గడమే కాకుండా ఈ ఆస్తులను అమ్ముకోలేక, అప్పులు తిరిగి రాబట్టుకోలేక, నిరర్ధక ఆస్తులు పెరిగిపోయి బ్యాంకులు దివాళా తీశాయి. లేమన్ బ్రదర్స్ పతనంతో సంక్షోభం తారా స్థాయికి చేరి సునామీ వలె చుట్టు ముట్టడంతో 1929 నాటి మహా మాంద్యాన్ని మించిన ఆర్థిక సంక్షోభం నేడు ప్రపంచం ముంగిట నిలిచి కోరలు చాస్తున్నది. గృహ రుణాలతో మొదలైన సంక్షోభం క్రమంగా ఆర్థిక వ్యవస్థ మొత్తాన్ని ముంచేసింది. ఒక్క 2010లోనే 130 బ్యాంకులు మూత పడ్డాయి. అయితే పెట్టుబడిదారీ విధానపు పట్టుకొమ్మలైన ఈ బ్యాంకులు నేల రాలితే తమ పునాదులే కదులుతాయని గుర్తించిన అమెరికన్ పాలక వర్గాలు ప్రజల సొమ్ముతో 'బెయిల్ అవుట్' పథకాలను అమలు చేసి తాత్కాలికంగా గట్టెక్కించారు. ఇలా అమెరికాలో మొదలైన ఈ పెను సంక్షోభం క్రమ క్రమంగా విశ్వమంతటా విస్తరించింది. గ్రీస్ లాంటి దేశాలు ఈ కోరలలో చిక్కుకుని చిగురుటాకుల్లా నేడు వణికి పోతున్నాయి.

**భారత ఆర్థిక వ్యవస్థపై ప్రభావం**

ఇంకా తదుపరి వంతుగా ఈ సంక్షోభంలో చిక్కుకున్నది భారతదేశం. ఎక్కడో గ్రీస్ దేశం ఆర్థిక సంక్షోభంలో పడితే మనకేంటి అని సామాన్య ప్రజలు అనుకోవచ్చు. ఇది ప్రపంచీకరణ యుగం. ఈ ఆర్థిక ప్రపంచంలో ఏ మూల ఏ చిన్న సంఘటన జరిగినా దాని ప్రభావం ప్రపంచమంతా ఉంటుంది. మనదేశంలో సరళీకరణ విధానాలు ఇందిరాగాంధీ

హయాంలోనే 1980లో ప్రవేశించాయి. రాజీవ్‌గాంధీ పాలనలో అవి ఊపందుకున్నాయి. అయితే ఈ విధానాల విశ్వరూపం ఆవిష్కృతమైంది మాత్రం పి.వి. నరసింహారావు హయాంలో ఆర్థిక మంత్రిగా మన్మోహన్‌సింగ్ చొరవతో 1991లో ఐఎంఎఫ్ నుంచి అప్పు తీసుకున్నప్పుడు వారి షరతులకు కూడా మనదేశం తలొగ్గింది.

ఈ షరతులలో భాగంగా 1) మార్కెట్లపై నియంత్రణ ఎత్తివేత. 2) పబ్లిక్ రంగ సంస్థల ప్రైవేటీకరణ. 3) ప్రజా సంక్షేమం, సబ్సిడీలు, సామాజిక భద్రతా పథకాలలో కోత. 4) రూపాయి విలువ తగ్గింపు మొదలైన చర్యలకు ప్రభుత్వం అంగీకరించి అమలు చేస్తూ ప్రజల జీవితాలను దుర్భరంలోకి నెట్టింది.

ఈ రకంగా మన రాజ్యాంగ విలువలు, సామాజిక న్యాయం, సమానత్వం, సార్వభౌమత్వం, స్వావలంభనలకు తిలోదకాలిచ్చి సంస్కరణలే, విదేశీ పెట్టుబడులే, మేకిన్ ఇండియాలే తారకమంత్రంలా జపిస్తుంది. ఫలితంగా వృద్ధిరేటు 2008 నాటికి 7.3 శాతం పడిపోయింది.

ఇప్పుడు మోడీ వచ్చాక మాటల్లో దేశభక్తి, చేతల్లో విదేశీ భక్తిని చాటుతూ ఈ సంవత్సర కాలంలో సరళీకరణ విధానాలను దూకుడుగా అమలు చేస్తున్నాడు. అన్ని రంగాలలో విదేశీ ప్రైవేట్ ప్రత్యక్ష పెట్టుబడులకు (ఎఫ్‌డిఐ) ఎర్ర తివాచీ పరిచాడు. ప్రభుత్వ రంగ బ్యాంకుల్లో ప్రభుత్వ మూల ధనాన్ని రెండు లక్షల 48 వేల కోట్లకు తగ్గించుకునే విధంగా డిజిన్వెస్ట్‌మెంట్ ఉండాలని భీమా రంగంలో కూడా (ఎఫ్‌డిఐ) ని 26 శాతం నుండి 48 శాతానికి పెంచినాడు. చివరికి రక్షణ రంగంలో సైతం ఎఫ్‌డిఐని 49 శాతానికి పెంచాడు. ఇక రైల్వేలది అదే దారి. ఈ చర్యలతో నేటి మన ఆర్థిక వ్యవస్థ గతంలో కంటె ఎక్కువగా ప్రపంచ ఆర్థిక వ్యవస్థతో అనుసంధానమై ఉన్నది. ఈ కారణంగా ప్రపంచ ఆర్థిక సంక్షోభ ప్రభావం నుంచి మనదేశం తప్పించుకోలేదు.

దేశంలో ఈ సరళీకరణ విధానాలు అడుగుపెట్టిన నాటి నుండి దేశ ప్రజల జీవన స్థితిగతులు పూర్తిగా గతి తప్పాయి. సామాజిక భద్రత, విద్యా, వైద్యం, ప్రజా పంపిణీ వ్యవస్థలను పూర్తిగా బలహీనం చేసి పేదలకు తిండిగింజలు కూడా దక్కకుండా చేసి వాళ్ల ఉసురు పోసుకుంటున్నారు. ఒక్క మాటలో చెప్పాలంటే దేశాన్ని హోల్‌సేల్‌గా అమ్ముతూ ఆర్థిక వ్యవస్థను బార్లా తెరిచి ఇష్టా రీతిన దోచుకోండంటూ స్వదేశీ, విదేశీ కార్పొరేట్ గుత్త సంస్థలకు అప్పనంగా అప్పజెప్పారు. అభివృద్ధి పేరుతో ప్రజలను దోచుకోవడమే కాక ప్రజలకు దక్కాల్సిన వనరులను కొల్లగొడుతున్నారు.

1991 నుండి దేశంలో ఆర్థిక అసమానతలు మరింత తీవ్రమయ్యాయి. సురేష్ టెండూల్కర్ కమిటీ అంచనా ప్రకారం మన దేశంలో సుమారు 40 కోట్ల పై చిలుకు ప్రజలు దారిద్ర్య రేఖకు దిగువన బతుకుతున్నారు. అన్నార్తులు 'అన్నమో రామచంద్ర' అంటూ ఆకలితో అలమటిస్తుంటే గోదాముల్లో ఆహార ధాన్యాలు కుళ్లిపోతున్నాయి. మనది మట్టి దేశం. వ్యవసాయ రంగం సంక్షోభం కారణంగా లక్షల సంఖ్యలో రైతులు ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. చేనేత ఇతర వృత్తుల వారికి సైతం ఆత్మహత్యలే మిగిలాయి. నిత్యావసర వస్తువుల ధరల పెరుగుదల కనీసం కూరగాయలు కూడా కొనలేని స్థితిలో ద్రవ్యోల్బణం అదుపుతప్పి పెరిగిపోతున్నది. మరోవైపు నిరుద్యోగిత, ఉపాధిలేమి ప్రజలను పూర్తిగా కృంగదీస్తున్నది.

భారతదేశ విదేశీ రుణభారం 2015 మార్చ్‌తో ముగిసిన ఆర్థిక సంవత్సరం 476 బిలియన్ డాలర్లకు చేరింది. 2014 మార్చ్‌తో పోలిస్తే ఈ మొత్తం 29.5 బిలియన్ డాలర్లు (6.6 శాతం) ఎగిశాయి. 2015 మార్చ్ నాటికి స్థూల దేశీయోత్పత్తి (జిడిపి) విలువతో పోల్చి చూస్తే విదేశీ రుణభారం 23.8 శాతం ఉంది. పరిస్థితి ఎంతదాక వచ్చిందంటే రుణాల మీదే ప్రభుత్వాలు నడుస్తున్నాయి. అప్పు ఇస్తే వాయిదాలలో రుణం, వడ్డీ చెల్లించాలి. వాయిదా చెల్లింపుల కంటె వడ్డీ చెల్లింపులే అధికంగా ఉన్నాయి. ఇలా వాయిదా, వడ్డీ చెల్లింపులు 2013 – 14 ఆర్థిక సంవత్సరంలో రు. 5,43,267 కోట్లు, 2014 – 15 మోడీ ప్రభుత్వం రు. 6,43, 301 కోట్లు కేటాయించింది. ఇది ఏ ఆర్థిక వ్యవస్థకూ మంచిది కాదు. మన ఆర్థిక వ్యవస్థ పతనం అంచున ఉందనడానికి ఇది సంకేతం. ఇవన్నీ ప్రస్తుత సంక్షోభం తాలూకు వికృత రూపాలు. వాస్తవం ఇది కాగా పాలకులు భారత ఆర్థిక వ్యవస్థ ఆకాశమే హద్దుగా ఉరకలు వేస్తున్నదని వృద్ధిరేటు 12 శాతం వరకు ఉంటుందని ఉత్తర కుమార ప్రగల్భాలు పలుకుతూ ఉంటారు.

**మరి ప్రత్యామ్నాయ మార్గం ఏమిటి?**

దీనికి ప్రత్యేకమైన దగ్గర మార్గాలు ఏమీ లేవు. చరిత్రే పరిష్కార మార్గాన్ని చూపింది. పటిష్టమైన సోషలిస్టు ఆర్థిక విధానాలే పెట్టుబడి దారీ ఆర్థిక సంక్షోభపు క్యాన్సర్ జబ్బుకు సరైన చికిత్స అని మనకు రష్యా చరిత్ర నిరూపించింది. 1929లో ప్రపంచంలోనే అన్ని దేశాలు మహా మాంద్యం తాగిడికి గురై బాధలు అనుభవిస్తే సోషలిస్టు సోవియట్ యూనియన్ పై ఈ మహా మాంద్యం ఎలాంటి ప్రభావాన్ని చూపలేదు. వాస్తవానికి ఆ కాలంలో సోవియట్ ఆర్థిక వ్యవస్థ మరింత పుంజుకుంది. 1928లో ప్రథమ పంచవర్ష ప్రణాళిక అమలైంది. మౌలిక వసతులు వృద్ధి చెందాయి. పరిశ్రమల ఏర్పాటు పెద్ద ఎత్తున కొనసాగింది. ఈ ఆర్థిక పురోభివృద్ధి అందరి ఉపాధికి దారి తీసింది. దేశ ప్రజలందరు గౌరవ ప్రదమైన జీవనం గడపడానికి అవసరమైన వసతులను అప్పటి సోషలిస్టు రాజ్యం కల్పించింది.

రెండవ ప్రపంచ యుద్ధంలో పాల్గొన్న పెట్టుబడి దారీ దేశాలు దివాళా తీశాయి. కాని స్టాలిన్ హయాంలోని అప్పటి రష్యా ఆర్థికంగా తట్టుకుని నిలబడగలిగింది. దీనికి కారణం లాభాపేక్ష లేని సమిష్టి ఉత్పత్తి, సమిష్టి పంపిణీ ఇరుసుగా గల సోషలిస్టు ఆర్థిక విధానాలే. ఇక్కడ వస్తు ఉత్పత్తి సామాజిక అవసరంతో ముడిపడి ప్రణాళికా బద్ధంగా ఉంటుంది. కనుక ఇక్కడ సంక్షోభాలు ఉండవు. ఈ దిశగా కార్యాచరణ ఉండాలి. కార్మిక వర్గం, కర్షక వర్గం నాయకత్వంలో ప్రజలు ఉద్యమించాలి. యూరప్‌లో ఇప్పటికే నిప్పు రాజుకుంది. సమ్మెలు, ప్రదర్శనలు అక్కడ నిత్య కృత్యమయ్యాయి. పెల్లుబుకుతున్న ఉద్యమాలకు అన్ని సెక్షన్ల ప్రజలు మొత్తం పౌర సమాజం ఒక సామాజిక బాధ్యతగా గుర్తెరిగి ప్రజలు చేపట్టే ఉద్యమాలకు అండగా నిలబడి మరో నూతన నవ భారత నిర్మాణాన్ని నిర్మించుకోవాలి. భావితరాలకు ఒక నాణ్యమైన సమాజాన్ని అందించాలి.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# లెనిన్ - ట్రాట్స్కీ వివాదంపై వివరణ

- ఎస్‌విఎస్ నాగభూషణం

'జర్మనీతో శాంతి కోసం లెనిన్ పోరాటం' అనే నా వ్యాసంపై (ఈ వ్యాసానికి నేను పెట్టిన పేరు 'జర్మనీతో శాంతికోసం లెనిన్ చేసిన పోరాటం – ఎట్టకేలకు సాధించిన విజయం.' ఈ వ్యాసం ఏప్రిల్, మే, జూన్ – 2015 సంచికలలో మూడు భాగాలుగా వీక్షణంలో రావడం తెలిసిందే) జూలై సంచికలో నరేంద్రమోహన్ ఆస్ట్రేలియా నుంచి రాసిన లేఖ చూశాను. ట్రాట్స్కీ చేసిన ద్రోహం గురించి నా వ్యాసంలో ఎక్కడా చెప్పలేదని ఆయన ఆరోపించారు.

నిజానికి ఈ ఆరోపణకు నేను ప్రతి స్పందించాల్సిన అవసరం లేదు. ఎందుకంటే, ఆయన నా వ్యాసాన్ని పూర్తిగా చదవలేదని ఆయన ఉత్తరమే తెలియజేస్తుంది. వ్యాసం మొదటి భాగం చివరలోనే ట్రాట్స్కీ ఏం ద్రోహం చేసిందీ తెలిపాను.

ఆయన నా వ్యాసాన్ని సరిగ్గా చదవకుండానే ఆ ఆరోపణ చేశారని ఎవరికైనా అర్థమవుతుంది. అయితే ఈ ఉత్తరం ఎందుకు రాస్తున్నానంటే, వ్యాసం రాసిన తర్వాత (ఈ వ్యాసాన్ని నేను డిసెంబర్ 2014 నాటికే పూర్తి చేశాను) శాంతి సంధిపై మరింత అధ్యయనం చేసినప్పుడు, ట్రాట్స్కీ శాంతి సంభాషణలు జరిపి సంధిపై సంతకాలు చేసేందుకు 'బ్రెస్ట్‌లితోవ్స్క్'కు వెళ్లినప్పుడు, ఆ సంభాషణలు చెడగొట్టేందుకు చేసిన కొన్ని ప్రయత్నాలు తెలిశాయి. ఆ విషయాలు వివరించేందుకే ఈ ఉత్తరం రాస్తున్నాను.

'బ్రెస్ట్–లితోవ్స్క్' పట్టణానికి ట్రాట్స్కీ వెళ్లింది ఒక ఓటమిని అంగీకరించిన దేశం తరపున రాజీ సంప్రదింపులు జరపడానికి. కానీ ట్రాట్స్కీ ప్రవర్తన అందుకు విరుద్ధంగా విజేత దేశం తరపున వెళ్లినట్టుగా ఉంది. అతణ్ని జర్మన్లు ఎంతో మర్యాదగా ఆహ్వానించారు. అందుకు అనుగుణంగా వ్యవహరిస్తూ, ఎంతో సుహృద్భావంతో తమ దేశానికి అనుగుణమైన రాజీలను రాబట్టాల్సింది పోయి, ట్రాట్స్కీ ప్రతి చిన్న విషయానికీ వివరాలు కావాలని పట్టుబడుతూ, జర్మన్లకు చిరాకు కలిగించాడు. సంభాషణల్ని వీలైనంత సాగదీయమని సిసి చెప్పిన విషయాల్ని సాకుగా తీసుకుని, అసలుకే మోసం వచ్చేలా ప్రవర్తించాడు. కేవలం అంతేనా! ఆజ్ఞల్ని ధిక్కరించమంటూ జర్మన్ సైనికులకు బహిరంగంగా పాంప్లెట్లు పంచిపెట్టి ప్రచారం నిర్వహించాడు. విప్లవానికి మద్దతునివ్వమని కోరాడు. దీంతో జర్మన్ సేనానికి ఒళ్లు మండింది. అంతకు ముందు జర్మన్ ప్రభుత్వం పెట్టిన షరతులు రష్యాకు తక్కువ నష్టం కలిగించేవిగానే ఉన్నాయి. కానీ ట్రాట్స్కీ, అతని బృందం (సంతకాలు పెట్టేందుకు వెళ్లిన బృందమంతా ట్రాట్స్కీ అనుయాయులతోనే నిండిపోయింది) సాగించిన ఈ రెచ్చగొట్టే చర్యల వల్ల (మొదటి సారి సంభాషణలకు వెళ్లిన బృందానికి జోఫ్ నాయకత్వం వహించాడు. అప్పుడు అంతా సవ్యంగా జరిగిపోయింది), తన ప్రభుత్వం పెట్టిన షరతులకు తోడు జర్మన్ సేనానికి, స్వయంగా ఎక్కువ షరతుల్ని బాల్టిక్ రాష్ట్రాల్ని, పోలెండును పూర్తిగా జర్మనీకి అప్పగించే విధంగా, నష్టపరిహారం పెంచే విధంగా పెట్టాడు. ఇవి రష్యాకు మరిన్ని నష్టాల్ని కలిగించేవి. అయినప్పటికీ రష్యన్ ప్రభుత్వాధినేతా, పార్టీ అధ్యక్షుడూ అయిన లెనిన్‌తో పాటు, పార్టీ సిసి కూడా, జర్మనీ ఎలాంటి షరతుల్ని పెట్టినా, అంగీకరించి, సంతకాలు చేయమని ట్రాట్స్కీని ఆదేశించడం జరిగింది. అధికంగా పెట్టిన షరతుల గురించి ట్రాట్స్కీ కనీసం లెనిన్‌తో ఫోన్‌లో కూడా సంప్రదింపులు జరపకుండా (అప్పటికి ఫోన్లున్నాయి), సంతకాలు పెట్టేది లేదని తెగేసి చెప్పి, సంప్రదింపుల నుండి వాకౌట్ చేశాడు. అంతేకాక, సైన్యాన్ని కూడా ఉపసంహరిస్తున్నామని పరమ విద్రోహకరంగా ప్రకటించాడు.

అందుకు ప్రతీకారంగా జర్మనీ యుద్ధం ప్రకటించేసరికి, లెనిన్ తిరిగి సిసిని సమావేశపరిచి, తిరిగి సంప్రదింపులు జరిపి, సంధిపై సంతకాలు చేయాలని తీర్మానాన్ని ప్రతిపాదిస్తే, ట్రాట్స్కీ వితండవాదన చేశాడు. జర్మనీ యుద్ధాన్ని ప్రకటిస్తుంది గానీ, యుద్ధం చేయదని, తనకేదో గొప్ప రహస్యం తెలిసిన వాడిలా బలంగా వాదించాడు. అతని మాటలు నమ్మి కొందరు సిసి సభ్యులు, వరుసనే జరిగిన రెండు సిసి సమావేశాల్లో లెనిన్ ప్రతిపాదించిన తీర్మానాన్ని స్వల్ప మెజారిటీతో తిరస్కరించారు. అయితే జర్మనీ ట్రాట్స్కీ వాదానికి విరుద్ధంగా, యుద్ధంలోకి దిగడమే గాక, వేగంగా ముందుకు చొచ్చుకు వస్తూ రాజధానికి ముప్పు కలిగించే పరిస్థితి వచ్చేసరికి, ట్రాట్స్కీకి మద్దతునిచ్చిన సభ్యులు కూడా లెనిన్ తీర్మానాన్ని బలపరచక తప్పలేదు. ఆ విధంగా లెనిన్ తీర్మానం నెగ్గి, జర్మనీతో శాంతి సంధిపై సంతకాలు పెట్టేందుకు రెండోసారి మార్గం సుగమమైంది. అయితే విదేశాంగ కమిస్సార్‌గా ఉన్న ట్రాట్స్కీ తాను సంధిపై సంతకాలు పెట్టేది లేదని భీష్మించి, తన పదవికి రాజీనామా ఇవ్వడంతో, లెనిన్ విదేశాంగ శాఖ ఉప కమిస్సార్‌గా ఉన్న ఛిఛెరిన్‌తో ఆ కార్యక్రమాన్ని నిర్వహించాల్సి వచ్చింది. అయితే రాజీనామా చేసిన ట్రాట్స్కీని లెనిన్ వదిలేయలేదు. అతనికి మరో శాఖను కేటాయించాడు. ఈసారి రక్షణ శాఖను కేటాయించాడు. అయితే అక్కడ ట్రాట్స్కీ మరో విద్రోహానికి తెరలేపాడు. అది వేరేకథ!

ఈ సందర్భంగా స్వెర్డ్‌లోవ్ గురించి కూడా కొంత చెప్పాలి. స్వెర్డ్‌లోవ్‌పై త్వరలోనే ఓ వ్యాసాన్ని (దాంతో పాటు కథనీ) రాయబోతున్నా గనుక, ఆయన గురించి రెండు, మూడు అంశాల్ని చెపుతాను. విప్లవ విజయం తర్వాత, అతి కొద్ది కాలానికే, కేవలం 38 సంవత్సరాల చిన్న వయస్సులోనే మరణించిన ఇతడు, పదవి రీత్యా మొదటి దేశాధ్యక్షునిగా, లెనిన్ కన్నా ఉన్నత స్థానంలో ఉన్నవాడు. పార్టీలో లెనిన్ తరువాతి స్థానంలో ఉన్నాడు. లెనిన్ గైర్హాజరీలో పార్టీ సిసికి అధ్యక్షత ఇతడిదే. తాను ఉన్నత స్థానంలో ఉన్నా, ఏమాత్రం గర్వం లేకుండా, లెనిన్ అనుచరునిగానే ప్రవర్తించాడు. తన 16 సంవత్సరాల ప్రాయం నుంచే విప్లవ కార్యక్రమాలు నడిపించాడు. సిద్ధాంతకర్త లెనిన్ అయితే, వాటిని పాలనలో అమలు పరిచేది స్వెర్డ్‌లోవే అని చెప్పడం అతిశయోక్తి కాదు.

ప్రపంచ విప్లవకారులందరికీ ఇతడి జీవితం ఒక ఆదర్శప్రాయమని చెప్పవచ్చు. ఎప్పుడు తిండి తింటాడో, ఎప్పుడు నిద్రిస్తాడో కూడా ఎవరికీ తెలీనంత అవిశ్రాంతిగా పార్టీ నిర్వహణలో అలుపెరగ కృషి చేసిన బోల్షివిక్ విప్లవ యోధుడు స్వెర్డ్‌లోవ్. చివరికి తన అవిశ్రాంత శ్రమతోనే ప్రాణాల మీదకి తెచ్చుకున్న ఇతడు, లెనిన్ ప్రాణాల్ని పలుసార్లు అపాయాల్నుంచి రక్షించిన వాడు. ఈ విషయాన్ని లెనిన్ భార్య నదెజ్దా కూడా తన స్మృతుల్లో పేర్కొన్నది. పార్టీలోని ముఖ్య నాయకులంతా జైళ్లలోనో, విదేశీ, స్వదేశీ ప్రవాసంలోనో ఉన్నప్పుడు, పార్టీ అతిక్లిష్ట పరిస్థితుల్లో ఉన్న జూలై, ఆగస్టు నెలల్లో స్వెర్డ్‌లోవ్ ఒక్కడే ఒంటిచేత్తో పార్టీని ఏకతాటిపై నడిపిస్తూ, విచ్ఛిన్నం కాకుండా కాపాడాడు. ప్రసిద్ధి చెందిన జూలై నెలలో జరిగిన కార్మికుల, నావికుల సాయుధ ప్రదర్శనను అత్యంత పగడ్బందీగా నడిపించిన గొప్ప ఆర్గనైజర్. అలాంటి స్వెర్డ్‌లోవ్ లెనిన్ తీసుకున్న అతిముఖ్య నిర్ణయాల్లో నిర్ణయాత్మక పాత్ర వహించాడు. శాంతి సంధి విషయంలోనూ స్వెర్డ్‌లోవ్ లెనిన్‌కు అతి ముఖ్య మద్దతు దారునిగా నిలవడమే గాక, ప్రజాభిప్రాయాన్ని మలచడంలోనూ ప్రధాన పాత్ర వహించాడు. ట్రాట్స్కీ, బుఖారిన్‌లు పార్టీలోనే ఉంటూ లెనిన్ ప్రతిపాదనలకు విరుద్ధంగా ప్రజల్ని రెచ్చగొట్టేందుకు విష ప్రచారం నిర్వహించినప్పుడు, ఆ ప్రచారాన్ని వమ్ము చేసింది స్వెర్డ్‌లోవే కావడం గమనార్హం! అలాంటి స్వెర్డ్‌లోవ్ 1919 మార్చ్‌లో మరణించాడు. అందరికన్నా ఎక్కువగా దుఃఖించింది లెనినే!

ఇక నరేంద్రమోహన్ తన లేఖలో, అక్టోబర్ విప్లవం తర్వాత ఒక దేశంలో సోషలిజం సాధ్యం అని లెనిన్ వాదించాడనడానికి ఆధారాలు లేవనీ, ఒకవేళ అలా వాదించినా, దానిని వేదంలాగా అంగీకరించాలని తన భావం కాదని కూడా రాశారు. అయితే ఈ శాంతి సంధి సందర్భంలోనే లెనిన్ ఆ విషయం కూడా రాస్తూ, తన వాదన తప్పని ట్రాట్స్కీ, బుఖారిన్‌లు వాదిస్తున్నారని, అందుకు జర్మనీలో రాబోయే విప్లవం కోసం రష్యాలో గెలిచిన విప్లవాన్ని బలి చేయాలంటున్నారని తప్పుపట్టాడు. నరేంద్రమోహన్ గారు లెనిన్ రాసిన ఆ వ్యాసాల్ని సవివరంగా చదువుకోవడం మంచిది. ఆయన తన లేఖలో బ్రాకెట్లలో – ఒకవేళ విప్లవం తర్వాత లెనిన్ అలా వాదించినా, దానిని వేదంలాగా అంగీకరించాలన్నది తన భావం కాదని రాయడం జరిగింది. లెనిన్ రాసినదాన్ని ఆయన అంగీకరించకపోతే, ఆయనతో వాదించడానికి ఏమీలేదు.

ఇక, 'ట్రాట్స్కీ ద్రోహం' గురించిన ఆరోపణలు స్టాలినిస్టు రచనల్లో ఉన్నాయని ఆయన చెపుతూ, అదంతా స్టాలిన్ అధీనంలో జరిగిన చరిత్ర వక్రీకరణ అంటూ, ట్రాట్స్కీ అసలు ద్రోహే కాదన్నట్లు చెప్పడం, నిజానికి చరిత్ర వక్రీకరణే తప్ప, వేరు కాదు. ట్రాట్స్కీ ద్రోహాల గురించి, లెనిన్ చెప్పిన లిస్టే ఇవ్వడం ఈ ఉత్తరంలో సాధ్యం కాదు గానీ, ఒక్క విషయం చెపుతాను. మొదటి సామ్రాజ్యవాద ప్రపంచ యుద్ధం సమయంలో లెనిన్ తన పార్టీకి (అసలాయుద్ధానికి సామ్రాజ్యవాద యుద్ధమన్న పేరు పెట్టిందే లెనిన్) సామ్రాజ్యవాదులందరి మీద (రష్యన్ ప్రభుత్వంతో సహా) తీవ్ర ప్రచార యుద్ధాన్ని సాగించిన విషయం విధితమే. యుద్ధ సమయంలో ట్రాట్స్కీ సెంట్రిస్టు వైఖరి తీసుకుని, జాత్యహంకార సోషల్ సామ్రాజ్యవాదులైన మితవాద సోషలిస్టుల్ని అంటకాగాడు. 1914 నుంచి 1918 దాకా జరిగిన ఈ యుద్ధంలో క్రమంగా ప్రపంచ శ్రామిక లోకానికి జరిగిన భయంకర నష్టాల్ని చూసి, శ్రామిక లోకమంతా యుద్ధ వ్యతిరేకతతో భగ్గుమనగా, ట్రాట్స్కీ బోల్షివిక్‌ల వైఖరికి రష్యాలో పెరుగుతున్న మద్దతు చూసి, తన వైఖరి మారినట్లు నటిస్తూ, 1917 ఆగస్టులో జరిగిన పార్టీ మహాసభలో బోల్షివిక్ తీర్థం పుచ్చుకున్నాడు. ఇదే మహాసభలో బోల్షివిక్ పార్టీ సాయుధ తిరుగుబాటుకి అంగీకరిస్తూ తీర్మానించింది. అందుకనుగుణమైన పరిస్థితులు సెప్టెంబర్ అంతానికి ఏర్పడ్డాయి. దాంతో వెంటనే తిరుగుబాటుకి పూనుకోవాలన్న లెనిన్ అభ్యర్థనను, ఆయన స్వయంగా (ఫిన్లాండ్‌లో అజ్ఞాతంలో ఉన్న లెనిన్ మారు వేషంలో తిరుగుబాటుకి నేతృత్వం వహించడానికి స్వయంగా పీటర్స్‌బర్గ్ వచ్చి, పార్టీ ఆఫీసు ఉన్న స్మోల్నీ భవనంలోకి రహస్యంగా వచ్చి, స్వయంగా తీర్మానాన్ని ప్రవేశపెట్టాడు) ప్రవేశపెట్టిన తీర్మానాన్ని అడ్డుకోవడానికి కామెనెవ్‌తో కలిసి ట్రాట్స్కీ తీవ్రంగా ప్రయత్నించాడు. ఇంతెందుకూ ఆగస్టులో జరిగిన పార్టీ మహాసభలో (ఈ మహాసభలోనే ట్రాట్స్కీ పార్టీలో చేరాడు) కూడా ట్రాట్స్కీ తన అనుచరుల సహాయంతో సాయుధ తిరుగుబాటు తీర్మానాన్ని అడ్డుకునేందుకు ప్రయత్నించి విఫలుడయ్యాడు.

ఇక నరేంద్రమోహన్ మరో విషయాన్ని చెపుతూ, స్టాలిన్, ట్రాట్స్కీల వివాదానికి పశ్చిమ దేశాల విప్లవోద్యమాలు అంతం పలికాయని అంటూ, స్టాలిన్ నాయకత్వంలోనే అక్టోబర్ విప్లవానికి ద్రోహం జరిగిందని సెలవిస్తూ, ఈ అంశంలో దాదాపు అన్ని విప్లవ పార్టీలూ అంగీకరించాయని చెప్పారు. ఇలాంటి ట్రాట్స్కీయిస్టు, టిటోయిస్టు ఆలోచనలు కొత్తవి కావు. స్టాలినే అక్టోబర్ విప్లవానికి ద్రోహం చేస్తే, ఆ తర్వాత అధికారాన్ని చేపట్టి, స్టాలిన్ తీసుకున్న చర్యలన్నింటినీ తిరగదోడి, స్టాలిన్ అనుచర వర్గాన్ని అంతమొందించిన కృశ్చేవ్ అక్టోబర్ విప్లవానికి ఏం ఊడబొడిచాడో నరేంద్రమోహన్ వివరిస్తే బాగుండేది. కృశ్చేవ్, అతడి వారసులూ సోవియట్ యూనియన్ను ఏవైపుకి తీసుకెళ్లారో చరిత్ర మన కళ్లెదుట కనపడుతుంది. సోవియట్ యూనియన్ను విచ్ఛిన్నం చేసేందుకు సామ్రాజ్యవాదులకు ఏజెంట్లుగా పనిచేసిన ఈ 'అక్టోబరిస్టు'ల చర్యల వల్ల – నేడు రష్యా, తన పూర్వం సోవియట్ యూనియన్‌లో భాగంగా ఉండి, నేడు పొరుగు దేశాలుగా ఉన్న వీటితో ఎదుర్కొంటున్న సంఘర్షణలు చూస్తే మనకు ఏమనిపిస్తుంది? బ్రిటన్ సాగించిన చాణక్య నీతివల్ల నేడు భారత్, పాకిస్థాన్‌లు ఎదుర్కొంటున్న వైమనస్యాలుగా కనబడడం లేదా? విప్లవాభిమానులు పై చర్యల వల్ల గుండెల్లో గునపాలు దిగబడినట్లు బాధపడడం లేదా?

నరేంద్రమోహన్ ఇందుకోసమే ట్రాట్స్కీని భుజాన వేసుకోదలిచారా? ఆ పని ఇటీవల కాలంలో ఆంధ్ర దేశంలోనూ కొందరు మహానుభావులు తలకెత్తుకున్నారు. నరేంద్రమోహన్ ఆస్ట్రేలియాలో ఉండి ఆ పని చేయదలిచారా? ఇటీవల కాలంలో అమెరికా ఏకధృవ ప్రపంచంలో సాగిస్తున్న చర్యలు, వాటిని ఎదుర్కోలేక సాగుతున్న మానవ హననాలను చూసి, ఒకప్పుడు కృశ్చేవ్, అతడి అనుయాయుల అబద్ధ ప్రచారాలతో స్టాలిన్‌ని వ్యతిరేకించిన వారు కూడా నేడు స్టాలిన్ అవసరాల్ని, అతడు విప్లవానికి చేసిన సేవల్ని గుర్తిస్తున్న విషయం వీరికి కనబడదా? స్టాలినే లేకుంటే రెండో ప్రపంచ యుద్ధం ఎలాంటి విషమ పరిణామాలకు దారితీసేదీ తలచుకుంటేనే భయమేస్తోంది! వీ

# హిజ్రా సమస్యపై ప్రతిస్పందన

- తెలంగాణ హిజ్రా ట్రాన్స్‌జెండర్ సమితి సభ్యులు

రంగనాయకమ్మ తన సుదీర్ఘ వ్యాసంలో కొన్ని ప్రశ్నలు లేవనెత్తారు. ఆమే కోసం కాకపోయినా, చాలా మందికి ఇలాంటి సందేహాలు, గందర గోళాలు ఉండే అవకాశం ఉంది. వారి అవగాహన కోసం రంగనాయకమ్మ ప్రశ్నలకు సమాధానాలు ఇవ్వాలని తెలంగాణ హిజ్రా ట్రాన్స్‌జెండర్ సమితి భావిస్తోంది.

మొదటిది, రంగనాయకమ్మ ఉద్దేశంలో మహిళ అంటే ఏమిటి? మహిళను సామాజిక ఆర్థిక కార్యకలాపాల్లో వారి శ్రమ నిర్ణయిస్తుందా? వారు ధరించే దుస్తులు నిర్ణయిస్తాయా? వారు ధరించే నగలు నిర్ణయిస్తాయా? లేదా వారి శరీరాలను బట్టీ నిర్ణయిస్తామా? లేదంటే, పైవన్నీ కలిసి మహిళను మహిళగా గుర్తించేలా చేస్తాయా?

రెండోది ట్రాన్స్‌జెండర్స్ తమ సెక్సువల్ రీ అసైన్‌మెంట్ సర్జరీలో బూర్జువా మందులు మార్కెట్ వైద్యం పాత్ర ఎంత?

మూడోది హిజ్రా కావడానికి జెనిటికల్ ఆధారమెంత? ఎక్స్ ఎక్స్ వై క్రోమో జోమ్‌లతో పుట్టిన వారే హిజ్రానా?

ఈ వ్యాసంలో ఇలాంటి సందేహాలకు సమాధానాలు చెప్పే ప్రయత్నం చేస్తున్నాం. గత వ్యాసంలో మేం హిజ్రాల సామాజిక, రాజకీయ పరిస్థితులపై చర్చించాం. ప్రస్తుత వ్యాసంలో రంగనాయకమ్మ ప్రశ్నించినట్లు, మహిళ అంటే ఏమిటి? అనే ప్రశ్నకు సమాధానం చెప్పాలనుకుంటున్నాం. రంగనాయకమ్మ హిజ్రాలు మహిళలు కారని ఎందుకంటే, తనంతట తానే మహిళా శరీరంగా మారదని అన్నారు. మరోవైపు హిజ్రాలు పురుషులతో ప్రవర్తించేటప్పుడు తగినంత సిగ్గు పడలేదని, అందువల్ల వారు మహిళలు కారని తన వ్యాసంలో అభిప్రాయపడ్డారు. ఈ రెండు వ్యాఖ్యలతో రంగనాయకమ్మకు హిజ్రాలపై తప్పుడు అవగాహన ఉందని అర్థమవుతుంది. రంగనాయకమ్మ దృష్టిలో మహిళ అంటే ఎవరు? కేవలం శరీరం మాత్రమే మహిళను నిర్ణయిస్తుందా? ఒక మహిళ తనను మహిళగా గుర్తించేందుకు శరీరాన్ని సాక్ష్యంగా చూపించాలా? సమాజం గుర్తించిన బాధ్యతలను నిర్వర్తించడం ద్వారానే మహిళగా గుర్తింపు పొందుతుందా? రంగనాయకమ్మతో సహా, సమాజంలో ఎంతో మంది మహిళలు, స్త్రీలపై సమాజం విధించిన కట్టుబాట్లను ధిక్కరించి, ఎదిరించి, ప్రశ్నించారు. దాని వల్ల వారు మహిళలు కాకుండా పోయారా?

ఇదే అంశంపై మహిళా ఉద్యమ కార్యకర్తలు, ఫెమినిస్టులు ఎన్నో ప్రశ్నలు లేవనెత్తారు. సామాజికంగా స్త్రీ ప్రవర్తన నిర్వచనాన్ని ఎండగట్టారు. ప్యాసివ్‌నెస్, ఫైనిస్ వంటి ప్రవర్తనలను స్త్రీలకు ఆపాదించడాన్ని తప్పు పట్టారు. నేడు పురుషులతో సమానంగా వర్గ పోరాటంలో పాల్గొంటున్న స్త్రీలు, ఆయుధాలు ధరించేందుకు ఎలాంటి బెరుకు ప్రదర్శించడం లేదు. రోజులు తరబడి, ఏళ్ల తరబడి, సహచర పురుష కామ్రేడ్స్‌తో కలిసి సామాజిక జీవనం సాగిస్తున్నారు. ఇక క్రీడాకారిణులు సైతం ఎన్నో జెండర్ రోల్స్‌ని తెంచుకుని, తమ తమ రంగాల్లో రాణిస్తున్నారు. ఇక ప్రతి రోజు చిన్న చిన్న గుడిసెల్లో, రోడ్ల పక్కన, లైంగిక నేరగాళ్ళు, గుంటనక్కల వంటి కాంట్రాక్టర్ల నడుమే, జీవనం సాగిస్తున్న శ్రామిక వర్గ మహిళలు రంగనాయకమ్మ దృష్టిలో మహిళలు కారా?

ఇక శరీరాలో స్త్రీతత్వాన్ని నిర్వచిస్తాయనే మాటను ఫెమినిస్టులు ఎప్పుడో వ్యతిరేకించారు. క్యాన్సర్ వల్ల రొమ్ములు పోగొట్టుకున్న స్త్రీ మహిళ కాకుండా పోతుందా? హిస్టరెక్టమీ చేయించుకున్న మహిళ, స్త్రీ కాకుండా పోతుందా? శరీరంపై, ముఖంపై సహజంగానే రోమాలు మొలచిన మహిళలు, స్త్రీలు కారా? ఇవన్నీ శరీరాలను, జెండర్‌ను కలగలపడం వల్ల వచ్చే సమస్యలు.

హిజ్రాలుగా మారే మెడికల్ ట్రాన్సిషన్‌ను రంగనాయకమ్మ తప్పుగా అర్థం చేసుకున్నారు. గత ఆర్టికల్‌లో మేం చెప్పినట్లు, ఆధునిక వైద్య సహకారంతో హిజ్రాలు తమ శరీరాలను పూర్తిగా మహిళా శరీరాలుగా మార్చుకునే అవకాశం ఉంది. అయితే గర్భ సంచి మాత్రం ఇంప్లాంట్ చేయలేరు. ట్రాన్సిషన్ తర్వాత ట్రాన్స్‌జెండర్ మహిళలు, హిస్టరెక్టమీ చేసుకున్న మహిళలతో సమానం.

సాధారణంగా చాలా మంది హిజ్రాలను మనం గుర్తించలేం. భిక్షాటనకు, సెక్స్ వర్క్ కోసం వెళ్లే స్త్రీలు మాత్రమే, ప్రత్యేకమైన ముస్తాబుతో, తమను తాము హిజ్రాలుగా ప్రకటించుకునే ప్రయత్నం చేస్తారు. ఈ రెండు పనులు చేసేందుకే అవకాశం ఉంది. అడుక్కునేప్పుడు, లేదా సెక్స్ వర్క్ కోసం వెళ్లినప్పుడు, చప్పట్లు కొట్టడం, జిలుగు జిలుగుల దుస్తులు ధరించడం, ప్రత్యేకమైన ముస్తాబు చేసుకుని, తమకు తాముగా, ట్రాన్స్‌జెండర్స్ అని ప్రకటించుకోవాల్సి వస్తుంది. ఒక్కోసారి హిజ్రాలు తమ దుస్తులు తొలగించి తాము ట్రాన్స్‌జెండర్‌లమని నిరూపించుకోవాల్సి వస్తుంది. యాచన, సెక్స్ వర్క్ తప్ప వేరే గత్యంతరం లేకే ఈ పనిచేస్తున్నామని చెప్పాల్సి వస్తుంది. అంతే కాదు, బహిరూపియాల కారణంగా కూడా ఈ పరిస్థితి దాపురిస్తుంది. బహిరూపియాలంటే, యాచన కోసం మహిళల లాగా దుస్తులు ధరించే వారు. వీరిలో చాలా మంది డ్రగ్ అడిక్షన్ ఉన్నవారు, తాగుబోతులు, చారిత్రకంగా ట్రాన్స్‌జెండర్‌ల బలహీనతను అడ్డం పెట్టుకుని వీరు బతికేస్తున్నారు. బహిరూపియాల వ్యవహార శైలి చాలా సందర్భాల్లో హిజ్రాలపై అసహ్యం కలిగించేలా ఉంటుంది. వీరు జనాన్ని పీడించి, డబ్బు వసూలు చేస్తుంటారు. జనం నుంచి పెద్ద మొత్తంలో డబ్బు డిమాండ్ చేస్తుంటారు. తాగి, అడుక్కునేందుకు వెళతారు. వీరి మాట, తీరు, వ్యవహార శైలి ఏ కోశాన, ట్రాన్స్‌జెండర్స్ వలే ఉండదు. బహిరూపియాల గుట్టు రట్టు చేసినందుకు, ట్రాన్స్ జెండర్లు తన్నులు తిన్న సందర్భాలు కూడా లెక్కలేనన్ని ఉంటాయి. ఇక హైదరాబాద్‌లో హిజ్రాల కంటే మూడు రెట్లు ఎక్కువ సంఖ్యలో బహిరూపియాలు ఉన్నారు. అందువల్ల జనం చాలా సందర్భాల్లో బహిరూపియాలను ట్రాన్స్ జెండర్లుగా పొరబడుతూ ఉంటారు. ఇది హిజ్రాల జీవితానికి అతిపెద్ద ఇబ్బంది. అంతేకాదు, ఈరోజు కూడా యాచన, సెక్స్ వర్క్ మినహా, ఎలాంటి పనీ దొరకని పరిస్థితి ఉంది. ఈ రెండు వృత్తులపై సామాజిక చిన్న చూపు, ట్రాన్స్ జెండర్లుగా ఉండడం వల్ల ఎదుర్కొనే వివక్షకు అదనం, ఇక బహిరూపియాల వల్ల, ట్రాన్స్ జెండర్ల పట్ల జనం అసహ్యించుకునే పరిస్థితులు తలెత్తుతున్నాయి. హిజ్రాలు అనేక సందర్భాల్లో బహిరంగంగా తమను తాము, నిజమైన ట్రాన్స్‌జెండర్‌లని నిరూపించు కోవాల్సిన పరిస్థితి. అందుకు జనం ముందు తమ దుస్తులు ఎత్తి నిరూపించుకోవాల్సిన దుస్థితి తలెత్తుతుంది. సమాజంలో ఏ మహిళ అయినా, తమ శరీరాలు చూపి, మహిళగా నిరూపించుకోవాల్సిన పరిస్థితి వస్తుందా? అలాగే హిజ్రలు కూడా అలా నిరూపించుకోవాలని అనుకోరు. అయితే, వారికి ప్రతి రోజు రోడ్డుపై, ఇరుగు పొరుగు వారివద్ద, పనిచేసే చోట్ల, అడుక్కునేందుకు వెళ్లిన చోట, పదే పదే తమను తాయు హిజ్రాలుగా

నిరూపించుకోవాల్సిన ఒత్తిడి ఉంటుంది. దళిత సోదర, సోదరీమణుల వలెనే, ఈ ఫ్యూడల్ వ్యవస్థ హిజ్రాలను అన్ని రకాలుగా అణచి వేస్తోంది. తెలంగాణ హిజ్రా ట్రాన్స్‌జెండర్ సమితిగా మేం ఈ మనువాద, బ్రాహ్మణీయ పుషాధిపత్యానికి వ్యతిరేకంగా పోరాడుతున్నాం. కొన్ని కమ్యూనిటీలను కొన్ని కరాల పనులకే పరిమితం చేయడాన్ని ఖండిస్తున్నాం.

అందువల్ల మొత్తంగా రంగనాయకమ్మ దృష్టిలో స్త్రీ అంటే శరీరమే అయితే, ట్రాన్సిషన్ తర్వాత హిజ్రా, పూర్తి మహిళా శరీరాన్ని పొందుతారు. మరి రంగనాయకమ్మ వారిని ఎందుకు మహిళలుగా గుర్తించడం లేదో అర్థం కావడం లేదు. లేదంటే, సామాజిక భూమిక ద్వారా మహిళను నిర్వచించినట్టయితే, చాలా మంది ట్రాన్స్‌జెండర్ మహిళలు ముమ్మూర్తులా స్త్రీలని నిరూపించుకోగలరు. కానీ, ఈ పరీక్షలో చాలా మంది బోల్డ్ సిస్ జెండర్ మహిళలు (సిస్ జెండర్ అంటే ట్రాన్స్‌జెండర్ కాని అని అర్థం) రంగనాయకమ్మ దృష్టిలో తమను తాము స్త్రీలుగా నిరూపించుకోవడంలో విఫలమైతారు.

మేం మహిళలను వారి శరీరాల ద్వారా, సామాజిక నిర్వాచనాలను అన్వయించి, స్త్రీలుగా గుర్తించం, మేం ఒకరి జెండర్‌ని, వారి స్వంత లేదా స్వయం ప్రకటిత జెండర్ ఐడెంటిటీతో మాత్రమే గుర్తిస్తాం. ఎవరైనా స్త్రీగా బతుకుతుంటే, వారిని స్త్రీగానే గుర్తిస్తాం.

ఇక రంగనాయకమ్మ తమ వ్యాసంలో మరో ఆశ్చర్యకరమైన విషయాన్ని లేవనెత్తారు. బూర్జువా మెడికల్ కంపెనీలు ట్రాన్స్‌జెండర్ అంశాన్ని లెవనెత్తుతున్నాయని, ఇది పూర్తిగా దురుద్దేశ పూర్వకమైన ఎత్తుగడ. లెఫ్ట సర్కిల్స్‌ను ట్రాన్స్‌జెండర్ సమస్య నుంచి దూరంగా జరిపే ప్రయత్నమే ఇది. చారిత్రకంగా, వేలాది ఏళ్ల క్రితం నుంచే హిజ్రాలు తమ మర్మాంగాలను తొలగించుకునే పద్ధతి ఒకటి ఉంది. ఈ విషయం రంగనాయకమ్మకు కూడా తెలుసు. అంతే కాకుండా, మరో చోట స్వయంగా తానే ప్రస్తావించారు కూడా. అందువల్ల బూర్జువా వైద్యం కారణంగా ట్రాన్స్‌జెండర్‌ల సమస్య తలెత్తలేదని ఖచ్చితంగా చెప్పవచ్చు. ఆధునిక వైద్యం కనిపెట్టడానికి వేల ఏళ్ల ముందు నుంచే ట్రాన్స్‌జెండర్‌లు ఉన్నారన్న విషయం గుర్తుంచుకోవాలి. మరో విషయం సంప్రదాయ వైద్యం స్థానంలో బూర్జువా వైద్యం ఎలాగైతే హృద్రోగాలు, మధుమోహం, బిపి, సెల్బ్రల్ మలేరియా వంటి ప్రాణాంతక వ్యాధుల నుంచి కాపాడేందుకు మెరుగ్గా పనిచేస్తాయో, తమ శరీరాల నుంచి ఎదురవుతున్న తీవ్రమైన అసౌకర్యాన్ని తొలగించుకూనేందుకు ట్రాన్స్‌జెండర్‌లు ఆధునిక వైద్య సాయాన్ని పొందుతున్నారు.

అంతే కాదు, ఇక్కడ గుర్తించాల్సిన మరో విషయం ఏంటంటే, ట్రాన్స్‌జెండర్‌లు హార్మోనల్ థెరపీ కోసం ఉపయోగించే ఏ ఔషధం వారి కోసం తయారు చేసింది కాదు. ట్రాన్స్‌జెండర్ మహిళలు తీసుకునే ఎస్ట్రోజెన్, మోనోపాజ్ దాటిన మహిళలు తమ శరీరంలో ఎముకలు గట్టిగా ఉండేందుకు వాడతారు. ట్రాన్స్‌జెండర్ పురుషులు తీసుకునే టెస్టోస్ట్రాన్ వయసు మళ్లిన పురుషుల తమ టెస్టోస్ట్రాన్ స్థాయిలు పడిపోకుండా కాపాడుకునేందుకు సప్లిమెంట్‌గాను, యువకులు కండలు పెంచేందుకు వాడతారు. ఈ మార్కెట్ సిస్ జెండర్లను ఉద్దేశించినదే తప్ప, ట్రాన్స్‌జెండర్ల కోసం ఏర్పడినది కాదు. మెడికల్ ఇండస్ట్రీస్ సిస్ జెండర్‌లను వాడుకున్నట్లే, ట్రాన్స్‌జెండర్‌లను వాడు కుంటుంది తప్ప, వారినే ఉద్దేశించి ఎలాంటి ఔషధాలు తయారు చేయదు.

ఇందు వల్లనే వర్కింగ్ క్లాస్ ట్రాన్స్‌జెండర్ వ్యక్తుల వైద్య ఖర్చులు ప్రభుత్వమే భరించాలని, వారికి తగిన వైద్య సాయం అందించాలని మేం సమితీ ద్వారా ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తున్నాం. ఇప్పటికే కొన్ని ప్రాంతాల్లో ఇది అమలైనా, చాలా భాగం ట్రాన్స్‌జెండర్‌లకు సెక్స్ రీ అసైన్‌మెంట్ సర్జరీ, హార్మోనల్ థెరపీ కాదు కదా, కనీసం అత్యవసర వైద్య సాయం కూడా అందడం లేదు.

ఇక మూడో విషయం రంగనాయకమ్మ ట్రాన్స్‌జెండర్‌లు, ఇంటర్ సెక్స్ వక్తుల మధ్య గందరగోళంలో ఉండిపోయారు. నపుంసక అనే మాటను ఆవిడ ఎవరిని ఉద్దేశించి ఉపయోగించారో గందరగోళంగా ఉంది. అయితే ఆవిడ కోట్ చేసిన డాక్టర్లు రెండు ఎక్స్ ఎక్స్ క్రోమోజోమ్‌లు ఉంటే స్త్రీలని, ఒక ఎక్స్, ఒక వై క్రోమోజోమ్ ఉంటే పరుషుడనీ, ఎవరైన ఒక వ్యక్తి రెండు ఎక్స్, ఒక వై క్రోమోజోమ్‌లతో పుడితే క్లైన్ఫెల్టర్ అంటారు. క్లైన్ఫెల్టర్‌లో మళ్లీ అనేక రకాలు ఉన్నాయి. వీరిలో చాలా మంది శరీరాలు అటు స్త్రీగా కాని, ఇటు పురుషుడిగా కాని నిర్ణయించలేం. ఇంటర్ సెక్స్ అనేది అతి సామాన్యమైన సమస్య. ప్రతి 2000 మందిలో ఒకరు ఇలాంటి సమస్యతో జన్మిస్తున్నట్లు పరిశోధనలు చెపుతున్నాయి. ఇక ఇంటర్ సెక్స్‌కు సంబంధించి బోలెడు సమాచారం ఇంటర్నెట్ మీద దొరుకుంది. ఎవరికైనా ఆసక్తి ఉంటే, oiiinternational.com లోని లైబ్రరీ, ఇంటర్ సెక్స్ ఆర్టికల్ విభాగంలో చదువుకోవచ్చు. www.isna.org వెబ్‌సైట్‌లో కూడా సందేహాలు నివృత్తి చేసుకోవచ్చు.

అనేక సందర్భాల్లో ఇంటర్ సెక్స్ పిల్లలకు డాక్టర్లు స్త్రీ, పురుష లింగాల్లో ఏదో ఒకటి ఇచ్చేస్తారు. ఈ పిల్లలు పెద్దయ్యాక, వారికి డాక్టర్లు ఆపాదించిన జెండర్‌తో ఇబ్బంది లేకపోతే సమస్య లేదు. కొన్ని సందర్భాల్లో వారికి ఇచ్చిన జెండర్‌తో సమస్య వస్తే, వారు ట్రాన్స్‌జెండర్‌లుగా మారతారు. ఇంటర్ సెక్స్ పిల్లలకు చిన్నప్పుడే ఎలాంటి జెండర్ అసైన్‌మెంట్ ఇవ్వడం కంటే, పెద్దయ్యాక, వారికి సౌకర్యంగా ఉన్న జెండర్ అసైన్ చేయడం ఉత్తమం.

అందువల్ల ఇంటర్ సెక్స్ పిల్లలు ఉన్న తల్లిదండ్రులు, డాక్టర్లు ఈ విషయాన్ని గుర్తుంచుకోవాలి. పిల్లలు పుట్టగానే, వారికి జెనిటికల్ సర్జరీ చేసే ముందు, పిల్లలు పెరిగి పెద్దయ్యే వరకూ వేచి చూసి వారికి ఇష్టమైన జెండర్‌లో ఉండే అవకాశం కల్పిస్తే వారిలో ట్రాన్స్‌జెండర్ సమస్యలు ఉత్పన్నమయ్యే అవకాశం ఉండదు.

ఇక మరో విషయం ఏంటంటే, చాలా మంది ఇంటర్ సెక్స్, హిజ్రా ఒకటే అని అనుకుంటారు. కానీ కొంతమంది హిజ్రాలు ఇంటర్ సెక్స్ రకానికి చెందవచ్చు కానీ, చాలా వరకూ హిజ్రాలు ఇంటర్ సెక్స్ కారు. ట్రాన్స్‌జెండర్ మహిళ అంటే, పుట్టుకతో మగవాడుగా గుర్తించిన, తమకు తాము స్త్రీలుగా భావించుకునే వారు. కొంత మంది ట్రాన్స్‌జెండర్ మహిళలు చాలా చిన్న వచస్సులోనే , తమను తాము ఆడవారిగా గుర్తించుకోవడం మొదలవుతుంది. ట్రాన్స్‌జెండర్‌లను శారీకంగా డాక్టర్లు పరీక్ష చేసి నిర్ధారించడం సాధ్యమయ్యే పనికాదు. ఒక చిన్నారి తనను గురించి తాను ఏ జెండర్‌గా ఫీల్ అవుతున్నారో. తమ శరీరంలోని జెండర్ అవయవాలతో, వారికి ఏదైనా అసౌకర్యం ఉందో అడిగి తెలుసుకుంటేనే వారిని ట్రాన్స్‌జెండర్‌లుగా గుర్తించడం పూర్తి అవుతుంది.

సాధారణంగా సిస్ జెండర్ పురుషులు, ట్రాన్స్‌జెండర్ మహిళల్లో హార్మోనల్ లెవెల్స్ పెద్దగా తేడా ఉండవు. హార్మోనల్ థెరపీ చేయించుకునే ట్రాన్స్‌జెండర్ మహిళల్లో మాత్రమే హార్మోన్ తేడాలు ఉంటాయి. రంగనాయకమ్మ పదే పదే ట్రాన్స్‌జెండర్‌ల గురించి శాస్త్రీయమైన కారణం (సైంటిఫిక్ బేసిస్) ఏంటి అని, ఆవిడ డాక్టర్ స్నేహితులు పదే పదే చెప్పినట్లు, ట్రాన్స్‌జెండర్‌లపై జరిగిన పరిశోధన కాస్త తక్కువే. అయితే, ట్రాన్స్‌జెండర్ ఐడెంటిటీ వెనక కొంత బయలాజిక్ బేస్ ఉందని తేల్చాయి. ట్రాన్స్‌జెండర్ వ్యక్తుల మెదడులో, కొన్ని ప్రాంతాల్లో (Zhow et al 1995; Kruijver et al 2000) వైట్, గ్రే మ్యాటర్స్‌లో తేడా ఉందని గుర్తించారు. (Rametti et al 2011; Luders et al 2011) దీనివల్ల ట్రాన్స్‌జెండర్ ఐడెంటిటీ వెనక మెదడు ప్రభావం ఉందని అర్థమవుతుంది. అంతే కాదు, ఇప్పటి వరకూ మెదడు పనితీరును మార్చే వైద్య పరిజ్ఞానం ఇంకా కనిపెట్టలేదు.

అంతేకాదు ట్రాన్స్‌జెండర్ ఐడెంటిటీ వెనక జెనిటికల్ కారణాలు

ఉన్నాయని (Kudwa et al 2005; Hare et al 2013) పరిశోధనలు చెపుతున్నాయి. తండ్రులు, కొడుకులు, అన్నదమ్ములు, ట్విన్స్ విషయంలో జెనిటిక్ సిమిలారిటీస్ కనుగొన్నారు. కొన్ని రకాల జీన్స్ ట్రాన్స్‌జెండర్ ఐడెంటిటీని నిర్ధారించడంలో కీలక పాత్ర పోషిస్తున్నాయి. ఏదేమైనా, భారతదేశంలో హిజ్రాలు బహిర్గతంగా కనిపిస్తారు. కానీ, ట్రాన్స్‌జెండర్ మెన్ కనిపించే అవకాశం చాలా అరుదు. రంగనాయకమ్మగారి డాక్టర్ ఫ్రెండ్ స్వయంగా ట్రాన్స్‌జెండర్‌ల గురించి తనకు ఎక్కువ విషయాలు తెలియదని ఒప్పుకున్నారు. ట్రాన్స్‌జెండర్ పురుషుల ఐడెంటిటీపై కొన్ని పరిశోధనలు జరిగాయి. సివైపిఐ7 జీన్ (Bentz et al 2008) ట్రాన్స్‌జెండర్ పురుషులుగా నిర్ధారించడంలో కీలకమని చెపుతున్నాయి. ఇక ట్రాన్స్‌జెండర్ పురుషులు సైతం సర్జరీ, హార్మోన్స్ ద్వారా పురుష శరీరాలు, మీసాలు, గడ్డాలు, కంఠస్వరం పొందుతారు. అయితే రంగనాయకమ్మ చెప్పినట్లు ల్యూప్రాన్ ఇంజెక్షన్లు తీసుకోరు. ఎందుకంటే, ఈ ఇంజెక్షన్లు చాలా ఖరీదైనవి. వీటి బదులు, చౌకగా అనేక ఇంజెక్షన్లు మార్కెట్‌లో లభిస్తాయి. ట్రాన్స్‌జెండర్ పురుషులు సమాజంలో బహు అరుదుగా కనిపిస్తారు. దీనికి పురుషాధిక్య సమాజమే కారణం. ట్రాన్స్‌జెండర్ పరుషులను తమ కుటుంబాలు కట్టు బాట్లతో బయటికి రాకుండా కట్టడి చేస్తాయి. ట్రాన్స్‌జెండర్ స్త్రీ, పురుషుల్లో అత్యధిక భాగం కుటుంబం, సమాజం తమ పట్ల వ్యవహరించే తీరుకు మనస్థాపంతో, చాలా చిన్న వయస్సులోనే ఆత్మహత్యలు చేసుకుంటారు.

నెలల తరబడి రంగనాయకమ్మ హిజ్రాలపై వ్యాసాలు రాస్తూ, మేం సమాధానాలు రాస్తున్న క్రమంలో మన చుట్టు పక్కల, హైదరాబాద్ నగరంలోనే ఒక హిజ్రా ఆత్మహత్యకు పాల్పడింది. ఒక హిజ్రా మూడుసార్లు ఆత్మహత్యకు ప్రయత్నించింది. ఒక ట్రాన్స్‌జెండర్ మహిళ రెండు కాళ్లు కుటుంబ సభ్యులే విరగ్గొట్టారు. ఒక ట్రాన్స్ మహిళ కాళ్లు పూర్తిగా తొలగించారు. ఒక ట్రాన్స్ మహిళ యాసిడ్ దాడికి గురైంది. మరో హిజ్రాపై ముగ్గురు మిలిటరీ జవాన్‌లు దాడి చేసి తీవ్రంగా గాయపరిచారు. బిక్షాటనకు వెళ్లిన ఒక ఆదివాసి హిజ్రా తల పగలగొట్టారు. సొమ్మసిల్లి పడి ఉన్న ఆమెను తీసుకువచ్చేందుకు వెళ్లిన మరో దళిత హిజ్రాను బట్టలు విప్పి కొట్టి, పోలీస్ స్టేషన్‌కు లాక్కెళ్లి, న్యూసెన్స్ కేసు పెట్టారు. ప్రతి రోజు హిజ్రా కమ్యూనిటీపై జరుగుతున్న హింస మధ్యలో రంగనాయకమ్మ రాసిన సుదీర్ఘ వ్యాసానికి సమాధానం రాయడానికి కారణం ఒక్కటే. వీక్షణం పాఠకులకు హిజ్రాలు, ట్రాన్స్‌జెండర్‌లపై సరైన అవగాహన కల్పించాలని. అంతకంటే ముఖ్యంగా మన కుటుంబాల్లోని ట్రాన్స్‌జెండర్ పిల్లలను అర్థం చేసుకునే అవకాశం ఉంటుందనే ఆశ మాత్రమే. వీ

---

*(... 4వ పేజీ తరువాయి)*

*అక్టోబర్ విప్లవానికి ద్రోహం జరిగింది అనేది అన్ని విప్లవ పార్టీలూ అంగీకరించిన విషయం అంటారు నరేంద్రమోహన్. దీనికి విప్లవ పార్టీల దాకా వెళ్లనవసరంలేదు. ట్రాట్స్కీ 'ది రెవల్యూషన్ బిట్రేడ్' నాల్గవ ఇంటర్నేషనల్ పార్టీలకి ఓ ప్రామాణిక ఆధార గ్రంథం అవుతూ వస్తున్నదే. మోటుదనం అనియతత్వం, అసహనం, అసభ్యత మొదలయిన లక్షణాలు (లెనిన్ లాస్ట్ విల్) స్టాలిన్‌లో ఉన్నాయనుకున్నా లెనిన్ చివరిదాకా గుండెబాదుకుని చెప్పిన కూటములు, కుట్రలతో చిరిగిన విస్తరి కాకుండా, విచ్ఛిన్నమైపోకుండా దేశాన్ని ఏకధాటి సుస్థిరతతో నిలుపుకుంటూ త్వరిత అభివృద్ధిపరిచి అగ్రరాజ్య ఏకాధిపత్య ధాటికి ధీటుగా విశాల సోవియట్‌ని తలెత్తి నిలపగలిగిన శ్రేయస్సు స్టాలిన్‌కి దక్కుతుందని అందరూ అంగీకరించే విషయమైంది. శ్రీశ్రీ ఆధివాస్తవికత శోధనలో తలమున్కలవుతున్న రోజుల్లో శ్రీశ్రీ తడిమిన స్టాలిన్ - ట్రాట్స్కీల 'నిరంతర విప్లవ' విభేదాలపై ఆసక్తిమేర శ్రీశ్రీగూడా ఆధివాస్తవిక ఆంద్రీబ్రెతా పట్ల ఆధివాస్తవికతని సమర్థించిన ట్రాట్స్కీ పట్ల గురిగా ట్రాట్స్కీ, డ్యుశ్చెర్ రచనల పఠన పరిభ్రమాలున్నాయి.*

*చివరగా - నేడు కావాల్సింది స్టాలిన్ - ట్రాట్స్కీ పొలిమిక్‌లు తిరిగి తవ్వుకోటాలు కావు. (నరేంద్రమోహన్‌కి ఇవి విప్లవానికి అవసరమైన పొలిమిక్‌లు అనిపించకూడనివి). నేటి దిక్కులేని ఏకధృవ ప్రపంచానికి మరో సశక్త ధృవ పునఃస్థాపనకి కలిసికట్టు కార్యాచరణ ఉద్యమతత్వం. నరేంద్రమోహన్, నాగభూషణంల పుణ్యమా అంటూ మరుగునపడ్డ మురుగుని కెలికే అనవసరం అవసరం కాకూడనిది. కాలం కడుపులో నింపాదిగా నిదరబోతున్న గత చరిత్ర హనన (కారెక్టర్ ఎసాసినేషన్) చరిత్రకి కొత్తగా జీవంపోసి కాలాన్ని ఖర్చు చేయడం కంటే నేటికి కావాల్సిన నిదాన సమాధానాలు వెతకటం మంచిది కాగలదేమో. నరేంద్రమోహన్ అభ్యంతరాలకి వివరణగా సందర్భానుసారంగా ట్రాట్స్కీని ఉదహరించడం జరిగిందేగాని ట్రాట్స్కీని తక్కువజూసే ఉద్దేశం ఈ లేఖారూపం కాదని ఒప్పించడం కష్టమే అవొచ్చేమో!*

***- గూడ శ్రీరాములు***
*భిలాయి*

*ఇటీవల వెలుగులోకి వచ్చిన మ్యాగీ నూడిల్స్ సుదీర్ఘకాల కుట్రకు స్పందిస్తూ 'వీక్షణం' జూలై 2015 సంచికలో రాసిన 'మ్యాగీ సరే, మిగిలిన ఉత్పత్తుల మాటేమిటి?', 'భద్రత ప్రజలకా-కంపెనీలకా?' అనే రెండు వ్యాసాలు సామాన్య పాఠకులను సైతం ఆలోచింపచేసే విధంగా ఉన్నాయి. నెస్లే ఇండియాతో పాటు దేశంలో పలు బహుళజాతి సంస్థలు అందిస్తున్న రెడీమేడ్ ఆహార ఉత్పత్తులు ప్రజల ఆరోగ్యం పైన ఏవిధమైన చెడు ప్రభావం చూపిస్తున్నాయో ఈ వ్యాసాలు కొంతమేర అవగాహన కల్పిస్తున్నాయి, తమ వంతుగా ప్రజలను అప్రమత్తం చేస్తున్నాయి. దేశంలో సంప్రదాయ ఆహారాలను అంచెలంచెలుగా అపహాస్యం చేస్తూ సుదీర్ఘకాలంగా పుట్టుకొచ్చిన రెడీమేడ్ ఆహార ఉత్పత్తులలో ప్రధానమైన కొన్నింటి గురించి, అవి ప్రజలకు చేస్తున్న హాని గురించి క్లుప్తంగానైనా అవసరమైన సమాచారాన్ని రచయితలు అందించారు. అలాగే, ప్రజల ఆరోగ్యానికి కీడు చేసే ఆహార ఉత్పత్తులను సకాలంలో గుర్తించకుండా ప్రభుత్వాలు అవలంబిస్తున్న నిర్లక్ష్య ధోరణిని, ఆ ఉత్పత్తులను అందిస్తున్న దిగ్గజ సంస్థల పట్ల ఈ ప్రభుత్వాలు పాటిస్తున్న ఉపేక్ష స్వభావాన్ని రచయితలు ప్రధానంగా ప్రశ్నించారు. అంతేకాకుండా, ప్రజలలో తమకున్న ఇమేజ్‌ను మరో ఆదాయ మార్గంగా భావించి హానికారక ఉత్పత్తులకు వత్తాసు పలుకుతూ వ్యాపార ప్రకటనల్లో దర్శనమిస్తున్న సెలబ్రిటీల వ్యవహారశైలి పట్ల నిరసన తెలియజేశారు.*

**- ఎస్. కిశోర్ కుమార్**
హైదరాబాద్

*జూలై నెలలో హిజ్రా సమస్య పై తెలంగాణ హిజ్రా ట్రాన్స్‌జెండర్ సమితి సభ్యుల ప్రతిస్పందన శాస్త్రీయంగా ఉంది. జీవిత అనుభవం బాధలు ఆవేదన వారి శ్వాస, అక్షరాల రూపంలో పొందుపరిచారు. రంగనాయకమ్మ 12 పేజీల సుదీర్ఘ వ్యాసం డొల్లతనాన్ని కళ్లకు కట్టినట్లు రాశారు. హిజ్రాలు సమాజం నుండి, ప్రభుత్వం నుండి ఎదుర్కొంటున్న సమస్యలు అన్నీ ఇన్నీ కావు. పురుషులు, స్త్రీలు కూడా వారిని చూసి దూరంగా జరిగిపోతున్నారు. వారికి ఇండ్లు అద్దెకు ఇవ్వడం లేదు. వారితో మాట్లాడడానికి ఇష్టపడడంలేదు. ఏడాది క్రితం విశాఖపట్నం రెండవ పట్టణ పోలీస్‌స్టేషన్‌లో హిజ్రాను పోలీసులు కొట్టి చంపేశారు. అతడి కుటుంబ సభ్యులకు కబురు పంపించినా రాలేదు. పోలీసులు హిజ్రాల నాయకుడు యల్లాజీని బెదిరించి పోలీస్ స్టేషన్‌కు రాకుండా చేశారు. వాళ్ల జీవితాల్లో ఎలా ముగింపు ఉంటుందో తెలియదు. రోగగ్రస్థులు, ముసలి హిజ్రాలను, ప్రేమ సమాజం వారు గాని, అనాథ ఆశ్రమాలు గాని చేరదీయవు. బిక్షమెత్తుకున్నా పిడికెడు అన్నం పెట్టరు. వాళ్ల దగ్గరకు పోయి వాళ్ల జీవితాలను చదివిన వారికే వారి గురించి తెలుస్తుంది. పుస్తకాలు చదివితే చాలదు.*

**- తుంపాల శ్రీరామమూర్తి**
*గాజువాక, విశాఖపట్నం* వీ

### తెలంగాణలో కొనసాగుతున్న నిరసనలు

తెలంగాణలోని మున్సిపల్ ఉద్యోగులు, కార్మికులు తమ సమస్యల పరిష్కారం కోసం రాష్ట్ర వ్యాప్తంగా జూలై 6 నుంచి సమ్మె ప్రారంభించారు. ఇందులో సిఐటియు, ఎఐటియుసి, బిఎంఎస్, ఎచ్ఎంఎస్, ఐఎఫ్టియు, ఎఐయుటియుటిసి, టిఎస్టియుసిలు ఈ సమ్మెలో పాల్గొన్నాయి. పర్మనెంట్ ఉద్యోగుల పిఆర్సి బేసిక్ ప్రకారం కాంట్రాక్ట్ కార్మికులు కనీస వేతనం రు. 14,170 పెంచాలనీ, జిపిఎఫ్ ఖాతాలు తెరవాలనీ, ఆరోగ్య కార్డులు జారీ చేయాలనే తదితర ప్రధాన డిమాండ్లతో సమ్మెచేశారు. గ్రేటర్ హైదరాబాద్ మునిసిపల్ కార్పొరేషన్ పరిధిలో పదిరోజుల పాటు సమ్మె జరిగింది. జూలై 16న ముఖ్యమంత్రి కెసిఆర్ జిఎచ్ఎంసి కార్మికులకు 47 శాతం జీతాలు పెంచుతానని హామీ ఇవ్వడంతో సమ్మె విరించారు. జూలై 16లోగా విధుల్లోకి చేరిన వారికే ఈ పెంపు వర్తిస్తుందనీ, సమ్మెలో కొనసాగుతున్న వారిని విధుల నుంచి తొలగిస్తామని హెచ్చరించింది. ఈ నేపథ్యంలో దీంతో జిఎచ్ఎంసి పరిధిలో సమ్మె విరమించారు. జూలై 17న మునిసిపల్ ఉద్యోగులు తెలంగాణ బంద్ నిర్వహించారు. మిగతా తెలంగాణ జిల్లాల్లో మునిసిపల్ కార్మికులకు ఎటువంటి హామీ లభించకపోవడంతో సమ్మె కొనసాగుతోంది.

### ఎపిలో తహసిల్దార్ పై ఇసుక మాఫియా దాడి

కృష్ణా-పశ్చిమగోదావరి జిల్లాల సరిహద్దుల్లో ఇసుక అక్రమ రవాణాను అడ్డుకున్నందుకు కృష్ణా జిల్లా, ముసునూరు తహసీల్దార్ వనజాక్షిపై జూలై 8న దాడి జరిగింది. దెందులూరు టిడిపి ఎంఎల్ఎ, ప్రభుత్వ విప్ చింతమనేని ప్రభాకర్ అండతో ఆయన అనుచరులు ఆమెపై దాడి చేశారు. ఇసుక అక్రమంగా తరలిస్తున్నారనే సమాచారంతో తహిసిల్దార్తో అక్కడికి వెళ్లి అడ్డు చెప్పడంతో వారు ఈ దాడికి పూనుకున్నారు. దీంతో ఆమె ముసునూరు పోలీస్ స్టేషన్లో ఎంఎల్ఎపై రిపోర్టు చేశారు.

### ఎపిలో మున్సిపల్ కార్మికుల సమ్మె

ఆంధ్రప్రదేశ్లోని మున్సిపల్ ఉద్యోగులు, కార్మికుల సమస్యలను పరిష్కరించాలనే డిమాండ్తో ఆంధ్రప్రదేశ్ మున్సిపల్ ఉద్యోగుల, కార్మికుల ఐక్య కార్యాచరణ కమిటీ సమ్మెకు పిలుపునిచ్చింది. జూలై 10 అర్ధరాత్రి నుంచి ఉద్యోగులు, కార్మికులు సమ్మె చేస్తున్నారు. ప్రభుత్వం నుంచి ఎటువంటి హామీ లభించకపోవడంతో సమ్మె కొనసాగుతోంది.

### విరసం 45 ఏళ్ల ఆవిర్భావ సభలు

విప్లవ రచయితల సంఘం 45 ఏళ్ల ఆవిర్భావ సభలు హైదరాబాద్లోని బాగ్లింగంపల్లి సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో జూలై 12న కామ్రేడ్ వివేక్ వేదికపై నిర్వహించారు. ఈ సభలకు రెండు తెలుగు రాష్ట్రాల నుండి కవులు, కళాకారులు, ఆలోచనాపరులు హాజరయ్యారు. ఈ సభల్లో మేక్ ఇన్ ఇండియా – కాషాయీకరణ – జనతన సర్కార్ ప్రత్యామ్నాయం, ప్రజా వ్యతిరేక భూసేకరణ ఆర్డినెన్స్, తెలంగాణ– ఆంధ్రప్రదేశ్లలో పాలకుల ఎజెండా–ప్రజా ఎజెండా, మళ్లీ అదే ప్రశ్న.. రచయితలారా మీరెటువైపు? అనే అంశాలపై వక్తలు ప్రసంగించారు.

### తెలంగాణ రచయితల వేదిక సమావేశం

తెలంగాణ రచయితల వేదిక (తెరవె) ఆధ్వర్యంలో హైదరాబాద్లోని దోమలగూడ, హైదరాబాద్ స్టడీ సర్కిల్లో జూలై 12న సమావేశం జరిగింది. ఈ సమావేశానికి తెలంగాణ పది జిల్లాల నుంచి కవులు, రచయితలు పాల్గొన్నారు. వర్ధమాన సాహిత్యం, ధోరణులు, కర్తవ్యం దిశానిర్దేశం కార్యక్రమం రూపకల్పన అంశంపై వక్తలు మాట్లాడారు. ఆలోచనా పరులు నిరంతరం ప్రజల పక్షాన నిలవాలన్నారు. తెరవె అధ్యక్షుడు జయధీర్ తిరుమలరావు సమావేశ తీర్మానాలను ప్రకటించారు.

### అమరుల బంధు మిత్రుల సంఘం మహాసభలు

అమరుల బంధు మిత్రుల సంఘం (ఎబిఎంఎస్) 3వ రాష్ట్ర మహాసభలు హైదరాబాద్లోని బాగ్లింగంపల్లి సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో జూలై 18న జరిగాయి. ఈ సభలకు రెండు తెలుగు రాష్ట్రాలలోని అమరుల బంధు మిత్రులు హాజరయ్యారు. చరిత్ర పొడవునా ప్రభుత్వ అణిచివేతకు, దోపిడీకి వ్యతిరేకంగా విప్లవకారులు పోరాటాలు చేస్తున్నారని వక్తలు అన్నారు. పాలకులు అభివృద్ధి పేరుతో సహజ వనరులను కొల్లగొడుతున్నారని విమర్శించారు. నూతన సమాజ నిర్మాణం కోసం ఎంతో మంది అమరులయ్యారన్నారు. ఎబిఎంఎస్ అధ్యక్షురాలు అంజమ్మ అధ్యక్షతన సభ జరిగింది. ఈ సభలో విరసం నేత వరవరరావు, ప్రొ. హరగోపాల్, పౌరహక్కుల సంఘం కార్యదర్శి చిలుకా చంద్రశేఖర్, ఎబిఎంఎస్ కాకరాల, విరసం కార్యదర్శి వరలక్ష్మి, టివివి మహేష్, టిపిఎఫ్ రమాదేవి వక్తలుగా పాల్గొన్నారు.

### దళితులపై కొనసాగుతున్న దాడులు

దళితులపై జరుగుతున్న దాడులను వ్యతిరేకిస్తూ కుల నిర్మూలన పోరాట సమితి ఆధ్వర్యంలో హైదరాబాద్లోని బషీర్బాగ్ ప్రెస్క్లబ్లో జూలై 20న సమావేశం ఏర్పాటు చేశారు. ఖరగ్పూర్ ఐఐటి ప్రొ. ఆనంద్తెల్ తుంబ్డే మాట్లాడుతూ తెలంగాణ రాష్ట్రం ఏర్పడిన తరువాత మహబూబ్నగర్ జిల్లా పెద్దేరు మండలం పాతపల్లి గ్రామంలో దళితులపై ప్రణాళికా బద్ధంగా దాడులు జరిగాయన్నారు. దీనిని ప్రభుత్వం పట్టించుకోకపోవడం దారుణమని విమర్శించారు. దాడులకు పాల్పడిన బోయలను కఠినంగా శిక్షించాలని డిమాండ్ చేశారు. దళితులపై పెట్టిన కేసులను ఎత్తివేసి దళితులకు రక్షణ కల్పించాలని డిమాండ్ చేశారు.

### కారంచేడు ఘటనకు 30 ఏళ్లు

కారంచేడు ఘటనకు 30 ఏళ్లు అయిన సందర్భంగా హైదరాబాద్లోని సెంట్రల్ యూనివర్సిటీలో జూలై 21న దళిత స్టూడెంట్స్ యూనియన్ (డిఎస్యు) ఆధ్వర్యంలో బహిరంగ సభను నిర్వహించారు. ఈ సభలో వక్తలు కారంచేడు, చుండూరు ఘటనలు ఉద్దేశ పూర్వకంగానే జరిగాయని, బాధిత కుటుంబాలకు సరైన న్యాయం జరగలేదని ఆరోపించారు. ప్రభుత్వాలు బాధితులను వదిలేసి నిందితుల పక్షాన నిలుస్తున్నాయన్నారు. ఈ కార్యక్రమంలో ప్రొ. వి. కృష్ణ, కుల నిర్మూలన పోరాట సమితి అధ్యక్షుడు దుడ్డు ప్రభాకర్, ప్రొ. హరగోపాల్, ప్రొ. శ్రీపతి రాముడు, ప్రొ. కాశీం తదితరులు పాల్గొన్నారు.

### గోదావరి పుష్కరాలు

పన్నెండు సంవత్సరాలకు ఒకసారి వచ్చే గోదావరి నదీ పుష్కరాలు రెండు తెలుగు రాష్ట్రాల్లో జరిగాయి. ఈసారి 144 సంవత్సరాలకు వచ్చే మహాపుష్కరం సందర్భంగా ప్రజలు భారీ సంఖ్యలో గోదావరి పుష్కర ఘాట్లలో స్నానాలు చేశారు. తెలంగాణ ఏర్పడిన తరువాత వచ్చిన తొలి పుష్కరం సందర్భంగా ప్రభుత్వం పెద్దఎత్తున నిర్వహించింది. పుష్కరాలు జూలై 14న మొదలై జూలై 25న ముగిసాయి. తెలంగాణలోని ఐదు జిల్లాల గోదావరి నదీ ఘాట్లలో దాదాపు ఐదు కోట్ల మంది పుష్కర సాన్నాలు చేశారు. ఆంధ్రప్రదేశ్లోని గోదావరి నదీ ఘాట్లలో నాలుగున్నర కోట్ల మంది పుష్కర స్నానాలు చేశారు. పుష్కరాలు మొదలైన మొదటి రోజు జూలై 14న రాజమండ్రి ఘాట్లో జరిగిన తొక్కిసలాటలో 27 మంది మరణించారు. వందలాదిగా గాయపడ్డారు. పుష్కరాల ఏర్పాట్లకై ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1600 కోట్లు, తెలంగాణ ప్రభుత్వం 600 కోట్లు కేటాయించాయి.

### విరసం వ్యవస్థాపక సభ్యులు చలసాని ప్రసాద్ మృతి

విప్లవ రచయితల సంఘం (విరసం) వ్యవస్థాపక సభ్యులు చలసాని ప్రసాద్ (83) జూలై 25న గుండెపోటుతో విశాఖపట్నంలో మృతి చెందారు. ఆయన కృష్ణా జిల్లా భట్ల పెనుమర్రు గ్రామంలో 1932లో పుట్టారు. విశాఖ విద్యార్థులు 'రచయితలారా మీరెటువైపు' అన్నపుడు ఆయన ప్రజలపక్షం వహించి విరసం వ్యవస్థాపకుల్లో ఒకరిగా నిలిచారు. ఆయన సాహిత్య రంగంలో ఎనలేని కృషి చేశారు. శ్రీశ్రీ, కొడవటిగంటి కుటుంబరావు, రావిశాస్త్రి రచనలను తీసుకురావడంలో ప్రధాన పాత్ర పోషించారు. చలసాని వ్యాసాలు, సాహిత్య వ్యాసాలు పేరుతో రెండు పుస్తకాలు వెలువడ్డాయి. వీ

### ప్రొ. సాయిబాబా బెయిలుపై విడుదల

ఢిల్లీ విశ్వవిద్యాలయ ప్రొ. జి.ఎన్. సాయిబాబా జూలై 3న నాగ్‌పూర్ జైలు నుంచి బెయిల్‌పై విడుదలయ్యారు. మావోయిస్టులతో సంబంధాలు న్నాయనే ఆరోపణలతో మహారాష్ట్ర పోలీసులు ఆయన్ను 2014 మేలో అరెస్టు చేసి నాగ్‌పూర్ కేంద్ర కారాగారంలో నిర్బంధించారు. 90 శాతం అంగవైకల్యం తో, ఆరోగ్యం పూర్తిగా క్షీణించడంతో వైద్య చికిత్స కోసం బాంబే హైకోర్టు 50 వేల పూచికత్తుతో మూడు నెలల తాత్కలిక బెయిలు మంజూరు చేసింది. సాయిబాబా ఆరోగ్య పరిస్థితుల దృష్ట్యా వైద్య చికిత్స కోసం బెయిలు మంజూరు చేశాం లేదంటే ఆయన చనిపోయే అవకాశం ఉందని ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ మోహిత్ షా నేతృత్వంలోని హైకోర్టు ధర్మాసనం పేర్కొంది.

### దేశాన్ని వెంటాడుతున్న పేదరికం

దేశంలోని 3 వంతు గ్రామీణ కుటుంబాల్లోని వ్యక్తుల గరిష్ఠ ఆదాయం నెలకు రు. 5000లకు మించడంలేదు. దేశవ్యాప్తంగా మొత్తం 24.39 కోట్ల కుటుంబాలుండగా గ్రామాల్లో ఉంటున్న వాటి సంఖ్య 17.91 కోట్లు, వీటిలో 74.49 శాతం (13.34 కోట్లు) కుటుంబాల్లో అత్యధికంగా సంపాదిస్తున్న వారి ఆదాయం నెలకు రు. 5,000 కన్నా తక్కువే ఉంటోందని సామాజిక ఆర్థిక కుల గణన 2011 వెల్లడించింది. నెలకు 10 వేలు అంతకన్న ఎక్కువ సంపాదించే వ్యక్తులున్న కుటుంబాలు 8.29 శాతం (1.48 కోట్లు) మాత్రమేనని తేల్చింది.

### వ్యాపం కుంభకోణం

మధ్యప్రదేశ్‌లోని ప్రభుత్వ ఉద్యోగ నియామకాల సంస్థ 'వ్యాపం' ఆధ్వర్యంలో నియమించబడిన ఉద్యోగ నియామకాల్లో పెద్ద ఎత్తున అక్రమాలు జరిగాయన్న ఆరోపణలు ఉన్నాయి. విచారణ సందర్భంగా ఈ కేసులో నిందితులు, సాక్షులు జూలై 9 నాటి వరకు 49 మంది వరకు అసహజ మరణాలకు గురయ్యారు. ఈ కుంభకోణంలో రాష్ట్ర ముఖ్యమంత్రితో పాటు మంత్రులు, బిజెపి పెద్దలపై ఆరోపణలున్న నేపథ్యంలో రాష్ట్ర ప్రభుత్వ ఆధ్వర్యంలోని దర్యాప్తుపై పలువురు అనుమానాలు వ్యక్తం చేస్తూ సుప్రీం కోర్టును ఆశ్రయించారు. ప్రధాన న్యాయమూర్తి ఎచ్.ఎల్. దత్తు, న్యాయమూర్తులు అరుణ్‌మిశ్రా, అమితావ్‌రాయ్‌లతో కూడిన సుప్రీం కోర్టు బెంచ్ ఈ కుంభకోణంపై జూలై 9న విచారణ చేపట్టింది. ఈ కుంభకోణంలో ఆరోపణలు ఎదుర్కొంటున్న మధ్యప్రదేశ్ గవర్నర్‌పై ఎందుకు చర్య తీసుకోలేదో చెప్పాలని కేంద్రానికి, రాష్ట్ర ప్రభుత్వానికి నాలుగు వారాల్లోగా తెలపాలని నోటీసులు జారీ చేసింది.

### యాకూబ్ మెమన్‌కు ఉరిశిక్ష ఖరారు

ముంబైలో 1993లో జరిగిన బాంబు పేలుళ్ల కేసులో మరణ శిక్ష పడిన యాకూబ్ మెమన్‌కు టాడా కోర్టు జూలై 15న డెత్‌వారంట్ జారీచేసింది. క్షమాభిక్ష పిటిషన్‌ను జూలై 21న సుప్రీం కోర్టు కొటివేసింది. దీంతో అతనికి మరణ శిక్ష ఖరారైనట్లయింది. జూలై 30న నాగపూర్ సెంట్రల్ జైలులో కాని లేదా పూనె ఎరవాడ జైలులో కానీ ఉరిశిక్ష అమలు చేయవచ్చునని నాగపూర్ సెంట్రల్ జైలు సూపరింటెండెంట్ యోగేశ్ తెలిపారు.

### మావోయిస్టుల కాల్పుల్లో పోలీసుల మృతి

చత్తీస్‌గడ్‌లోని బీజాపూర్ జిల్లాలో జూలై 13న అపహరించిన నలుగురు పోలీసులను జూలై 14న మావోయిస్టులు కాల్చిచంపారని బీజాపూర్ అదనపు పోలీసు సూపరింటెండెంట్ ఇందిర కళ్యాన్ తెలిపారు. పోలీసులతో పాటు అపహరించిన ఇద్దరు ఇన్‌ఫార్మర్లను వదిలిపెట్టారన్నారు. గుడ్మా గ్రామ పరిసరాల్లో ఏర్పాటుచేసిన 'జన్ అదాలత్'లో వీరిని చంపినట్లు ఆయన తెలిపారు. ఈ హత్యలకు కారణాలను తెలియపరిచే లేఖలు వదిలి వెళ్లారన్నారు. ఈ నలుగురు పోలీసులు అమాయక గిరిజనులను చిత్రహింసలకు గురిచేస్తూ తప్పుడు కేసులతో వేధిస్తున్నారని, అందుకు ప్రతీకారంగానే ఈ హత్యలు చేసినట్లు ఆ లేఖల్లో ఉందని తెలిపారు.

### ఎఫ్‌టిఐఐ విద్యార్థులకు నోటీసులు

ఫిల్మ్ అండ్ టెలివిజన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇండియా (ఎఫ్‌టిఐఐ) ఛైర్మన్‌గా బిజెపి నేత గజేంద్ర చౌహాన్ నియామకాన్ని నిరసిస్తూ విద్యార్థులు గత 34 రోజులుగా (జూలై 15 నాటికి) ఆందోళన చేస్తున్నారు. ఈ ఆందోళనను నిలిపివేసి తక్షణం తరగతులకు హాజరు కావాలని, లేనిపక్షంలో వారిపై తొలగింపుతో సహా కార్యనిర్వాహక చర్యలు తీసుకోవాల్సి వస్తుందని ఎఫ్‌టిఐఐ డైరెక్టర్ డి.జె. నారియన్ జూలై 15న ఎఫ్‌టిఐఐ విద్యార్థి సంఘం (ఎఫ్ఎస్ఎ) నేత హరిశంకర్ నాచిముత్తు పేరుతో నోటీసు జారీ చేశారు.

### పెరిగిపోతున్న అసహజ మరణాలు

జాతీయ నేర గణాంక శాఖ విడుదల చేసిన 'ప్రమాద మరణాలు, ఆత్మహత్యలు' 2014 వార్షిక నివేదికలో ఈ విషయాలు వెలుగుచూశాయి. ఆత్మహత్యలు చేసుకుంటున్న రాష్ట్రాల్లో మొదటి నాలుగు స్థానాల్లో మహారాష్ట్ర, తమిళనాడు, పశ్చిమబంగ, కర్ణాటక రాష్ట్రాలున్నాయి. రెండు తెలుగు రాష్ట్రాల్లో కలిపి 2014లో 15,724 ఆత్మహత్యలు నమోదయ్యాయి. తెలంగాణ 5 స్థానంలో ఉండగా ఆంధ్రప్రదేశ్ 9వ స్థానంలో ఉంది.

### ఎంఎల్‌ఎ ని నిర్బంధించిన గ్రామస్థులు

ఉత్తరప్రదేశ్‌లో బిఎస్‌పికి చెందిన ఎంఎల్ఎని అలీనగర్‌కు చెందిన గ్రామస్థులు నిర్బంధించారు. విద్యుత్, నీటి సరఫరా సరిగా లేకపోవడంతో జూలై 19న గ్రామస్థులు నిరసనకు దిగారు. వారి సమస్యను తెలుసుకునేందుకు మొగల్‌సరాయి ఎంఎల్ఎ బబ్బర్‌సింగ్ చౌహాన్ అక్కడికి వెళ్లగా గ్రామస్థులు ఆగ్రహంతో ఆయన్ను నిర్బంధించినట్లు ఎస్‌పి తెలిపారు. ఎంఎల్ఎ గ్రామస్థులకు హామీ ఇవ్వడంతో ఆయన్ను గ్రామస్థులు విడిచిపెట్టారని ఎస్‌పి తెలిపారు.

### జంషెడ్‌పూర్‌లో మత ఘర్షణలు

జార్ఖండ్‌లోని జంషెడ్‌పూర్‌లో జూలై 21న మత ఘర్షణలు జరిగాయి. ఈ ఘటనలో 30 మంది తీవ్రంగా గాయపడ్డారు. దీంతో పోలీసులు కర్ఫ్యూ విధించారు. నగరంలోని గాంధీ మైదాన్ ప్రాంతంలో ఉండే ఒక వర్గానికి చెందిన అమ్మాయిని మరో వర్గానికి చెందిన కొందరు అబ్బాయిలు వేధింపులకు గురిచేశారు. దీంతో అమ్మాయి తరపు వర్గం వారు గొడవకు దిగడంతో రెండు వర్గాల మధ్య తీవ్ర ఘర్షణలు జరిగాయి. ఈ ఘర్షణల్లో మంగో ప్రాంతంలోని దుఖానాలు కొల్లగొట్టారు. వాహనాలను ధ్వంసం చేశారు.

### పౌరహక్కుల నేత సెబాస్టియన్ మృతి

కమిటీ ఫర్ ప్రొటెక్షన్ ఆఫ్ డెమోక్రటిక్ రైట్స్ (సిపిడిఆర్) సభ్యులు, న్యాయవాది పి.ఎ. సెబాస్టియన్ జూలై 23న గోవాలోని ఒక వృద్ధాశ్రమంలో మరణించారు. కేరళలో పుట్టిన సెబాస్టియన్ పోలియో బాధితుడు. మెట్రిక్యులేషన్ పూర్తి చేసిన తరువాత ముంబాయికి తన మకాం మార్చారు. అక్కడే గ్రాడ్యుయేషన్ పూర్తి చేసి, లా పట్టా పుచ్చుకొని, ముంబై హైకోర్టులో ప్రాక్టీసు మొదలుపెట్టారు. ముంబైలోని స్టూడెంట్ రాడికల్ మూవ్‌మెంట్‌లో చురుగ్గా పాల్గొనేవారు. సెబాస్టియన్ సిపిడిఆర్ స్థాపకులలో ఒకరు. ఎమర్జెన్సీ ఎత్తివేసిన తరువాత ఆయన సిపిడిఆర్ ప్రధాన కార్యదర్శి పదవి చేపట్టి ఎంతో క్రియాశీలంగా పనిచేశారు. తన ఆరోగ్యం సహకరించినంత వరకు కోర్టు లోపల, బయటా, ప్రజాసంఘాల తరపున ఎన్నో పోరాటాలు చేశారు. ఎన్నో నిజ నిర్ధారణ కమిటీలలో పాలుపంచుకున్నారు. ఇంటర్నేషనల్ అసోసియేషన్ ఆఫ్ పీపుల్స్ లాయర్స్‌కి ఛైర్‌పర్సన్‌గా, కమిటీ ఫర్ రిలీజ్ ఆఫ్ పొలిటికల్ ప్రిజినర్స్‌కి వైస్ ప్రెసిడెంట్‌గా పనిచేశారు. వీ

### అమెరికా - క్యూబా దౌత్య సంబంధాలు

అమెరికా – క్యూబా మధ్య నిలిచిపోయిన దౌత్య సంబంధాలు దాదాపు ఐదున్నర దశాబ్దాల తరువాత పునరుద్ధరణ అయ్యాయి. ఈ దౌత్య సంబంధాల పునరుద్ధరణ ద్వారా వివాదాలను అంతర్జాతీయ చట్ట పరిధిలో శాంతియుతంగా పరిష్కరించుకోవచ్చు. జూలై 1న ఇటు వాషింగ్టన్‌లో అమెరికా అధ్యక్షుడు బరాక్ ఒబామా, అటు హవానాలలో క్యూబా అధ్యక్షుడు రావుల్ కాస్ట్రో ఒకేసారి దౌత్య కార్యాలయాలను పునఃప్రారంభించారు.

### యెమెన్‌లో దాడులు

యెమెన్‌లో రోజురోజుకూ అంతర్యుద్ధం తీవ్రం అవుతోంది. ప్రభుత్వానికీ, హౌతీ తిరుగుబాటుదారులకూ మధ్య దాడులు కొనసాగుతున్నాయి. జూలై 2న అడెన్ నగరంలో తిరుగుబాటుదారులు విచక్షణా రహితంగా జరిపిన కాల్పుల్లో ముప్పై మంది మరణించారు. వంద మందికి పైగా తీవ్రంగా గాయపడ్డారు. అంతకు ముందు జూన్ 30న తైజ్ పట్టణంలోని జైలు నుంచి దాదాపు పన్నెండు వందల మంది ఖైదీలు తప్పించుకున్నారు. జైలు సిబ్బంది విధులు మారుతున్న సందర్భంలో ఖైదీలు అవకాశం చేసుకొని సిబ్బందిపై దాడి చేసి తప్పించుకున్నారు. పరిస్థితిని సమీక్షించిన ఐక్యరాజ్య సమితి యెమెన్‌లో ఎమర్జెన్సీ ప్రకటించింది. జూలై 10 నుంచి కాల్పుల విరమణ ప్రకటించింది. అయినా పోరు సాగుతూనే ఉంది. ప్రభుత్వ సేనలకు మద్దతుగా సౌదీ నేతృత్వంలో పలు నగరాలపై వైమానిక దాడులు కొనసాగుతున్నాయి.

### గ్రీస్‌లో సంక్షోభం

గ్రీస్‌లో ఉద్దీపనల పేరుతో యూరోపియన్ సెంట్రల్ బ్యాంక్, యూరోపియన్ యూనియన్, అంతర్జాతీయ ద్రవ్య నిధి విధించిన కఠిన షరతుల అమలును తిరస్కరిస్తూ సిరిజా ప్రభుత్వం రెఫరెండం ప్రకటించింది. జైల 5న జరిగిన రెఫరెండంలో 61.3 శాతం మంది ప్రజలు తిరస్కరించగా, 38.7 శాతం మంది షరతులకు ఆమోదం తెలిపారు. ఈ నేపథ్యంలో ఆర్థిక సంక్షోభం నుంచి గ్రీస్‌ను గట్టెక్కించేందుకు కఠినమైన షరతులతో మూడో విడత బెయిల్ అవుట్ ప్యాకేజి ఇవ్వడానికి యూరోజోన్ ఏకగ్రీవంగా ఆమోదించింది. బెయిల్ అవుట్ షరతుల మేరకు రూపొందించిన ఆర్థిక సంస్కరణల బిల్లుకు గ్రీస్ పార్లమెంట్ జూలై 16న ఆమోదం తెలిపింది. మొత్తం 300 మంది పార్లమెంట్ సభ్యుల్లో 229 మంది సభ్యులు బిల్లుకు ఆమోదం తెలిపారు. అయితే 149 మంది అధికార సిరిజా పార్టీ సభ్యులలో 32 మంది వ్యతిరేకంగా ఓటు వేశారు. ప్రత్యామ్నాయ మార్గం లేకపోవడంతోనే ఈ కఠిన సంస్కరణలను ఆమోదించాల్సి వచ్చిందని గ్రీస్ ప్రధాని అలెక్సిస్ సిప్రస్ అన్నారు. బెయిల్ అవుట్ ఒప్పందానికి వ్యతిరేకంగా నిలిచిన మంత్రివర్గ సభ్యులను ప్రధాని సిప్రస్ తొలగించారు. కఠిన సంస్కరణలకు ఆమోదం తెలపడంతో గ్రీస్ ప్రజలు తీవ్ర నిరసన తెలిపారు. గత అయిదేళ్లలో గ్రీస్‌కు రుణ సహాయం చేయడం ఇది మూడోసారి.

### నైజీరియాలో కొనసాగుతున్న దాడులు

నైజీరియాలో బొకోహరమ్ ఉగ్రవాదుల దాడులు కొనసాగుతూనే ఉన్నాయి. జూన్ 6న వరుస బాంబు దాడులలో నలభై మందికి పైగా మరణించారు. అరవై మందికి పైగా గాయపడ్డారు. బొకోహరమ్ దళాలు గ్రామాలపై, పట్టణాలపై మూకుమ్మడిగా దాడులు చేస్తూ ప్రజలను కాల్చి చంపుతున్నారు. ఆస్తులను లూటీ చేస్తున్నారు. మరోవైపు జూలై 17న గోంబే ప్రాంతంలో జరిగిన వరుస పేలుళ్లలో యాభై మంది చనిపోయారు. రంజాన్ పండగ సందర్భంగా స్థానిక మార్కెట్‌లో జనాలతో రద్దీగా ఉన్న సమయంలో బాంబు పేలుళ్లు సంభవించడంతో మృతులు అధిక సంఖ్యలో ఉన్నారు. ఈ దాడిలో ఎనభై మంది దాకా గాయపడ్డారు.

### అఫ్గనిస్తాన్‌లో ఆత్మాహుతి దాడులు

అఫ్గనిస్తాన్‌లోని ఖోస్ట్ నగర శివారుల్లోని అమెరికా సైనిక స్థావరం సమీపంలో జూలై 12న జరిగిన ఆత్మాహుతి దాడిలో కనీసం 25 మంది మరణించారు. శివార్లలో ఉన్న సైనిక చెక్‌పోస్ట్ వద్ద వాహనాలు నిలిచి ఉన్న సమయంలో పేలుడు పదార్థాలతో ఉన్న ఒక కారులో దూసుకు వచ్చిన ఆత్మాహుతి దళ సభ్యులు తమను తాము పేల్చుకొని ఈ దాడికి పాల్పడ్డారు.

### ఇరాన్ అణు ఒప్పందం

ఇరాన్, ఆరు అగ్ర దేశాలు – చైనా, ఫ్రాన్స్, జర్మనీ, రష్యా, బ్రిటన్, అమెరికాల మధ్య అణు ఒప్పందం కుదిరింది. ఈ ఒప్పందం మేరకు ఇరాన్ తన అణు కార్యక్రమాన్ని కుదించుకుంటే అందుకు బదులుగా ఇరాన్‌పై ఉన్న ఆంక్షలను పశ్చిమ దేశాలు సడలించుకుంటాయి. ఇరాన్‌పై అంతర్జాతీయ ఆంక్షలను సడలిస్తూ చేసిన ప్రణాళికపై జూలై 14న వియన్నాలో జరిగిన సమావేశంలో ఇరాన్, ఆరు దేశాలు సంతకాలు చేశాయి. అణు కార్యక్రమాలు జరుపుతున్న అభియోగంపై ఇరాన్‌పై గత పన్నెండేళ్లుగా ఆంక్షలు విధించాయి. ఈ ఒప్పందంలో భాగంగా కార్యాచరణ అమలును పర్యవేక్షించడానికి, వివాదాస్పదమైన పరిస్థితులను ఎదుర్కొనడానికి జాయింట్ కమిషన్‌ను ఏర్పాటు చేస్తారు. ఇరాన్ తీసుకోబోయే అణు సంబంధిత చర్యలను అంతర్జాతీయ అణు ఇంధన సంస్థ (ఐఎఇఎ) పర్యవేక్షిస్తుంది.

### ఇరాక్‌లో ఆత్మాహుతి దాడి

ఇరాక్ రాజధాని బాగ్దాద్ దగ్గరలోని ఖాన్‌బెనీసాద్ అనే మార్కెట్ ప్రాంతంలో జూలై 18న జరిగిన ఆత్మాహుతి దాడిలో 120 మంది మరణించారు. వంద మందికి పైగా తీవ్రంగా గాయపడ్డారు. రంజాన్ సందర్భంగా పౌరులు ఒక చోట గుమిగూడి పండుగ సంబరాల్లో ఉండగా ఐఎస్ తీవ్రవాదులు కారు బాంబుతో దాడి చేశారు. రంజాన్ కోసం బట్టలు, ఆహార పదార్థాలు కొనుగోలు చేయడానికి వచ్చిన అనేక మంది ఈ దాడిలో హతులయ్యారు. ప్రభుత్వ బలగాలు, ఐఎస్ తీవ్రవాద దళాల మధ్య జరుగుతున్న ఆధిపత్య పోరులో వేలాది మంది సామాన్య ప్రజలు ప్రాణాలు కోల్పోతున్నారు.

### బ్రిక్స్ బ్యాంకు

బ్రెజిల్, రష్యా, ఇండియా, చైనా, దక్షిణాఫ్రికా (బ్రిక్స్) దేశాలి కలిసి జూలై 21న షాంఘైలో బ్రిక్స్ బ్యాంకును స్థాపించాయి. దీనిని న్యూ డెవలప్‌మెంట్ బ్యాంక్ (ఎన్ డి బి) అని పిలుస్తారు. ప్రపంచ బ్యాంకుకు ధీటుగా దీనిని స్థాపించారు. ఆసియన్ ఇన్వెస్ట్ మెంటం ఇన్ఫ్రాస్టక్చర్ బ్యాంకు (ఎఐఐబి)తో కలిసి ఎన్ డి బి పనిచేస్తుంది. దీనికి అత్యధికంగా చైనా 41 బిలియన్ డాలర్లు ఇచ్చి 39.5 శాతం ఓటింగం హక్కులను పొందింది. బ్రెజిల్, రష్యా, ఇండియాలు 18 బిలియన్ డాలర్లను పెట్టుబడి పెట్టగా దక్షిణాఫ్రికా 5 బిలియన్ డాలర్లు ఇచ్చింది. ఐదు దేశాలు కలిసి దీనికోసం 50 బిలియన్ డాలర్లు మూలధనంగా కేటాయించాయి. ఎన్ డి బి ఛైర్మన్గా ఐసిఐసిఐ బ్యాంక్ మాజీ ఎండి కుందపూర్ వెమన్ కామత్ ని నియమించారు.

### టర్కీలో బాంబు దాడి

టర్కీలోని సురుస్ పట్టణంలో జూలై 20న జరిగిన బాంబు దాడిలో 32 మంది విద్యార్థులు చనిపోయారు. టర్కీ, సిరియా సరిహద్దులో ఉన్న కోబానీ పట్టణానికి కేవలం 10 కిలోమీటర్ల దూరంలో ఉన్న సురుస్ పట్టణంలో విద్యార్థులు ఏర్పాటు చేసిన మీడియా సమావేశాన్ని లక్ష్యంగా చేసుకుని ఇస్లామిక్ స్టేట్ ఉగ్రవాదులు బాంబు దాడి జరపడంతో ఈ దుర్ఘటన జరిగింది. చనిపోయిన వారిలో ఎక్కువ మంది విద్యార్థులే ఉన్నారు. వందల సంఖ్యలో తీవ్రంగా గాయపడ్డారు. సిరియా సరిహద్దులో ఉన్న ఈ ప్రాంతం ఆ దేశ అంతర్యుద్ధ పరిస్థితుల ప్రభావం ఇప్పుడిప్పుడే టర్కీలోకి ప్రవేశిస్తున్నాయని ప్రజలు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం: ఎస్. వెంకటేష్

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్థాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషుల కోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(జూన్ 1 నుండి జూన్ 30, 2015 వరకు తెలంగాణలోని 10 జిల్లాలు (1123), ఆంధ్రప్రదేశ్‌లోని 13 జిల్లాలలో (1059) అసహజ మరణాల పాలైన వారి సంఖ్య 2182)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | | | | | | | | | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| | | | | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | | | | | | | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | 1 | 2 | – | 18 | 9 | 3 | 4 | 2 | 3 | 3 | 2 | 1 | 1 | 2 | 28 | 30 | – | – | – | 3 | 4 |
| హైదరాబాద్ | – | – | – | 5 | 9 | 1 | 4 | – | 2 | 4 | 4 | 6 | 2 | 4 | 22 | 16 | – | – | – | – | 1 |
| కరీంనగర్ | – | 3 | 2 | 6 | 11 | 4 | 4 | – | – | 1 | 3 | 2 | – | 6 | 24 | 21 | – | – | – | – | 36 |
| ఖమ్మం | – | 1 | – | 10 | 12 | 4 | 8 | 1 | 2 | 2 | – | 7 | – | 8 | 17 | 24 | – | – | – | – | 31 |
| మహబూబ్‌నగర్ | – | 5 | – | 10 | 20 | 15 | 8 | 6 | 5 | 8 | 15 | 12 | 20 | 20 | 55 | 6 | – | – | – | – | 3 |
| మెదక్ | 1 | 29 | 6 | 4 | 11 | 3 | 4 | – | 4 | 3 | 8 | 4 | 9 | 12 | 32 | 4 | – | – | – | 6 | 5 |
| నల్గొండ | – | 3 | 1 | 1 | 3 | 4 | – | 2 | 1 | 3 | 2 | 5 | – | 11 | 21 | 16 | – | – | – | – | 11 |
| నిజామాబాద్ | – | – | – | 8 | 19 | 2 | 1 | – | 1 | 3 | 1 | – | 1 | – | 28 | 18 | – | – | – | – | 11 |
| వరంగల్ | 4 | 2 | – | 7 | 9 | 2 | 6 | 4 | – | 1 | – | – | – | 4 | 14 | 18 | – | – | – | – | 13 |
| రంగారెడ్డి | – | 3 | – | 1 | 3 | 5 | 4 | – | – | – | 5 | 4 | 2 | 3 | 14 | 13 | – | – | – | – | 7 |
| **తెలంగాణ** | **6** | **47** | **9** | **70** | **106** | **43** | **43** | **15** | **18** | **28** | **40** | **41** | **35** | **70** | **255** | **166** | **-** | **-** | **-** | **9** | **122** |
| అనంతపురం | – | 10 | 4 | 12 | 21 | 1 | 2 | 6 | 3 | – | 1 | 7 | 8 | 7 | 31 | – | – | – | – | – | 20 |
| చిత్తూరు | – | – | – | 4 | 8 | 11 | 9 | – | – | – | 2 | 8 | 8 | – | 32 | 9 | – | – | – | – | 2 |
| కడప | – | – | – | 1 | 2 | – | – | – | 1 | 1 | 1 | 2 | – | – | 13 | – | – | – | – | – | 13 |
| గుంటూరు | – | – | – | 2 | 4 | 2 | 1 | – | – | – | 4 | 4 | – | 3 | 29 | 27 | – | – | – | – | 3 |
| కృష్ణా | – | – | – | 5 | 9 | 3 | 6 | – | – | – | 3 | 6 | – | 5 | 26 | 16 | – | – | – | – | 2 |
| కర్నూలు | – | 4 | 1 | 6 | 3 | 5 | 8 | 5 | 6 | 4 | 3 | 6 | 9 | 7 | 18 | 12 | – | – | – | – | 10 |
| తూర్పు గోదావరి | – | 2 | – | 2 | 4 | 3 | 1 | – | – | 3 | 1 | – | 2 | 14 | 39 | 13 | – | – | – | – | 24 |
| ప్రకాశం | – | 1 | – | 1 | 4 | 2 | 1 | – | 3 | 1 | 2 | – | – | 4 | 21 | 14 | – | – | – | – | 16 |
| శ్రీకాకుళం | – | 1 | – | 2 | 6 | 2 | 10 | 2 | 1 | 3 | 3 | 4 | 4 | 5 | 25 | 7 | – | – | – | – | 10 |
| పశ్చిమ గోదావరి | – | – | – | 3 | 5 | – | 5 | – | 2 | 1 | 4 | 3 | – | 1 | 14 | 17 | – | – | – | – | 8 |
| నెల్లూరు | – | – | – | 6 | 8 | 1 | 2 | – | – | – | 1 | 3 | – | 3 | 9 | 13 | – | – | – | – | 3 |
| విజయనగరం | – | – | – | 2 | 1 | – | 3 | – | 2 | 4 | 1 | 1 | – | 2 | 13 | 11 | – | – | – | – | 34 |
| విశాఖపట్నం | – | – | – | 4 | 11 | 1 | 1 | – | 1 | 4 | 1 | 2 | 7 | 3 | 20 | 17 | – | – | – | 10 | 1 |
| **ఆంధ్రప్రదేశ్** | **-** | **18** | **5** | **50** | **86** | **31** | **49** | **13** | **19** | **21** | **27** | **46** | **38** | **54** | **290** | **156** | **-** | **-** | **-** | **10** | **146** |




# స్వచ్ఛమైనవి వాడండి, నిశ్చింతగా ఉండండి



## ఆహార పదార్థాలలో కల్తీ కనిపెట్టే పద్ధతులు

| క్ర సం. | ఆహార పదార్థం | కల్తీ | కనిపెట్టే పరీక్ష / పద్ధతి |
|---|---|---|---|
| 1 | వంట నూనె | ఆముదం | శుభ్రమైన పొడి టెస్ట్‌ట్యూబ్‌లో ఒక మి.లీ. నూనె తీసుకోండి. 10 మి.లీ. ఆమ్లీకరించిన పెట్రోలియం ఈథర్ కలపండి. రెండు నిమిషాలు గట్టిగా ఊపండి. ఒక చుక్క ఆమోనియం మోలిబ్డేట్ రీయేజెంట్ కలపండి. ద్రవం మురికి మురికిగా ఉందంటే ఆ నూనెలో ఆముదం కల్తీ జరిగినట్టే. |
| | | వంట నూనె | 5 మి.లీ. నూనెకు 5 మి.లీ. గాఢ నత్రికామ్లం కలిపి జాగ్రత్తగా ఊపండి. ద్రవంలో పసుపు, నారింజ రంగులు వేరయ్యే దాకా వేచి చూడండి. కింది భాగంలో ఉండే ఆమ్లపు పొరలో ఎరుపు రంగు కనబడితే కల్తీ జరిగినట్టే. |
| 2 | గోధుమ పిండి | ఇసుక, దుమ్ము | కొద్దిపాటి పిండితో 10 మి.లీ. కార్బన్ టెట్రాక్లోరైడ్ కలిపి కాసేపు పేరుకునేలా చూడండి. దుమ్ము, ఇసుక అడుక్కు చేరుతాయి. |
| | | ఊక, తవుడు | పిండిని నీళ్లపైన చిలకరించండి. ఊక, తవుడు పైకి తేలతాయి. |
| | | సుద్ద పొడి | కొంత పిండిని హైడ్రోక్లోరిక్ ఆమ్లంతో కలపండి. వాసనను బట్టి సుద్ద పొడి కల్తీ జరిగిన విషయం తెలుస్తుంది. |
| 3 | ఆహార ధాన్యాలు | కనబడకుండా ఉండే క్రిములు | ఒక శాతం ఆల్కహాల్ ఉండే నిన్ హైడ్రిన్ రీయేజెంట్‌లో ముంచి తీసిన అద్దుడు కాగితంపై ఆహార ధాన్యాలు పెట్టి అద్దుడు కాగితాన్ని మూసేసి సుత్తెతో ధాన్యాన్ని నలగగొట్టండి. అద్దుడు కాగితం మీద నీలం - ఐచ్ఛలి పండు రంగు మచ్చలు కనబడితే ఆహార ధాన్యాలలో క్రిములు దాగి ఉన్నట్టే. |

DAVP 08101/13/0014/1516




ప్రజా ప్రయోజనాల కోసం విడుదల చేసినవారు
**వినియోగదారుల వ్యవహారాలు, ఆహారం, ప్రజా పంపిణీ మంత్రిత్వ శాఖ**
**వినియోగదారుల వ్యవహారాల విభాగం, భారత ప్రభుత్వం**
**కృషి భవన్, న్యూ ఢిల్లీ - 110 001**
వెబ్‌సైట్ : www.consumeraffairs.nic.in

వినియోగదారుల సమస్యలపై ఏ సహాయం / వివరణ కావలసి వచ్చినా
జాతీయ వినియోగదారుల హెల్ప్‌లైన్‌కు ఫోన్ చేయండి.
1800-11-4000 (టోల్‌ఫ్రీ)
లాగిన్ అయి మీ ఫిర్యాదు చేయవచ్చు.
తప్పుదారి పట్టించే వ్యాపార ప్రకటనల గురించి ఫిర్యాదులు చేయడానికి
**www.gama.gov.in** లాగిన్ అవండి

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 169 - August 2015 ● ISSN 2231-6892
● RNI Regn.No.APTEL/2003/11482 ● Published on 27/7/2014 ● Postal Regn. No. L II/RNP/HD/1100/2014-16
Date of Posting : 29th, 30th



Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Deccan Press for Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020
and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao